సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 31 ఫిబ్రవరి, 1975 సంచిక 2

మార్చి నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00

కోఆపరేటివ్
హెయిర్ డ్రెస్సింగ్
సెలూన్



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

ఫిబ్రవరి నెల

# భావపరిచయ పోటీ

## బహుమతి పొందిన వ్యాఖ్య




పుత్రు డొకడు పుడితె పున్నామ నరకంబు
తప్పునంచు మదిని తలచి నతడు
కాంత నల్గురాడ కవలల్ని కనజూచి
నేల కీళ్ళుజారి కూలబడెను.

తమ్మిరెడ్డి రామారావు
యలమంచిలి



"ఆ అమ్మాయి ఫోటో ఇదిగో, వాళ్ళు పంపించారు. ఇది నీకు నచ్చితే, రేపు మంచిరోజేనట, వెళ్ళి పిల్లను చూసుకొద్దువుగాని. ఈ నెలాఖరు దాకా ముహూర్తాలు వున్నాయట. పెళ్ళిచేసుకుని పిల్లను వెంటబెట్టుకు వెళ్ళిపోదువుగాని. ఈ పిల్లా నచ్చలేదంటావా, నీ యిష్టం. ఇంకెప్పుడూ నీ పెళ్ళివిషయంలో చేయి పెట్టను. నీ కిష్టమైనప్పుడు లేదా అసలు చేసుకోకపోయినా ఆ విషయం ఎత్తితే ఒట్టు." అనవలసిన నాలుగు మాటలూ వడగళ్ళ వానలా గలగల దిమ్మరించినట్లు అనేసి చేతిలోని ఫోటోని కొడుకుమీదకు గిరవాటేసి ఎంత దూకుడుగా వచ్చిందో అంత వేగంగాను ఆ చోటు విడిచిపెట్టి వెళ్ళిపోయింది దుర్గాంబ. ఆవిడకు కొడుకు మీద చాలా కోపంగా వుంది, ముప్ప

య్యేళ్ళు దాటుతోన్నా ఇంకా పెళ్ళి చేసుకోనంటాడని. ఎన్ని సంబంధాలు చూసినా వాళ్ళను చూసి రావడానికి అయిన ఖర్చు కనిపిస్తున్నదే కాని కొడుకు మాత్రం 'ఫలాని పిల్ల నచ్చింది' అనడంగాని, పెళ్ళి చేసుకుంటానని మాట ఇవ్వడంగాని జరగడం లేదని అక్కసుగా వుంది. ఈసారైనా వాడి పెళ్ళి నిశ్చయించాలనే పట్టుదలతో వుందావిడ. ఆ పట్టుదలను, కోపాన్ని మాటల్లో వ్యక్తంచేసి వెళ్ళిపోయింది తన గదిలోకి. "వచ్చి ఇరవై నాలుగ్గంటలు కాలేదు. అప్పుడే మొదలు 'వెళ్ళి పిల్లనుచూసిరా పెళ్ళిచేస్తానంటూ.' అసలు ఇక్కడకు రాకుండావుంటే ?" నుదురు చిట్లించి విసుక్కున్నాడు జయరామ్.

'ఇక్కడకు రాకుండా అమ్మని, చెల్లెళ్ళను చూడకుండా వుండగలవా ?' నవ్వింది మనసు.

అవును, వుండలేను. ఏడాది జరిగే సరికి అమ్మమీద భ్రాంతి పుడ్తుంది. చిన్నప్పుడు క్షణమన్నా విడిచిపెట్టి వుండలేని తను ఇన్నేసి రోజులు ఆమెను విడిచిపెట్టి చూడకుండా ఎలా వుండగల్గుతున్నాడో ? ఈ ఆలోచన రావడం వెంటనే ఓ నెల సెలవు పెట్టేసి బండెక్కి వచ్చి తల్లిదగ్గర వాలడం, తనని చూస్తూనే 'వచ్చావా జయా, ఎంత చిక్కిపోయావురా. ఇదివరకు వచ్చినప్పటికంటే కూడా చిక్కిపోయావు, నల్లబడిపోయావు. ఆ హోటల్ భోజనం నీకు పడలేదురా కన్నా' కళ్ళల్లో వాత్సల్యం పొంగులు వారుతుండగా తనని ఆప్యాయతగా తడివి చూస్తూ కళ్ళ నీళ్ళుపెట్టుకునే తల్లిని చూస్తే అతనికెంతో గర్వం. అమ్మకి నామీద ఎంత ప్రేమ, ఎంత వాత్సల్యం అని లోలోపల పొంగిపోతాడు. "అందుకనే కదమ్మా వచ్చాను. ఈనెల్లాళ్ల నీచేతి ప్రసాదంతిని బలాన్ని పుంజుకుని వెళ్తాను, తెలిసిందా మరి. నాకెలా వండిపెడ్తావో" నవ్వుతూ అంటాడు. 'నీ మొహం, అలా అంటావు గాని నేను వండిపెట్టినా నువ్వు తినవు కదా.' అలా సాగుతుంది వాళ్ళ మధ్య సంభాషణ. కాని ఈ రోజు అందుకు విరుద్ధంగా తల్లి 'పిల్లచూపులు, పెళ్ళి యిష్టాయిష్టాలు' అంటూ ఎత్తుకునేసరికి అతనికి ఒళ్ళు మండిపోయింది. ఈ పెద్ద వాళ్ళు కెప్పుడూ తమ యిష్టాలు సాగించుకోవడమేగాని ఎదుటివారి మనసును ఎందుకు అర్థంచేసుకోరో కనీసం అర్థం చేసుకోవడానికైనా ఎందుకు ప్రయత్నించరో అనిపించింది.

తల్లి తనమీదకు గిరవాటేసిన ఫోటోని చేతిలోకి తీసుకుని పరీక్షగా చూసాడు ఓసారి. అంతే దాన్ని నిర్లక్ష్యంగా ప్రక్కన ఉన్న బల్లమీద పెట్టేసాడు. "ఎలా వుంది అమ్మాయి ?

నీకు నచ్చిందా ?" నవ్వుతూ వచ్చింది పెద్దచెల్లెలు బిందు. ఆ అమ్మాయికి రెండేళ్ళ క్రితమే పెళ్లైంది. అన్నగారు రాబోతున్నాడని తెలిసి అన్నగారిని చూడాలనే ఉద్దేశ్యంతో రెండురోజుల క్రితమే వచ్చింది నెల్లూరునుంచి. ఇంక చిన్నచెల్లెలు హేమ రావాలి కాకినాడ నుంచి. తనూ వస్తుంది ఇప్పుడో ఇంకాస్సేపటికో. అతనున్న నాలుగు రోజులు ఇల్లు పెళ్ళివారి ఇల్లులా సందడిగా వుంటుంది, అతన్ని చూట్టం కోసం వచ్చిపోయే అతని స్నేహితుల తోనూ బంధువులతోనూ.

"ఎలా వుందా ! నా తలకాయలా వుంది." విసురుగా అన్నాడతను.

"నీతలకాయకేం, అందంగా, ఒత్తుగా, నొక్కుల జుట్టుతో బ్రహ్మాండంగా వుంటుంది అయితే అమ్మాయి నచ్చిందని అమ్మకి చెప్పనా?" అల్లరిగా నవ్వింది బిందు.అన్నగారిని ఆట పట్టించటమంటే బిందుకి చాలా యిష్టం.

"ఛీ, ఏం బాగాలేదు. అచ్చు అమ్మమ్మలా వుంది." ఈసారి మనసులో ఉద్దేశ్యాన్ని స్పష్టంగాచెప్పాడుజయరామ్.

అన్నగారి అభిప్రాయానికి విస్తుపోయిన బిందు "అంత అందంగావున్న అమ్మాయి నీ కంటికి అమ్మమ్మలా వుందా? ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నావురా అన్నయ్యా ! మీ దృష్టిలో ఇంత లక్షణంగా వున్న అమ్మాయిలు, అమ్మమ్మల్లా వున్నారంటే ఇకఎటువంటిఅమ్మాయిలు బ్యూటీ క్వీన్‌లుగా కనిపిస్తారు మీకు ? బహుశా తల విరబోసుకుని, చెవులకు గాజుల్లాంటి రింగులు పెట్టుకుని అంగీ లుంగీ కట్టుకుని, గురూషర్టు వేసుకుంటే మీ కంటికి అందంగా అపురూపంగా కనిపిస్తారేమో?" అంది అక్కసుగా. 'అసలు ఈ అన్నయ్యకు ఏ అమ్మాయయినా నచ్చి పెళ్ళంటూ అవుతుందా' అని. అయిదారేళ్ళ నుంచి సంబంధాలు చూస్తూనే వున్నాడు. కాని ఒక్క అమ్మాయీ తన మనసుని ఆకర్షించడం లేదు. ప్రతి అమ్మాయిని చూసిరావడం, నాకు నచ్చలేదని ఆ అమ్మాయికి ఏవో వంకలు పెట్టడం, ఇలా ఇంకెన్నాళ్ళో? అన్నగారి వైపు సానుభూతిగా చూసింది ఆమె.

* * *

జయరామ్ ఎమ్. టెక్. చదివాడు. బెంగుళూర్‌లో ఓ పెద్ద కంపెనీలో జాబ్ చేస్తున్నాడు. జీతం నాలుగు అంకెల వరకూ వుంటుంది. అతను చదువుకునే రోజుల్లోనే తండ్రిపోయాడు. అప్పటినుంచి ఆ కొడుకునీ, ఇద్దరు కూతుళ్ళనూ, భర్త ఇచ్చిపోయిన స్థిరాస్థిని జాగ్రత్తగా చూసుకుంటూ వస్తున్నది దుర్గాంబ. జయరామ్‌కి ఇరవై నిండినప్పటినుంచీ అతనికి పెళ్ళిచేయాలని ప్రయత్నిస్తూనే వుంది.

"ఇప్పుడే ఏం పెళ్ళి? చదువు పూర్తయ్యే వరకూ ఆ మాట ఎత్తవద్దు" అంటూ వస్తున్నాడు జయరామ్. అతని చదువు పూర్తయింది. ఉద్యోగంలో స్థిరపడ్డాడు. అప్పటినుంచీ తిరిగి పెళ్ళి ప్రయత్నాలు మొదలు పెట్టిందామె. అప్పుడిక వద్దనలేక తల్లి చూసిరమ్మనమన్న అమ్మాయిని చూసిరావడం, 'నాకు నచ్చలేదు' అని చెప్పడం సాగించాడు. చూస్తూ చూస్తూ కొడుక్కి నచ్చని పిల్లను ఎలా చేస్తుంది? 'నూరేళ్ళు కలిసి జీవించాల్సిన జీవితంలో కలతలు, అసంతృప్తి బయలుదేరితే కలిసి బ్రతకడం కష్టం.' అనే భావంతో ఆ సంబంధం తనకి నచ్చినా, కొడుకు నచ్చలేదనగానే, మరో సంబంధం చూడటం, ఇలా ఎన్ని సంబంధాలో ఈ అయిదారేళ్ళల్లో చూడటం, కాని ఇంత వరకు ఒక్కటీ కుదరలేదు. రెండేళ్ళ క్రితం ఓ కూతురికి, ఏడాది క్రితం మరో కూతురికి మంచి సంబంధాలే చూసి చేసిందామె. కాని కొడుకు మెడలు వంచి మాత్రం పెళ్ళి చేయలేక పోతున్నది. 'నేను బ్రతికివుండగా వాడి పెళ్ళి చూస్తానో, చూడనో' అనే దిగులు మనసుని కృంగదీస్తున్నది. తను ఉండగానే కొడుకు నెత్తిమీద ఆ అక్షింతలు నాలుగూ పడిపోతే ఆ తర్వాత తను ఏమైపోయినా ఫరవాలేదు. ఈ ఉద్దేశ్యంతోనే ఇక కొడుకు వస్తాడనగా ఒకటి రెండు సంబంధాలు చూసి వుంచుతుంది 'పేటిలో ఒకటన్నా అబ్బాయికి నచ్చక పోతుందా' అని. అదేమి దురదృష్టమో కాని చూసిన ప్రతి పిల్లకూ పేర్లు పెట్టూనే వున్నాడు జయరామ్. అందం వుంటే చదువు మరీ తక్కువ అంటాడు. చదువు వుంటే కాకిలా నల్లగా వుందంటాడు. చదువూ అందం వున్న అమ్మాయైతే గొంతుకు బాగా లేదనో, నడక అందంగా లేదనో వంక. వాళ్ళు బాగా వున్నవాళ్ళయి ఎక్కువ కట్నం కానుకలిస్తామంటే 'అటువంటి అమ్మాయిలు, మొగుడి మాట వినరు. వాళ్ళకు కోపం ముక్కుమీదనే వుంటుంది. అహంకారం వాళ్ళ భూషణం, అభిమానం వాళ్ళ ఆరో ప్రాణం' ఇలా వర్ణించి 'ఆ అమ్మాయిని నేను చేసుకోను' అనేస్తాడు కచ్చితంగా. ఈరకంగా కాలక్షేపంచేసి ఓ రోజు చెప్పా పెట్టకుండా బయలుదేరతాడు 'నా శలవు పూర్తయిపోయింది. ఈసారి శలవులకు వచ్చినప్పుడు ఎవరినో ఒకర్ని చేసుకుంటాలే. నువ్వు అనవసరంగా నా గురించి బెంగపెట్టుకుని మనసు పాడు చేసుకోకు' అని తల్లికి నచ్చచెప్పి వెళ్ళి రైల్లో కూర్చుంటాడు.

అటువంటి కొడుకుని ఏ తల్లి మాత్రం ఏంచేయగలదు? లోలోపల బాధపడటం తప్పించి.

ఈసారి కొడుకు వద్దన్నా వినకుండా




ఎలా అయినా పెళ్ళి జరిపించి తీరాలనే నిర్ణయానికొచ్చిన దుర్గాంబగారు కొడుకు రాకముందునుంచే అమ్మాయిల వేట ప్రారంభించి వాటిలో రెండు సంబంధాలను ఎంపికచేసి వుంచింది. రెండు సంబంధాలూ మంచివే. ఓ అమ్మాయి బి.ఏ. పరీక్ష రాస్తే మరొక అమ్మాయి బి. ఏ. ఆఖరి సంవత్సరంలోకి వచ్చింది. రెండు సంబంధాలూ సామాన్యమైనవే. అంటే కట్న కానుకలు ఇచ్చుకోగల స్థోమత వున్నవారు కాదు.

దుర్గాంబకు, కోడలు తీసుకురాబోయే కట్న కానుకలమీద ఆట్టే ఆశ లేదు. ఆవిడ కోరిక ఒక్కటే 'మూడు పదులు నిండిన కొడుకు పెళ్ళంటూ చేసుకుంటే చాలు' అని. అదీగాక ఈసారి కొడుకు పెళ్ళికి సుముఖంగా వుంటాడని చాల నమ్మకంగా వుంది ఆమెకు. తను అంత కఠినంగా వుంటేనే గాని కొడుకు మనసు మార్చుకోడని అలా కోపాన్ని నటించింది కొడుకు ఎదురుగా.

తన వెనకాలే జయ వచ్చి 'అలాగే, నీ యిష్టం. నాకు నచ్చిన అమ్మాయిని చూడమ్మా పెళ్ళి చేసుకుంటాను' అని అంటాడు అనే ఆశతో ఎదురుచూస్తున్న దామె గదిలో కూర్చునే. బిందు వచ్చి చెప్పింది. "అన్నయ్యకు ఈ అమ్మాయీ నచ్చలేదటమ్మా' 'అచ్చు అమ్మమ్మలా వుంది' అని కామెంట్ చేస్తున్నాడు. అనవసరంగా వాడి నెందుకు బాధపెడ్తావుగాని, ఆ పిల్లగల వాళ్ళకు కబురుచేయి 'మీ అమ్మాయి మా అబ్బాయికి నచ్చలేదట. కనుక మా కోసం ఎదురుచూడకుండా మరో సంబంధం చూసుకోండి' అని. లేక

పోతే వాళ్ళు మన రాకకోసం ఆతృతగా ఎదురుచూస్తుంటారు."

ఆ మాట వింటూనే నిరాశా నిస్పృహలకు లోనయ్యింది దుర్గాంబ. విరక్తిలాంటిది చోటుచేసుకుంది మనసుకో. 'గుర్రాన్ని నీళ్ళదగ్గరకు తీసుకెళ్ళగలంగాని, దానిచేత బలవంతంగా నీళ్ళు తాగించగలమా' అనిపించింది. ఒక వేళ బలవంతంగా పెళ్ళి జరిపించినా ఇష్టం లేని భార్యతో వాడు కాపురం చేయడు కూడా. జయమ్మ కొడుకులా 'ఈ భార్యంటే నా కిష్టంలేదు' అని కోర్టు కెక్కి విడాకులు తీసుకున్నా తీసుకో వచ్చు. వాడిష్టమైనప్పుడే తనకి నచ్చిన అమ్మాయినే చేసుకోనియ్యి' అని మనసుకి సమాధానం చెప్పుకుందామె. అయినా కొడుకు తన మాట వినడం లేదే అని మనసులో బాధ. ఆ బాధ పైకి వ్యక్తం చేయలేక లోపల ఇముడ్చుకోలేక తన కోపాన్ని, కసిని రకరకాలుగా వ్యక్తం చేయసాగింది.

తల్లి ఎప్పటిలా తనతో మాట్లాడక పోవడం, అన్నం పెట్టమని అడిగితే ఆ పని బిందుకి చెప్పడం, తను ఏదైనా చెప్పబోతే వినిపించుకోనట్లు వెళ్ళి పోవడం ఇదంతా కనిపెట్టిన జయరామ్‌కి తల్లి తనను ఈ రకంగా సాధిస్తున్నట్లు గ్రహించుకున్నాడు. 'అమ్మ మనసు నొప్పించానా ?' అనుకుంటూ ఆత్మవిమర్శ చేసుకున్నాడు. అమ్మ మనసును బాధించకుండా తిరిగి ఆమె వాత్సల్యాన్ని, అభిమానాన్ని సంపాదించుకోవాలంటే ఏంచేయాలి ?

'తక్షణం మీ అమ్మకోర్కె తీర్చడానికి వెంటనే పెళ్ళికి అంగీకారం తెలపడమేను' హిత బోధ చేసింది అంతరాత్మ.

'నా మనసుకి నచ్చని పిల్లని ఎలా చేసుకోను ?' తనని తను ప్రశ్నించుకున్నాడు పిచ్చిగా.

పిల్లని చూడకుండానే నచ్చలేదనుకోవడం మంచిదికాదు. పైగా అది ఆరోగ్యలక్షణం కాదు కూడాను. కొందరు ఫోటోలో బాగా వుండరు. కాని విడిగా చాలా అందంగా వుంటారు. అయినా ఇప్పుడు నీ వయసెంతో తెలుసా ? బాగా వయసు ముదిరిపోతే తర్వాత అమ్మాయలే నిన్ను తిరస్కరిస్తారేమో 'మాకు నచ్చలేదంటూ.' అప్పుడు అవమానపడేది నువ్వే. అటువంటి చిక్కులు రాకుండా చూసుకో ? అయినా నీ తల్లి నిన్ను ఏం కోరింది? పెళ్ళి చేసుకుని స్థిరపడమంటున్నది. భార్యా బిడ్డలతో నీ సంసారం సుఖంగా సాగిపోతుంటే చూడాలని ఆ తల్లి తపన. ఎదిగిన కొడుకు తల్లికి ఆనందాన్నీ తృప్తినీ కలిగించాలిగాని అశాంతినీ, అసంతృప్తినీ, ఆవేదననూ కలిగించకూడదు. అలా తల్లిని దుఃఖానికి, ఆవేదనకు

సరిచేసిన కొడుకు వున్నా లేకపోయినా ఒకటే. తన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించే కొడుకునిచూసి తల్లి గర్వ పడుతుంది. అటువంటి కొడుక్కి తను తల్లి అయినందుకు ఎంతో పొంగిపో తుంది. అటువంటి గర్వాన్ని, ఆనం దాన్ని, తృప్తిని నీ తల్లికి కలిగించాలని నీవు అనుకోవడంలేదా ?" మనసు మూలల్లోంచి ఎవరో హితబోధ చేయ సాగారు అంతవరకూ అతనిలో వున్న మూర్ఖ పట్టుదల కొద్ది కొద్దిగా సడల సాగింది ఏమైనా ఇక అమ్మను నొప్పించే పని చేయను. నా కష్టం లేక పోయినా అమ్మకోసం అయినా ఇష్టం కలిగించుకుంటాను. ఆ అమ్మాయిని చూట్టానికి రేపే వెళ్తాను. అంతరంగ మథనం తర్వాత ఓ నిశ్చయానికి వచ్చాడు జయరామ్‌కి తన నిశ్చయాన్ని తల్లితో చెప్పడానికి బిడియమేసింది బిందుని పిలిచి ఆ ఫోటోలో అమ్మాయిని చూట్టానికి రేపు వెళ్దామా" అని అడిగాడు.

"ఆ అమ్మాయి నచ్చలేదు, అమ్మ మ్మలా వుందన్నావుగా, మరి ఆ అమ్మమ్మని చూట్టానికే వెళ్తావా ?" ఎత్తిపొడుపుగా నవ్వింది బిందు.

"ప్లీజ్ నన్ను వెక్కిరించకు! నా అభి ప్రాయం చెప్పాను. అమ్మతో చెప్పి రేపు ఆ ఏర్పాట్లు ఏవో చేయించు. అమ్మ ముఖావం, నీ ఎత్తిపొడుపులు చూస్తుంటే నాకు మతిపోతున్నట్లు వుంది తెలుసా ?" అన్నాడు జయరామ్ ముఖం మాడ్చుకుంటూ.

వచ్చే నవ్వుని దాచుకుంటూ అన్న గారి మాటను తల్లితో చెప్పడానికి పరుగలాంటి నడకతో లోపలికెళ్ళి పోయింది బిందు.

* * *

అమ్మాయిని చూసిరావటానికి కొడుకు సుముఖంగా వున్నాడని తెలిసి దుర్గాంబ లోలోపల ఎంతయినా సంతోష పడింది. 'ఆ అమ్మాయిని వాడు మన స్ఫూర్తిగా ఇష్టపడేట్లు చేయి ఏడు కొండలవాడా' అని ఆ వెంకటరమణుడికి పదే పదే దణ్ణం పెట్టుకుంది మనసులో. ఆవిడకు ఆ అమ్మాయి చాలా నచ్చింది. బియ్యే చదువుతున్నా, గర్వం లేకుండా వినయంగా, లక్షణంగా వుంది పిల్ల. 'ఈ పిల్లను కోడ లుగా చేసుకుందే బాగుంటుంది' అని ఆ రోజే అనుకుంది. పెళ్ళంటే ఇంకా సుముఖంగా లేని కొడుకు ఈ పిల్లను అంగీకరిస్తాడా అన్నదే ఆమె అనుమానం. బిందు వచ్చి చెప్పగానే బోలెడంత సంబరపడింది. కాని వాడి మాట వింటేనే కాని ఏదీ నిర్ణయించుకో కూడదు అనుకుంది తనని తాను ఓదార్చుకుంటూ.

ఆ సాయంత్రమే మధ్యవర్తి ద్వారా కబురు చేసింది పిల్లగలవాళ్ళింటికి,

ఆ మర్నాడు తమ అబ్బాయి అక్కడికి రాబోతున్నట్లుగా. వాళ్ళు ఉండేది ఆ ఊరిలోనే మరో వీధిలో.

ఆ మర్నాడు వర్జ్యం చూసుకుని, తిథి, నక్షత్రాలు చూసుకుని బయలు దేరారు. జయరామ్, బిందు, మధ్య వర్తిను. ముగ్గురు అయితే వెళ్ళే పని ముక్కలవుతుందనే భయంతో పక్కింటి పెద్దమనిషిని కూడా ప్రయాణంచేసి పంపించింది, దుర్గాంబ.

చదువుకుంటున్న అమ్మాయి, అనవ సరమైన సిగ్గు ప్రదర్శించకుండా వీళ్ళ దగ్గరగా మరో కుర్చీలో కూర్చుని వాళ్ళతో బాగానే మాట్లాడింది. బిందు అడిగిన మాటలకు ఓపిగ్గా జవాబు చెప్పింది. తన పేరు జయంతి అని చెప్పి, బిందు పేరు అడిగి తెలుసుకుంది. తమ్ముడు 'ట్రే' లో పెట్టుకుని వచ్చిన కాఫీ గ్లాసులను అతిథులకు అందిం చింది. నవ్వుతూ వీడ్కోలు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది. కాని ఎన్నో వూహించుకుంటూ, బలవంత బ్రాహ్మ ణార్థంగా వచ్చిన జయరామ్ మాత్రం కుర్చీకి అతుక్కుపోయినట్లుగా కూర్చుండిపోయాడు ఆ అమ్మాయిలో ఏ అద్భుత శక్తి వుందో, ఎలాటి వశీకరణ శక్తి వుందో, మరే ఆకర్షణ వుందో ఆ అమ్మాయిని చూసీ చూడ గానే అలాగే కళ్ళప్పగించి చూడ సాగాడు. ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసినా తనివితీరనట్లు మళ్ళీ మళ్ళీ చూసాడు రెప్పలార్పకుండా చూసాడు. మనసు మూగవోయినట్లు, మాటలే కరవైపోయినట్లు కాలమే స్తంభించి పోయినట్లు చూసాడు. అక్కడ ఉన్నది తామిద్దరే, ఇంకెవరూ లేనట్లు దీక్షగా, తీక్షణంగా చూసాడు. అయినా తృప్తి కలగడంలేదు మనసుకి. తన కలల సుందరి, తన జీవిత సహచరిణి ఇన్నాళ్ళకి తనకు సాక్షాత్కరించింది ఎంతమంది అమ్మాయిలను చూసాడో కాని ఒక్కరన్నా ఇలా తన మనసుని మొదటి చూపులోనే దోచుకున్న వారున్నారా ? ఉహూ......కళ్ళు అర మూసి ఆలోచనా నిమగ్నుడయ్యాడు. కళ్ళు మూసినా తెరిచినా అదే రూపం. ఏదో మత్తు ఆవరించినట్లుగా వుంది శరీరానికి. అతని ఊహాప్రపంచం చెదిరిపోయింది బిందు పిలుపుతో.

"అన్నయ్యా, అమ్మాయి ఎలా వుంది ? అమ్మమ్మలా వుందా, నాయ నమ్మలా వుందా ?" చిలిపిగా నవ్వింది బిందు.

"నీ మొహం. నోరు మూసుకో."
చిన్నగా కసురుకున్నాడు.

"నాకైతే అమ్మమ్మకు పెద్దక్కలా వుంది బాబూ, ఛీ...ఏం బాగాలేదు."
చెవిలో గుసగుసలాడింది మళ్ళీ.

మధ్యవర్తి, ప్రక్కింటి పెద్దమనిషి, పెళ్ళికూతురు తండ్రీ బిగ్గరగా ఏదో

మాట్లాడుకుంటున్నారు. ఆ సందడిలో వాళ్ళ మాటలు ఎవరూ వినిపించుకో లేదు.

"నీకు దణ్ణం పెడ్తాను, కాస్సేపు నోరు మూసుకోవే బిందూ. నీ మాటలు వాళ్ళు విన్నారంటే బాగుండదు." బ్రతిమిలాడాడు జయరామ్.

'అలా దారికిరా' అన్నట్లు అల్లరిగా నవ్వి బిందు బుద్ధిమంతురాల్లా నోరు మూసుకుంది, ఇక ఏడిపించనులే నిన్ను అనే ధోరణిలో.

కాస్సేపు కూర్చుని లేచారు వెళ్తా మంటూ వాళ్ల ఉద్దేశ్యాలు తెలుసుకోవ డానికి మధ్యవర్తి అక్కడే ఆగిపోయాడు. వాళ్ళు ముగ్గురూ ఇంటిముఖం పట్టారు. దారిలో బిందు మాట్లాడసాగింది "ఆ అమ్మాయికి నువ్వు నచ్చలేదు కాబోలురా అన్నయ్యా. మూతి బిగాయించింది. నేను లోపలికి వెళ్ళాను చెప్పడానికి. కనీసం మర్యాదకోసమైనా నవ్వింది కాదు. పేద్ద తనే గొప్ప అందగత్తె ననుకుంది కాబోలు. ఇంతకన్న అంద మైన వాళ్ళనే నువ్వు చూసి తిరస్క రించిన సంగతి తనకు తెలియదు కాబోలు."

జయరామ్ గుండె ఝల్లుమ దొక్క సారిగా. ఆ అమ్మాయికి తను నచ్చలేదా? ఎందుకు నచ్చడూ? తనకేం లోటు ఆడపిల్లల్ని ఆకర్షించుకోగల అందం, పెద్దచదువు, చదువుకి మించిన హోదాగల ఉద్యోగం, ఇన్ని కలిగివున్న తను ఒక ఆడపిల్లను ఆకర్షించుకోలేడా? ఇన్‌సల్ట్, గ్రేట్ ఇన్‌సల్ట్. బిందు వైపు కోపంగా చూసాడు 'అలా మాట్లాడకు, నాకు చాల బాధగా వుంది' అన్నట్లు, కాని అన్నగారి ముఖంలోని భావాలను అవగాహన చేసుకోలేని బిందు నోటి కొచ్చినట్లు ఇంకా ఇంకా వాగుతూనే వుంది. 'ఆ అమ్మాయి కాకపోతే మరొ కమ్మాయి, ఈ ఆంధ్రదేశం ఆడిపిల్లలకే గొడ్డోయిందా' అంటున్నది.

ఈసారి జయరామ్ మాట్లాడలేదు. "నాకు బజార్లో పనివుంది. మీరు వెళ్ళండి ఇంటికి" అంటూ బిందుని, అతన్ని రిక్షా ఎక్కించి తను మరో రిక్షా ఎక్కి వెళ్ళిపోయాడు.

* * *

"అన్నయ్యా ఏమన్నాడు? అమ్మాయి నచ్చిందని చెప్పాడా?" గడపలో కాలు పెట్టగానే బిందుని అడిగింది ఆతృతగా దుర్గాంబ. ఫరవాలేదు, వాడి ధోరణి చూస్తుంటే నువ్వు వద్దన్నా విన కుండా 'ఆ పిల్లనే చేసుకుంటాను' అనేలా వున్నాడు." బిందు నవ్వింది నిండుగా.

'అమ్మయ్య ఇన్నాళ్ళకి తన కోర్కె తీరబోతున్నది' లోలోపల ఎంతయినా ఆనందపడిందామె. 'పెళ్ళి ఎక్కడ చేయాలి? గుళ్ళో దేవుడి సన్నిధిలో చేస్తే బాగుంటుందా లేక ఇంటిముందు వేసిన పందిరిలో చేస్తే నిండుగా

వుంటుందా ! పెళ్ళికూతురికి ఏమేమి నగలు పెట్టాలో.' ఈ రకమైన ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరి కాసాగిందామె.

ఓ గంట తర్వాత మధ్యవర్తి వచ్చాడు. "వాళ్ళకి మన అబ్బాయి నచ్చాడు కాని కట్నం దగ్గరే భయపడుతున్నారు 'వాళ్ళ అంతస్తుకి మేము తూగలేమేమో,' అంటున్నారు అని చెప్పాడు.

"మనకి కట్నం అక్కర్లేదు. వాళ్ళ అమ్మాయికి ఏం పెట్టుకుంటారో పెట్టుకోమనండి చాలు. పెళ్ళి కూడా గుళ్ళో జరిపించేస్తే ఖర్చు తెలిసిపోతుంది. ముహూర్తం పెట్టుకోవడానికి ఎప్పుడు రమ్మన్నారో కనుక్కునే వచ్చారా ?"

"రేపు దశమి గురువారం మంచి దని, మనల్ని రమ్మనమని చెప్పారు వియ్యంకుడుగారు" అని చెప్పి "రేపు నాలుగ్గంటలకు కెళ్ళాము బ్రాహ్మడి దగ్గరకు " నేను వెళ్తున్నా అని వెళ్ళిపోయాడతను. ఈ సంబంధం గురించి వివరాలు చెప్పింది ఆయనే. "ఈ పెళ్ళి కూడా మీ చేతి మీదుగానే జరిపించండి అన్నయ్యగారూ. వెనకాముందూ, మొగదక్షత లేనిదాన్ని" అంటూ కొడుకు పెళ్ళి భారమంతా ఆయనమీద పెట్టింది దుర్గాంబ. అందుకు ఆనందంగా ఒప్పుకున్నాడాయన.

* * *

రాత్రి మొదటి ఆట చూసి పది గంటలకు ఇంటికొచ్చిన జయరామ్‌కి అన్నం పెడ్తూ "వాళ్ళు మనతో తూగలేమని కబురుచేసారు" అంది దుర్గాంబ.

"అంటే ?" అర్థం కానట్లు చూసాడతను తల్లి వైపు.

"అంటే ఏం వుంది ? మనం అడిగినంత కట్నమూ ఇవ్వలేమని కాబోలు వాళ్ళ ఉద్దేశ్యం" ఆ మాటకు కొడుకు ఏమంటాడో అన్నట్లు అతని ముఖంలోకి తీక్షణంగా చూసిందామె.

"మనం కట్న కానుకలు తీసుకోమని నువ్వు కబురు వేయలేదా అమ్మా ?" అడిగాడు కోపంగా చూస్తూ.

"ఈ రోజుల్లో కట్నం కోరనివారెవర్రా ? బిందుకి, హేమకి కట్నం ఇవ్వగా లేనిది నీకు తీసుకుంటే ఏం ?" నిదానంగా జవాబు చెప్పి తల్లివైపు చురుగ్గా చూసాడతను.

మన కిష్టమయ్యింది మన అమ్మాయిలకు పుట్టింటి ఆస్తిగా మనకు తోచింది ఇచ్చాము. అలా అని ఎదుటివారిని బలత్కారంగా ఇమ్మంటావా ? వాళ్ళు కట్నం ఇవ్వలేని స్థితిలో వుంటే ?"

"అప్పుడు ఈ సంబంధాన్ని వదులుకుని మరొకటి చూసుకుంటాము. ఉద్యోగం సద్యోగం లేనివాళ్ళకే వేల మీద కట్నాలు ఇస్తున్నప్పుడు, అయిదారేళ్ళనుంచి ఉద్యోగం చేస్తున్న నీకు ఇవ్వడం అబ్బురమా." నిర్లక్ష్యంగా అందావిడ.

"నువ్వు కట్నం గురించి ఆశపెట్టు



కుంటే నా పెళ్ళెంటూ జరగడంకూడా చూడలేవమ్మా నీవు......" తినే తినే అన్నంలో చేయి కడుక్కొని లేచి పోయాడు జయరామ్

"అయ్యో ఎంతపని జరిగింది. వాడిని అర్థాకలితో లేపగొట్టానే" ఖిన్నురాలయ్యిందామె వాడి ఉద్దేశం తెలుసుకోవాలని అలా మాట్లాడితే అదంతా నిజమే అనుకున్నాడు కాబోలు పిచ్చి సన్యాసి కొడుకుని వెనక్కి పిలిచి, 'నేను చెప్పిందంతా అబద్ధం. వాళ్ళ అమ్మాయిని నీ కివ్వడానికి వాళ్ళు సుముఖంగానే వున్నారట. ముహూర్తాలు పెట్టుకోవడానికి రేపు వెళ్తున్నాము' అని చెప్పాలనుకుంది. అంతలోనే ఆ అభిప్రాయాన్ని మార్చుకుని 'ఇప్పుడెందుకులే, రేపు అక్కడకు వెళ్ళేముందు చెప్తేసరి' అనుకుంది.

పుస్తకం చదువుతూ కూర్చున్న బిందు అన్నగారిని చూసి పుస్తకం మడిచి ఓ పక్కన పెట్టి తిన్నగా కూర్చుంది.

"సినిమా బాగాలేదా ? లేక హోటల్లో ఎవరితో అయినా పోట్లాడి వచ్చావా

అలా వుంది ముఖం." నవ్వు దాచుకుంటూ అడిగింది.

మాట్లాడలేదు జయరామ్.

"వాళ్ళు కబురు పంపించారు ?"

"వాళ్ళా ! వాళ్ళెవరూ ?" విస్మయంగా చూసాడతను.

"ఇంకెవరు ? వాళ్ళే ఉదయం వెళ్ళామే పెళ్లి చూపులకు, వాళ్ళేను. ఆ అమ్మాయి ఇప్పుడే పెళ్ళిచేసుకోదట, ఎమ్.ఎ. కూడా చదువుతుందట."

"మంచిదే. బాగా చదివి దేశాన్ని ఉద్ధరిస్తుందటనా." వెటకారంగా అని నవ్వేడు జయరామ్. పై మాటగా అలా అన్నా హృదయంలో ఎక్కడో కలుక్కుమనిపించింది. 'తను నచ్చలేదా ఆ అమ్మాయికి ? నచ్చకే అలా కబురు చేసిందా ! లేక నిజంగానే చదువుకోవాలని అనుకుంటున్నదా ? ఏమో...' అతనికి చాల అవమానంగా వుంది. అవతలనుంచి అటువంటి కబురు వస్తుందని కలలో కూడా ఊహించుకోనందువల్ల చాల ఆశాభంగంగా వుందతనికి. ఆ అమ్మాయి గురించి అప్పుడే ఎన్ని కలలు కన్నాడో— ఆ అమ్మాయి తన భార్య అయినట్లు, ఇద్దరూ చెట్టాపట్టా లేసుకుని తిరుగుతున్నట్లు. ఓహ్ తనెంత మూర్ఖుడో ఇప్పు డు తెలుసుకున్నాడు, మనసు పారేసుకున్నంత తేలిగ్గా వెనక్కి తీసుకోలేమని.

ఆ అమ్మాయి తనని ఎందుకు వద్దన్నదో వెళ్ళి తననే కనుక్కుంటే ? నేను అందంగా లేనా ? నా చదువు తక్కువా ? నా సంపాదన తక్కువా ? ఆ అమ్మాయి ఏ కాలేజీలో చదువుతున్నదో ? ముందు ఆ విషయం కనుక్కొని వెళ్ళి ముఖాముఖిగ అడిగి నా సందేహాలన్నీ తీర్చుకుంటాను. అప్పటికీ తను సుముఖంగా లేకపోతే... ఆ అమ్మాయితో కలిసి జీవించే అదృష్టం లేదనుకుని వచ్చేస్తాను. ఓ వేళ 'మిమ్మల్ని చేసుకోవడం నా కిష్టమేను, కాని మావాళ్ళకే ఇష్టంలేదు మీతో వియ్యం అందుకోవడం' అంటే ? అలా అంటే చాలు, అటు పెద్దలు, ఇటు పెద్దలు ఎవరు వద్దన్నా మా పెళ్ళి ఆగదు ఆ అమ్మాయి అంగీకారం వుంటే చాలు రిజిష్ట్రారాఫీసులో పెళ్ళిచేసుకుంటాము. ఇంటికొస్తాము. అలా ఊహించుకుంటుంటే అలా పెద్దల్ని ఎదిరించి చేసుకున్న ఎన్నో జంటలు ఊహాపదంలోకి కదలసాగారు. ఆ నిశ్చయానికి, తెగింపుకి వచ్చాక మనసు లోని అలజడి ఆవేశం కాస్త తగ్గి, ఊరట లభించినట్లయింది.

మౌనంగా కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్న అన్నగారి వైపు వారగా చూస్తున్న బిందుకి, ఇంక . అన్నయ్యను ఏడిపించకూడదు, ఇప్పటికే వాడి మనసుని చెదరగొట్టాను చాలావరకూ అనిపించింది. సానుభూతిగా చూసింది




అతనివైపు "అన్నయ్యా, నీకు గుడ్ న్యూస్ చెప్తాను మరి నాకేం ఇస్తావు ప్రతిఫలంగా" అంది గారంగా చూస్తూ.

"ఏం కావాలో అడుగు ? ఆకాశాన్ని దించమంటావా, చుక్కల్ని తెంచమంటావా ?" కొంటెగా అడిగాడతను.

"వాటిని నేనేంచేసుకోను, మంచి ఖరీదుగల పట్టుచీర కొనిపెడ్తానంటే చెప్తాను" ఊరించింది కాస్సేపు.

"అలాగే కొంటానులే."

"మరేం ఆ అమ్మాయికి నీవు నచ్చావట. అమ్మా, మామయ్యగారు ఆక్కడికి వెళ్తున్నారు ముహూర్తాలు పెట్టుకు రావడానికి. ఆ అమ్మమ్మ మోజులో పడి నా చీరమాట మర్చిపోయేవు కొంప దీసి. ఊరుకోను సుమా !" హెచ్చరించింది బిందు.

"అసలు ఇంత సేపూ నన్ను ఏడిపించినందుకు, నీకస్సలు ఏమీ కొనకూడదు." చిరుకోపం నటించినా ఆ కోపం ఎంతసేపో నిలవలేదు. తను మనసా వాచా కోరుకున్న యువతే తన భార్య కాబోతున్నది. అంతకన్నా కోరుకోవలసిన అదృష్టం ఏం వుంది జీవితంలో ! అనిపించిందతని కా

* * *

ఆ వారంలోనే జయరామ్, జయంతిల వివాహం జరిగింది. ఆ రోజే పునస్సంధానం, భార్యాభర్తలు ఏకాంతంగా కలుసుకున్నారు "నేనంటే నీ కిష్టం లేదా ?" జయంతి చేతిని పట్టుకుంటూ గోముగా అడిగాడు జయరామ్. 'మీరంటే నాకు చాలా యిష్టం' అనే

ఆ మర్నాడు తమ అబ్బాయి అక్కడికి రాబోతున్నట్లుగా. వాళ్ళు ఉండేది ఆ ఊరిలోనే మరో వీధిలో.

ఆ మర్నాడు వర్జ్యం చూసుకుని, తిథి, నక్షత్రాలు చూసుకుని బయలు దేరారు. జయరామ్, బిందు, మధ్య వర్తీను. ముగ్గురు అయితే వెళ్ళే పని ముక్కలవుతుందనే భయంతో పక్కింటి పెద్దమనిషిని కూడా ప్రయాణంచేసి పంపించింది, దుర్గాంబ.

చదువుకుంటున్న అమ్మాయి, అనవ సరమైన సిగ్గు ప్రదర్శించకుండా వీళ్ళ దగ్గరగా మరో కుర్చీలో కూర్చుని వాళ్ళతో బాగానే మాట్లాడింది. బిందు అడిగిన మాటలకు ఓపిగ్గా జవాబు చెప్పింది. తన పేరు జయంతి అని చెప్పి, బిందు పేరు అడిగి తెలుసుకుంది. తమ్ముడు 'ట్రే' లో పెట్టుకుని వచ్చిన కాఫీ గ్లాసులను అతిథులకు అందించింది. నవ్వుతూ వీడ్కోలు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది. కాని ఎన్నో వూహించుకుంటూ, బలవంత బ్రాహ్మ ణార్థంగా వచ్చిన జయరామ్ మాత్రం కుర్చీకి అతుక్కుపోయినట్లుగా కూర్చుండిపోయాడు ఆ అమ్మాయిలో ఏ అద్భుత శక్తి వుందో, ఎలాటి వశీకరణ శక్తి వుందో, మరే ఆకర్షణ వుందో ఆ అమ్మాయిని చూసీ చూడ గానే అలాగే కళ్ళప్పగించి చూడ సాగాడు. ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసినా తనివితీరనట్లు మళ్ళీ మళ్ళీ చూసాడు రెప్ప లార్పకుండా చూసాడు. మనసు మూగవోయినట్లు, మాటలే కరవైపోయినట్లు కాలమే స్థంభించి పోయినట్లు చూసాడు. అక్కడ వున్నది తామిద్దరే, ఇంకెవరూ లేనట్లు దీక్షగా, తీక్షణంగా చూసాడు. అయినా తృప్తి కలగడంలేదు మనసుకి. తన కలల సుందరి, తన జీవిత సహచరిణి ఇన్నాళ్లకి తనకు సాక్షాత్కరించింది ఎంతమంది అమ్మాయిలను చూసాడో కాని ఒక్కరన్నా ఇలా తన మనసుని మొదటి చూపులోనే దోచుకున్న వారున్నారా ? ఊహూ......కళ్ళు అర మూసి ఆలోచనా నిమగ్నుడయ్యాడు. కళ్ళు మూసినా తెరిచినా అదే రూపం. ఏదో మత్తు ఆవరించినట్లుగా వుంది శరీరానికి. అతని ఊహాప్రపంచం చెదిరిపోయింది బిందు పిలుపుతో.

"అన్నయ్యా, అమ్మాయి ఎలా వుంది ? అమ్మమ్మలా వుందా, నాయ నమ్మలా వుందా ?" చిలిపిగా నవ్వింది బిందు.

"నీ మొహం. నోరు మూసుకో."

చిన్నగా కసురుకున్నాడు.

"నాకైతే అమ్మమ్మకు పెద్దక్కలా వుంది బాబూ, ఛీ...ఏం బాగాలేదు." చెవిలో గుసగుసలాడింది మళ్ళీ.

మధ్యవర్తి, ప్రక్కింటి పెద్దమనిషీ, పెళ్ళికూతురు తండ్రీ దగ్గరగా ఏదో

మాట్లాడుకుంటున్నారు. ఆ సందడిలో వాళ్ళ మాటలు ఎవరూ వినిపించుకో లేదు.

"నీకు దణ్ణం పెడ్తాను, కాస్సేపు నోరు మూసుకోవే బిందూ. నీ మాటలు వాళ్ళు విన్నారంటే బాగుండదు." బ్రతిమిలాడాడు జయరామ్.

'అలా దారికిరా' అన్నట్లు అల్లరిగా నవ్వి బిందు బుద్ధిమంతురాల్లా నోరు మూసుకుంది, ఇక ఏడిపించనులే నిన్ను అనే ధోరణిలో.

కాస్సేపు కూర్చుని లేచారు వెళ్తామంటూ వాళ్ల ఉద్దేశ్యాలు తెలుసుకోవడానికి మధ్యవర్తి అక్కడే ఆగిపోయాడు. వాళ్ళు ముగ్గురూ ఇంటిముఖం పట్టారు. దారిలో బిందు మాట్లాడసాగింది "ఆ అమ్మాయికి నువ్వు నచ్చలేదు కాబోలురా అన్నయ్యా. మూతి బిగాయించింది. నేను లోపలికి వెళ్ళాను చెప్పడానికి. కనీసం మర్యాదకోసమైనా నవ్వింది కాదు. పేద్ద తనే గొప్ప అందగత్తె ననుకుంది కాబోలు. ఇంతకన్న అందమైన వాళ్ళనే నువ్వు చూసి తిరస్కరించిన సంగతి తనకు తెలియదు కాబోలు."

జయరామ్ గుండె ఝల్లుమ దొక్కసారిగా. ఆ అమ్మాయికి తను నచ్చలెదా? ఎందుకు నచ్చడూ? తనకేం లోటు ఆడపిల్లల్ని ఆకర్షించుకోగల అందం, పెద్దచదువు, చదువుకి మించిన హోదాగల ఉద్యోగం, ఇన్ని కలిగివున్న తను ఒక ఆడపిల్లను ఆకర్షించుకోలేడా? ఇన్‌సల్ట్, గ్రేట్ ఇన్‌సల్ట్. బిందు వైపు కోపంగా చూసాడు 'అలా మాట్లాడకు, నాకు చాల బాధగా వుంది' 'అన్నట్లు, కాని అన్నగారి ముఖంలోని భావాలను అవగాహన చేసుకోలేని బిందు నోటి కొచ్చినట్లు ఇంకా ఇంకా వాగుతూనే వుంది. 'ఆ అమ్మాయి కాకపోతే మరొకమ్మాయి, ఈ ఆంధ్రదేశం ఆడపిల్లలకే గొడ్డోయిందా' అంటున్నది.

ఈసారి జయరామ్ మాట్లాడలేదు. "నాకు బజార్లో పనివుంది.మీరు వెళ్ళండి ఇంటికి" అంటూ బిందుని, అతన్ని రిక్షా ఎక్కించి తను మరో రిక్షా ఎక్కి వెళ్ళిపోయాడు.

* * *

"అన్నయ్య ఏమన్నాడు? అమ్మాయి నచ్చిందని చెప్పాడా?" గడపలో కాలు పెట్టగానే బిందుని అడిగింది ఆతృతగా దుర్గాంబ. ఫరవాలేదు, వాడి ధోరణి చూస్తుంటే నువ్వు వద్దన్నా వినకుండా 'ఆ పిల్లనే చేసుకుంటాను' అనేలా వున్నాడు." బిందు నవ్వింది నిండుగా.

'అమ్మయ్య ఇన్నాళ్ళకి తన కోర్కె తీరబోతున్నది' లోలోపల ఎంతయినా ఆనందపడిందామె. 'పెళ్ళి ఎక్కడ చేయాలి? గుళ్ళో దేవుడి సన్నిధిలో చేస్తే బాగుంటుందా లేక ఇంటిముందు వేసిన పందిరిలో చేస్తే నిండుగా

వుంటుందా ! పెళ్ళికూతురికి ఏమేమి నగలు పెట్టాలో.' ఈ రకమైన ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరి కాసాగిందామె.

ఓ గంట తర్వాత మధ్యవర్తి వచ్చాడు. "వాళ్ళకి మన అబ్బాయి నచ్చాడు కాని కట్నం దగ్గరే భయపడుతున్నారు 'వాళ్ళ అంతస్తుకి మేము తూగలేమేమో,' అంటున్నారు అని చెప్పాడు.

"మనకి కట్నం అక్కర్లేదు. వాళ్ళ అమ్మాయికి ఏం పెట్టుకుంటారో పెట్టుకోమనండి చాలు. పెళ్ళి కూడా గుళ్ళో జరిపించేస్తే ఖర్చు కలిసివస్తుంది. ముహూర్తం పెట్టుకోవడానికి ఎప్పుడు రమ్మన్నారో కనుక్కునే వచ్చారా ?"

"రేపు దశమి గురువారం మంచిదని, మనల్ని రమ్మనమని చెప్పారు వియ్యంకుడుగారు" అని చెప్పి "రేపు నాలుగ్గంటలకు కెళ్దాము బ్రాహ్మడి దగ్గరకు" నేను వెళ్తున్నా అని వెళ్ళిపోయాడతను. ఈ సంబంధం గురించి వివరాలు చెప్పింది ఆయనే. "ఈ పెళ్ళి కూడా మీ చేతి మీదుగానే జరిపించండి అన్నయ్యగారూ. వెనకాముందూ, మొగదక్షత లేనిదాన్ని" అంటూ కొడుకు పెళ్ళి భారమంతా ఆయనమీద పెట్టింది దుర్గాంబ. అందుకు ఆనందంగా ఒప్పుకున్నాడాయన.

* * *

రాత్రి మొదటి ఆట చూసి పది గంటలకు ఇంటికొచ్చిన జయరామ్‌కి అన్నం పెడ్తూ "వాళ్ళు మనతో తూగలేమని కబురుచేసారు" అంది దుర్గాంబ.

"అంటే ?" అర్థం కానట్లు చూసాడతను తల్లి వైపు.

"అంటే ఏం వుంది ? మనం అడిగినంత కట్నమూ ఇవ్వలేమని కాబోలు వాళ్ళ ఉద్దేశ్యం" ఆ మాటకు కొడుకు ఏమంటాడో అన్నట్లు అతని ముఖంలోకి తీక్షణంగా చూసిందామె.

"మనం కట్న కానుకలు తీసుకోమని నువ్వు కబురు చేయలేదా అమ్మా ?" అడిగాడు కోపంగా చూస్తూ.

"ఈ రోజుల్లో కట్నం కోరనివారెవర్రా ? బిందుకి, హేమకి కట్నం ఇవ్వగా లేనిది నీకు తీసుకుంటే ఏం ?" నిదానంగా జవాబు చెప్పే తల్లివైపు చురుగ్గా చూసాడతను.

"మన కిష్టమయ్యింది మన అమ్మాయిలకు పుట్టింటి ఆస్తిగా మనకు తోచింది ఇచ్చాము. అలా అని ఎదుటివారిని బలత్కారంగా ఇమ్మంటావా ? వాళ్ళు కట్నం ఇవ్వలేని స్థితిలో వుంటే ?"

"అప్పుడు ఈ సంబంధాన్ని వదులుకుని మరొకటి చూసుకుంటాము. ఉద్యోగం సద్యోగం లేనివాళ్ళకే వేల మీద కట్నాలు ఇస్తున్నప్పుడు, అయిదారేళ్ళనుంచి ఉద్యోగం చేస్తున్న నీకు ఇవ్వడం అబ్బురమా." నిర్లక్ష్యంగా అందావిడ.

"నువ్వు కట్నం గురించి ఆశపెట్టు



కుంటే నా పెళ్ళంటూ జరగడంకూడా చూడలేవమ్మా నీవు......" తినే తినే అన్నంలో చేయి కడుక్కుని లేచి పోయాడు రఘురామ్.

"అయ్యో ఎంతపని జరిగింది. వాడిని అర్థాకలితో లేపగొట్టానే" ఖిన్నురాలయ్యిందామె. వాడి ఉద్దేశం తెలుసుకోవాలని అలా మాట్లాడితే అదంతా నిజమే అనుకున్నాడు కాబోలు పిచ్చి సన్యాసి. కొడుకుని వెనక్కి పిలిచి, 'నేను చెప్పిందంతా అబద్ధం. వాళ్ళ అమ్మాయిని నీ కివ్వడానికి వాళ్ళు సుముఖంగానే వున్నారట. ముహూర్తాలు పెట్టుకోవడానికి రేపు వెళ్తున్నాము' అని చెప్పాలనుకుంది. అంతలోనే ఆ అభిప్రాయాన్ని మార్చుకుని 'ఇప్పుడెందుకులే, రేపు అక్కడకు వెళ్ళేముందు చెప్తేసరి' అనుకుంది.

* * *

పుస్తకం చదువుతూ కూర్చున్న బిందు అన్నగారిని చూసి పుస్తకం మడిచి ఓ పక్కన పెట్టి తిన్నగా కూర్చుంది.

"సినిమా బాగాలేదా ? లేక హాల్లో ఎవరితో అయినా పోట్లాడి వచ్చావా

అలా వుంది ముఖం." నవ్వు దాచుకుంటూ అడిగింది.

మాట్లాడలేదు జయరామ్.

"వాళ్ళు కబురు పంపించారు ?"

"వాళ్ళా ! వాళ్ళెవరూ ?" విస్మయంగా చూసాడతను.

"ఇంకెవరు ? వాళ్ళే ఉదయం వెళ్ళామే పెళ్లి చూపులకు, వాళ్ళేను. ఆ అమ్మాయి ఇప్పుడే పెళ్ళిచేసుకోదట, ఎమ్.ఎ. కూడా చదువుతుందట."

"మంచిదే. బాగా చదివి దేశాన్ని ఉద్ధరిస్తుందటనా." వెటకారంగా అని నవ్వేడు జయరామ్. పై మాటగా అలా అన్నా హృదయంలో ఎక్కడో కలుక్కుమనిపించింది. 'తను నచ్చలేదా ఆ అమ్మాయికి ? నచ్చకే అలా కబురు చేసిందా ! లేక నిజంగానే చదువుకోవాలని అనుకుంటున్నదా ? ఏంవో...' అతనికి చాల అవమానంగా వుంది. అవతలనుంచి అటువంటి కబురు వస్తుందని కలలో కూడా ఊహించుకోనందువల్ల చాల ఆశాభంగంగా వుందతనికి. ఆ అమ్మాయి గురించి అప్పుడే ఎన్ని కలలు కన్నాడో— ఆ అమ్మాయి తన భార్య అయినట్లు, ఇద్దరూ చెట్టాపట్టా లేసుకుని తిరుగుతున్నట్లు. ఓహ్ తనెంత మూర్ఖుడో ఇప్పుడు తెలుసుకున్నాడు, మనసు పారేసుకున్నంత తేలిగ్గా వెనక్కి తీసుకోలేమని.

ఆ అమ్మాయి తనని ఎందుకు వద్దన్నదో వెళ్ళి తననే కనుక్కుంటే ? నేను అందంగా లేనా ? నా చదువు తక్కువా ? నా సంపాదన తక్కువా ? ఆ అమ్మాయి ఏ కాలేజీలో చదువుతున్నదో ? ముందు ఆ విషయం కనుక్కుని వెళ్ళి ముఖాముఖిగ అడిగి నా సందేహాలన్నీ తీర్చుకుంటాను. అప్పటికి తను సుముఖంగా లేకపోతే... ఆ అమ్మాయితో కలిసి జీవించే అదృష్టం లేదనుకుని వచ్చేస్తాను. ఓ వేళ 'మిమ్మల్ని చేసుకోవడం నా కిష్టమేను, కాని మావాళ్ళకే ఇష్టంలేదు మీతో వియ్యం అందుకోవడం' అంటే ? అలా అంటే చాలు, అటు పెద్దలు, ఇటు పెద్దలు ఎవరు వద్దన్నా మా పెళ్ళి ఆగదు ఆ అమ్మాయి అంగీకారం వుంటే చాలు రిజిష్ట్రారాఫీసులో పెళ్ళిచేసుకుంటాము. ఇంటికొస్తాము. అలా ఊహించుకుంటుంటే అలా పెద్దల్ని ఎదిరించి చేసుకున్న ఎన్నో జంటలు ఊహాపదంలోకి కదలసాగారు. ఆ నిశ్చయానికి, తెగింపుకి వచ్చాక మనసులోని అలజడి ఆవేశం కాస్త తగ్గి, ఊరట లభించినట్లయింది.

మౌనంగా కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్న అన్నగారి వైపు వారగా చూస్తున్న బిందుకి, ఇంక అన్నయ్యను ఏడిపించకూడదు, ఇప్పటికే వాడి మనసుని చెదరగొట్టాను చాలావరకూ అనిపించింది. సానుభూతిగా చూసింది











అతనివైపు. "అన్నయ్యా, నీకు గుడ్ న్యూస్ చెప్తాను మరి నాకేం ఇస్తావు ప్రతిఫలంగా" అంది గారంగా చూస్తూ.

"ఏం కావాలో అడుగు ? ఆకాశాన్ని దించమంటావా, చుక్కల్ని తెంచమంటావా ?" కొంటెగా అడిగాడతను.

"వాటిని నేనేంచేసుకోను, మంచి ఖరీదుగల పట్టుచీర కొనిపెడ్తానంటే చెప్తాను" ఊరించింది కాస్సేపు.

"అలాగే కొంటానులే."

"మరేం ఆ అమ్మాయికి నీవు నచ్చావట. అమ్మా, మామయ్యగారు అక్కడికి వెళ్తున్నారు ముహూర్తాలు పెట్టుకు రావడానికి. ఆ అమ్మమ్మ మోజులో పడి నా చీరమాట మర్చిపోయేవు కొంప దీసి. ఊరుకోను సుమా !" హెచ్చరించింది బిందు.

"అసలు ఇంత సేపూ నన్ను ఏడిపించినందుకు, నీ కస్సలు ఏమీ కొనకూడదు." చిరుకోపం నటించినా ఆ కోపం ఎంత సేపో నిలవలేదు. తను మనసా వాచా కోరుకున్న యువతే తన భార్య కాబోతున్నది. అంతకన్నా కోరుకోవలసిన అదృష్టం ఏం వుంది జీవితంలో ! అనిపించిందతని కా

* * *

ఆ వారంలోనే జయరామ్, జయంతిల వివాహం జరిగింది. ఆ రోజే పునస్యంధానం, భార్యాభర్తలు ఏకాంతంగా కలుసుకున్నారు "నేనంటే నీ కిష్టం లేదా ?" జయంతి చేతిని పట్టుకుంటూ గోముగా అడిగాడు జయరామ్. 'మీరంటే నాకు చాలా యిష్టం' అనే

మాటని భార్య నోటిద్వారా వినాలని అతని కాంక్ష.

'నీ రంటే నాకు ఇష్టం లేదూ ? ఎవరన్నారు అలా ? ఈ పెళ్ళి జరుగు తుందో లేదో, నీకు నేను నచ్చానో లేదో, అని ఎంత తపించిపోయానో మీ కెలా చెప్పను ?' మనసులో అనుకున్న జయంతి పెదవి కదిపి ఒక్క మాటన్నా చెప్పలేదు. కేవలం నవ్వి ఊరుకుంది.

తనని పెళ్ళిచూపులు చూడ్డం కోసం వచ్చిన మొదటి వ్యక్తి, చివర వ్యక్తీ ఈయనే ఈయన్ని చూడగానే చేసుకుంటే తననే చేసుకుంటాను, లేకపోతే జీవితాం తమూ కన్యలా వుండిపోతాను' అని అ క్షణంలోనే నిర్ణయించుకుంది. తండ్రి, వాళ్ళు వెళ్ళిపోయాక తల్లితో అంటు న్నాడు "మన తాహతుకి మించిన సంబంధం ఇది. వియ్యమైనా కయ్య మైనా సమానమైన వాళ్ళతోనే పొందా లట. మా అమ్మాయికి నచ్చలేదట అని కబురు చేస్తాను" అని. ఆ మాట విని తన గుండె జారిపోయింది. అతను తనకి అందని ఫలం అనుకోగానే ఉక్రో షంతో ఏడుపు ముంచుకొచ్చింది. తన బాధని, తన ఆశని ఎవరితో చెప్ప కుంటుంది ? ఆ రోజంతా దిగులుగా తిరిగింది. ఆ మర్నాడు వాళ్ళే ఏకంగా ముహూర్తం పెట్టుకోవడానికి వచ్చారు అప్పుడు తన ఆనందం వర్ణింపరానిది. వాళ్ళకి కట్నం అక్కర్లేదట. ఆ మాట విన్నాక తన దిగులంతా పోయింది. 'కల్యాణ ఘడియ' అంటే ఇదే కాబోలు తనవైపే తమకంగా చూస్తున్న భర్త వైపు ఓ క్షణంచూసి చప్పున కళ్ళు వాల్చేసుకుంది జయంతి. ఆమె పెదవుల మీద చిరునవ్వు లీలగా మెరిసి మాయ మయ్యింది.

'అసలు పెళ్ళే చేసుకోనన్న పెద్ద మనిషి, ఇప్పు డెలా చేసుకున్నాడా" అని నవ్వుకుంటున్నావు కదూ ! ఏం చేయను ఒక్కో అమ్మాయి వుందంటే అయస్కాంతంలా లాక్కుంటుంది మనసుని. ఆ మనసుని వెతుక్కుంటూ వచ్చి నీకు బందీనైపోయాను" జయ రామ్ భార్య చేయిపట్టి దగ్గరగా లాక్కు న్నాడు.

"నన్ను పెళ్ళిచేసుకుని చాలా కట్నం నష్టపోయారు కదూ" అంది చిన్నగా జయంతి, అతని కౌగిలిలో ఒదిగిపోతూ.






## పోలుదుగు సత్యనారాయణరావు

# ఎండ వెనుక వెన్నెల

రాజేంద్ర రేడియో కట్టేసాడు అంత వరకూ ఆ రేడియో మాటలే చెప్పిందో, పాటలే పాడిందో అతనికి తెలీదు. ఆలోచనలు అతన్ని వదలేక, అతను ఈ లోకంలోకి వచ్చాక రేడియో కట్టేసాడు. ఆ రేడియో అంతక్రితమే తమ ప్రసారాన్ని ఆ రోజుకు కట్టేస్తున్నట్టుగా ప్రకటించింది.

రాజేంద్ర అన్యమనస్కంగా కుర్చీలోంచి లేచాడు. అతనికి జీవితం అన్నా, బ్రతుకన్నా అసహ్యంగా ఉంది. అయినా చావటం అతనికి ఇష్టంలేని పని — అందుకే, అలా నిస్సారంగానే జీవితాన్ని గడపటం అలవాటు అయి పోయింది.

చుట్టూ చీకటి. అతని జీవితంలో

లాగే ఆ ఇంటి ఆవరణలో చీకటి ఆవరించింది.

రాజేంద్ర గదిలోంచి బయట వరండా లోకి నడిచాడు. వరండాకు ఉన్న గ్రిల్స్ లోంచి అంతా నల్లగా భయంకరంగా కనిపిస్తోంది.

—కొన్నాళ్ళ క్రితం ... ఈ ఇంటి చుట్టూ ఇంత చీకటికి తావు ఉండేది కాదు. ఇంటి ముందున్న గేటుకు ఇరుపక్కలా, ఇంట్లోకి చీకటి రాకుండా చూసేందుకు — రెండు పెద్ద దీపాలు కళ్ళల్లో వత్తులు వేసుకొని కాపలా ఉండేవి. అవి చీకట్లను ఆ ఇంట్లోకి రా కు ం డా చూడగలిగాయేగానీ, మృత్యువును మాత్రం ఆపలేకపోయాయి మృ త్యు వు ఆ ఇంట్లోకి వచ్చి... వచ్చి... రాజేంద్ర జీవితంలోని వెలుగు నంతా కబలించుకునే పోయింది. భార్య-పార్వతి పోయాక రాజేంద్ర జీవచ్ఛవమే అయిపోయాడు.

ఆ తర్వాత ఆ ఇంటి చుట్టూ చీకట్లే! ఇంటిముందు దీపాలూ ఆరిపోయాయి.

అందుకే వసారాలోంచి చూస్తే, రాజేంద్రకు ఇంబయటా, మనసులోపలా అంతా చీకట్లే కనబడ్డాయి.

అయిదు నిమిషాలు అక్కడే నిల బడ్డాడు రాజేంద్ర. ఉస్సురని నిట్టూర్చు కొంటూ లోపలికి పోబోయాడు.

అప్పుడు వినిపించింది అతనికి — ఎవరో ఏడుపు ఆపుకొంటున్న శబ్దం.

ఉలికిపడ్డాడు రాజేంద్ర — బాగా గమనించి విన్నాడు మళ్ళీ ఇంకోసారి.

నిజమే — పార్వతి అతన్ని మోసంచేసి, ఈ లోకంలోంచి వెళ్ళిపోయిందే కానీ, అతని ఇంద్రియాలు ఇంకా అతన్ని మోసం చేయటంలేదు. అతను విన్నది రైటే— ఆపుకొంటున్నా ఆగని వెక్కిళ్లు. ఆపుతున్నా ఆగని కన్నీటి వరదకు అవి బాహ్యచిహ్నాలు.

రాజేంద్ర క్షణం తర్వాత ఔట్ హౌస్ కేసి చూశాడు. ఆ శబ్దం అక్కడినుంచే వస్తోందన్నమాట !

—ఏం జరిగిందో ?

—ఏ దారుణమూ జరిగి ఉండకపోతే, ఇంతటి చీకటిలో ఇలా శోకించాల్సిన అవసరం ఏమిటి ?

ఔట్ హౌస్‌లో ఉంటున్నది ఇద్దరే. భార్యా భర్తలు — ఏడుస్తున్నది ఆమే అయి ఉండాలి. అంటే ... భర్తకు ఏదైనా ప్రమాదం...

రాజేంద్ర ఉలికిపడ్డాడు - అంత వరకూ అతనిలో ఒంటరితనం ఉన్నట్టుండి చచ్చిపోయింది. మనిషిలో ఏదో అత్రత, ఆందోళన...

—ఏం జరిగిందో... అతని కేద్దైనా ప్రమాదం... వద్దు... జంటలో ఒకరిని కోల్పోయి తనెంతటి నిస్సారపు జీవితం గడుపుతున్నదీ అతనికి తెలుసు. ఇంతటి శిక్ష ఇంకొకరికి వద్దు— ముఖ్యంగా స్త్రీకి తోడు పోతే...

రాజేంద్ర అనాలోచితంగా వసారా లోంచి బయటికొచ్చి, మెట్లు దిగి, ఔట్ హౌస్‌కేసి నడిచాడు.

అయిదారు అడుగులు వేశాడో లేదో...

"చంపేస్తాను. నోరుమూసుకుంటావా, లేదా ?" అన్న మాటలు వినబడ్డాయి రాజేంద్రకు.

రాజేంద్ర ఆగిపోయాడు.

ఈసారి అతనికి సందేహం కలుగ లేదు. ఆ మాటలు అంటున్నది ఆమె భర్తే. ఆ అధికార స్వరం తెలుస్తూనే ఉంది. అంటే... తను అనుకున్నట్లుగా ప్రమాదం జరిగింది అతనికి కాదు — జరుగుతున్నది ఆమెకు ! - అయినా రాజేంద్ర అడుగు ముందుకు వేయలేక పోయాడు.

మరో రెండు నిమిషాలు అక్కడే నిలబడి ఉన్నట్లుండి తెలివి తెచ్చుకొని రాజేంద్ర తన ఇంటికేసి నడిచాడు.

మెట్లెక్కుతూ క్షణం ఆగి, ఆ ఔట్ హౌస్‌కేసి చూశాడు.

అవును. ఆ ఔట్ హౌస్...

* * *

భార్యల్ని భర్తలుఎందుకు కొడతారో రాజేంద్రకు తెలీదు. సరికదా, ఎంత ఆలోచించినా అతనికి అంతుపట్టని విషయం. ఏ విషయం మీదైనా అభిప్రాయభేదాలు రావటం సహజం. మనుషులు కాబట్టి. అందరికీ ఆలోచనా జ్ఞానం ఉంటుంది కాబట్టి, అభిప్రాయా లలో తేడా వచ్చినా, మనుషులుగానే పరిష్కరించుకోగలటం అనే పద్ధతి ఒకటి ఉంది.

రాజేంద్ర జీవితమూ ఇలాగే జరిగింది. అతనికీ, పార్వతికీ జీవితంలో -కలిసి బతికిన బతుకులో- అభిప్రాయ భేదం అంటూ వచ్చింది ఒకే ఒక్కసారి అదీ ఆ ఔట్ హౌస్ విషయంలో పార్వతి అతని మాటకు ప్రతి అన్నది !

'మీకు తెలీదండి, మీరు ఇంట్లోంచి వెళ్ళిపోయాక ఇంతటి ఇంట్లో నే నొక్కతెనూ ఉండలంటే ఎంత కష్టమో? ఊరు కింత దూరంలో ఒక్కతెనూ ఉండటం భయంగా ఉంటుంది కూడానూ !' అంటే రాజేంద్ర నవ్వేసే వాడు. "కాదు పార్వతీ, ఇంత దూరంగా ఉంటే ఎంత లాభమో తెలుసా ? మనం ఇద్దరం ఇక్కడ ఎంత దగ్గరగా ఉన్నా ఫర్వాలేదు."

"అందుకని, మీతో గడిపే కొన్ని క్షణాలకోసం రోజంతా ఒక్కదాన్నీ బిక్కుబిక్కు మంటూ... పోనీ, మన ఇంట్లో వద్దు. దూరంగా ఓ చిన్న అవుట్ హౌస్ కట్టండి. దాన్ని ఎవరి కైనా ఇద్దాం. మీరు వెళ్ళాక నాకు కొంచెం కాలక్షేపం...

రాజేంద్ర 'ఊ' అన్న నెలన్నర కల్లా అవుట్ హౌస్ పూర్తయిపోయింది.

పార్వతి ఏం అవస్థపడిందో గానీ ఓ నెలకు కాబోలు ఆ ఇంట్లోకి పెళ్ళిద్దరూ అద్దెకు వచ్చారు.

-రాజేంద్రకు పార్వతిచేసే అన్ని పనులూ నచ్చినా ఇదినచ్చలేదు అయినా పార్వతి ఇష్టం. పార్వతికి.

—ఇన్నాళ్ళకు ఈ ఇష్టో ఇలా ... ఛ ! రాజేంద్ర మనసంతా పాడయి పోయింది.

వచ్చి, మంచంమీద పడుకున్నాడే గానీ, అతని ఆలోచనలు అన్నీ ఆ అవుట్ హౌస్ కుటుంబం మీదకే పోయాయి.

భర్త, భార్యను కొట్టాడంటే ఆవిడ తప్పుచేసే ఉండాలి. ఏం తప్పుచేసి ఉంటుంది ?- రాజేంద్ర క్షణం బాధ పడ్డాడు. తప్పు. తన ఆలోచనలు అన్నీ తప్పుదారి పడుతున్నాయి. ఇంత వరకూ చూడని స్త్రీ గురించి ఇలా ఆలోచించటం తప్పు. మరెందుకు కొట్టినట్లు ?

ఎందుకు ఆమెను ఆమె భర్త కొట్టి ఉంటాడో అని ఆలోచిస్తూనే, ఆ రోజు రాత్రంతా గడిపాడు రాజేంద్ర.

* * *

తెల్లగా తెల్లవారింది.

రాజేంద్ర లేచేసరికి నిన్నటి చీకట్లు పోయాయి. నిద్ర లేవగానే అతనికి నిన్న రాత్రి సంఘటన గుర్తొచ్చింది. ఉలికిపాటుతో వసారాలోకి వచ్చాడు. ఎవరో స్త్రీ, బిందెతో నీళ్ళు అవుట్ హౌస్‌లోకి తీసుకెడుతోంది.

నిన్న రాత్రి దెబ్బలు తిన్నది ఈవిడేనా ?- ఏమో !

రాజేంద్ర మనసులో సందేహాలన్నీ అలాగే ఉండగానే, లోపలికి వచ్చాడు.

ఆ ఇద్దరి మధ్యా ఆ సంఘటన ఒక పీడకల అయ్యి ఉంటుంది. భర్త బహుశా క్షమాపణ కోరుకుని ఉంటాడా ? ఏమో! లేకపోతే... ఆవిడ మళ్ళీ మామూలు జీవితంలోకి ఎలా రాగలిగి ఉంటుంది ?- ఆ తర్వాత ఇద్దరూ రాజీకి వచ్చి ఉంటారనే నిర్ణయించుకొన్నాడు రాజేంద్ర.

ఆ తర్వాత, అతని మనసు కుదుట పడింది. కానీ, అనుకోకుండా అతని మనసులోకి హఠాత్తుగా ఆ అవుట్ హౌస్ లోని కుటుంబం చొరబడి, తమకోసం కొంచెం చోటు చేసుకున్నాయి.

అంతవరకూ జీవిస్తూ కూడా, నిర్వి కారంగా ఉండే రాజేంద్ర జీవితంలోకి కొంచెం పరిసరాలు చొచ్చుకొన్నాయి.

ఆ రోజు రాత్రి అతను రేడియో కట్టేసాక — వరండాలోకి వచ్చి నిల బడ్డాడు. నిన్నటి ఘర్షణ తర్వాత నేటి కలయిక వాళ్ళు ఇద్దరికీ ఎంతో ఆనందదాయకమై ఉండాలనుకొన్నాడు. తన జీవితంలోనూ అంతే !- ఒకటి రెండుసార్లు చిన్న చిన్నమాట లను కొన్నాక, కొంచెంసేపు ఒంటరితనం ఇద్దరూ మూగగా అనుభవించాక కలుసు కొంటే- ఆ కలయికలో ఎంతటి మాధుర్యం నిండిఉండేది ! తనూ పార్వతీ — ఇద్దరూ ఆ తప్పుకు కారణం

తామే అయినట్లూ ఆ క్షణకాల వినియోగానికి జీవితం అంతా పశ్చాత్తాపం చెందుతున్నట్లు— దీనికి ప్రతీకగా తాము ఒకరికొకరు... నిజమే, విడిపోయాక కలుసుకోవటం ఎంత తియ్యగా ఉండేది !

—ఈ రోజు అవుట్ హౌస్‌లో వెన్నెలే కాబోలు— ఈ రోజు వాళ్ళ జీవితంలో పండుగే కాబోలు ! !

—తనలా మోడుబ్రతుకు కాక... రాజేంద్ర మనసెంతో గాయపడింది. ఆ క్షణంలో క్షణం సిగ్గుపడ్డాడు కూడా! తన జీవితం ఇలా అయిందని కాదు, ఆ దంపతులుండే అంతరాంతరాలలో అసూయపడ్డందుకు !!

అయినా ఇలా ఇక్కడ నిలబడటం తన బలహీనతే, అనుకొంటూ వరండాలోంచి వెనక్కు నడిచాడు నడుస్తోంటే మళ్ళీ... నిన్నటి గతం, ఈ రోజు మళ్ళీ...!

రాజేంద్ర ఉలిక్కిపడి ముందుకొచ్చి విన్నాడు. నిన్నటి స్వరం మళ్ళీ ఈ రోజు కొత్తపదాలు పలుకుతోంది. నిన్నటి జీవితానికి ఈ రోజు...ఇంకో రోజు...

—ఇది రోజూ జరిగే కథేనా ?...

ఇన్నాళ్ళనుంచీ తనెందుకు గమనించలేదు ?

తన ఇంట్లో ఇలా రోజూ నరకం పంచుకొంటూ ఆ దంపతులు ఎన్నాళ్ళనుంచీ ఉంటున్నారు ?

—రాజేంద్రకు తన ముందున్నదంతా అసహ్యంగా కనబడింది. భార్యాభర్తలు ఇలా ఇంత దారుణంగా ఒకర్నొకరు ఎలా హింసించుకోగలరో అతనికి అర్థం కాలేదు.

వారం రోజులు గడిచాయి. ఈ వారం రోజులలోనూ రాజేంద్రకు రోజూ అది ఒక దినచర్య అయిపోయింది. పగలంతా నిశ్శబ్దంగా ఉండే ఆ అవుట్ హౌస్ రాత్రి అయేసరికి దీపావళినాటి రాత్రి అవుతోంది. చిటపటలు, ధుమ ధుమలు...ఇంత వేగంగా ఎలా బ్రతుకుతున్నారో వీళ్ళు ?

రాజేంద్ర మనసంతా చికాకయిపోయింది. వీళ్లేమిటి. ప్రేమమందిరంలాంటి తన ఇంట్లో ఇంత అశాంతి గూడు కట్టుకోవడం బాగాలేదు. అవుట్ హౌస్ కాపురం చక్కబడితే గానీ తనకు మనశ్శాంతిలేదు.

రాజేంద్ర మర్నాడు ఉదయం రోజూ కన్నా ముందుగానే నిద్ర లేచాడు. నిద్ర లేచీ లేవగానే, వరండాలోకి నడిచాడు.

వరండాలోంచి బయటకు చూస్తే వాతావరణం అంతా ఎంతో ప్రశాంతంగా ఉంది. గులాబీ చెట్లు పూచిన పూలమీద మంచుబిందువులు హాయిగా కాపురం ఉంటున్నాయి. ఇంకొంచెంసేపు అయితే తూర్పునుంచి సూర్యుడు ఉదయిస్తే, ఆ

కాపురానికి సిల్లాదులుకోవలసి వస్తుందని అనుకొంటున్నట్లుగా లేవు.

రాజేంద్ర అవుట్ హౌస్‌కేసి చూశాడు. నిన్నటి ఘర్షణల ప్రతీకగా ఈ రోజు ఏదీ లేదు. అంతటి ప్రశాంత వాతావరణంలో ఆ అవుట్ హౌస్‌కూడా నిర్మలంగానే ఉంది. కానీ ఆ నైర్మల్యం వెనుక ఎంతటి ఝంఝరు ఉందో ఎవరికి తెలుసు ?

రాజేంద్ర అలా చూస్తూ ఉండగానే ఆ ఇంట్లోంచి ఒకతను బయటకు వెళ్ళి పోయాడు. ఆ వెళ్లే పద్ధతి చూస్తే అతను ఇపుడపుడే తిరిగి రాడు అనిపించింది.

క్షణంసేపు తదేక దృష్టితో ఆ ఇంటి కేసి చూసి, నెమ్మదిగా మెట్లు దిగాడు. అవుట్ హౌస్‌కూ, తన ఇంటికీ మధ్య నున్న స్థలంలోఉన్న పూలచెట్లు హాయిగా నవ్వుతూ ఉన్నాయి.

రాజేంద్ర అవుట్ హౌస్ దగ్గరగా వెళ్ళాడు. తలుపుతీసే ఉంది. ఎదురుగా ఒక స్త్రీ అద్దంలోకి చూస్తూ బొట్టు సరి చేసుకుంటోంది

రాజేంద్రకు నవ్వొచ్చింది — బొట్టు భర్తకు ప్రతీక. బొట్టును సరిదిద్దు కొన్నంత తేలికగా భర్త నడవడిని దిద్దుకోగలిగితే ఎంత బాగుండేది ! !

ఎవరో మనిషి వచ్చిన అలికిడి అయినట్లయి ఆమె తలెత్తి చూసింది. రాజేంద్ర ఆవిడకేసి చూసాడు. ఎంతటి అందం ఆమెలో చోటుచేసుకుందో అతని అంచనాకు కూడా అందలేదు. ఆ సోయగాల కళ్ళు, ఆ నుదుటినుంచి కొంచెం ముందుకు తూలిపడుతున్న ముంగురులు, కొనదేరిన ముక్కు, చిరు నవ్వులు చిందిస్తున్న పెదవులు — రాజేంద్ర ఉలిక్కిపడ్డాడు.

ఇంతటి అందం తన అవుట్ హౌస్‌లో ఇన్నాళ్ళనుంచీ కాపురం ఉంటున్నా గమనించని తన తెలివి తక్కువ తనానికి, తన దురదృష్టానికి క్షణం చింతించాడు.

ఆవిడ అద్దం కిందబెట్టి, లేచి నిలబడింది

రాజేంద్ర గొంతు సరిచేసుకొంటూ మనసును అదుపులోకి తెచ్చుకొంటూ అన్నాడు : "మీ పేరు నాకు తెలీదు గానీ..."

"...ఝాన్సీ..."

రాజేంద్రకు నవ్వొచ్చింది, పేరు ఝాన్సీట !

"... వారం, పదిరోజులనుంచీ చూస్తున్నాను. రోజూ మీ ఇద్దరి గొడవలు నాకేమీ నచ్చటంలేదు. అయినా ఆయనమిమ్మల్ని రోజూ కొట్టి, చిత్రహింస చేస్తోంటే, ఎందుకు ఊరు కొంటున్నారు ?"

ఝాన్సీ ఉలికిపడింది. నెమ్మదిగా అడిగింది— "ఏం చేయమంటారు మరి?"

"ఏం చేయటమేం ? తిరగబడండి!




మనిషిలో అంతటి పశుత్వం ఉన్న వ్యక్తితో సంసారం ఏమిటి ? ఛ- మీ అంత అందం ఉన్న వ్యక్తిని ఎవరైనా పూజించి తీరతారు. మీకు అభ్యంతరం లేకపోతే, లేచిపోండి... ఈ నరకంలోంచి దూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోండి - ఎవరితోనైనా...... ఎవరైనా ఎందుకు ? నాతోనే ...!" -రాజేంద్ర ఆగిపోయాడు.

ఏమంటున్నాడు తను ?

ఏమనేశాడు ?

మనసులో పార్వతి లేని లోటు ఇలా బయట కొచ్చిందా ? పెదవులలోంచి ఇలాటి మాటలు ఎలా వెలువడ్డాయి ? అసలు నిజంగా తనే అన్నాడా ఆ మాటలు ?

ఝాన్సీ తెల్లబోయింది. ఆ మాటలు ఆమెకు అర్థంకావటానికి కొంచెం సమయం పట్టింది. అర్థం అయాక ...

తళ్ళల్లోంచి నీళ్ళు ఉబికి ఉబికి వస్తోంటే ఆమె లోపలికి పరిగెట్టింది.

—రాజేంద్ర నెమ్మదిగా వెనుదిరిగి ఇంటిదారి పట్టాడు

గదిలోకి వచ్చిన రాజేంద్ర మనసు మనసులో లేదు. తన అంతరాంతరాల్లో ఎక్కడో దాగిఉన్న కోరిక ఇలా ఇపుడు బయట కొచ్చింది. తన హృదయంలో దాగి ఉన్న లావా ఒక్కసారిగా పొంగింది. ఇది దురదృష్టవశాత్తూ, ఆ కుటుంబాన్ని దహించివేస్తే...

రాజేంద్ర మనస తా గాయపడింది. తను పొరపాటు చేశాడు. తన పొరపాటుకు శిక్ష ఆ కుటుంబానికి పడుతుందా ? అసలే అంతంత మాత్రంగా ఉన్న ఆ కుటుంబం, ఈ దారుణ అఘాతానికి తట్టుకొంటుందో, లేదో...!

సాయంత్రం అయింది. పగలంతా రాజేంద్ర ఆ గదిలోనే ఉండిపోయాడు. బయట వసారాలోకి వస్తే, ఝాన్సీ కన్పిస్తుందేమో ! తను ఆవిడముందు నిలబడటం కష్టం. ఆ అర్హత తను పోగొట్టుకున్నదే !

అందుకే బోనులో సింహంలా అక్కడే ఉండిపోయాడు రాజేంద్ర.

ఎవరో తలుపు తడుతున్నట్లయి ఉలిక్కిపడ్డాడు రాజేంద్ర.

ఎవరై ఉంటారు ?

బయట కొచ్చాడు. వసారాకు ఉన్న గ్రిల్స్ అవతలినుంచి అతను - ఝాన్సీ భర్త కనిపిస్తూనే ఉన్నాడు. ఎందు కొచ్చాడు ? ఏం చేస్తాడు ?

వెళ్ళి తలుపు తీశాడు రాజేంద్ర.

ఆ వ్యక్తి చిన్నగా నవ్వి అన్నాడు : "నేను ఝాన్సీ భర్తను. ఝాన్సీ మీతో మాట్లాడాలిట ! వీలైతే నాతో రండి!"

రాజేంద్ర గుండె ఒక్కసారిగా ఆగిపోయినట్టైంది. అంటే ఝాన్సీ అతనికి అంతా చెప్పేసిందా ? ఆడవాళ్ళు అలాటి సంగతులు కూడా ఎలా చెప్పగలరు ? గుండెలు కుదుటపరచుకొని అతనివెంట మెట్లు దిగాడు.

ముందు అతను, వెనుక రాజేంద్ర.

అవుట్ హౌస్ దగ్గరవుతోంటే రాజేంద్రలో అలజడి ఎక్కువవుతోంది

"రండి, కూర్చోండి... ఝాన్సీ... నేనలా వెళ్లొస్తా !" అంటూ రాజేంద్ర కేసి తిరిగి అన్నాడా వ్యక్తి. "మీరు మాట్లాడుతూ ఉండండి. నేను ఇపుడే వస్తా !" అంటూనే బయటకు వెళ్ళిపోయాడు.

ఝాన్సీ నెమ్మదిగా అక్కడి కొచ్చింది. తల ఎత్తాలనీ, ఆవిడ అందం మరొక్కసారి మనసారా చూసు కోవాలనీ ఎంత అనిపించినా తల ఎత్త లేకపోయాడు, రాజేంద్ర.

"మీరు చెప్పిన విషయం బాగా ఆలోచించాను. ఆయనతో కూడా




చెప్పాను. మేం ఇద్దరమూ బాగా ఆలోచించే ఒక నిర్ణయానికి వచ్చాము." ఝాన్సీ ఒక్క క్షణం ఆగింది.

రాజేంద్ర కుర్చీలోంచి లేచాడు. ఏ క్షణంలో ఆ నరకంనుంచి, బయట పడతానా అని ఆలోచిస్తున్నా డతను

"నిజమే, రోజూ దెబ్బలు తినే ఈ నరకంలోంచి పారిపోతే బాగానేవుంటుంది. మీరన్నట్లుగా నా అందాన్ని పూజించే వ్యక్తి దగ్గరకు వెళ్ళిపోతే బాగుంటుంది. కానీ చూడండి, మీరు నా జీవితంలో ఉన్న ఎండనే చూశారు. ఆ ఎండ వెనుక ఉన్న వెన్నెలను మీరు చూడలేదు, చూడలేరు. ఆ వెన్నెల...నా సాంసారిక సౌఖ్యంలోని మాధుర్యం మీకు నేను చెప్పగలిగేది కాదు. ఆయన నన్ను కొట్టినా, పూజించినా అందులోని ఆత్మీయత, అనుబంధం సంగతి మీకు అర్థం అవదు. మీరు నరకమన్న క్షణాలు నా కెంతటి ఆనందాన్నిస్తాయో మీకు తెలీదు...అందుకే... క్షణం బాధ నుంచి తప్పించుకోవాలని జీవితంలోని.. సంసారంలోని మాధుర్యాన్ని, ఆ స్వర్గాన్ని కాలదన్నుకోలేను అందుకే... క్షమించండి ... మీ కోరిక తీర్చలేక పోతున్నాను...!" అంటూనే ఝాన్సీ తన కొంగును నోటిలోకి కుక్కుకుంది. కళ్ళల్లోంచి నీళ్ళు ధారగా కారుతోనే ఉన్నాయి. జవసత్త్వాలు ఒక్కసారిగా ఉడిగిపోయినట్లుగా ఆమె అలా కిందకు జారిపోయింది.

రాజేంద్ర ఆ క్షణంలో పూర్తిగా చచ్చిపోయి, ఆ అవుట్ హౌస్‌లోంచి బయటకు కాలుపెట్టాడు.

"ఆగండి మాట..." ఝాన్సీ కన్నీటిని ఆపుకొంటూ అంది, "రేపు మేము ఈ ఇల్లు ఖాళీచేస్తున్నాం !"

రాజేంద్రకు ఆ మాటలు వినబడ్డాయో లేదో ఆమెకు తెలీదు.

# బంధం

వేములపల్లి స్వర్ణ




**నా** జీవితాన్ని అంతగా ప్రభావితం చెయ్యగల శక్తి వాసులో ఉందని నాకప్పటివరకూ తెలియలేదు. అతని మరణవార్త నన్ను విపరీతంగా కుంగదీసింది. నాకున్న కొద్దిమంది మంచి స్నేహితుల్లో ప్రథముడు అతనే. అటువంటివాడు నన్ను ఈ లోకంలో ఏకాకిని చేసిపోతాడని కలలో కూడా అనుకోలేదు

నేను ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్న కాలేజీలోనే చదువుతున్నాడు అతను. ఒకరోజు నేను ఆఫీసు ముందు కారు దిగేప్పటికి అక్కడ కుర్రవాళ్ళు గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు. వాతావరణం ప్రశాంతంగా లేదని అర్థమౌతూనే ఉంది. మౌనంగా లోపలికి నడిచాను. నా వెనకే వచ్చాడు వాసు.

'మా క్లాసులో మురళీ అనే స్టూడెంటుకు స్కాలర్‌షిప్ శాంక్షన్ అయి ఆరునెల లయింది. ఇంతవరకూ అది అతనికి అందజేయబడలేదు. క్లర్కును ఎన్ని సార్లు అడిగినా పట్టించుకోవడంలేదు. నిన్న కొద్దిగా ఘర్షణ జరిగింది. ఆ స్టూడెంట్‌ను షర్ట్ పట్టుకుని బయటికి తోశారు ఆఫీసులోనుండి.'

'నేను కనుక్కుంటాను. ముందు మీరంతా క్లాలసుకు వెళ్ళండి' అన్నాను నేను ప్రశాంతంగా. 'ముందు మీరా క్లర్క్‌ను పిలవండి. ఇది తేలేవరకూ కుర్రవాళ్ళు క్లాలసుకు వెళ్ళడం కష్టం' నా కనుబొమలు ముడివడ్డాయి. అసహనంగా చూశాను.

'విజ్ఞులు మీరు, ఆవేశపడకుండా ఆలోచించండి. కాలే కడుపులతో కాలేజీ కొచ్చే అలాంటి కుర్రవాళ్ళు తమ చదువుకోసం ఎన్నో త్యాగాలు చేస్తారు. కానీ అభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని చంపుకోలేరు. వారి సహనాన్ని పరిధిని దాటి పరీక్షించడం ఎవరికీ మంచిది కాదు వారి అవసరాలు నిప్పుల్లాంటివి. వాటిని అక్కడే ఆర్పెయ్యాలి. లేకపోతే అవి దావానలంగా మారి సర్వనాశనానికి దారితీస్తాయి. తర్వాత ఆ వినాశనానికి కారణాలు వెదుక్కుని ప్రయోజనంలేదు. వేగంగా వెళ్ళిపోయాడు తను.

కాసేపటివరకూ ఆశ్చర్యంనుండి తేరుకోలేదు నేను. స్కూలు వదిలి కాలేజీలో అడుగు పెట్టగానే చాలా పెద్ద వాళ్ళమై పోయామనుకుంటారు పిల్లలు. అతని మాటల్ని మళ్ళీ మననం చేసుకున్నాను. అధికారాన్నీ అహంకారాన్నీ పక్కకు నెట్టి ఆలోచిస్తే, అతనన్నదాంట్లో అసమంజస మేమీ కనిపించలేదు. ప్యూనుతో క్లర్క్‌ను పిలవమని చెప్పాను.

వాసునూ, నన్నూ సన్నిహితుల్ని చేసిన సంఘటన మరోటి జరిగింది. ఆ రోజు ఎవరో పెద్దమనుషులొస్తే, లాన్‌లో కూర్చుని కాఫీలు తాగుతూ మాట్లాడు కుంటున్నాం. వాళ్ళలో ఒకాయన కొడుక్కి మా కాలేజీలో సీటు కావాలి. జేబులోనుండి వందరూపాయల కాగితాలు బయటికి తీస్తూ 'కొంచెం కనిపెట్టి చూడండి మీ రుణం ఉంచుకోను' అన్నా డాయన. నేను పెద్ద సందిగ్ధావస్థలో పడ్డాను. అంత బహిరంగంగా నేనెపుడూ లంచం తీసుకోలేదు నిజానికి నాకు ఆదర్శాలూ, ఆశయాలూ అంటూ ఏమీ లేవు ప్రిన్సిపాల్‌నే గానీ ప్రిన్సిపల్డ్ కాదు నేను.

'వారు తీసుకోరు' మీరు వెళ్ళవచ్చు. కొంచెం కఠినంగా వినపడింది వెనక నుండి వాసు గొంతు.

'తమరెవరో తెలుసుకోవచ్చా !' వ్యంగ్యంగా అన్నాడు వాళ్ళలో ఒకా యన.

'ఎవరైతేనేం లెండి. మీరు వెళ్ళండి. అవకాశముంటేనా శాయశక్తులా సహాయం చేస్తాను,' అన్నాను కుర్చీలోనుండి

లేస్తూ. వారిని పంపించి వచ్చేసరికి వాసు గార్డెన్ ఛైర్‌లో కూర్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

'నేను రాకపోతే ఆ డబ్బు మీరు తీసుకునేవారేనా!' సూటిగా నా కళ్ళలోకి చూశాడు. గిల్టీగా ఫీలై తల వంచుకున్నాను.

'ఈ పరిస్థితి ఏర్పడినందుకు నేను సిగ్గుపడుతున్నాను. పదిమందికి దారి చూపవలసిన మీరే అడ్డదారులు వెతుక్కుంటున్నారా!' ఆ గొంతులో ఎంతో బాధ.

'ఏ దారిన నడిచినా, నా పిల్లల భవిష్యత్తు కోసమే వాసూ! ఈ సంఘంలో వాళ్ళు ఆనందంగా గడపడానికి కావలసిన అన్ని హంగులూ సమకూర్చడం నా విధి. లేనప్పుడు నా పితృత్వానికి సార్థకత ఏమిటి! వాళ్ళ అవసరాలు తీరనప్పుడు, వాళ్ళు సుఖంగా ఉండనప్పుడు, నాకు శాంతి ఎక్కడ ?'

అసహనం, అసహ్యం, జాలీ, కోపం, అశక్తత అన్నీ ఒక్కసారే అతని ముఖంలో చోటుచేసుకున్నాయి.

'ఏ రకమైన వాదన ఇది, దారులు కాదు, భోగాలు ముఖ్యమని చెబుతున్నారా! స్వార్థంకోసం నైతికంగా పతనమైపోయినా ఫర్వాలేదన్నమాట మీరు చాలా మంచివారనుకున్నాను. సంఘంలో మీ బిడ్డలకు మీరు లంచం రాళ్ళతో కోట గోడలు కట్టి రక్షణ కల్పిద్దామనుకుంటే అది కేవలం అవివేకం. అది వారి భవిష్యత్తుకు సమాధిగా మాత్రమే తయారవుతుంది. ఒక సమర్థుణ్ణి అడుక్కి తొక్కి వేరొక అసమర్థుడికి అర్హతలేని అవకాశాలిచ్చి, మీరు సంపాదించబోయే ఆ డబ్బు, మీ పిల్లల క్షేమానికి కాదు, వారి క్షోభకు కారణమౌతుంది. మీ బిడ్డలకు మీరు పరుస్తున్నది పట్టు పరుపులు కాదు, ముళ్ళ కంచెలు. జీవితాల్ని మలినం చేసుకోవడంకన్నా మరణించడం మేలు.' వెళ్ళిపోయాడతను.

మా ఇద్దరి మధ్యా వాతావరణం ఎప్పుడూ గంభీరంగానే ఉంటుంది. తుఫానులా వస్తాడు. నాలో ఏవేవో ఆలోచనలు రేకెత్తిస్తాడు. ఆ సంగ్రామం సాగుతూనే ఉంటుంది, నా మనసులో. తను మాత్రం కర్తవ్యం నిర్వహించిన సూత్రధారిలా మెల్లగా జారుకుంటాడు. అతని విమర్శల్లోని తోతు నా కర్థమౌతున్నకొద్దీ, అతని పట్ల నా అభిమానం రెట్టింపవుతూ వచ్చింది.

ఆ రోజు చాలా గంభీరంగా వచ్చాడు. చూస్తే పెద్దదుమారం లేవదీసేట్టున్నాడు. కాస్త భయపడ్డాను.

'వీణ పెళ్ళి చెయ్యాలి!' అన్నాడు.

నా గుండె కలుక్కుమంది. పదాలు చిన్నవే కానీ చరిత్ర చాలా ఉంది వాటికి

'ఆ సంగతి నాకూ తెలుసు. కానీ చేసుకు . వాడేడీ' అన్నాను నీరసంగా.

వీణ నా కూతురు పెళ్ళయి సంవత్సరం తిరక్కుండానే భర్త మోటారు సైకిల్ ఏక్సిడెంట్లో మరణించాడు. అప్పట్నుంచీ నాదగ్గరే ఉంటోంది. మొదట్లో దాన్ని చూస్తుంటే గుండె తరుక్కుపోయేది. కోరికలకు వెల్ల వేసినట్లు తెల్లచీరలో నడుస్తున్న శవంలా తను ఆ ఇంట్లో తిరుగుతుంటే నేనను భవించిన మానసిక వేదన వర్ణనాతీతం కానీ కాలం అన్నిటితో పాటు నా శోకాన్ని కూడా తనలో కలుపుకోగలిగింది. ఇప్పుడు వీణను చూస్తుంటే నా కేమీ అనిపించదు. ఎప్పుడో ఓ నిట్టూర్పు మాత్రం అప్రయత్నంగా వెలువడుతుంది, అంతే

'అది కేవలం పలాయనవాదం. చేసుకునేవాణ్ణి వెతికి తీసుకురావడం మీ బాధ్యత. మీరు వెలిగించిన దీపం ఆరిపోతే మళ్ళీ దాన్ని వెలిగించవలసిన అవసరం లేదా ! చీకట్లోనే ఆ జీవితం తెల్లవారిపోవాలా ! ప్రాణం పొయ్యడం పశు పక్ష్యాదులు కూడా చేస్తాయి. తను ప్రతిష్ఠించిన ప్రాణం తల్లడిల్లకుండా చూడటంలోనే ఉంది జన్మ నిచ్చినవాడి గొప్పతనం.'

అతనెప్పుడూ అంతే. కొట్టినట్టు మాట్లాడతాడు.

నా అసమర్థతను ఒప్పుకోలేని బల హీనతతో అన్నాను.'నేను నా బాధ్యతల్ని విస్మరించిన మాట వాస్తవమే. నా మీద నిష్ఠూరాలు వేసే బదులు ఆ బాధ్యతేదో నువ్వే నెత్తి నేసుకోరాదూ. యువకుడివి కదా. మీ యువకులంతా ఉదర్శభావాలో అంటూ వల్లిస్తారు గదా ! అయినా పెళ్ళయి సంవత్సరం కాపురం చేసిన ఆడదాన్ని కట్టుకునేంత ఉన్నత సంస్కారాన్ని ఈ సంఘం మగవాడి కింకా నేర్పలేదు '

'మీరు చాలా సంకుచితంగా ఆలోచిస్తున్నారు. ప్రయత్నమే చెయ్యకుండా ఉండదనుకోవడం మూర్ఖత్వం. నా కవకాశం ఇవ్వండి. మీ మాటలు నిజం కాదని నిరూపిస్తాను.'

నిజంగానే నిరూపించాడు. నెల తిరక్కుండా, వెంకటేశ్వరస్వామి గుళ్ళో మళ్ళీ మా వీణ తలమీద ఇన్ని అక్షంతలు చల్లుతుంటే కల కాదు కదా అని అనుమానం వచ్చింది. కానీ వధూవరుల మొహాల్లో కాంతీ, చిగురులు వెయ్యబోతున్న జీవితం తెచ్చే జీవకళా, అంతా వాస్తవమేనని రుజువుచేస్తున్నాయి. వాసు వైపు చూశాను. విజయం సాధించిన చక్రవర్తిలా ఠీవిగా, గర్వంగా తల ఎత్తుకుని నిలబడ్డాడతను నా మనసు పులకరించింది. మళ్ళీ ఇంకోసారి వధూవరుల్ని చూశాను. చక్కని జోడీ. సమాజం జోహార్లు పట్టడానికి అవసరమైన ధనం, కులం వరుడిలో లేకపోయినా, ఇతరులను నొప్పించని గుణం,సంస్కారం ఉన్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే

నా వీణకు తగిన వైణికుడతను. నా కంతే చాలు. ఈ వివాహం తప్పకుండా విజయవంతమౌతుందని వీణ కళ్ళల్లోని మెరుపు ఛాయలు నాకు చెబుతున్నాయి.

అలాంటి వాసు, నేను దారి చూపితే నడవలసిన వాడు, నాకే మార్గదర్శకుడై నా బాధ్యతలను స్వీకరించి నాకు బ్రతుకు బాటను సుగమంచేసి, జ్ఞాపకాలు మాత్రం నాలో మిగిల్చి, ఆరిపోని కార్చిచ్చు నాలో రగిల్చి, ఈ లోకానికి దూరమైపోయాడు.

అతని మరణంకన్నా అతను మరణించిన విధానం నన్ను చిత్రవధ చేస్తోంది. ఆ రోజు ఎవరో స్నేహితుడితో సినిమా చూసి ఇంటికి తిరిగి వస్తున్నాడు వాసు. నలుగురు దృఢకాయులు అడ్డం తగిలారు వీరికి. తర్వాత మళ్ళీ ఇద్దరూ కళ్ళు తెరిచేసరికి ఆపరేషన్ టేబుల్ మీద ఉన్నారు. పొత్తి కడుపు కింద సన్నటి బాధ. ఏం జరిగిందో అర్థమయ్యేసరికి ఇద్దరూ పిచ్చివాళ్లయ్యారు. తాము ఏం కోల్పోయారో తెలుసుకునేసరికి వారి రకం ఆవిరిగా మారింది. పెళ్ళి కాకముందే తండ్రులయ్యే అర్హతను కోల్పోయిన ఆ యువకుల హృదయాలు భగ్గున మండాయి. అక్కడున్న డాక్టర్‌ను సంజాయిషీ అడిగితే కావలిస్తే పోలీస్ రిపోర్ట్ ఇచ్చుకో మన్నాడట. అంతే ఆ డాక్టర్ కళ్ళు బైర్లు కమ్మాయి మరు నిముషంలో పోలీసులు వచ్చారు. ఇద్దర్నీ అరెస్ట్ చేసారు.

ఆ డాక్టర్ పుణ్యమా అని ప్రాణం పోసే అవకాశం మాత్రమే పోగొట్టుకున్నారు వాడు. కానీ తర్వాత ఆ మిగిలిన ప్రాణాన్ని పోలీసులు తీసుకుంటారని ఊహించలేకపోయారు అమాయకులు. వారి రాక్షసత్వానికి తట్టుకోలేని వాసు ఆహుతైపోయాడు. జరిగిన దారుణకాండకు నిదర్శనంగా కొన ఊపిరితో మిగిలిపోయాడు అతని స్నేహితుడు. నా దురదృష్టంకొద్దీ నేనప్పుడు బొంబాయిలో కాన్ఫరెన్స్‌లో ఉన్నాను. టెలిగ్రాం చూసి ఇంటికి తిరిగి వచ్చేసరికి అంతా అయిపోయింది. చివరి చూపు కూడా అందలేదు. నిన్నటి వరకూ నా ప్రాణంలో ప్రాణంగా మెదిలిన వాసు ఈ రోజు ప్రకృతిలో, శూన్యంలో ఓ భాగంగా మారిపోయాడు.

హాల్లోకి వచ్చాను. గోడకున్న ఫోటోలో చిరునవ్వు నవ్వుతూ వాసు. ఆ ఫోటోకో పూలదండ, అతని వ్యక్తిత్వానికి చిహ్నంగా ఆ ఫోటోను చేత్తో తడుముతూ అలాగే చాలాసేపు నిలబడిపోయాను. కళ్ళు నీళ్ళతో నిండాయి.

రెండు నెలల క్రితం, ఓ రాత్రి నేను గాఢనిద్రలో ఉన్నాను. పక్కనే ఏదో అలికిడైంది. కళ్ళు తెరిచి చూస్తే, ఇద్దరు నల్లగా, దెయ్యాల్లా నిలబడి ఉన్నారు.




ఒకడి చెయ్యి నా దిండు కింద ఉంది. ఆ చేతిని గట్టిగా పట్టుకుని, దొంగ, దొంగ అని గట్టిగా అరిచాను. రెండోవాడు నా మొహంమీద గట్టిగా చరిచాడు. క్షణం సేపు నేనెవరో నాకు తెలియలేదు. మెరుపులా వచ్చాడు వాసు గదిలోకి. నా వాకింగ్ స్టిక్ అందుకుని వాళ్ళల్లో ఒకడి తలమీద గట్టిగా మోదాడు వాడు కింద పడిపోయాడు. మరుక్షణంలో రెండో వాడి చేతిలో కత్తి సర్రుమన్న చప్పుడు వాసు అరిచిన అరుపులో కలిసిపోయింది 'వాసూ' దిక్కు లదిరేలా అరిచాను నా కళ్ళ ముందు వాసు రక్తం ప్రవహిస్తోంది. జబ్బలో దిగబడిన కత్తిని పట్టుకుని విల విల్లాడిపోతున్నాడతను. నేను నాటిన బీజం, నేను పెంచిన మొక్క తుఫాను గాలికి అల్లాడిపోతోంది. అతన్లో ప్రవహించే నా రక్తం నా కళ్ళముందే స్రవిస్తోంది. అంతకు ముందెన్నడూ అంత బాధ నేననుభవించలేదు.

ఆ మర్నాడు హాస్పటల్లో అతనికి రక్తం చాలకపోతే నా రక్తాన్నిచ్చి బ్రతికించుకున్నాను. కానీ ఈనాడు నాకా అవకాశం లేకుండాపోయింది.

అతని ఫోటోముందు నిలబడి మనసులో అనుకున్నాను. 'కొడుకులు తండ్రుల ఫోటోల ముందు నిలబడి ఏడవడం సహజం. మరి ఈ రోజున అందుకు విరుద్ధంగా నాకీ పరిస్థితి కల్పించావెందుకురా తండ్రీ' అని.

శ్రీసుభా





ఎదిగిన కూతురికి పెళ్ళి చేయలేక పోవడం అసమర్థత క్రిందకి వస్తుంది. ఉద్యోగం చేస్తూన్న రోజుల్లో వెనక వేయలేకపోవడం, వేసింది సంసార చక్రం తిప్పడంలో హరించుకుపోవడం, కారణం ఏదైనా విశాల పెళ్ళికి జాప్యం జరిగింది.

విశాల అందగత్తె. చదువుకుంది. ఉద్యోగార్హత కూడా సంపాదించుకుంది. అయినా ఈ పాడు ప్రపంచంలో పెళ్ళికి

అర్హతలు వేరేమో! వయసుకారు కుర్ర వాళ్ళు విశాలమీద నుంచి కన్ను కదప లేరు. తిరిగి చూడాలనిపించేదే అందం అయితే—ఆ అర్హతలన్నీ విశాలకి ఉన్నాయి.

విసుగేసినప్పుడు, ఏమీ చెయ్య లేనప్పుడు నాకు అన్పించేది కూడా—కట్నం లేకుండా దాని అందచందాలు, చదువూ చూసి ఎవరైనా ముందుకు రావాలి లేక దాన్ని ప్రేమించి, దాన్ని తప్ప మరెవర్నీ పెళ్ళాడనని మొరా యించి విశాలకోసం ముందుకు వచ్చే ప్రేమికుడు కనబడాలి.

ఇలా జరుగుతుందా అసలు! లోకంలో కొంతమంది విషయంలోనైనా ఇలాంటి అదృష్టం కలిసివస్తోన్న మూలంగానే నాకీ కోరిక పుట్టివుండాలి!

ఒట్టినే పిచ్చికగూళ్ళూ, గాలి మేడలూ కట్టుకోవడానికి నేనేం అవివేకిని కాను. పిచ్చివాణ్ణి అసలే కాను.

* * *

అనుకున్నవి అనుకున్నట్టుగా జరిగితే ఎంత బావుంటుంది. మనసుకి ఎంత హాయిగా ఉంటుంది. కానీ అలా ఎప్పుడూ జరగదేమో! ముందు గొయ్యి వుందని నడచినంతకాలం ఏ దెబ్బా తగలదు. కానీ ఏ ఒక్కరోజు చూసుకుని నడవక పోయినా బోర్లా పడక తప్పదు. నవ్వా లనుకున్నప్పుడు ఏడవాల్సిరావడం, ఏడవాల్సినప్పుడు వేదాంతం గుర్తుకు రావడం జీవితంలో జరిగే తమాషా అయి వుంటుంది.

పడక్కుర్చీలో పడుకుంటే, ఆ పైన సిగరెట్ పొగలా ఆలోచనలు మనసులో తేలడం వయసు లక్షణమేమో! వయసు మీద పడుతూంటే గతం కన్నా వర్తమానం కన్నా భవిష్యత్ అంటేనే మనిషికి ఇష్టం కలుగుతుందేమో! కిటికీ లోంచి ఎప్పుడు మాయమయ్యిందో వెలుతురు—చీకటి చీర కట్టుకుని కన్పిస్తోంది.

విశాల ఇంటికి రాలేదు. ఉద్యోగం గురించి రికమెండేషన్ చేస్తానన్న స్నేహితురాలి ఇంటికి వెళ్ళింది. వాళ్ళ అమ్మ కూడా శ్రావణ శుక్రవారం పేరం టానికి వెళ్ళింది. అసలు సరోజ పేరం టానికి వెడుతుందంటేనే నాకు భయం పూర్వం అయితే జేబురుమాలుతో కొబ్బరిముక్కలూ, చలిమిడీ కలిపిన శనగలు తెచ్చి అక్కడ స్నేహితురాళ్ళ సింగారం గురించీ, చీరల ఖరీదు గురించీ చెప్పి ఊరుకునేది. కానీ ఇప్పుడు శన గలతో పాటు పెళ్ళికొడుకుల జాబితా తేవడం మొదలుపెట్టింది. వాళ్ల యడ్రసులూ వైనాలూ మూటగట్టుకుని మరీ వస్తుంది... న్యూస్‌పేపర్ తెరిచి చదవ బోయి—విసుగేసి వార మాస పత్రికలు తెరిచి—అవి రుచించక ఆలోచనల నూకలు కాస్తూంటే వీధిలోంచి పదేళ్ళ వున్న కుర్రాడు వచ్చాడు.

పరుగున వచ్చినవాడు స్విచ్ వేసి

నట్టు వాకిట్లోకి వచ్చి ఆగిపోయాడు. హాలంతా చూసి ఆ పైన నన్ను చూసి కంగారుగా వెనక్కి తిరిగి చూస్తున్నాడు.

"ఇటు రా, ఎవరు కావాలి ?" కేక వేశాను, కుర్చీలోంచి లేచే ప్రయత్నం చేస్తూ.

"ఆ...ఆ" అన్నాడు బెదురుతూనే.

"ఫర్వాలేదు, ఇటు రా." ముద్దుగా పిలిచాను.

బెదురుతూ నా వైపు వచ్చాడు.

"చెప్పు, ఏం కావాలమ్మా ?"

"విశాలక్క."

"విశాలక్కా—ఎందుకు ?"

ఆ అబ్బాయి మాట్లాడలేదు.

"విశాల ఇంట్లో లేదు కదా" అన్నాను.

"మరి...మరీ"

అతను జేబులో చెయ్యి పెట్టుకున్నాడు. చెయ్యి తిరిగి తీస్తూంటే జేబులోంచి ఓ కాగితం క్రింద పడింది. అది తీసుకుందుకు అతను వంగాడు. నేను వంగడంతో అది నా చేతికి దొరికింది.

నేను ఉత్తరం విప్పాను. అది విశాలను సంబోధిస్తూ వ్రాసిన ప్రేమలేఖ. ఒక్క వాక్యం చదివాను. కళ్లు మసకగమ్మాయి. క్రింద చూశాను. ఎవరిదో పేరు 'రాఘవ' అని సంతకం ఉంది.

నా మెదడు మొద్దుబారిపోయింది... అంతవరకూ భవిష్యత్తుమీద బంగారు భవనాలు నిర్మించుకుంటూన్న నేను, వాటిని పూర్తిచేయకుండానే, వర్తమానం వదిలి, గతం తాలూకు కూలిన గోడల చుట్టూ పరిభ్రమిస్తోన్నట్టు నాకే తెలియలేదు. ఏవో, ఏవేవో జ్ఞాపకాలు క్షణం మనసులో రగిలాయి...నా కళ్లు ఎర్రబడ్డాయి. నాకు ఆవేశం, దాంతో పాటు ఆయాసం వచ్చాయి...ఏదో చెయ్యాలి !

విశాల బ్రతుకు ఇలా, ఇలా, కాకూడదు. ప్రేమించాననే జనాభా ఎక్కువయి—పెళ్ళిమాట వచ్చేటప్పటికి పరారీ అయ్యే కుర్రకారు ఆవేశానికి విశాల బలి కాకూడదు.

"ఎవరిచ్చారీ ఉత్తరం ?" నెమ్మదిగా అడిగాను.

"అంకుల్."

"నీకు చాకలెట్లు కొనిపెడతాను. బిస్కెట్ పాకెట్ ఇస్తాను. నే చెప్పినట్టు చేస్తావా, సరి" మృదుత్వాన్ని తెచ్చిపెట్టుకుంటూ అడిగాను.

ఆ అబ్బాయి బుర్ర ఊపాడు.

"అయితే కూర్చో" అంటూ ఓ కాగితమూ, పెన్నూ తీసుకున్నాను.

ఉత్తరం వ్రాయడం మొదలు పెట్టాను. ఏదో వ్రాస్తున్నాను. కానీ మనసంతా వికావికలమయిపోతోంది... కళ్ళు అక్షరాలపై—వాక్యాల మీదా దృష్టి వుంచడంలేదు. ఉత్తరం ముగించి—ఆ అబ్బాయి వెళ్ళినవైపు చూస్తూ ఉండిపోయాను, నేను.

* * *

సాయంత్రం పెందరాళే ఆఫీసు నుంచి వచ్చేశాను. సరోజ ఏవేవో అడుగుతోంది. నాకు మాట్లాడాలని లేదు. నా ఆలోచనలన్నీ పబ్లిక్ పార్క్—మీద మరో గంటలో జరగబోయే యుద్ధ కాండ మీదే వుంది. రాఘవ విశాల కోసం వస్తాడు. సరిగ్గా ఏనుగు బొమ్మ దగ్గర కూర్చుంటాడు. ఏడుగంటలకి విశాల బదులు—తను పంపించిన మనుష్యులు కన్పిస్తారు. కాదు, వాళ్ల మనుషులు కాదు కిరాయి మనుషులు.తన దగ్గర డబ్బు తీసుకున్న మూలంగా రాఘవని మాటలతో పోనివ్వరు.కావాలని పేచీ సృష్టించి బుద్ధి వచ్చేటట్టు చేస్తారు. జీవితంలో మరే ఆడపిల్లకి ప్రేమలేఖ వ్రాయకుండా జ్ఞానోదయం అయ్యేటట్టు చేస్తారు.

వీధిలోంచి విశాల రావడంతో నా ఆలోచనలకి అంతరాయం కలిగింది. విశాలవైపు చూశాను.

అవును. ఇక ఆలస్యం చేయకూడదు. ఏదో సంబంధం చూసి విశాల పెళ్ళి కానిచ్చేయాలి. విశాల సుఖపడాలి. విశాల జీవితం కన్నీటి కథ కాకూడదు.

విశాల నన్ను పలకరించకుండానే తన గదిలోకి వెళ్ళిపోయింది. తిరిగి నా ఆలోచనలు రాఘవమీదకి మళ్ళాయి. కాదు రాఘవ, ఆ పరిస్థితులూ దాటి ఎందుకో చాలా దూరం వెడుతున్నాయి. మనసుమీద ముళ్ళు గుచ్చుకున్నట్టుగా ఉంది. తను తప్పు చేశాడా ? తొందర పడ్డాడా ?

విశాల ఆంతర్యం రాఘవ మన స్తత్వం పూర్తిగా తెలుసుకోకుండా తననిలా ముందడుగు వేయించింది ఎవరు ? తనలో వివేకం నశించిందా ? ఎందు కిలా చేశాడు ?

లోకంలో అంతా చెడ్డవాళ్లూ, మోస గాళ్లూ మాత్రమే ఉంటారనే నిర్ణయానికి తనెలా వచ్చాడు ?

* * *

ఆఫీసు ప్యూన్ తీసుకువచ్చి ఎవరో ఇచ్చారంటూ ఓ ఉత్తరం నా చేతిలో పెట్టాడు. ఉత్తరం విప్పాను.

"సుందర్రావుగారూ

సాయంకాలం పబ్లిక్ పార్క్—లో ఏనుగుబొమ్మ దగ్గర నన్ను కలవ గలరా ? సరిగ్గా ఏడుగంటలకు రండి. మరో విషయం. మీ రనుకున్నట్టుగా మీ కిరాయి మనుషులు నన్ను చావదన్ని చెవులు మూయలేదు. మా స్నేహితు లందరం కలిసి మీ వాళ్ళకే మా సత్తా రుచి చూపించాం. సాయంత్రం మీరు గానీ రాకపోతే కథ మీకే ఎదురు తిరుగు తుంది. మీ క్షేమానికి ఇదే మా హామీ !

మీ—రాఘవ."

నాకు మతిపోయింది. అది ఆఫీసనీ నేను కిందా మీదా అవకూడదనీ తెల్సు. కానీ ఏదో భయం—ఏదో తొచనితనం...

ఇంటికి వెళ్లడమా, లేక పార్కు—కి

వెళ్లడమా? తెలియక ఆలోచిస్తూ ఉండి పోయాను. ఈ రాఘవ ఎవడో చాలా తెలివైనవాడై వుండాలి. లేకపోతే నా ప్లాను ఎలా తిప్పిగొట్ట గల్గుతాడు!! ఈ విషయం విశాలకి తెలిస్తే ! ! తెలియ కూడదు. ఎవరీ తెలియకూడదు.

సరిగ్గా ఏడుగంటలకి పార్కు-కి వెళ్లాను. జనం పల్చగా ఉన్నారు. ఒకళ్లూ ఇద్దరూ అటూ ఇటూ తిరుగుతున్నారు.

"రండి సార్."

చుట్టూ చూశాను.

పొడుగాటి మనిషి పాతిక సంవత్స రాలు ఉండొచ్చు. బెల్ బాటమ్ పాంట్‌తో గురూ షర్ట్‌లో అందంగా ఉన్నాడు.

ముందుకు వచ్చి "కూర్చోండి సార్," అన్నాడు. కూర్చున్నాను.

క్షణం మా మధ్య మాటలు లేవు.

"మీరు పెద్దవారు-మీరే ఇలా చేస్తా రని ఎప్పుడూ అనుకోలేదు. ఈ విషయం విశాలకి చెబితే తండ్రిగా మిమ్మల్ని ఎంతగా అసహ్యించుకుంటుందో ఆలో చించారా ?"

నాకు కోపం ఆగింది కాదు. ఆవేశం వచ్చింది.

"పెళ్ళి కాని ఆడపిల్లల్ని ఇలా వల్లో వేసుకుని మోసంచేసే వాళ్ళని నేను చాలామందిని చూశాను. నా కూతురు బ్రతుకు పాడవకుండా చూసే బాధ్యత నాకు లేదంటావా ?"

"నేను మీ అమ్మాయిని మోసం చేస్తా నని ఎందుకు అనుకున్నారు ? ఎలా అనుకున్నారు? కనీసం మీ అమ్మాయి నైనా మీరు అడిగారా ?"

"నా కనవసరం."

"విశాల కేజువల్‌గా నాకు ఫోన్ చేసిన మూలంగా నేను బ్రతికి పోయాను."

నేను మాట్లాడలేదు.

"సార్-సుందర్రావుగారూ, మీరు పెద్ద వారు. మీ మీద నా కేవిధమైన కోపం లేదు. నేను నిజంగా చెప్తున్నాను విశాలని నేను పెళ్ళిచేసుకుంటాను... సరేనా ?"

నేను చిరాగ్గా అనేశాను, "అసలు నువ్వెవరివి ? మంచీ చెడూ చూడక్కర లేదా ? అంతా మీ ఇష్టమేనా ?"

రాఘవ చీకట్లో నవ్వేశాడు.

"మంచివాళ్ళకి మంచివాళ్ళూ చెడ్డ వాళ్ళకి చెడ్డవాళ్ళూ దొరుకుతా రంటారు. కానీ మీలాంటి చెడ్డవాళ్ళు కూడా మంచివాళ్ళే కావాలని అనడం బాగోలేదు. టూ మచ్ ఏంబిషన్..."

"అంటే..."

"ఆడపిల్లల్ని ప్రేమించి ఆ పైన స్వంతం చేసుకుని ప్రేమలేఖలు వ్రాసి- పెళ్ళిమాట వచ్చేసరికి పరారీ అయిన పెద్దమనిషి-తన కూతురికి ఇంద్రుడో చంద్రుడో అల్లుడవాలని కోరుకోవడం అత్యాశ అవదంటారా ?" గబగబా అంటున్నాడు రాఘవ.

"ఏమిటి నువ్వు మాట్లాడేది ?" అన్నాను.



"అవును సార్...నేను ఎవర్ని అనుకున్నారు.రాఘవని మీరు పెళ్లి అయీ మా అక్కయ్యకి బ్రహ్మచారినని చెప్పి వల్లో వేసుకున్నారు. మా ఇంట్లో అద్దె కుండి నా చేత ప్రేమలేఖలు మోయించారు. మా వాళ్ళకి నిజం తెలిసి మిమ్మల్ని కొట్టడం...అవన్నీ..."

"రాఘవా..."

"భయపడకండి సార్...మీ రు అక్కయ్యకి ద్రోహం చేశారని-అందు కోసం నేను ప్రతిగా విశాలిని మోసం చెయ్యను. లోకంలో అందరూ మీలాంటి వాళ్ళే ఉండరు. కొందరిలో బహు కొందరిలో నాలాంటివాళ్లు కూడా ఉంటారు మీ నీడని చూసి మీరు భయ పడ్డారంతే!! లేకపోతే ఈ దారుణం మీరు చేసేవారు కాదు.

నేను దిమ్మెత్తిపోయి రాఘవని చూస్తూ ఉండిపోయాను. చీకట్లో నా నీడ దెయ్యంలాగా కన్పించడం మొదలు పెట్టింది.

# ఉత్తరం

ప్రతాప రవిశంకర్




సెలవు కాదు. వంట్లో బావున్నట్లని పించక ఆ రోజు ఆఫీసుకు సెలవు పెట్టి వరండాలో పేము కుర్చీలో కూర్చుని ఇంగ్లీషు నవల చదువుతున్నాను. మాంచి సస్పెన్స్‌లో వుండగా గేటు నెట్టిన చప్పుడు వినిపించింది.

తలెత్తి చూశాను. చిరునవ్వుతో లోపలికి వస్తున్న పోస్ట్‌మేన్ కనిపించాడు. దగ్గరకు రాగానే చేతిలోవున్న ఉత్తరాల కట్టలోనించి ఓ కవరు తీసి నా చేతిలో వుంచి వెళ్ళిపోయేడు.

కవరు చించాను.

చెల్లెలు హెమవతికి —

మీ అన్నయ్య గోవర్ధనం వ్రాయు

నది. నాకు తెనాలికి ట్రాన్స్ఫరయింది. రెండ్రోజుల్లో జాయినవ్వాలి. నిన్ను చూసి చాలారోజు లయింది. బావగారిని ఇంతవరకు చూడలేదు. అందుకే ఇద్దరినీ చూసినట్లవుతుందని రేపు విజయవాడలో దిగి మీ ఇంటికి వస్తాను. మీ వదిన పురిటికి పుట్టింటికి వెళ్లిపోయింది.

— గోవర్ధనం

ఆ ఉత్తరం చదివిన తర్వాత కొంత సేపు ఆలోచనలో పడవలసి వచ్చింది. నాకు తెలిసినంతలో నా భార్య హైమవతికి అన్నయ్యలు ఎవరూ లేరు. బహుశ ఏ కజినో అయివుంటా డనుకున్నాను. పాపం – అత నింతగా తన చెల్లెలికి ఉత్తరం రాస్తే హైమవతి ఇక్కడ లేదు. మా అత్తగారికి ఏదో జబ్బు చేసిందని ఉత్తరం రాగా రెండ్రోజుల క్రితమే వెళ్ళిపోయింది.

ఎందుకో నా చేతిలో ఉన్న ఉత్తరాన్ని మరోసారి చదవా లనిపించింది. మళ్ళీ చదువుతుంటే ఆ దస్తూరి నాకు సుపరిచితమే ననిపించింది. ఎప్పుడో, ఎక్కడో అటువంటి చేతివ్రాతను చూశాను. చాలా ఆర్టిస్టిక్‌గా వున్నాయి అక్షరాలు. ఆ దస్తూరిని ఎక్కడ చూశానో గుర్తు తెచ్చుకోటానికి ప్రయత్నించాను. ఐదు నిమిషాల తర్వాత హఠాత్తుగా నా కళ్ళముందు మంగపతి పెళ్ళినాటి సంఘటన కదిలింది.

అవును. సరిగ్గా ఏడాది క్రితం ఓ పల్లెటూరికి నా స్నేహితుడు మంగపతి పెళ్ళికి వెళ్ళాను పెళ్లికూతురు తరఫువాళ్లే ఎక్కువమంది వచ్చారు. అంతా కోలాహలంగా వుంది. మంగపతి హడావిడిగా తిరుగుతున్నాడు. పెళ్ళికూతురు డిగ్రీ వరకు చదువుకున్నదనీ, అందంగా వుంటుందనీ చెప్పాడు. నేను చూశాను. అతని మాటలు నిజమే.

ఇంకా మంగళసూత్రధారణ జరక్క ముందే ఆ పెళ్ళి పందిట్లో ఓ బాంబు పేలింది. మంగపతి పేర ఓ ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం చదివి అక్కడే పడబోయాడు మంగపతి. అతన్ని పట్టుకుని ఆ ఉత్తరం చదివాను. ఇంకేముంది ? ఆ ఉత్తరంలో పెళ్ళికూతురు ఇంతకుముందు ఎవర్నో ప్రేమించిందనీ, మంగపతిని చేసుకోడం ఆ అమ్మాయికి సుతరామూ ఇష్టం లేదనీ బలవంతంగా మంగపతి మామగారు కూతురి పెళ్ళి చేస్తున్నాడనీ వుంది. పెళ్ళికి వచ్చిన మరికొందరు పెద్దలు కూడా ఆ ఉత్తరాన్ని చదివారు. పెళ్ళికూతురికి ఆ పెళ్ళి ఇష్టంలేదని తేల్చారు. మంగపతి పెళ్లి ఆగిపోయింది ఇంతకీ నేను చూసిన దస్తూరి ఆ ఉత్తరంలోనిదే. మంగపతి పెళ్ళిరోజు వచ్చిన ఉత్తరంలో దస్తూరి, ఇప్పుడు నాకు వచ్చిన ఉత్తరంలోదస్తూరి ఒకటే ననిపించింది. అలా అనిపించగానే గోవర్ధనం మీద అనుమానం వచ్చింది. నా

అనుమానానికి నవ్వొచ్చింది...ఐనా ఈ గోవర్ధనమే ఆ ఉత్తరం రాసిన మనిషి ఎందుకు కాకూడదు ? అనిపించింది మనసులో. కాకతాళీయంగా జరిగివుండ వచ్చు. అందుకే గోవర్ధనం రాగానే ఎలాగైనా ఈ విషయం గురించి ఆరా తీద్దా మనుకున్నాను.

* * *

మరురోజు–

ఆదివారం. గోవర్ధనంకోసం ఎదురు చూస్తూ ఇంట్లోనే వున్నాను. ఉదయం పదిగంటలవుతుండగా ఇంటిముందు రిక్షా ఆగింది. ఆగిన రిక్షాలోనించి ఎయిర్‌బ్యాగ్ పట్టుకుని దిగాడు ఓ యువకుడు. అతనే గోవర్ధన మనుకున్నాను.

లోపలకు వచ్చాడు. తనని పరిచయం చేసుకున్నాడు. నేనూ నన్ను పరిచయం చేసుకుని అతని ఉత్తరం చేరిందనీ హైమవతి పుట్టింటికి వెళ్ళిందనీ చెప్పాను. నా మాటలు విన్న తర్వాత కొంత నిరుత్సాహం అతనిలో కనపడింది.

తర్వాత ఇద్దరం కబుర్లలోకి దిగాము. తన ఉద్యోగం గురించి చెబుతున్నాడు గోవర్ధనం. అతని మాటలు చాలా తెలివిగా ఎదుటి మనిషిని ఆకట్టుకొనేట్టు వున్నాయి.

పదకొండు గంటల తర్వాత ఇద్దరం స్నానంచేసి హోటల్‌కు వెళ్ళి భోజనం చేసివచ్చాము. సాయంత్రం వరకు పేకాడుకొన్నాము. అటు తర్వాత గోవర్ధనం ఓ గంటసేపు నిద్ర పోయేడు.

నాకు నిద్రపట్టలేదు. నా మనసులో కదులుతున్న ఆలోచనలను గోవర్ధనం ముందు ఎలా బయటపెట్టాలని ఆలోచిస్తున్నాను. నేనిలా ఆలోచిస్తుండగానే అతను నిద్ర లేచాడు. ఐదున్నర దాటుతోంది,

డ్రెస్ చేసుకొని ఇంట్లోనించి బయట పడ్డాము. ఏవో విషయాలు మాట్లాడుకుంటూ కృష్ణా బ్యారేజి దగ్గరకు వెళ్లాము.

బాగా చీకటిపడిన తర్వాత వెనక్కు మళ్ళాము.

నడుస్తున్న వాడినల్లా "ఎందుకో నాకో సంఘటన గుర్తుకొస్తోంది" అన్నాను.

"ఏమిటది?" నాకేసి చూస్తూ ఆశ్చర్యంగా అడిగాడు గోవర్ధనం.

"ఏడాదిక్రితం నా స్నేహితుడు మంగపతి పెళ్ళికి ఓ పల్లెటూరు వెళ్ళాను. పెళ్ళిరోజు మంగపతి పేర్న ఓ ఉత్తరం వచ్చింది. అందులో పెళ్ళికూతురు ఎవర్నో ప్రేమించిందనీ, మంగపతిని చేసుకోడం ఆ అమ్మాయికి ఇష్టంలేదనీ వుంది. ఆ ఉత్తరం నేను చదివాను. నన్నెంతగానో ఆకర్షించింది. చాలా ఆర్టిస్టిక్‌గా వున్నాయి అక్షరాలు. ఆ ఉత్తరం



కారణంగా మంగపతి పెళ్లి ఆగిపోయింది. బహుశ ఆ అమ్మాయిని ప్రేమించి నతనే ఆ ఉత్తరం రాసివుండాలి. ఇప్పుడా అమ్మాయికి పెళ్లయిందో? లేదో? ఎందుకో నాకు అప్పుడప్పుడు ఆ సంఘటన గుర్తుకొస్తూవుంటుంది"

గోవర్ధనం మాట్లాడలేదు. నవ్వాడు. అతని ముఖంలో ఫీలింగ్స్‌ను గమనించాను. ఎలాంటి భావమూ కనిపించలేదు. బహుశ ఆ ఉత్తరం రాసింది గోవర్ధనం కాదేమో అనుకున్నాను అతనే రాయాలని ఏముంది? మరెవరో అయివుండవచ్చును. ఎట్లాగో మనసును సరిపెట్టుకోవాలనుకున్నాను ఈసారి డైరెక్టుగా విషయంలోకి దిగిపోయేను

"ఈ సంఘటన గురించి సందర్భం లేకుండా మీతో ఎందుకు చెప్పానో తెలుసా?" అడిగాను.




"ఎందుకు ?"

"నిన్న మీరు రాసిన ఉత్తరంలో దస్తూరి. మంగపతి పెళ్లిరోజు వచ్చిన ఉత్తరంలో దస్తూరి ఒకటే "

నవ్వి "గ్రహించాను. ఆ ఉత్తరం నేనే రాశానేమోనని తెలుసుకుందామని ఈ సంఘటన చెప్పారు, అవునా" అన్నాడు గోవర్ధనం

తల వూపాను

"మీ ఊహ నిజమే. ఆ ఉత్తరం నేనే రాశాను "

విస్తుబోయాను.

"నిజం. ఆ అమ్మాయిని ప్రేమించింది నేనే మే మిద్దరం పెళ్లిచేసుకుందామనుకున్నాం. కాని అప్పట్లో నాకు ఉద్యోగం లేకపోవడంవల్ల ఆ అమ్మాయి తండ్రి మా పెళ్లికి ఒప్పుకోలేదు మరో సంబంధం చూసి పెళ్ళి నిశ్చయించాడు. వారికి ముందుగానే ఉత్తరం రాశాను. తర్వాత మరో సంబంధం చూశాడు. అదే మీ మంగపతిగారి సంబంధం. ఉతరం రాశాను. పెళ్లి ఆగిపోయింది. తర్వాత మరో సంబంధం కూడా చెడగొట్టేను. ఆ తర్వాత మరెవరూ ఆ అమ్మాయిని చేసుకుంటానంటూ రాలేదు. నాకు ఉద్యోగం వచ్చింది. నా కాళ్లే కడిగి కన్యాదానం చేశాడు. ఇప్పుడు ఆ అమ్మాయి నా భార్య. అంటూ స్ట్రీట్ లైటు దగ్గర ఆగి పర్సులో నించి ఓ ఫోటో తీసి చూపాడు. కళ్ళు పెద్దవిచేసి చూశాను.

గోవర్ధనం – పక్కనే ఆ అమ్మాయి గుర్తుపట్టగలిగేను. ఆ అమ్మాయే మంగపతికి తప్పిపోయిన భార్య.









కాను..." విసురుగా ఫోను పెట్టేసిన శబ్దం.

ఛ......బ్యాడ్ లక్......ఈ వేళ ముహూర్తం అంత బాగున్నట్టు లేదు అనుకున్నాడు మధు.

మధుకి ఒక పిచ్చి సరదా ఉంది. ఆదేమిటంటే ఏదో ఒక నెంబరు డయల్ చేసి ఫోనుచెయ్యడం. అవతల ఫోను ఎత్తిన వ్యక్తి స్త్రీ అయితే రొమాంటిక్‌గా మాట్లాడడం, పురుషుడు అయితే రాంగ్ నెంబరని డిస్కనెక్ట్ చేయడం. ఒక్కొక్కప్పుడు చాల గమ్మత్తులు జరుగుతుంటాయి. కొందరు స్త్రీలేమో రాంగ్ నెంబరని ఫోను పెట్టేస్తారు. కొందరేమో వాళ్ళుకూడా రొమాంటిక్‌గా మాట్లాడుతారు.

ఒకసారి అలానే...ఏదో నెంబరు డయల్ చేశాడు

"హలో అన్నాడు మధు.

"హలో ... ఎవరు మాట్లాడుతూంట ?..." ఎవరిదో ఆడగొంతు.

"నేను ధర్మేంద్రను !......" అన్నాడు మధు.

"హాయ్ ధర్మేంద్రా...నేను హేమా మాలినిని మాట్లాడుతున్నాను" అన్నది ఆమె. మధుకి మతిపోయినట్టయింది.

"ఏం ధర్మేంద్రా ...... ఇన్నాళ్ళ తరువాత ఫోనుచేసి ఏమీ మాట్లాడకుండా మౌనంగా ఉన్నావేం ?... ఆమె కంఠం లోని చిలిపితనం మధుకు గిలిగింతలు పెట్టింది.

"నీ కంఠం విని పారవశ్యంలో అలా ఉండిపోయాను హేమా డియర్."

"ఛ...ఉత్త కబుర్లే......అంత ప్రేముంటే ఇన్నాళ్లూ ఎందుకు ఫోను చేయలేదు......నీ కోసం నేనెంత వేగి పోతున్నానో నీకేం తెలుసు..." చిన్నగా నవ్విన శబ్దం.

మధుకి ఇప్పుడు పూర్తిగా మతి పోయింది. ఒకసారి కూడా చల రొమాంటిక్‌గా (పిచ్చి పిచ్చిగా) మాట్లాడేడు.

వాళ్లు ఇలా పావుగంట మాట్లాడేరు. అంతసేపు మాట్లాడినా ఆమె తన అసలు పేరుగానీ తన ఫోను నెంబరుగానీ చెప్ప లేదు. మధు తనచేతికి ఏ నెంబరు అందితే ఆ నంబరు డయల్ చేస్తాడు. అందుకనే తనే నెంబరు డయల్ చేశాడో తనకే తెలియదు. మధు ఎంత బతిమిలాడినా ఆ హేమామాలిని తన పేరూ—ఆ ఫోను నెంబరూ చెప్పలేదు. కనీసం తన నెంబరైనా ఆమెకు చెప్తే అమే మళ్ళీ ఎప్పుడైనా ఫోను చేస్తుందని ఆమెకు తన ఫోను నెంబరు చెప్పాడు. కానీ ఈనాటివరకూ ఆమె మళ్ళీ ఫోను చెయ్యలేదు.

ఇలా ప్రతిరోజూ ఆఫీసు ఫోనును దుర్వినియోగం చెయ్యడం అతని హాబీల్లో ఒకటి. ఈరోజు ఎంత ప్రయత్నించినా అతనికి రొమాంటిక్‌గా మాట్లాడేవాళ్ళు దొరకడంలేదు.

మళ్ళీ ఏదో నెంబరు డయల్‌చేశాడు.

"హలో..."

"హలో...మాధవి ఉందా ?..."

"ఎవడ్రా...నువ్వు ?... మాధవి కావాలా ?... దొంగ రాస్కెల్...నీ ..." వాడెవడో బండబూతులు తిడు తున్నాడు. మధు వెంటనే ఫోను పెట్టేశాడు. మాధవి అనే ఆమె నిజంగా ఉందా ?... వాడికేమౌతుందో !!... చెల్లె... ?... కాదు పెళ్లామే అయి ఉంటుంది !!...

మధు వేళగడియారం వంక చూసు కున్నాడు. పన్నెండైంది. ముఖ్యమైన ఫైళ్లు చూసి త్వరగా ఇంటికి వెళ్ళి పోవాలి. లేకపోతే బస్సు మిస్సైపోతుంది అనుకున్నాడు. ఆఖరిసారిగా మరోసారి ఫోనుచేసి ప్రయత్నించి చూద్దామను కున్నాడు. రెండు కళ్ళూ మూసుకుని తన ఆరాధ్యదైవమైన కృష్ణుడిని తలుచుకుంటూ అలా కళ్ళు మూసుకునే ఒక నెంబర్ డయల్ చేశాడు.

"హలో..." ఎవరిదో స్త్రీ కంఠం !

"హలో.. బావున్నారా ?..." మధు ఉత్సాహంగా ప్రశ్నించాడు.

ఆమె ఏదో ప్రశ్నించింది. మధుకు సరిగ్గా వినబడడంలేదు. లైను సరిగ్గా లేదో లేక అవతలి ఫోను సరిగ్గా లేదో!!

"ఏమంటున్నారు ?..." మధు కాస్త గట్టిగా అడిగాడు.

"ఇంతకీ మీరెవరూ అంటున్నాను."

"నన్ను గుర్తుపట్టలేదా ?...ఐమీన్ ...అదే నా గొంతును..."

"సారీ... ఫోను సరిగ్గా వినబడటం లేదు."

"కానీ మిమ్మల్ని నేను గుర్తుపట్టాను ...మీరు నా ఆరాధ్య దేవత !..."

"అలాగేం. ....అలాగయితే నేను కూడా మీ రెవరో గుర్తుపట్టాను...మీరు

కూడా నా ఆరాధ్య దైవమే... అంతే కదూ ?..." తీయని నవ్వు వినిపించింది.

మధు ఎగిరి గంతేసినంత పని చేశాడు. ఆమె మాటలకు రెచ్చిపోయాడు.

"మేడమ్......మీ గొంతు ఎంత తీయగా ఉందో తెలుసా ?...ఇలానే జీవితాంతం మీ గొంతు వింటూనే ఉండిపోవాలనిపిస్తుంది..."

"ఛ...ఇంత చిన్న కోరికా ?!..." ఆ కంఠస్వరంలో చిలిపితనం ధ్వనించింది.

"ఇంకా......ఇంకా చాలా చాలా తీయని కోరికలు ఉన్నాయి...... చెప్పేదా ?..."

"ఊ...చెప్పండి మరి."

మధు అలా ఆమెతో ఒక పావుగంట సేపు తీయగా వేడిగా వాడిగా మాట్లాడాడు. ఆమె కూడా మధుకు ఏమాత్రం తీసిపోలేదు.

"ఏమండీ...ఇంత సేపు మాట్లాడినా మీ పేరు చెప్పలేదు...ఇంతకీ మిమ్మల్ని ఏమని సంబోధించమంటారు ?..." మధు కుతూహలంగా అడిగాడు.

"అమ్మో...... ఆశ !: ... మీరు మాత్రం మీ పేరు చెప్పరేంటి ?...నేను చెప్పను...!"

"ప్లీజ్...ప్లీజ్...కనీసం మీ ఫోను నెంబరు చెప్పండి..." మధు బ్రతిమలాడాడు

"నా ఫోను నెంబరు తెలియకుండా నాకెలా ఫోను చేశారో...పోనీలే...నేను చెప్తాలేగానీ ఒక్కటే షరతు."

"చెప్పండి. ఏ షరతుకైనా సిద్ధమే."

"మీరు అప్పుడప్పుడూ మధ్యాహ్నం పూట నాకు ఫోను చెయ్యాలి...ఈ రెండురోజులు మాత్రం మీరు ఎన్ని సార్లు ఎప్పుడు ఫోను చేసినా పరవాలేదు..."

"ఓస్...అంతేనా... రోజూ ఫోను చెయ్యమన్నా చేస్తాను...మీ నెంబరు ?"

"34670..."

మధు ఉలిక్కిపడ్డాడు ... అది తన ఇంటి ఫోను నెంబరు ...... తను పొరబాటుగా వినడం లేదు కదా ?

"ఏమిటీ ?..."

"34670..."

"మీ పేరు......" అనుమానంతో మధు కంఠం వణికింది.

"ప్రమీల..."

ఓహ్ ...... ప్రమీలా !! రాంగ్ నెంబర్...మధు తలపట్టుకుని కుర్చీలో వెనక్కు పడిపోయాడు.



# పందికొక్కులు

(గల్పిక)

దేశంలో పందికొక్కుల విజృంభణ నానాటికీ తీవ్రమయింది. మనిషి చెమటోడ్చి పండించిన ధాన్యంలో పదోవంతు పందికొక్కుల కమిషనుగా ఆమోదించబడుతూ వస్తున్నది. కాని యాభై శాతం లు తినెయ్యటం చాలా తప్పు. అందుకని కొందరు యువకులు పందికొక్కులను వెతికి చంప సాగారు. పందికొక్కులను చంపటం హింస. వేద విరుద్ధం. అందుచేత ప్రభుత్వం పందికొక్కులను చంపే వాళ్లను వేటాడి తుపాకులతో కాల్చటమూ, పట్టుబడితే కారాగృహాలలో పెట్టి చిత్రహింసలు చేయటమూ సాగించింది.

అయినా "పందికొక్కులు నశించాలి" అన్న నినాదం ఇచ్చింది ప్రభుత్వం. "ఇది కపట నినాదం. ఈ ప్రభుత్వం పందికొక్కులను తుపాకులతో కాపాడుతున్నది," అంటూ కొందరు రాజకీయ వేత్తలు బయలుదేరి, అహింసా విధానంలో పాత ప్రభుత్వాన్ని పడగొట్టి, కొత్త ప్రభుత్వం ఏర్పాటు చేశారు.

వీళు ప్రజలకు హామీ ఇచ్చారు! "పందికొక్కుల్ని అదుపులో ఉంచుదాం. దేశంలో ఆహారధాన్యాల కొరత తీరుస్తాం"

కాని పందికొక్కుల విజృంభణ తగ్గలేదు. హెచ్చింది. కొత్త ప్రభుత్వం ఏం చేస్తున్నదని ప్రజలు అడిగారు.

అలా అడగటం అన్యాయం. కొత్త ప్రభుత్వం చేతులు కట్టుకు కూర్చోలేదు. అది పందికొక్కులను అదుపులో ఉండమని వేడుకున్నది. న్యాయంగా పది శాతం భోంచెయ్యమన్నది. అంతకుమించి తినటం అక్రమమనీ, అలా చేస్తే కఠిన చర్యలు తీసుకోబడతాయనీ అన్నది. ఆ చర్యలు ఎలాంటివో అది పరమ రహస్యం. పందికొక్కుల్ని అదుపులో పెట్టటానికి పదేళ్లు వ్యవధి ఇయ్యమనీ, పోయిన ప్రభుత్వం పెంచిన పందికొక్కుల్ని అదుపు చెయ్యటం త్వరలో జరిగే పని కాదనీ, అయినా పందికొక్కులను వేటాడేవాళ్ల ప్రాణాలు తీసే అహింసా కార్యక్రమం అక్షరాలా జరుగుతుందనీ కొత్త ప్రభుత్వం అటు ప్రజలకూ, ఇటు పందికొక్కులకూ కూడా హామీ ఇచ్చింది.

అందుచేత మళ్ళీ అయిదేళ్లకు ప్రజలు ఈ ప్రభుత్వాన్నే ఎన్నుకుంటే, పదేళ్ల తరవాత నందో రాజా భవిష్యతి.

***కొడవటిగంటి కుటుంబరావు***




"రమణమూర్తి తమ ఆఫీసు డివిజినల్ ఇన్‌చార్జ్‌గా వస్తున్నాడు. ఇదే ఆ రోజు ఉదయంనుంచీ శ్రీధరాన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్న విషయం. ఉదయం ఆఫీసుకి వస్తూనే ఈ వార్త చెవిన వేశాడు రాంబాబు.

"గురూ! మనకు ఇన్‌చార్జ్‌గా రమణమూర్తి అనే ఆఫీసరొస్తున్నారట. ఇవాళ ఆర్డర్స్ వచ్చాయ్..."

అంతే! ఆ క్షణంనుంచీ తనకు మనశ్శాంతి కరువయిపోయింది. తనను ఇదే ఆఫీసులో గుమాస్తాగా చూసి రమణమూర్తి ఏమనుకొంటాడు ఎలా ప్రవర్తిస్తాడు? ప్రతీకారం తీర్చుకో కుంటా ఉంటాడా! 'భలే దొరికావురా శ్రీదరం! ఇప్పుడు కాచుకో నా దెబ్బ' అని అంటాడు. తనను ఓ తవధ చేసేసాడు. తనేమయినా అభిమానపడి

ఎదురు తిరిగితే ఉద్యోగంలోనుంచి పీకేస్తాడు! అప్పుడు తనేం చేయగలడు? ఎవరితో చెప్పుకోగలడు! మరో ఉద్యోగం ఎవరిస్తారు తనకి? ఉద్యోగాలు సంపాదించుకోవడం అంత తేలికయిన విషయం కాదే. తన భార్యా పిల్లలు — వీళ్ళందరినీ పోషించటం ఎలా? తన జీవితమే గందరగోళం అయిపోతుందే —

"ఏం గురూ! ఓవర్ టైమ్ చేస్తున్నావేమిటి? అయిదు దాటినా సీట్లోనే కూర్చున్నావ్?" అడిగాడు రాంబాబు నవ్వుతూ. ఆలోచనల్లోంచి తేరుకొని టేబిల్ మీద ఫైల్సన్నీ త్వర త్వరగా సర్ది అతన్తోపాటు బయటకు నడిచాడు శ్రీధరం.

"మనకొచ్చే ఆఫీసరు బాలా జీవాంతకుడట గురూ! మన హెడ్ క్లర్క్ ఇక్కడికి ట్రాన్స్‌ఫర్‌లో వచ్చే ముందు కొంతకాలం ఆయన దగ్గరా పని చేశాట్ట. అవులిస్తే పేగుల్లెక్కబెట్టే రకమట. మన హెడ్డాఫీసులో సరిగ్గా పనిచేయడంలేదని ఇద్దరు గుమాస్తాలను, ఒక ప్యూనును డిస్మిస్ చేసిపారేశాట్ట. ఆ తరువాత వాళ్ళు యూనియన్‌ద్వారా ఎంత ప్రయత్నించినా లాభంలేకపోయిందట..." రోడ్డుమీద నడుస్తూ చెప్పుకుపోతున్నాడు రాంబాబు.

అతని మాటలు మరింత కృంగదీసి నాయ్ శ్రీధరాన్ని.

ఈలెఖ్ఖలో తన ఉద్యోగం నిలబడడం కల్ల. అంతటి చండశాసనుడు ఇక తనలాంటివాడిని వదులుతాడా? తప్పకుండా రెండోరోజునే ఏదో ఒక వంకతో డిస్మిస్ చేసేస్తాడు. తన బ్రతుకు రోడ్డున పడక తప్పదు.

"నువ్వేదో ఆలోచిస్తున్నట్టున్నావ్ ఏమిటి?" శ్రీధరం పరధ్యానాన్ని కనిపెట్టి అడిగాడు రాంబాబు.

శ్రీధరానికి తన మనసులో విషయాలు రాంబాబుకి చెప్పాలనిపించలేదు. చిన్నగా నవ్వేసి, "ఏమీలేదు" అంటూ తప్పించుకున్నాడు.

రాంబాబు వెళ్ళిపోయాక నెమ్మదిగా ఇంటివేపు అడుగులు వేయసాగాడతను. ఎందుకో అప్పుడే ఇంటికి వెళ్ళాలనిపించటంలేదు. ఇలా ఇల్లు చేరుకోగానే, సుభద్ర తన ఆలోచనల్ని వెంటనే పసిగట్టేస్తుంది. అవన్నీ తన కూడా చెప్పేవరకూ ఊరుకోదు. ఆమెకు చెప్తే నవ్వేస్తుందేమో! "మీరు మరీ సిల్లీ!" అంటూ కొట్టిపారేస్తుంది. తనకు తెలుసా విషయం. పార్కులో కెళ్ళి నిర్మానుష్యంగా ఉన్నచోట రుమాలు పరుచుకొని దానిమీద కూర్చున్నాడు శ్రీధరం. ఇప్పుడీ సమస్యను ఎలా పరిష్కరించుకోవాలనేదే తెలీటంలేదు. జరిగిందానికి క్షమించమని రమణ మూర్తిని అడిగితే? ఛ! ఆ పని ఎలా చేయగలడు? తన అభిమానాన్ని చంపేసుకోగలడా? అంతకంటె

గత్యంతర మేముంది మరి ? తన భార్యనూ, పిల్లలనూ కూడా తనతోపాటు బాధలకు గురిచేయడంకంటె అభిమానం చంపేసుకొని అవమానాలు సహించడం నేర్చుకోవాలి.

ఎంచేతో ఈ ఆలోచన నచ్చటం లేదు శ్రీధరానికి. ఆఫ్టరాల్— కాలేజిలో ఉండగా ఊరూ పేరూ లేని ఓ కుర్రాడిని కాలేజి కంతటికి హీరోగా వెలిగిపోయిన తను క్షమించమని అడగాలా? అభిమానం కోసం, పరువుకోసం ప్రిన్సిపాల్ కే ఎదురు తిరిగి, టి.సి. తీసుకొని మరో కాలేజిలో చేరిన తనలాంటి అభిమాన ధనుడు ఇప్పుడు రమణమూర్తికి క్షమార్పణలు చెప్పుకోవాలా ?

నో—నో—నో— ! ఊహుం ! వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు. తనకో వ్యక్తిత్వం ఉంది. ఎన్ని కష్టనిష్ఠూరాలొచ్చిన తన వ్యక్తిత్వాన్ని అమ్ముకో కూడదు. చంపుకోకూడదు.

నిజమే, ఆనాడు తను బియెస్సీ ఫైనలియర్లో ఉన్న రమణమూర్తిని అతని రూమునుంచి రోడ్డుమీదకు లాగి చెంప దెబ్బ కొట్టేడు. కానీ అందుక్కారణం ఉంది. అతను తన క్లాస్ మేట్ అయిన రమాకాంతశర్మతో పేచీపడి అక్కడితో ఆగక డబ్బు ఖర్చుపెట్టి బజార్లోని రౌడీ వెధవలను తీసుకొచ్చి వాడిని కొట్టించాడు. అక్కడే తన కోపం వచ్చింది. కాలేజి కుర్రాళ్ళలో ఏమయినా తగాదాలొస్తే వాళ్ళలో వాళ్ళే తేల్చుకోవాలి. కొట్టుకోవాలి, తిట్టుకోవాలి— ఇవేమీ చేతకాకపోతే నోర్మూసుకు కూర్చోవాలి. అంతేగాని కిరాయి రౌడీలను తీసుకురావడ మేమిటి ? అందుకే తనకు ఒళ్ళుమండి రమణ మూర్తిని కొట్టాడు. మరోసారి కిరాయి రౌడీలను తెస్తే శాల్తీ గల్లంతవుతుందని హెచ్చరించాడు. అంతే ! అదే తనకూ రమణమూర్తికీ వైరం. ఆ తరువాత కాలేజిలో ఉన్న కొద్దిరోజులూ ఎప్పుడూ మాట్లాడుకోలేదు. కాలేజీజీవితం ముగిశాక అసలు ఒకరి కొకరు కనిపించను కూడాలేదు. తను ఈ ఉద్యోగంలో చేరిన పదెనిమిదేళ్ళకు తమ సంస్థ హౌస్ మాగజిన్ లో అతని ఫొటో చూసి ఆశ్చర్యపోయాడు. అతని రూపం ఏమీ మారలేదు. అదివరలానే సన్నగా రివటలా ఉన్నాడు. కాపోతే ఆఫీసరు కావడంవల్ల వేషం మారింది. అదే తేడా ! ఆ రోజే తను కంగారుపడ్డాడు. రమణమూర్తి తమ సంస్థ హెడ్ క్వార్టర్స్ ఆఫీసులో ఆఫీసరు. ఇవాళ కాకపోతే రేపయినా తను పనిచేసే చోటికి అధికారిగా రావచ్చు. అప్పుడు తను చాలా ఇబ్బందులకు గురవుతాడేమో ! ఆ విషయం క్రమేపీ మర్చిపోయినా అప్పుడప్పుడు అతని గురించి విన్నా, హౌస్ మాగజిన్ లో అతనికి సంబంధించిన విషయాలేమయినా చదివినా కొద్దిసేపు ఓ

విధమయిన అశాంతి చోటుచేసుకొనేది. లేచి ఇంటివేపు బయల్దేరాడు శ్రీధరం.

"ఏమి టివాళ ఇంత ఆలస్యం ?" అడిగింది సుభద్ర భోజనం వడ్డిస్తూ.

"అలా పార్కు కెళ్ళివచ్చాను..."

"ఏమిటో విశేషం ?" నవ్వాపు కొంటూ అడిగిందామె.

ఏమీలేదు...ఫ్రెండ్స్‌తో...అలా... కాసేపు కూర్చుని..." అబద్ధమాడే డతను.

"ఎందుకలా అబద్ధాలు చెప్తారు ? వచ్చిందగ్గర్నుంచీ చూస్తున్నాను...... ఏమిటో ఆలోచనలు—పరధ్యానం—నాకు చెప్పకూడదా ఏమిటి ?"

శ్రీధరానికి నవ్వు వచ్చేసింది. అంతా చెప్పక తప్పలేదు ఆమెకి. వింటూనే ఆశ్చర్యపోయిందామె.

"ఓస్ ! ఈ మాత్రాని కింత సత మతమయిపోతున్నారా ? భలేవారే ! అలా ఏం జరుగదులెండి ! మీకెందుకు నేను చెప్తున్నాగా ?" అలా పైకయితే అనేసింది గానీ లోలోపల ఆమెకూ నిజంగానే భయం పట్టుకొంది. ఒకవేళ భర్తని ఉద్యోగంనుంచి నిజంగా తొలగిస్తే తమ గతేమిటి ?

రెండ్రోజులు భారంగా గడిచిపోయి నయ్ ఈ రెండ్రోజుల్లోనూ శ్రీధరం బాగా కృంగిపోయాడు. అతన్ని చూసి సుభద్ర కూడా దిగులు పెట్టుకుంది.

ఆఫీసంతా హడావుడిగా వుందారోజు రమణమూర్తి ఆ వేళే వచ్చాడు చార్జీ తీసుకోడానికి.

టీ పార్టీ ఏర్పాటుచేశారు - రమణ మూర్తి వచ్చినందుకూ, పాత ఆఫీసరు వెళ్ళిపోతున్నందుకూ.

స్టాఫ్ అందరినీ పరిచయం చేస్తు న్నాడు పాత ఆఫీసరు. శ్రీధరానికి ఏమీ తోచటంలేదు. తనని పరిచయం చెయ్య కుండా ఉంటే బావుండునని కోరుకుం టున్నా డతను. వాళ్ళిద్దరూ తనదగ్గరకు రానే వచ్చేశారు.

"మిస్టర్ శ్రీధరం— మన ఆఫీసుకి ఒక ఎసెట్ అనుకోండి..." పరిచయం చేస్తూ అన్నాడు పాత ఆఫీసరు.

శ్రీధరం నమస్కరించాడు. రమణ మూర్తి విష్‌చేస్తూ ఏదో గుర్తువచ్చినట్లు తల పంకించాడు. శ్రీధరం ముఖం పాలిపోయింది. అతను తనని గుర్తు పట్టేశాడు. పైగా అతను చూసిన చూపులో 'బాకీలు తీర్చేసుకొంటాను' అన్న ధోరణి కనిపించింది.

సాయంత్రం నాలుగున్నరకరకూ సీట్లో అన్యమనస్కంగానే గడిపాడతను.

"మిమ్మల్ని అయ్యగారు పిలుస్తు న్నారు..."

తన సీటు దగ్గరకొచ్చి అన్న ప్యూను మాటలు విని అదిరిపడ్డాడు శ్రీధరం.

"నన్నా ?" ఖంగారుపడుతూ అడిగాడు

"అవున్సార్..."



అయిపోయింది. తన ఉద్యోగానికి అవసానదశ వచ్చేసింది. లేచి ఆఫీసరు గదివేపు నడిచాడు శ్రీధరం.

ప్యూను తలుపుతీసి పట్టుకొన్నాడు శ్రీధరం వెళ్లడానికి. సింహం బోనులో అడుగెడుతున్న మేకలా లోపలికి నడిచాడు శ్రీధరం.

"పిలిచారట సార్..." నెమ్మదిగా అన్నాడు శ్రీధరం

"అవును మిస్టర్ శ్రీధరం ! మీతో మాట్లాడాలని ! అలా నుంచున్నారేం ? కూర్చోండి..."

"ఫరవాలేదండీ..."

"నోనో- ముందు కూర్చోండి..."

కుర్చీలో ఇబ్బందిగా కూర్చున్నాడు శ్రీధరం.

"మీరు మన ఇన్‌స్టిట్యూషన్‌లోనే పని చేస్తున్నారన్న విషయం నాకు నిన్నటి వరకూ తెలీదు. మిమ్మల్ని చూడగానే ఆశ్చర్యపోయాననుకోండి. మధ్యాహ్నం నుంచీ నాకు కాలేజి రోజులే కళ్ళముందు తిరుగుతున్నాయ్. ఎంత త్వరగా మిమ్మల్ని పిలిచి మాట్లాడుదామా అని ఎదురుచూస్తున్నాను. ఇప్పటివరకూ

ఛార్జీ తీసుకోవడంతో తీరిక దొరికింది కాదు. అయిదయిపోతే మళ్ళీ మీరు ఇంటికి వెళ్ళిపోతారేమోనని ... అలా ఇబ్బంది ఫీలవకండి– ఫ్రీగా ఉండండి. మనం కాలేజిలో ఉన్నప్పుడు మీరెలా ఉండేవారో గుర్తులేదూ ? మిమ్మల్ని అలా చూడ్డమే నాకిష్టం..."

శ్రీధరం ముఖం పాలిపోయింది. తనని ఇన్సల్ట్ చేస్తున్నాడు. దమ్ముంటే కాలేజిలోలా ఇప్పుడు ప్రవర్తించమని ఛాలెంజ్ చేస్తున్నాడు. ఉద్యోగంలోనుంచి తనని తీసేయడం ఖాయం ! అంటే ఎలాగూ ఉద్యోగం పోతుంది. మరిక తనెందుకు అధైర్యపడాలి ? ఎందుకు ఇతగాడికి తలఒగ్గి ఉండాలి ? అప్పటిలానే ఇప్పుడూ ఎందుకు ప్రవర్తించకూడదు ? ఆత్మాభిమానం ఎందుకు చంపుకోవాలి ? ఉద్యోగం పోయినా, కనీసం తన వ్యక్తిత్వాన్ని చంపుకోలేదన్న ఆనందమయినా ఉంటుంది. శ్రీధరం పదేళ్ల వెనక్కి వెళ్ళాడు. ఎప్పుడూ పదిమంది తన వెంబడి తిరిగిన ఆ 'కాలేజి హీరో' జీవితం అతని కళ్లముందు కొచ్చి నిలబడింది. ప్రతిరోజూ వెయిట్ లిఫ్టింగ్ ప్రాక్టీస్ చేయడంవల్ల ఆకర్షణీయంగా కండలు తిరిగిన శరీరం. ఎత్తూ, ఎత్తుకు తగ్గ పొడవూ, ఇవన్నీ తన రూపాన్ని మరింత ఆకర్షవంతంగా చేసేసినయ్. వీటికితోడు తన వ్యక్తిత్వం. అనేక సందర్భాలలో దెబ్బలాటల్లో జోక్యం చేసుకొని– వాటిని పరిష్కరించడం– ఇవన్నీ తనని మరింత ముఖ్యమయిన వ్యక్తిగా తయారుచేసినయ్. ఆడపిల్లలు మరే కుర్రాడితోనూ మాట్లాడేవారుకాదు. కానీ తనతో మాట్లాడ్డానికి ఉవ్విళ్ళూరేవారు. జూనియర్ కుర్రాళ్ళు సరేసరి. చాలామంది ఎప్పుడూ తనని 'డిన్నర్' లకో. 'టీ'లకో, 'సినిమా'లకో పిలుస్తుండేవారు

శ్రీధరం కుర్చీలో సర్దుకూర్చున్నాడు. అపును ఆరోజుల్లో తను వెలిగిపోయాడు. తన సాహచర్యం కోసం ఎంతోమంది తహతహలాడిన హీరో ఆ రోజుల్లో తను. తనలోని ఆ వ్యక్తిత్వాన్ని, ఆ ధీమాని, ఆ అభిమానాన్ని ఆ నిర్లక్ష్యాన్ని ఇప్పుడు చంపేసుకుంటాడా ! నో...నెవర్ !

రమణమూర్తి ఏమయినా అవాకులు చెవాకులూ వాగితే తానిప్పుడు ఊరుకోడు, గట్టిగా బుద్ధిచెప్తాడు. ఇంకా ఒళ్లు మండితే అతను 'డిస్మిస్' అనకముందే తను 'రిజైన్' అనేస్తాడు. అంతే !

"నిజం చెప్పాలంటే మనం కాలేజి జీవితం వదిలాక మీరు మళ్ళీ కలుస్తారేమోనని చాలాకాలం ఎదురుచూశాను. కాని మీ జాడే తెలీలేదు. ఇన్నాళ్లకు మీరు కనబడటం– అదీ మనిద్దరం ఒకే ఆఫీసులో ఉండటం నాకు అమితమయిన ఆనందాన్నిస్తోంది శ్రీధరంగారూ ! ఆ రోజుల్లో మీ పరిచయంకోసం తహతహలాడినవాళ్లల్లో నేనూ ఒకడిని. కానీ నా దురదృష్టం మూలాన మన పరిచయం నేను కోరుకోని విధంగా జరిగిందనుకోండి ! అది వేరే విషయం. మీరు

మాత్రం ఇకనుంచి నాకు ఓ మాంచి స్నేహితులవాలి. నేను ఆఫీసరు- మీరు గుమస్తా అన్న ఫీలింగ్ వదిలేయండి అదంతా ఈ నాలుగ్గోడల మధ్య అదృష్ట వశాత్తూమనకై ఈనాలుగ్గోడలమధ్యకంటె బయట గడిపే సమయమే చాలా ఎక్కువ. ప్రతి రోజూ మనిద్దరం కలిసి మీ ఇంట్లోనయినా, మా ఇంట్లోనయినా సరే రెండు మూడు గంటలు సరదాగా కాల క్షేపం చేయాలి. ఏమంటారు ? మీకే మయినా అభ్యంతరమా ?"

శ్రీధరం ఉక్కిరిబిక్కిరి అవుతు న్నాడు ? ఏమిటిది ? రమణమూర్తి ఇలా మాట్లాడుతున్నాడేమిటి ? తనమీద అతనికి కోపం. ప్రతీకారభావం—ఇవేమీ లేవా? ఈ ఆపేక్ష, ఈ ఆప్యాయత ఎలా ప్రవేశించినయ్ వాటి స్థానంలో ?

"శ్రీధరంగారూ? ఏమీ మాట్లాడరేం? నేనంటే మీలో ఏమీ అయిష్టం పేరుకుపోలేదుకదా ?" నవ్వుతూనే అడిగాడు రమణమూర్తి.

"అబ్బె అలాంటిదేం లేదు... ఆ మాటకొస్తే మీకే నేనంటే అయిష్టత ఉండాలి... ఎందుకంటే... ఆ రోజు తొందరపడి మీ మీద చెయిచేసు కున్నాను..." సిగ్గుపడుతూ అన్నాడు శ్రీధరం

"అంత మాటనకండి ! అందులో మీరు తొందరపడిం దేమిలేదు. ఆ రోజు మీరు చేసినపని సరయినదే ! తర్వాత నా స్నేహితుడు మరొకతనికి కలిగిన అనుభవంద్వారా తెలుసుకున్నాను. అతనూ నాలాగే బజారు రౌడీలను ఏర్పాటుచేసి తనతో కొట్లాడిన ఓ కుర్రాణ్ని చావబాదించాడు తరువాత అదే కుర్రాడు ఆ రౌడీలకు బోలెడు డబ్బిస్తే వాళ్ళు వచ్చి నా స్నేహితుడినే చితకతన్నారు. అప్పుడు తెలిసింది నాకు మీ మాటల్లోని నిజం ! ఆ రోజునుంచే మీరంటే విపరీతమయిన అభిమానం ఏర్పడిపోయింది. అప్పుడే మీతో మాట్లాడాలనీ, మీ స్నేహం చేసుకో వాలని అనుకొన్నానుగానీ సిగ్గుపడ్డాను. అంతే ! అంతకు మించి వేరే కారణం మేమీ లేదు లేకపోతే ఏనాడో మనం మంచి స్నేహితులమయి ఉండేవాళ్ళం..."

శ్రీధరానికి ఒక్కసారిగా రమణ మూర్తిమీద అభిమానం ముంచుకొచ్చింది. ఆప్యాయంగా అతన్తో కరచాలనం చేయా లనిపించింది

"రమణమూర్తిగారూ ! మీ మనసు చాలా గొప్పది. అందుకే నాలాంటివాడితో 'స్నేహం' కావాలంటున్నారు. అంత కంటె నాకు మాత్రం అదృష్టం ఏముం టుంది ! మీరెలా చెప్తే అలా చేస్తాను. కేవలం మీరు నా ఆఫీసరు అవటం మూలాన నేనిలా మాట్లాడటంలేదు. నాకన్నా గొప్ప మనసున్న మనుషులు మీరు ! అందుకే పడిపోయాను..."

ఆ సాయంత్రం ఇంటికి వస్తూనే "నా కాలేజ్ మేట్, మిష్టర్ రమణమూర్తి" అంటూ పరిచయం చేస్తున్న భర్తని అయోమయంగా చూసింది సుభద్ర.




ఆప్యాయంగా శాంత వీపు తట్టుతూ "వూరుకో శాంతా ! ఏదీ మధును చూద్దాం పద" అంటూ మధు వున్న గదిలోకి వెళ్ళిన చంద్రం యింకా అలాగే ఆకాశంవైపు చూస్తూ కూర్చున్న మధుని చూస్తే బాధతో మనసు మెలికలు తిరిగింది. మధు జీవితంలో తిన్న దెబ్బలు సామాన్యమైనవి కావు. అంత చిన్న వయసులోనే ఒక జీవితకాలానికి స[illegible] పడ్డ కష్టాల్ని కళ్ళజూసింది. ఆమెకు అత్యంత ఆత్మీయులైన వ్యక్తులు ఒక్కొక్కరే మధు జీవితంనుంచి నిష్క్రమించారు. ఆ షాకుకు తట్టుకోడం సామాన్యులకు సాధ్యంకాదు. ఆ అమాయకురాలి మనసున రగిలిన బాధాగ్నిని అర్థంచేసుకోలేని ప్రజావాహిని వాళ్ళ కిష్టమొచ్చినట్లు వూహించుకొని ఏవేవో మాట లంటున్నారు

దగ్గరగా వెళ్ళి "మధూ !" అని పిలిచాడు చంద్రం. మనసులోని ఆప్యాయతంతా ధ్వనించిందా కంఠంలో. ఓ సారి చంద్రంవైపు వెర్రిగా చూసి, మళ్ళీ నిశబ్ద నిశీథిలోకి దృష్టి సారించింది. తలమీద చెయివేసి "మధూ ! కొంచెంసేపు పడుకోమ్మా !" అన్నాడు [illegible]ద్రం ఆర్ద్రంగా.

[illegible]ధులో మార్పేమీ లేదు. ఆ మౌన మూర్తిని ఎక్కువసేపు చూడలేకపోతున్నాడు చంద్రం. ప్రక్కనే నిలబడ్డ శాంతను "ఓ గ్లాసు పాలు తీసుకు రామ్మా !" అని పంపించాడు. అయిదు నిముషాలు మౌనంగా గడిచిపోయాయి

వకుళ దగ్గిర విదూషకత్వంచేసే బాధా తప్పేది," అన్నాడు.

"నీవనేదేమిటి, బావా?" అంటూ బేతాళవర్మ ముఖం కందగడ్డలా చేసుకున్నాడు.

"నేననేదేమిటో, యీసరికి నీ మెదడు కాస్త అర్థమయ్యే భాషలో నీకు చెప్పివుండవలసింది? విష్ణుమిత్రుడు శరీరం నిండా గాయాలతో స్పృహలేకుండా పడివున్న స్థితిలో, అతడి దగ్గిర దొరికిన పత్రాలనుబట్టి, అతడు ఫలానా అని గ్రహించాను. పైగా మణిమంతుడు లోగడ అనేకసార్లు, అతణ్ణి గురించి నాతో చెప్పివున్నాడు. ఇప్పటికైనా అర్థమైందా, వర్మా?" అన్నాడు ప్రసేనుడు.

"ఆ పత్రాలలోవున్న విషయం ఏమిటో చదివిచూశావా?" అన్నాడు బేతాళవర్మ కోపంతో వణికిపోతూ.

"ఆ పత్రాల్లోవున్న విషయమంతా చదివి చూడవలసిన అవసరం నాకేం కలిగింది? గౌరవమర్యాదలు పాటించేవాడెవడూ, మరొకరికి సంబంధించిన పత్రాలలో ఏమి రాసివున్నదో చాటుమాటున చదవదనుకుంటాను. ఒకవేళ నువ్వనుకుంటున్నట్టు అగ్నిపాలుడైతే ...అతడు నా ఇల్లు చేరేందుకు ప్రాణగండం కలిగించేంత పెద్ద గాయాలు స్వయంగానో, మరొకరిచేతనో పొడిపించుకునివుండాలి? అలా చేసేటంత బుద్ధిహీనుడు కాదనుకుంటాను, అగ్నిపాలుడు. నే విన్నదానినిబట్టి, అతడు









ఎంతో తెలివితేటలూ, గొప్పవాణ్ణనే అహంకారంవున్న నవభోజరాజుగారి భృత్యుడు," అన్నాడు ప్రసేనుడు.

బేతాళవర్మ మరి మాట్లాడలేదు. ప్రసేనుడు కావాలనే తనను యింతగా అవమానిస్తున్నాడని అతడు భావించాడు వెంటనే ఉన్నచోటునుంచి కదిలి, గబగబా ఉద్యానవనాన్నుంచి బయటికి వెళ్ళిపోయాడు. (సశేషం)




చలపతి ఫోన్‌చేశాడు. కాద్రాస్నుంచి రామం వస్తున్నాడట. గుంటూరు వెళుతూ వెళుతూ హైదరాబాద్‌లో రెండు రోజులు సరదాగా తన పాతమిత్రులు—ఆత్మీయులు—ముఖ్యంగా మా యిద్దరితో గడిపి మరీ వెళతానన్నాడట!

పది సంవత్సరాలయింది వాడిని చూసి. నేను గుంటూరులో వున్నప్పుడే వాడు ఫారిన్ వెళ్ళాడు. నేనూ చలపతీ ఏడ్చేశాంగూడా ఏర్‌పోర్ట్‌లో—బొంబాయి దాకా వెళ్లాం సెండాఫ్ ఇవ్వటానికి.

వాడి దగ్గరనుంచి నాకు నెలరోజుల క్రితం వచ్చిన ఉత్తరంలో రావాలనుకుంటున్నట్లుగా రాశాడు. చలపతికి రాసిన ఉత్తరంలో వస్తున్నట్లే రాశాడు.

నాకు రాసిన ఉత్తరంలో—'మళ్ళా మన మనుష్యులను, మన వాళ్ళని, మన ఊళ్ళని చూడాలని ఎన్నాళ్లబట్టో తపన పడిపోతున్నాను...ఒక్కసారి 'మన' అనుకున్న ప్రతిదానినీ కౌగలించుకొని కన్నీరు కారిస్తే నా జన్మకిక కావల్సిందేముంది. నా నెత్తురంటే నా కెంత ఆత్మీ

-యతో నా దేశమన్నా, నా ఊరన్నా, నా వాళ్లన్నా—నా అనుకున్న మీరన్నా అంతేరా సత్యం ... ఈ ఉత్తరం రాస్తుంటే మిమ్మల్ని చూస్తున్నట్లే వున్నది. మీతో మాట్లాడుతున్నట్లే వున్నది.

కళ్ళల్లో నీళ్లు తిరుగుతున్నాయిరా చిన్నా!'

—మా ముగ్గురిలో చిన్నవాడిని నేనే!

* * *

ఉదయం ఎనిమిది గంటలకు హైద్రాబాద్ ఏర్‌పోర్ట్‌లో రాబోయే రామం కోసరం ఆప్యాయంగా ఆకాశంలోకి చూస్తున్నాం.

నిన్ననే బొంబాయి వచ్చాడు వాడు.

దూరంగా ఆకాశంలో ఎక్కడో మ్రోత...తలెత్తితే దూరంగా, చిన్నగా, చిన్నపిట్టలా మా రామాన్ని దాచుకున్న విమానం...ఆ విమానంమీద మా కెంతో ఆత్మీయత...

రామం వస్తున్నాడు.

చలపతీ, నేనూ క్షణాలమీద పదేళ్ళ క్రితంలో పడిపోయి ఆనాటి రామాన్ని కళ్లముందు కదిలించుకుంటున్నాం.

ఈ పదేళ్ళలో వాడిలో ఎంతో మార్పు వచ్చివుంటుంది.

కళ్లజోడు వచ్చివుండవచ్చు. కాస్త లావెక్కి వుండవచ్చు. తెల్లబడి వుండవచ్చు... సూటూ, బూటూ, టై... ఎప్పుడూ లాల్చీ, పైజమాలనే లైక్ చేసేవాడు. వాటిని మర్చిపోయే వుండవచ్చు.

విమానం మా కళ్ళముందు, మా కాళ్ళముందే వచ్చి ఆగింది. ఆత్మీయంగా హృదయం తెరుచుకుంటున్నట్లుగా తలుపు తెరుచుకుండే అందులో నుంచి రామం చేతులూపుకుంటూ—పచ్చటి పైరులమీద ఎగిరే పిట్టలా ఎగురుతూ హాయిగా దిగాడు.

'మై గాడ్! రామం వాడే!'

పదేళ్ళక్రితం రామం - రెండు నిముషాలక్రితం పక్కగదిలోకివెళ్ళి మళ్ళీ తిరిగివచ్చినట్లే వున్నాడు.

—వాడు లాల్చీ, పైజమాలల్లోనే వున్నాడు.

నో గ్లాసెస్ ... నథింగ్ ... నో చేంజ్...

"అరేయ్ రామం... రామూ ... రామం..."

ముగ్గురం ఒకళ్ళమీద పడి ఒకళ్ళం కౌగలించుకున్నాం!

* * *

"నో ఛేంజ్ ఎటాల్!" చలపతి వాడి చేతిని పట్టుకొని అన్నాడు.

కారు ఏబిడ్స్‌లోనుంచి దూసుకుపోతోంది. నేను సిగరెట్టు ముట్టించి రామం వళ్ళో పడేశాను సిగరెట్టుపెట్టె అగ్గిపెట్టె ... రామాన్ని అనుకొని కూర్చుంటే అదో హాయి...

"శాంత గుంటూరులోనే వున్నది... నెలయింది వచ్చి!"

"మాకు రాయనేలేదేం...?"

"బొంబేలో వాళ్ల బ్రదర్ దగ్గర ఓ వీక్ వుంది ... మద్రాస్ మీదుగా గుంటూరు వెళ్ళింది...హైద్రాబాద్ టచ్ చేయలేదు!"

"మాకు దూరమవుతున్నావేమో నని భయంగా వున్నదిరా!" చలపతి నిష్ఠూరపు కంఠం.

"నో...బిలీవ్ మీ...నాటెటాల్... అలా అయితే ఇప్పుడు ఇక్కడ దిగే వాడినేకాదు!"

చలపతీ, నేనూ వాడినే కళ్లతో త్రాగేస్తున్నట్లుగా చూస్తూ కూర్చున్నాం.

ఎన్నాళ్ల కెన్నాళ్ళకు!

ఈ రోజు ఎంత సుదినం?

"ఏ హోటల్లో దిగమంటారు నన్ను?" రామం ప్రశ్న.

చలపతి హడావుడిగా జేబులు తడుముకోసాగాడు.

"ఏఁవైంది?" ఆత్రంగా అడిగాను.

"ఊఁహూఁ ... ఏఁవీలేదు ... కత్తి వుండాలే...ఏఁవైందా అని...వెధవని పొడిచేస్తాను..."

ముగ్గురం పగలబడి పగలబడి నవ్వుకున్నాం...పొట్టలు ఎగిరెగిరిపడేలా, ఒకళ్ళమీద ఒకళ్లం పడుతూ—తృళ్లుతూ, తూగుతూ—చలపతి ఇంటిముందు కారు ఆగేటంతటివరకూ — మేం ఎక్కడున్నామో మాకే తెలియదు...

* * *

"సో...ఇది పాతఇల్లుగాదు!" కారు దిగుతూ అన్నాడు రామం...చుట్టూ పరిశీలనగా చూచి.

"అది అమ్మే ఇది కొన్నది!" చలపతి వెనగ్గా దిగాడు.

"వెల్...చాలా బాగుంది ... ఏరా సత్యం నీవూ...?" నా వంక తిరిగాడు.

"నాదీ ఇంత కొంప కాకపోయినా ...ఒక కొంపే! ప్రస్తుతానికి మీ చెల్లెలుగారు...మా కుటుంబాన్ని విస్తృత పరిచే వుద్దేశ్యంతో..."

"ఓ ..కంగ్రాట్స్...భారతదేశాన్ని బాగుచేస్తున్నావన్నమాట...కానీయ్..."

ముగ్గురం మెట్లెక్కాం.

"ఓయ్...నీలూ! అంకుల్ ఆగయా ..."చలపతి కేకవేసాడు.

నీలూ చలపతి కూతురు.

నీలూ చెంగుచెంగున మెట్లమీదనుండి దూక్కుంటూ దిగింది...పద్దెనిమిదేళ్ళుంటాయి...లేడిపిల్లలా ఎప్పుడూ ఎగురుతూనే వుంటుంది...ఇంకా ఫ్రాక్ లే వేస్తుంది...బాబ్డ్ హెయిర్...

కానీ ఈ రోజు చీరలో ముచ్చటగా ముద్దబంతి పువ్వులా కనిపిస్తోంది— అంతా తల్లిపోలిక!

"హాయ్...నీలవేణా! చాలా పెద్దదయిపోయిందే అప్పుడే!" రామం






ముందుకు వడివడిగా అడుగులువేస్తూ అన్నాడు.

"నమస్తే!"

"దట్సాల్ రయిట్...నీవు నీలవేణి వేనా అని!"

"అవునురా పండూ...నీలవేణే!" చలపతి కళ్ల కాంతితో వెలుగుతుండగా కూతురివంక ఆప్యాయంగా చూస్తూ అన్నాడు. "నీవు పది సంవత్సరాల క్రితం ఎత్తుకు మోసిన నీలవేణే!"

"వెల్ బిల్ట్...వెల్ మానర్స్... హార్టీ కంగ్రాట్స్‌రా చలపతీ!" అన్నాడు ఆత్మీయంగా, ప్రేమగా మిత్రుడి కళ్ళలోకి చూస్తూ.

"థాంక్యూ!" చలపతి కళ్ళు గర్వంతో మెరిసినయ్.

"సో..." అంటూ సోఫాలో కూర్చొని నా ఉనికిని వాళ్ళకు గుర్తు చేశాను.

"నీలూ...కోటిల్నిపిలు!" అంటూనే రామంవైపుకు తిరుగుతూ, "రామం! కూర్చోరా...కూర్చొని...ఈ పది సంవత్సరాల మన ఎడబాటునూ...ఈ రెండు రోజుల కలయికకూ యీక్వలయిజ్ చేసి ...జీవితంలో మరువలేని మధుర క్షణాలను సృష్టించు...యస్ మాన్!" అన్నాడు చలపతి.

"జీవితం తొంగిచూస్తోంది గతంలోకి ...నీవా, కమ్ హియర్...ఈ క్షణం ఈక్షణంలాగానే జీవితాంతం నిలిచిపోతే ...బ్రదర్స్! రండిరా దగ్గిరకు..."

రామం కళ్ళల్లో నీళ్ళు ఒప్పిల్లుతున్నాయి.

"మిమ్మల్ని చూస్తున్నాను ... మీలో కరిగిపోతున్నాను...మనం...మనం... మనం ... ఈ క్షణాన మనమంతా ఇక్కడే ఎదురెదురుగ్గా ... అనుకొని కూర్చొని...తనివితీరా కౌగలించుకొని —ఓ ఈ క్షణమా, హట్సాఫ్!" వాడి కంఠం జీరబోతోంది...

మా కళ్ల చెమ్మగిల్లుతున్నాయి.

కోటీలు వచ్చాడు.

"హాట్ వాటర్ సిద్ధంచేయి ...

బ్రేక్‌ఫాస్ట్ ఎరేంజ్ చేయ్...డియర్! ఎనీ హాట్ డ్రింక్స్..." చలపతే అడిగాడు.

"వద్దు!"

"మిత్రమా! ... నీలో మార్పు లేదోయ్!"

* * *

"ఏఁవిటి చూస్తున్నావ్?" ఇడ్లీ తింటున్నవాడల్లా ఆగి అడిగాడు చలపతి రామాన్ని.

"అటు చూడు..." రామం కిటికీ లోంచి బయటకు వేలుతో చూపుతూ అన్నాడు.

పక్కింటి మేడమీద మళయాళపు కెప్టెన్ పెళ్ళాం తలనిండా స్నానంచేసి జుట్టు ఆరబెట్టుకుంటోంది...మంచి పకడ్బందీగా వున్న మనిషి...మగవాళ్ళ చూపులను తిప్పుకోనీయలేని మనిషి!

"టిఫిన్ కానీయ్!" అన్నాను— కెప్టెన్ చూస్తే కాల్చేస్తాడు అన్నట్లుగా. కళ్ళు చికిలించి నవ్వుతూ, "నో ఛేంజ్ ఎటాల్...ఈ పదిసంవత్సరాలూ నీలో ఏ మార్పూ తీసుకురాలేదు—అవునా?" అన్నాను ఎగతాళిగా.

నిజమే—వాడిలోవున్న పెద్దలోపం అదొక్కటే!

వాడిలోని ఆ వుమన్ వీక్‌నెస్ మమ్మల్ని చాలాసార్లు ఇబ్బందుల్లో పడేసింది.

ఆ విషయంలో రామం వట్టి వెధవ!

దేశం మారాడు. కాలం మారింది. రోజులు మారాయి. వాతావరణం మారింది—అయినా వాడిలో మార్పు రాలేదు!

ఇక రాదేమోగూడా!

వయస్సు నెత్తినపడీ ఏం లాభం?

యూనివర్సిటీ జీవితంలో గూడా ఒకటి రెండుసార్లు వాడి పని చావుతప్పి కన్ను లొట్టపడినంత పనయింది.

"బాగున్నదిగదూ—కెప్టెన్ అదృష్టవంతుడు!" కళ్ళతోనే నవ్వుతూ అన్నాడు రామం.

చలపతి ఇబ్బందిగా కదిలాడు.

"పుట్టుకతో పుట్టిన ఆలోచనలూ, అలవాట్లూ చావుతోగానీ పోవు—అవునా?"

"అక్షరాలా నిజం — సందేహమే లేదు!" అన్నాడు రామం నవ్వును బిగపట్టుకుంటూ.

గాడిదవెధవ—మొండి ఘటం!

"విదేశాలల్లో భారతదేశానికి ఎంత చెడ్డపేరు తెచ్చివుంటావ్?"

"పక్కన శాంత వుండగా తల ఎత్తగలననే మీ ఉద్దేశ్యం!" వాడు ఇంటి కప్పు ఎగిరేలా నవ్వేడు. "శాంతే నా ప్రపంచమోయ్ భగవాన్లూ!"

ఏఁవో ఎవరు చెప్పగలరు—అక్కడ వాళ్ళనుచూసి భయపడి నోరు మూసుకు కూర్చుండేవాడేమో?

"కిటికీ తలుపు వేయమంటావా...



తలవంచుకొని టిఫిన్ తింటావా!" చలపతి విసుగ్గా అడిగాడు.

''నీలూ...చట్నీ కావాలి!'' రామం పెద్దగా అరిచాడు.

''వచ్చే!'' లోపలినుంచి నీలూ సమాధానం.

"చెప్పరా రామం?...ఎలా వున్నది వుద్యోగం...ఎలా వున్నది నీ జీవితం ...ఎలా వున్నది నీ విదేశీ బ్రతుకు?" నేను మాట మారుస్తున్నట్లుగా అన్నాను.

రామం ఫక్కున నవ్వాడు! ''ఈ ఇడ్లీలో ఇప్పుడు నీలూ వేయబోయే చట్నీలా నేనూ ఆ దేశం కలిసిపోయాం ...ఐ లైక్ దట్ కంట్రీ! ఓ కమాన్ నీలూ...నీ ప్లేటిక్కడ...నీవూ ఇక్కడ కూర్చోగూడదూ!"

"అరేయ్! అది ఇక్కడ మనతో మాటలు చెబుతూ కూర్చుంటే...అక్కడ వంటయింట్లో పని ఎలా అవుతుందిరా!"

''సుభద్ర పోయింతరువాత మళ్ళీ నీవు వివాహం ఎందుకు చేసుకోలేదు...? రామం చటుక్కున అడిగాడు ముందుకు వంగి. "నాకేం నచ్చలేదు...ఎంజాయ్ ది లైఫ్ బాబూ!"

చట్నీ వేస్తున్నదల్లా, నీలూ పరుగిడుతున్నట్లుగా ఆ హాల్లోంచి వెళ్ళిపోయింది.

''డ్రాపిట్ డియర్ రామం!" దిగులుగా, సర్వం పోగొట్టుకున్నవాడిలా నిస్సహాయంగా అన్నాడు చలపతి.

''నీలూ...కమ్ హియర్...ఎందుకు వెళ్ళిపోయావ్...నేయి కావాలి!" రామం

ఆరుపు. "ఈ యింట్లో సుభద్ర లేక పోవడం పెద్ద వెలితేరా చలపతీ!"

"నీలూ ముందు—" నీలూ కెర్టన్ తొలగించుకొని బయటకు వస్తుంటే చలపతి కళ్లల్లో తిరుగుతున్న నీటిని,కళ్ళ జోడు తీసి తుడుచుకున్నాడు.

"సారీ ... వెరీసారీ...! గొణుగు తున్నట్లుగా అన్నాడు రామం. "నీలూ ...ఈరోజు స్పెషల్ ఏమిటి—దగ్గరకు రావాలి...నీకా బాబ్ చేయించిదెవరు? — మీ నాన్నేనా?...వట్టి పూల్... పొడుగాటి నీవు పొడుగ్గా జడవేసుకుంటే ఎంత బాగుంటుంది...నో నో..." చిరాగ్గా చలపతి ముఖంలోకి చూశాడు.

చలపతి పేలవంగా నవ్వాడు.

"చిన్నప్పుడు నిన్ను ఎత్తుకు మోశాను తెలుసా...ఆఫీసవుతూనే నీ కోసమే వచ్చేవాడిని ఇంటికి...నీవు మరీ పెద్దయిపోయావుగానీ లేకపోతే ఇప్పుడూ ఎత్తుకునే వాడినే!'' పగలబడి నవ్వు తున్నాడు రామం.

నీలవేణి బుగ్గలు అతడి మాటలకు సిగ్గుతో ఎర్రబడినయి.

చలపతి చిత్రంగా రామం ముఖం లోకి చూస్తున్నాడు.

"అంకుల్...కాఫీ!''

కాఫీ అందిస్తున్న నీలూ గులాబీరంగు చేతిని చేతిలోకి తీసుకుంటూ, "నీలూ ...ఐ లైక్ యూ..." అంటూనే ఆ చేతిమీద ముద్దుపెట్టుకున్నాడు రామం. "నీలూదంతా సుభద్ర పోలికే గదూ చలపతీ!"

నీలూ తుర్రున వంటయింట్లోకి పారిపోయింది.

* * *

గడియారం పదకొండుగంటలు కొట్టింది.

"అయ్యో మాష్టారూ! మనం చేయా ల్సిన పని ఏమిటి ఇప్పుడు...'' చల పతి ఆవులిస్తూ బెడ్ మీదనుంచి లేచాడు —పక్కనే పడుకున్న రామం ముఖం లోకి ఆత్మీయంగా చూస్తున్నాడు.

"నీలూ...'' రామం పెద్దగా కేక వేశాడు.

"ఏం కావాలి?'' చలపతి అడిగాడు. "ఏమైనా యివ్వమంటావా?"

"ఏం అక్కర్లేదు...నీలూ నా ఎదు రుగ్గా కూర్చొని కబుర్లు చెబుతుంటే చాలు!" అన్నాడు కళ్ళు మెరుస్తుండగా.

క్షణం చలపతి విసురుగా రామం ముఖంలోకి చూశాడు.

నేను గమనిస్తూనే వున్నాను— సగంకళ్లు మూసుకుపడుకొని ఇదంతా!

"ఓయ్...నీలూ!"

చలపతికి ఏం మాట్లాడాలో అర్థం కావడంలేదు.

చలపతిని నేను అర్థంచేసుకుంటు న్నాను.

సాత్వికులు ఎప్పుడూ అంతే—ఏ విషయాన్నీ గుటుక్కున మ్రింగనూ

లేరు — బయటకు వెళ్ళగ్రక్కనూ లేరు...

రామం గుణమూ తెలుసూ—అంద మయిన ఆడపిల్లలు ఎదురుగా కూర్చుంటే వాడికి అన్నం సీళ్ళూ అక్కర్లేదు...వాడికి సిగ్గూ, భిడియం లేవు...

సీలూను పదే పదే పిలుస్తున్నాడూ అంటే—?

—అలాంటి వాడి ఆలోచన నిజమే నేమో అనిపించినప్పుడు నాకు అసహ్యమే కలిగించింది...వికారం కలి గించింది.

అయినా—

వాడిలో ఆ ఉద్దేశ్యం ఉన్నదా అని?...

నలభై దాటినయి. చెంపలునెరిసినయి. ముఖంలో వయస్సు వచ్చినట్లుగా ముడ తలూ పడుతున్నయి...

ఊహూఁ...అవన్నీ వదిలేసినా—

సీలూ ఎవరు?

తన మిత్రుడి కూతురు...

తన ఆత్మీయుడి కూతురు!

—తను ఎవరితో అయితే రెండు రోజులు సర్వం మరిచి ఆనందంగా గతాన్నంతా నెమరువేసుకుంటూ గడపా లనుకుంటున్నాడో అతడి కూతురు...

ఆ అమ్మాయిని గూడా ఆ రాస్కెల్ ఆ దృష్టితోటే చూస్తున్నాడా?

ఛ! ఛ!

అదే గనుక నిజమయినట్లయితే చలపతికే గాదు—నాకూ భరించరాని విషయమే!

"వడ్డన రెడీ!" సీలూ వచ్చింది.

"అరేయ్ చలపతీ!...సీలూకు ఆ రింగులు బాగోలేదురా...వెడల్పాంటి రవ్వల దిద్దులు చేయించు...చక్కగా లక్ష్మీదేవిలా వుంటుంది!" రామం సీలూ ముఖంలోకే కళ్లార్పకుండా చూస్తూ అన్నాడు.

చలపతి ఏద్వలేక నవ్వినట్లుగా నవ్వాడు.

ముగ్గురం భోజనాలముందు కూర్చు న్నాం.

సీలూ వడ్డిస్తోంది. అది కావాలీ, ఇది కావాలీ అంటూ సీలూను పదే పదే పిలుస్తూ అమె కళ్ళల్లోకే నవ్వులు చిలక రిస్తూ భోజనం చేస్తున్నాడు రామం.

నిజమే–పది సంవత్సరాల క్రితం సీలూ చిన్నపిల్ల అవ్వవచ్చు—కానీ, ఈనాడు వయస్సువచ్చి, ఒడ్డులు వరుసు కుంటూ నిండుగా పారే సెలయేరులా వున్నది...

కొన్ని పరిధుల్లో వుంచవలసిన వయస్సు...

మూడుగంటలప్పుడు ముగ్గురం రోడ్డు మీదకు బయల్దేరాం.

సీలూనుగూడా రమ్మన్నాడు రామం.

సీలూ రానన్నది.

చలపతీ వద్దని చెప్పాడు.

–ఆ క్షణాన రామం కళ్లల్లో ఎంత

నిరాశ కనబడిందో, చలపతి కళ్లల్లో అంత కోపమూ కనబడింది నాకు.

రామం నసుక్కుంటూ బయటకు వచ్చి కారెక్కాడు.

కారులోకూర్చున్నతరువాత "రుక్మిణి ఎక్కడ వున్నది ఇప్పుడు?" రామం అడిగాడు.

"ఢిల్లీలో వున్నదనుకుంటాను ... భర్త సెంట్రల్ సెక్రటేరియట్‌లో వున్నాడు!"

"శారద...ఇక్కడే...హెవీ ఎల్రక్టికల్స్!"

''రాగిణి?"

"రాగిణా?...ఆ మధ్య ఎగ్జిబిషన్‌లో కాబోలు కనబడి చెప్పింది...భర్తకు డైవర్స్‌కు ప్రయత్నిస్తున్నదట!"

''అదేం?" ఉత్సుకతతో ముందుకు వంగాడు రామం.

''పాత గాథలన్నీ బయటపడివుండ వచ్చు!" నేనూ ఎగతాళిగా నవ్వుతూ వెనక్కు జారిగిలబడ్డాను.

"నిర్మల?"

"అరేయ్ రామిగా! ... శారద, వకుళ, పద్మ, ఖర్మ...అంతా వాళ్ళ వాళ్ళ మొగుళ్ళతో కాపురాలు చేసు కుంటూ, కలో కంజో త్రాగుతూ సుఖంగా బ్రతుకుతున్నారు ... వాళ్ళ గురించి మర్చిపో...పెళ్ళయిపోయిన మరుక్షణంలోనే వాళ్లూ నిన్ను మర్చి పోయి వుంటారు!" అన్నాడు చలపతి విసుగ్గా.

రామం తేలిగ్గా నవ్వేశాడు.

"నాకు అందుకేరా చలపతిగాడిని చూస్తే కోపం...వాడు జీవితాన్ని అనుభవించలేడు...మరొకరిని అనుభ వించనీయడు!"

"ఇలాగేనా?" విసురుగా అడిగాడు చలపతి.

-తన కూతురి వెంటబడి తిరిగే రామం అంటే చలపతికి అరికాలి మంట నెత్తికెక్కుతున్నది.

దాన్ని వెళ్లగ్రక్కటానికే అవకాశం కోసరం ఎదురుచూస్తున్నాడు వాడు.

''నీవు ఏమైనా అనుకోరా చలపతీ! నా చేతికొచ్చిన అవకాశాన్ని నేను ఎన్నడూ జారవిడుచుకోను...అంతే గాదు, అది మరొకరికి కష్టం కలిగించ నీయ్...నష్టం కలిగించనీయ్...నా ఆనందమే నాది!" అన్నాడు నొక్కి పలుకుతూ స్పష్టంగా రామం.

మా మధ్య ఓ జుగుప్సాకరమైన నిశ్శబ్దం తెరలు తెరలుగా జారిపడింది.

తరువాత పదినిముషాలకు బాంబే బజారుముందు అందర్నీ కారులోనుంచి దింపాడు రామం.

ముగ్గురం లోపలికి వెళ్లాం.

అద్దాల నడుమ...రంగుల తెరల మీదగా...అదో ప్రపంచం...

రామం పురమాయిస్తున్నాడు ...

కుర్రవాడు మా ముందు కుప్పలు కుప్ప లుగా బుట్టలతో మంచుకుమ్మరిస్తున్న ట్లుగా గుడ్డలు కుమ్మరిస్తున్నాడు.

"ఎన్ని కౌంటావ్ శాంతకి?" చలపతి రామం ప్యాక్ చేయిస్తున్న తీరు చూస్తూ అడిగాడు.

"కొనగల్గినన్ని!" కళ్లు చికిలించి నవ్వాడు రామం.

నాకు అనిపించింది——శాంతంటే ఈ వెధవకి ప్రేమకంటే భయంజా స్తీ-అని!

ఏ గుర్రాన్నయినా కళ్లాలులేకుండా ఆపటం మహాకష్టం!

ముగ్గురం బయటపడేటప్పటికి వాడి బిల్లు పదివందలు దాటనేదాటింది.

"తరువాత?"

"బార్—"

"ఇప్పుడా?"

"ఇండియాకువచ్చి నేను ఎంత సేపయిందో తెలుసా?...నేను పక్కా త్రాగుబోతుని!" ఫక్కున నవ్వాడు రామం.

"తిరుగుబోతువి మాత్రం కాదేమిటి?" కసిగా అన్నాడు చలపతి.

నాకు అనిపించింది — చలపతిలో రామం రాకముందున్నంత ఆప్యాయత వాడు వచ్చింతరవాత లేదేమోనని!

అందులో సందేహించవల్సిందేమీ లేదు.

అందుకు కారణం స్పష్టంగా కనబడు తుండగా—

"సీలూ... సీలూ ... సీలూ ..." అంటూ వాడు తిరగటమే...

వెనక సీట్లో కూర్చొని నేను-డ్రైవ్ చేస్తున్న చలపతిని-కళ్లు చించుకొని రోడ్ల పక్కన అందమైన ఆడవాళ్ళు కనబడ తారేమోనని ఆవురావురుమంటూ చూస్తు న్నట్లుగా చూస్తున్న రామాన్ని-చూస్తు న్నాను.

ఎవరినిచూచి జాలిపడాలి నేను.

భగవంతుడా! మనుష్యుల్ని బలహీన తలకు ఎందుకు అంతగా దాసోహం చేస్తావ్?...

దేవుడూ! నిన్ను మన్నించలేను నేను...ఈలాంటి మనుష్యులను మార్చ గలిగినవాడే దేవుడు...

బారులో గ్లాసుల చప్పుళ్లనడుమ బీరు మాత్రమే పుచ్చుకొని బయటపడ్డాం ముగ్గురం...

రామం వాగుతున్నాడు-కాడ్రాలో తన కొలీగ్, లేడీ ఫ్రెండ్ స్టెల్లాను గురించి...తనంటే పడిచచ్చిందిట అది!

ఏ క్షణాన తను 'ఊc' అంటే ఆ క్షణాననే ఆ పక్షి మొగుడికి విడాకులు గూడా ఇచ్చేస్తుందిట!

"కానీ..." వాడు నవ్వుతూ అన్నాడు. "శాంత ఇండియానుంచి వస్తూ వస్తూ ఓ కంట్రీ చీపురుకట్ట తన సూట్ కేసులో భద్రంగా పెట్టి తెచ్చుకున్న దని నాకు అక్కడకు వెళ్ళేటంతవరకూ తెలియదు!"

ఆ మాట అంటూ వాడు నవ్వే తుంటే, మాకూ నవ్వాగలేదు.

యింటికి వచ్చేటప్పటికి రాత్రి తొమ్మిదిగంటలయింది.

"సీలా..." మెట్లమీదనుండే అరి చాడు రామం.

చలపతి ఏదో విసుతుగా అనబో యాడు.

నేనే భుజంమీద చేయివేసి నొక్కాను "శాంతించు" అన్నట్లుగా.

నాకు చలపతిని చూస్తే సానుభూతే కలుగుతోంది.

కాని చాలా యిరకాటమైన పరిస్థితి.

ముగ్గురం హాల్లోకి వెళ్లేటప్పటికి కెర్టెన్ సగం పక్కకునెట్టి తలుపుదగ్గరే నిలబడివున్నది సీలా.

"యా ... సీలా ... ఇవి ఎలా వున్నయ్యో చూడు...కమాన్...నీ కోసమే తెచ్చాను!"

చేతిలో ప్యాకెట్లన్నీ సోఫాలో పడే శాడు.

"రామం!" చలపతి పెద్దగా అరి చాడు—కోపాన్ని నిగ్రహించుకోలేక పోతున్నట్లుగా.

నేను వడివడిగా ముందుకు అడుగులు వేశాను. రామం చేయి పట్టుకుంటూ, "ముందుగా చెప్పలేదేం ... చలపతికి ప్రజంటేషన్స్ అంటే గిట్టవని నీకు తెలియదూ!" అన్నాను...అలా అంటూ న్నప్పుడు నా గొంతు తడబడింది.

చలపతి అప్పటికే మెట్లెక్కి—తనని తాను నిగ్రహించుకోవటానికే అన్నట్లుగా పైకివెళ్ళిపోయాడు

సీలా నిలబడివున్నచోట కర్టెన్ ఊగుతున్నట్లుగా కనబడింది.

"ఐ లైక్ హర్...ఐ లైక్ హర్ మాన్!" నసుగుతున్నట్లుగా అన్నాడు రామం చిన్నగా...నీరసంగా తను తెచ్చిన చీరల ప్యాకెట్లవంకే చూస్తూ నిల్చున్నాడు.

వాడిని పట్టుకొని బెడ్‌రూంలోకి తీసుకువెళ్ళాను.

— చివాట్లు పెడదామనిపించింది.

— మహావుంటే ఇంకో ఇరవై నాలుగు గంటలు మా మధ్య వుండవచ్చు...అటు వంటివాడి మనస్సును కష్టపెట్టటం భావ్యమా?...

కానీ వాడు వట్టి వెధవే!

మధ్యలో నేను నీటిబయటపడ్డ చేపలా గిలగిలలాడక తప్పటంలేదు...

మౌనంగా యిద్దరం ఒకళ్ల ముఖం లోకి ఒకళ్ళం చూసుకుంటూ కూర్చున్నాం.

"కమాన్ పండ్లూ—భోజనం చేసే ద్దాం!" అంటూ నవ్వుకుంటూ పైనుంచి వచ్చాడు చలపతి.

అంటే—వాడికీ నాలాగే కొద్ది గంటలలో వెళ్ళిపోబోయే రామం ప్రవ ర్తనను గురించి పట్టించుకోవటం, బాధ పడటం—మనస్కరించలేదన్నమాట ...



గుడ్ స్పిరిట్...

నన్ను చలపతిమీద జాలి సంపూర్ణంగా ఆవరించింది.

భోజనాల టేబుల్ ముందు చలపతే అన్నాడు: "అవన్నీ శాంతకు తీసుకు వెళ్ళు...చాలా బాగున్నాయి గూడా!"

"నేను తీసుకు వెళ్ళినా శాంతకు నచ్చాలని ఎక్కడున్నది!" ఫక్కున నవ్వాడు రామం.

"నీవు శాంతకోసమే గదా వాటిని కొన్నది!"

"కాదు—నీలూ కోసమే!" నొక్కి చెప్పాడు రామం. "అప్పుడే చెబితే అసలు కొననీయవేమోనని అబద్ధమాడాను!"

—ఆ రాత్రి వాళ్ళ నడుమే పడుకున్నానుగాని—నాకు నిద్రపట్టలేదు... చలపతీ నిద్రపోయివుంటాడని నేను అనుకోను!

* * *

మరునాడు మధ్యాహ్నం గోల్కొండలో రామం వెళతానన్నప్పుడు చలపతి ఏమీ అడ్డుచెప్పకపోవటంలోని అంతర్యం నాకు అవగతమైపోయింది!

నిజమే... అంతకుమించి చలపతి చేయగలిగిందేమీలేదు.

రామం తన ప్రయాణం సంగతి చెబుతూ, "నీలూ...రెడీ అవ్వాలి త్వరగా!" అన్నాడు.

"దేనికి?" చలపతి కళ్ళు పెద్దవి చేసుకు చూస్తూ అడిగాడు.

"కొద్దిగా షాపింగ్ వున్నది... యిద్దరం కలిసి వెళ్ళివస్తాం!"

"నాన్సెన్స్ ... అలా వెళ్లటానికి వీల్లేదు!"

రామం గమనించాడో లేదోగాని నేను మాత్రం కనిపెట్టేశాను-చలపతి ముక్కు పుటాలు కోపంతో ఎగిరిపడుతున్నాయి.

"నీలూ—నీవు లోపలికి వెళ్లు!" అన్నాడు కసురుకుంటున్నట్లుగా చలపతి. "అదన్నమాట రామం!...నీవు హైద్రాబాద్ వచ్చిన కారణం...సాయంత్రందాకా వుంటానన్నవాడివి...మధ్యాహ్నానికే వెళ్ళిపోతానంటావా...అంతేగాకుండా...ఆ మధ్యాహ్నందాకా గూడా మా మధ్య వుండకుండా-నీ కోసం సెలవుపెట్టి మేంపడి ఏడుస్తుంటే-దాన్ని వేసుకొని రోడ్లవెంట తిరుగుతానంటావా ...సిగ్గులేదటరా నీకు!" వాడు కోపాన్ని నిగ్రహించుకొని, అసలు విషయాన్ని ట్విస్ట్‌చేసి రామాన్ని చివాట్లుపెట్ట ప్రయత్నిస్తున్నాడూ అంటే-చలపతిమీద నాకు గౌరవమే పెరిగింది.

"నీవు కదలటానికి వీల్లేదు...పద నా గదిలోనే కూర్చుందాం...కదిలావో కాళ్ళు విరగ్గొడతాను...మన ముగ్గురమే కూర్చోవాలి...మన ముగ్గురిమాటలే మన మధ్యనడవాలి...మరొకరు రావడంకాని, వారి ప్రసక్తి తీసుకురావడంగాని నేను సహించలేను...మళ్ళీ ఎన్ని సంవత్సరాలకో మన కలయిక...వీల్లేదురా పండూ ... ఈ కొద్దిగంటలయినా మనకు మరువలేని క్షణాలుగా చేయి!" వాడు ఆవేశపడుతున్నాడు.

—వాడి ఆ ఆవేశం వెనుక వున్న ఆదుర్దా, కోపం, నిగ్రహం-నాకు కళ్లకు కట్టినట్లే కనబడుతున్నాయి!

* * *

గోల్కొండకు ఇంకొక అరగంట టైం వున్నదనగా ముగ్గురం కార్లో బయల్దేరాం.

చలపతికి రామం రాక మనశ్శాంతినే కరువుచేసిందనటంలో అబద్ధమేమీలేదు.

నాకూ వాడి ప్రవర్తన అసహ్యాన్నే కలిగించింది.

రామం మా మధ్య లేనప్పుడు చలపతి చాలా బాధపడుతూ ఆ విషయం నాముందు ఎత్తాడుగూడా.

నేను వాడు చెప్పిందంతా మౌనంగా విని చివరికి అన్నాను. "నీవు త్వరబడి ఏమీ అనబోకు...నేనే వెళ్ళేలోగా అవకాశం చూసుకొని ఆ నాలుగు చివాట్లూ పెట్టేస్తాను!"

"పోనీయ్ లేరా...ఎవరి పాపం వాడిదే...ఈ జీవితంలో వాడిని మరో సారి కలుస్తామోలేదో...నాలుగు మాటలు

అని వాడి మనస్సు కష్టపెట్టినందుకు జీవితాంతం నేనూ...నేను బాధపడ్డానని తెలిసీ వాడూ బాధపడటం దేనికి...నన్ను ఒక్కడినే బాధపడనీయ్ ఈ విష యంలో!''

వాడి మాటలకు నాకు జాలివేసింది. అదే రామంమీద కోపాన్నీ ఇనుమడింప చేసింది.

రైల్లో కిటికీ పక్కగా వాడు కూర్చు న్నాడు. మేం ప్లాట్‌ఫారంమీద నిలు చున్నాం.

ప్లాట్‌ఫారం అంతా పెళ్ళిఇల్లులా హడావుడిగా వున్నది.

"చలపతీ ఏమైనా పుస్తకం కొనుక్కు రారా! ప్రయాణంలో వాడికి కాలక్షే పంగా వుంటుంది!'' అన్నాను వాడిని మా మధ్యనుంచి పంపే ఉద్దేశ్యంతో.

చలపతి అటు తిరగ్గానే రామం పేల వంగా నవ్వుతూ, "సరే కానీయ్...ఇక నీవు నన్ను తిడతావన్నమాట!" అన్నాడు.

నేను ఉలిక్కిపడ్డాను–వాడు నన్ను చదివేస్తున్నాడా?

"తిట్టేందుకు పెద్ద ఏమున్నదిగాని ...'' సర్దుకోసాగాను.

"మీకు తెలిసిన నాలోని బలహీనతే నామీద అసహ్యాన్ని మీకు కలిగిస్తోంది– అవునా?" అన్నాడు.

ఆ క్షణాన వాడు – ముఖమంతా పీక్కుపోగా ముసలివా డయినట్లే కనబడుతున్నాడు.

నేను చెప్పదలుచుకున్నదేదో సూటిగా అలస్యంచేయకుండా చెబుదామన్నట్లుగా నోరు తెరవబోతుండగానే, రామం, "సీ వేం చెప్పనక్కరలేదురా...చలపతి బాధా, నీ బాధాగూడా నాకు తెలుసు...అయినా ...అయినా..." తల అంటూ లోపల బాధను ఇముడ్చుకోలేకపోతున్నట్లుగా ఊపసాగాడు.

ఏదో తెలియని ఆవేశం వాడి శరీ రాన్ని ఊపేస్తోంది.

నా చేతిని వాడిచేతిలో బిగించివేశాడు.

"అరేయ్ సత్యం! నీలా తల్లి ఎవర్రా?" అన్నాడు–నా కళ్ళల్లోకే కన్నార్పకుండా చూస్తూ.

అర్థంలేని ప్రశ్న!

"సుభద్ర!"

"అయితే, నేను నీలా తండ్రినిరా, చిన్నా!"

ఆ క్షణాన అతడి కళ్లు చమరుస్తు న్నాయి.









[గత సంచిక తరువాయి)

## 3

మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి కథ చెప్పనారంభించింది.

మూర్ జూదర్‌తో ఇలా అన్నాడు:

"నేను మంత్రాలు చదువుతూ పోతూంటే నది నీరు క్రమంగా క్షీణించి, చివరకు పూర్తిగా ఇగిరిపోతుంది. అప్పుడు నీకు నదిగట్టులో ఒక బంగారు తలుపు కనబడుతుంది. అది నగరద్వారమంత ఎత్తుంటుంది. దాని తలుపులు రెండు వలయాలు, ఒకే లోహంతో చేసినవి, ఉంటాయి. నువు ఆ తలుపు వద్దకువెళ్ళి, ఒక వలయాన్ని నింపాదిగా తట్టి, క్షణంసేపు వేచిచూడు. తరవాత మరింతగట్టిగా తట్టి, మళ్ళీ క్షణం ఆగు. నువు వలయాన్ని మూడోసారి తట్టిన మీదట లోపలినుంచి ఒక గొంతు ఇలా అంటుంది: 'మంత్ర విప్పడం తెలియకుండానే నిధి తలుపు తట్టేది ఎవరు?' దానికి సమాధానంగా, 'నా పేరు జూదర్. కైరోకు చెందిన బెస్తవాణ్ణి. ఉమర్ కొడుకును,' అనిసమాధానంచెప్పు.

"అప్పుడు తలుపు తెరుచుకుని, ద్వారంలో ఒక మనిషి కనిపిస్తాడు. అతడి చేతిలో ఒక ఖడ్గం ఉంటుంది. ఆ మనిషి నీతో, 'నువు నిజంగా అతడివే అయితే, నీ మెడ చాచి, నీ తల నరకనియ్యి,' అంటాడు. నువు నిర్భయంగా మెడ చాచాలి. అలా చేస్తే ఆ మనిషి నీ తల నరకటానికి కత్తి ఎత్తే క్షణంలోనే నీ కాళ్ళదగ్గిరపడి చచ్చిపోతాడు. నీకు ఏ అపాయమూ కలగదు. అలాకాక నువు భయపడి మెడ చాచకపోయావో వాడు తప్పక నిన్ను చంపేస్తాడు.

"ఆ విధంగా మొదటి మాయను విరుగుడుచేసి, నువు లోపలికివెళ్ళి,

అక్కడ నీకు రెండోద్వారం కనిపిస్తుంది. నువు దాని తలుపుమీద ఒక్కసారే గట్టిగా తట్టు. వెంటనే గదపవద్ద ఒక మనిషి పొడుగుపాటి ఈటె పట్టుకుని ప్రత్యక్షమై, "మనుషులుగాని, యక్షులుగాని ప్రవేశించరాని ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని అడుగుతాడు. నువు ధైర్యంగా వాడి ఈటె ములికికి నీ రొమ్ము చూపించు. నీకేమీ అపాయం కలగదుగాని, వాడు చచ్చిపడిపోతాడు. అలాకాక, భయపడి వెనకడుగు వేశావో వాడు నిన్ను చంపేస్తాడు

"తరవాత నువు మూడో ద్వారం వద్దకు వస్తావు. అక్కడ ఒక విలుకాడు బాణం ఎక్కుపెట్టి, నీకు గురిచేస్తాడు. నువు ధైర్యంగా వాడికి రొమ్ము చూపించి, ముందుకు వెళ్ళు. వాడు చచ్చిపడిపోతాడు. నువు తటపటాయించావో వాడు నిన్ను చంపేస్తాడు.

"నాలుగో ద్వారంవద్ద ఒక భయంకరమైన సింహం, నిన్ను తినేలాగా నోరు తెరుచుకుని, నీపై దూకుతుంది. దాని నోట్లో నువు చెయ్యి దూర్చావంటే అది నీకు ఎలాటి అపాయమూ కలిగించకుండానే చచ్చిపడిపోతుంది.

"అయిదో ద్వారం తలుపు ఒక నీగ్రో తెరిచి, నీ పేరు అడుగుతాడు. నువు నీ పేరు చెప్పినమీదట వాడు, 'నువు అతడివే అయితే ఆరో ద్వారం తెరవటానికి ప్రయత్నించు,' అంటాడు. ఆరోద్వారం వద్దకు వెళ్ళి నువు, 'ఓ యేసూ మోజెస్‌ను తలుపు తెరవమని ఆజ్ఞాపించు!' అని కేక పెట్టు."

"వెంటనే ఆరోద్వారం తలుపు తెరుచుకుని రెండు మహా సర్పాలు, కుడి ఎడమలనుంచి, నోళ్లు తెరుచుకుని నీకేసి వస్తాయి. అవి నిన్ను కాటువేసేలోగా వాటిని నీ రెండు చేతులతోనూ తాకు. అవి శక్తి ఉడిగి నీకాళ్ళముందు పొర్లాడుతాయి. నువ్వు భయపడ్డావో, నిశ్చయంగా చస్తావు

"తరవాత ఏడో తలుపు తట్టు. నీ తల్లి తలుపుతెరిచి, 'రా, నాయనా, రా!' అంటూ నిన్ను దగ్గరికి పిలుస్తుంది. అప్పుడు నువు, 'అక్కడే ఉండు! నీ బట్టలు విప్పెయ్యి!' అనాలి. 'నీకు పాలిచ్చి పెంచిన తల్లిని కాదట్రా, నాయనా? నన్ను దిగంబరి కమ్మంటావుట్రా?' అంటుంది. 'నువు బట్టలు విప్పకపోయావో నిన్ను చంపేస్తాను,' అని కసురుకో. అలా అంటూ కుడిచేతి వైపు గోడకు వేళ్ళాడే కత్తి తీసుకుని ఆమెను తొందరపెట్టు. ఆవిడ నీలో జాలి ప్రేరేపించటానికి ప్రయత్నిస్తుంది. ఆమె ఒక్కొక్క ఉడుపే తీసేటప్పుడు, నువు కత్తి ఝళిపిస్తూ, 'మిగిలినవికూడా విప్పు!' అని భయపెట్టు. అన్ని బట్టలూ విప్పేసిన మరుక్షణం ఆమె అంతర్ధానమవుతుంది.

"అప్పటికి అన్ని మాయలూ విడి

పోతాయి. నీకు ఎలాటి ప్రమాదమూ కలగదు. నీ శ్రమకు ఫలితం నీ చేతికి అందుబాటులోకి వస్తుంది. అప్పుడు నువు చెయ్యవలసిందేమంటే, ఏడో గడప దాటి చావడిలోకి అడుగుపెట్టు. దాని నిండా బంగారు అచ్చులుంటాయి. నువు వాటిని పట్టించుకోకుండా చావడి మధ్యకు వెళ్లు. అక్కడ ఒక మండపానికి అడ్డంగా తెరకట్టి ఉంటుంది. ఆ తెర పైకెత్తావంటే మహామాంత్రికుడు అల్ షమర్దల్ ఒక బంగారు శయ్యమీద నిద్రిస్తూ కనిపిస్తాడు. ఆయన తలవద్ద గుంభ్రంగా చంద్రుడిలా మెరుస్తూ ఒక వస్తువు కనిపిస్తుంది ఆదే ఖగోళం. ఖడ్గం ఆయన నడుమునుచుట్టి ఉంటుంది. ముద్రిక ఆయన వేలికి ఉంటుంది. కాటుక డబ్బీ బంగారు గొలుసుకుకట్టి ఆయన మెడలో ఉంటుంది ఏ మాత్రమూ సంకోచించకుండా ఆ నాలుగు వస్తువులూ తీసుకుని, నా వద్దకు వచ్చెయ్యి. నేను చెప్పిన విషయాలన్నీ జ్ఞాపకం ఉంచుకుని, అలాగే చెయ్యి. నీ బుర్రగాని, ధైర్యంగాని సడలిందో తరవాత చేసేది ఏమీ ఉండదు."

మూర్ ఈ పాఠాన్ని జూదర్‌కు ఒకటికి మూడుసార్లు మళ్ళీ మళ్ళీ చెప్పాడు.

చివరకు జూదర్, "అంతా నాకు తలకెక్కింది. కాని మీరు చెప్పే భయంకర శక్తులను మానవమాత్రుడు ఎదుర్కోగలడా?" అన్నాడు.

"భయంలేదు, జూదర్. ద్వారాలను కాపాడేవి కేవలమూ మాయారూపాలు. వాటిని గురించి నువు నిశ్చింతగా ఉండవచ్చు," అన్నాడు మూర్.

"అన్నిటికీ అల్లానే నమ్ముకున్నాను" అన్నాడు జూదర్.

మూర్ నిప్పులమీద మరింత గుగ్గిలం వేసి మంత్రోచ్చాటన ప్రారంభించాడు. క్రమంగా నదిలో నీరు ఇంకిపోసాగింది. నీరంతా ఇగిరిపోయినాక బంగారుద్వారం బయటపడింది. జూదర్ ధైర్యంగా దాని వద్దకు వెళ్ళి తలుపు తట్టాడు. అన్ని ద్వారాలవద్దా మూర్ చెప్పినట్టే జరిగింది; మూర్ చెయ్యమన్నట్టే జూదర్ చేశాడు.

ఏడో ద్వారం తెరిచిన స్త్రీని జూదర్, "ఎవరు నువు?" అని అడిగాడు.

"నీ తల్లినిరా, నాయనా. నిన్ను తొమ్మిదినెలలుమోసి కని, నీకు పాలిచ్చి, పెంచి పెద్దవాణ్ణి చేశాను," అన్నదామె.

"నీ బట్టలు విప్పెయ్యి!" అని జూదర్ అరిచాడు.

"తల్లిని బట్టలు విప్పమని కొడుకు ఎక్కడైనా అడుగుతాడురా?" అన్నదామె.

"విప్పు!" అంటూ జూదర్ గోడనుంచి ఖడ్గంతీసి, "విప్పకపోయావో నీ ప్రాణం తీస్తాను," అన్నాడు.

ఆమె ఒక్కొక్క ఉడుపే తీసే



స్తూంటే, అతను "ఊః ఊః" అని తొందర చేశాడు.

"నా కడుపున చెడబుట్టావు గదరా! దిగంబరిగా తల్లిని చూడటం మహా పాతకం కాదుట్రా!" అన్నదామె.

"నిజమే. పోనీ నీ చెడ్డీ విప్పకులే," అన్నాడు జూదర్.

వెంటనే ఆమె, "జంకాడు! కొట్టండి! కొట్టండి!" అని అరిచింది.

ఎవరో అదృశ్యవ్యక్తులు అతన్ని చచ్చేటట్టు కొట్టి, అన్ని ద్వారాల కుండాను బయటికి తరిమేశారు. అతని వెనక ఆఖరుద్వారం కూడా మూసుకుని, అతను వచ్చిన నదిలో పడ్డాడు. అప్పటికే నదిలో నీరు పొంగుతున్నది. మూర్ అతన్ని నదిలోంచి పైకితీసేసరికి జూదర్ మూర్ఛలో ఉన్నాడు.

మూర్ కొరాన్ పఠించి, జూదర్‌కు స్పృహరాగానే, "అయ్యయ్యో, ఏం చేశావు?" అని అడిగాడు.

"అన్ని అవాంతరాలూ దాటాను. మా అమ్మ చెడ్డీమూలంగా సాధించిన దంతా బూడిద పాలయింది. చావు దెబ్బలు తిన్నాను. దాన్ని జన్మలో మరవలేను," అన్నాడు జూదర్.

"నేను చెప్పినట్టు చెయ్యకపోతే ప్రమాదమని ముందే హెచ్చరించానే! ఆమెను చెడ్డీ ఉంచుకోనిచ్చి, నాకు ద్రోహం చేశావు, నీకూ ద్రోహం చేసుకున్నావు. ఈ యేటికి ఇంక చేసేదేమీ లేదు. మళ్ళీ వచ్చేయేడు ప్రయత్నించాలి. అంతదాకా నువు నా వెంటనే ఉండు," అన్నాడు మూర్.

అతను ఏదో అనగానే ఇద్దరు నీగ్రోలు ప్రత్యక్షమై, గుడారంవిప్పి, కంచరగాడిదలను రప్పించారు. వాటిమీద జూదర్, మూర్ ఫెజ్‌నగరం చేరుకున్నారు.

ఒక సంవత్సరంపాటు జూదర్ మూర్‌కు అతిథిగా ఉన్నాడు. ప్రతి ఉదయమూ అతనికి మేలి అంగీ



అందింది, మంత్రపు సంచీనుంచి దివ్య మైన భోజనం లభించింది.

సంవత్సరం గడిచి, నిధిని సంపా దించే తరుణం రాగానే, మూర్ జూద ర్‌ను నగరం బయటికి తీసుకుపోయాడు. అక్కడ వాళ్ళను ఇద్దరు నీగ్రోలు కలి శారు. కంచరగాడిదలు వచ్చాయి వాళ్లు నదివద్దకు వెళ్ళి, గుడారం ఏర్పాటు చేసుకున్నారు. మూర్ ధూపం వెయ్య బోతూ జూదర్‌తో, "నీకొక్క సలహా చెబుతాను?" అన్నాడు.

"అవసరంలేదు, మహాప్రభో! నేను తిన్న చావు దెబ్బలు మరిచిపోతానేమో గాని, మీరు చెప్పినది మాత్రం మర వను," అన్నాడు జూదర్.

"నీకు నిజంగా అంతా జ్ఞాపకం ఉన్నదా, జూదర్? నువేమీ కంగారు పడకు. ఆమె నిజంగా నీతల్లికాదు, నీతల్లి ఆకారం ధరించిన ఒక మాయ. అది కూడా నీకు కీడుకలిగించటానికే! ఈసారి మాత్రం పొరపాటుచేశావో, నీవు ప్రాణా లతో బయటపడవు," అన్నాడు మూర్.

"ఈసారి పొరపాటు చేశానంటే నన్ను నిలువునా దహించినా పాపం ఉండదు," అన్నాడు జూదర్.

మూర్ గుగ్గిలం ధూపంవేసి మంత్రాలు చదవటం ప్రారంభించగానే నదిలో నీరు తగ్గిపోయింది. జూదర్ బంగారు ద్వారం వద్దకు దిగివెళ్ళాడు. అది పూర్వంలాగే తెరుచుకున్నది. జూదర్ ఒక్కొక్క ద్వారాన్నే జయిం చుకుంటూ ఏడోద్వారం చేరి తన తల్లిని చూశాడు. ఆమె అతణ్ణి లోపలికి ఆహ్వా నించింది.

"ముసిలిడొక్కూ నువు నాకు ఏమన్న తల్లివి? గుడ్డలువిప్పు," అన్నాడు జూదర్.

ఆమె అతన్ని మభ్యపెట్టటానికి విశ్వ



ప్రయత్నంచేస్తూ, తన దుస్తులు ఒక్కొక్కటే విప్పి, చివరకు చెడ్డీతో నిలబడింది.

"అదికూడా తీసెయ్యి!" అని జూదర్ అరిచాడు.

అదికూడా విప్పేసి ఆమె అదృశ్యమయింది.

జూదర్ సావడిలోకి ప్రవేశించాడు.

అతను అక్కడ గుట్టలుపోసిఉన్న బంగారు అచ్చులను పట్టించుకోకుండా మండపంవద్దకు వెళ్ళి, తెర పైకి ఎత్తి చూశాడు. మూర్ చెప్పినట్టుగానే అల్ షమర్దల్, నడుముకు ఖడ్గం చుట్టుకుని, వేలికి ముద్రిక పెట్టుకుని, మెడలో బంగారు గొలుసుకు కాటుకడబ్బీ ఉంచుకుని, బంగారు శయ్యమీద శయనించి ఉన్నాడు. ఆయన తలమీద ఎగువగా చంద్రబింబంలాంటి, ప్రకాశవంతమైన ఖగోళం ఉన్నది.

జూదర్ కత్తినీ, ముద్రికనూ, కాటుకడబ్బీనీ, ఖగోళాన్నీ తీసుకుని తిరుగుముఖమైనాడు. అతని విజయానికి ఎక్కడినుంచో మధుర సంగీతం వినిపించింది. ఏవో కంఠాలు, "శభాష్, జూదర్! శభాష్!'' అని అతన్ని మెచ్చుకున్నాయి. అతను తిరిగి నదిలోకి ప్రవేశించినదాకా ఆ ధ్వనులు వినిపిస్తూనే ఉన్నాయి.

అతన్ని వస్తువులతోసహా చూస్తూనే మూర్ ధూపాలూ, మంత్రోచ్చాటనా కట్టిపెట్టి, పరుగెత్తుకుంటూ వచ్చి, జూదర్‌ను గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు. అతను పిలవగానే ఇద్దరు నీగ్రోలూ ప్రత్యక్షమై, గుడారం విప్పేసి, కంచరగాడిదలను తెచ్చారు.



మూర్ జూదర్‌తో కలిసి తన భవనానికి తిరిగివచ్చి, మంత్రపుసంచీనుంచి భోజనంతీసి, తిని, పళ్లాలు సంచీలో పెట్టేసినాక, "జూదర్, నాకోసం నువు నీ స్వస్థలం వదిలివచ్చి, నా పనిపూ రి చేశావు. నేను నీకు ఎంతగా ఋణపడి ఉన్నానో చెప్పటం సాధ్యంకాదు. నువు నీకోరిక తెలిపినట్టయితే, అల్లా దయవల్ల దాన్ని తీర్చుతాను. మొహమాట పడవద్దు. నువు ఎంత కోరటానికైనా తగుదువు," అన్నాడు.

"స్వామీ, అల్లానుంచీ, మీ నుంచీ నాకు కావలసినది ఆ మంత్రవుసంచీ మాత్రమే," అన్నాడు జూదర్.

మూర్ [అబ్దుల్ సమద్] జూదర్‌కు సంచీ ఇస్తూ, "అవశ్యం తీసుకో. కాని నువు ఇంకేది కోరినా ఇచ్చి ఉండేవాణ్ణి. ఈ సంచీ నీకు ఆహార పానీయాలు మాత్రమే ఇవ్వగలదు. నాకోసం నువు కష్టాలుపడి, ఘోరప్రమాదాలను ఎదుర్కొన్నావు. నిన్ను తృప్తిపరచి మీవాళ్ల వద్దకు తిరిగి పంపుతానని మాట ఇచ్చి ఉన్నాను. నిన్ను కేవలం ఆహారసమృద్ధితో వెళ్ళనియ్యలేను. బంగారమూ, రత్నాలూ నించిన ఈ రెండోసంచీకూడా తీసుకుని మీ దేశానికిపోయి, గొప్ప వర్తకుడివై, డబ్బుకు ఎలాటి లోటూలేకుండా నువ్వు సుఖపడి, నీ వాళ్ళనూ సుఖపెట్టు. మంత్రపుసంచీని ఎలాగ ఉపయోగించాలో విను. సంచీలో చెయ్యిపెట్టి, 'సంచీలోని ఖానిసా, మంత్రశక్తుల సహాయంతో ఫలానా వంటకం పట్టుకురా. ఇదే నా ఆజ్ఞ!' అను. తక్షణమే నువు కోరినది సంచీ అడుగున సిద్ధంగా ఉంటుంది," అన్నాడు.

అబ్దుల్ సమద్ పిలిచేసరికి ఒక నీగ్రో,



ఒక కంచరగాడిదా ప్రత్యక్షమయారు. ఆయన కంచరగాడిదమీద ఒక పక్క బంగారం నింపిన సంచీ, మరొక పక్క రత్నాలు నింపిన సంచీ వేసి, వాటిమీద ఖాళీగా ఉన్న మంత్రపుసంచీ పరిచి, జూదర్‌తో, "దీనిమీద ఎక్కు. నీగ్రో ముందు నడుస్తూ మీ ఇంటిదాకా వస్తాడు. ఇల్లు చేరాక సంచులు తీసుకుని, కంచర గాడిదను నీగ్రోకు ఇచ్చెయ్యి. మన రహస్యం మూడోవాడికి తెలియనివ్వకు. క్షేమంగా వెళ్ళిరా," అన్నాడు.

"అల్లా మిమ్మల్ని చల్లగా చూడాలి," అని జూదర్ ఆయనవద్ద సెలవు పుచ్చుకుని, కంచరగాడిదనెక్కి, నీగ్రో వెనక రాగా బయలుదేరాడు.

ఈసారి కంచరగాడిద తన పూర్తి వేగంతో పోతూ, ఆ పగలూ, రాత్రీ ప్రయాణంచేసి, తిరిగి తెల్లవారేసరికి కైరో నగరప్రాకారాలకు కనుచూపుమేర లోకి వచ్చేసింది. జూదర్ విజయద్వారం కుండా నగరం ప్రవేశించి, తన ఇల్లు చేరుకుని, తన తల్లి గుమ్మంలో కూచుని వచ్చేపోయేవాళ్ళను బిచ్చం అడుగుతూ ఉండటం చూశాడు.

ఇది చూడగానే కడుపుమండిపోయి, జూదర్ కంచరగాడిదమీదనుంచి ఉరికి, చేతులు చాచుకుని తల్లివద్దకు వెళ్ళాడు. ఆమె అతన్ని చూడగానే బావురు మన్నది.

అతను కంచరగాడిదమీదినుంచి సంచులు దించి, కంచరగాడిదను నీగ్రో పరంచేసి, తల్లిని ఇంట్లోకి నడిపించుకు వచ్చి, చాపమీద కూర్చోబెట్టి, "అమ్మా, అన్నలు ఎలా ఉన్నారు?" అని అడిగాడు.

"బాగానే ఉన్నారు," అన్నది తల్లి.

"మరి నువు వీధిన బిచ్చమెత్తుతున్నా వేం? నేను వరసగా నీకు మూడురోజులు నూరేసి దీనారాలూ, వెళ్ళిపోయేటప్పుడు వెయ్యి దీనారాలూ ఇచ్చానుగద?"

"నాయనా, నీ అన్నలు నన్ను మోసంచేసి ఆ డబ్బంతా కాజేశారు. నేను తిండికికూడ గడవని స్థితిలో బిచ్చం ఎత్తుతున్నాను."

"అమ్మా, నేను తిరిగి వచ్చానుగా, ఇంక నీకే కష్టమూ ఉండదులే. ఇదుగో ఈ సంచీనిండా బంగారమూ, రత్నా లూనూ. ఇక మనకు తిండి కొరతకూడా ఉండదు."

తల్లి కన్నీటితోనే నవ్వుతూ, "నాయనా, అదృష్టమే నీ రూపంలో పుట్టిందిరా. అల్లా అనుగ్రహం నీకుండాలి! ఇంత రొట్టె కొనుక్కురా, నాయనా. రాత్రినుంచీ పస్తున్నాను," అన్నది.

రొట్టె అన్నమాటకు జూదర్ నవ్వి, "నువు ఏది తినాలనుందో చెప్పు. పోయి రాకుండా, అంగడిలో కొనకుండా నువు కోరిన వంటకం వస్తుంది," అన్నాడు.

"నువు తెచ్చినవి ఈ సంచిలోనివే గదరా, బాబూ? ఆహారం ఏదీ?"

"ఉన్నదిలే, అమ్మా! నీకేం కావాలి?"

"ఆకలి తీరటానికి ఏదైనా సరేరా!"

"అది నిజమేలే. అవసరం వచ్చిపడి నప్పుడు మనిషి దేనితోనైనా తృప్తి పడాలి. కాని కొల్లగా ఉన్నప్పుడు ఇష్ట మైనది కోరవచ్చుగద," అన్నాడు జూదర్.

"నాకు వేడివేడి జున్నుముక్క తినా లనున్నదిరా."

"నీ హోదాకు తగిన కోరిక కాదమ్మా."

"అయితే తగినది ఏదో నువే చెప్పు."

"కోడిమాంసం వేపుడూ, గొర్రె మాంసమూ, తేనే!" అంటూ జూదర్ పెద్ద దండకం చదివాడు.

ఇదంతా విని, పాపం, ఆ వృద్ధురాలు తనను కొడుకు హాస్యం పట్టిస్తున్నాడో, లేక వాడికి మతే పోయిందో తేల్చుకోలేక "నీకేం వచ్చిందిరా, జూదర్?" అని అడిగింది.

"నేను చెప్పిన వంటకాలన్నీ ఈ క్షణం నీ కియ్యగలనమ్మా. నీ చేత తిని పించగలను. ఆ ఖాళీసంచీ ఇలా తే!" అంటూ జూదర్ సంచీ అందుకుని, అందులోనుంచి, వెండిపళ్లాలలో, తాను చెప్పిన వంటకాలన్నీ ఒక్కొక్కటిగా బయటికి తీశాడు.

అతను తనముందు పేర్చిన ఆహారం చూసి నిర్ఘాంతపోతూ తల్లి, "నాయనా, సంచీ అంత చిన్నదిగదరా! పైగా ఖాళీది కూడానూ! ఇదంతా ఏమిటి?" అన్నది.

"అది మంత్రపు సంచీలే, అమ్మా. దీన్ని నాకు మూర్ ఇచ్చాడు. ఇందులో ఒక భూతం ఉండి, అడిగిన వంటకమల్లా



ఇస్తుంది,'' అంటూ జూదర్, సంచిలో చెయ్యిపెట్టి ఏమనాలో చెప్పాడు.

"ఈసంచీలోనుంచి నేను తీసినా వంటకాలు వస్తాయా?'' అని తల్లి అడిగింది.

"తప్పకుండా!'' అన్నాడు కొడుకు.

ఆమెకూడా మంత్రం చదివి తాను కోరిన వంటకం పైకి తీసింది.

"ఏమైనా, నాకు వేడివేడి జున్నుమీద భ్రమపోలేదు, నాయనా," అంటూ ఆమె రొట్టే, జున్నూ తీసింది.

"చూడమ్మా, తినటం అయిపోయాక పళ్ళాలు తిరిగి సంచీలో పెట్టెయ్యాలి. అది చాలా ముఖ్యం. సంచీని అవతల పెట్టేసి, అవసరమైనప్పుడే పైకితియ్యి. నువ్వు కావాలంటే చుట్టుపక్కలవాళ్ళకూ పేదలకూ ఎంత తిండి అయినా పెట్టు గాని, ఈ రహస్యంమాత్రం ఎవరికీ చెప్పకు. అన్నలకుకూడా, నేను ఉన్నా, లేకపోయినా భోజనం పెట్టవచ్చు," అన్నాడు జూదర్.

అతను ఇలా అంటూండగానే అతని అన్నలు వచ్చి, కింద పరిచిఉన్న విందు భోజనం చూశారు

జూదర్ తిరిగివచ్చినట్టు వాళ్ళకు చెప్పినవాడు, "మీ తమ్ముడు ఒక కంచరగాడిదమీద, ఒక నీగ్రో వెంట తిరిగి వచ్చాడు. అతను ధరించిన దుస్తులు ఎవరూ ఎన్నడూ చూసి ఉండరు —అంత అద్భుతంగా ఉన్నాయి,'' అన్నాడు.

"ఛీ, ఛీ! మనం అమ్మను మోసం చెయ్యకుండా ఉండవలసింది," అన్నాడు సాలిం.

"అమ్మ వాడికి మనం చేసినదంతా






చెప్పి ఉంటుంది. వాడు మనని గడప తొక్కనియ్యడు?" అన్నాడు సలీం.

"అయినా అమ్మది మెత్తని గుండె. అంతకంటే సాధువు మన తమ్ముడు. మన ప్రవర్తన సమర్థించుకునేటందుకు ఏదన్నా సాకు చెప్పుకుంటే వాడు ఒప్పుకుంటాడు," అనుకుని వాళ్ళు ఇంటికి తిరిగి వచ్చారు.

వాళ్ళను చూడగానే జూదర్ లేచి నిలబడి, భోజనానికి ఆహ్వానించాడు. డొక్కలు మాడుతూ ఉండటంచేత వాళ్లు సుష్టుగా భోజనం చేశారు. వాళ్లు తినటం అయిపోయాక జూదర్ వా "మిగిలినది పేదలకు పెట్టండి," అన్నాడు.

"మరోసారి తినటానికి దాచిఉంచితే నేం?" అన్నారు వాళ్ళు.

జూదర్ నవ్వి, "మరోసారి తినేవేళ అయితే ఇంత తిండీ ఉంటుంది—ఇంకా ఎక్కువే ఉంటుంది," అన్నాడు.

ఆ మాటతో ధైర్యంవచ్చి వాళ్ళు తినగా మిగిలినది బీదవాళ్ళకు పంచి, "తినండి," అని, ఖాళీ కంచాలు తెచ్చి జూదర్ కిచ్చారు. అతను వాటిని తల్లి కిచ్చి, సంచీలో పెట్టించాడు.

ఆ రాత్రి భోజనానికి జూదర్ సంచీ నుంచి నలభైరకాల వంటకాలు పైకితీసి, తల్లి వాటిని అమర్చినమీదట, తన అన్నలను భోజనానికి పిలిచాడు. భోజనానంతరం వాళ్లకు మిఠాయి మొదలైనవి పెట్టి, మిగిలిపోయినదంతా బీదలకు పంచి పెట్టమని అతను అన్నాడు.

ఇలా జూదర్ అన్నలు పదిరోజుల పాటు తమ జన్మలో ఊహించని విధంగా విందులు కుడిచారు. అప్పుడు సాలిమ్ సలీమ్‌తో—

ఇంతలో తెల్లవారటంచూసి మంత్రి కుమార్తె షహరాజాద్ కథ చెప్పడం చాలించింది. (సశేషం)




మరుసటి రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా కథ కొనసాగించింది :

ఖలీఫా రాజభవనంలోకి చేరగానే అత్తా కోడళ్లను జుబేదా తన చెలికత్తెల మధ్య కూర్చుని ఉన్న చోటుకి తీసుకు పోయారు ఆ చెలికత్తెలలో అగ్రగణ్యు రాలు తూఫా.

పిల్లలిద్దరినీ రోష్నికిచ్చి హసన్ తల్లి జుబేదా రాణికి వందనం చేసింది. జుబేదా ముసలామెను లెమ్మని, రోష్నితో "అమ్మాయీ, ఇక్కడ పురుషులెవరూ లేరుగదా, మేలిముసుగులు తీయ వెందుకు?" అన్నది. ఆమె సైగ చేయగా తూఫా లేచివెళ్ళి, రోష్ని ముఖం మీద మేలిముసుగు తొలగించింది.

రోష్ని ముఖం మబ్బుచాటునుంచి బయటికి వచ్చిన చంద్రబింబంకన్న కూడా విస్మయకరంగా ఉన్నది. అక్కడఉన్న స్త్రీలందరూ అద్భుతం చెందారు

జుబేదా ఆశ్చర్యంనుంచి కొంచెం తెప్పిరిల్లుకోగానే, తన ఆసనం నుంచి

లేచి, రోష్నిని గట్టిగా ఆలింగనం చేసుకుని, నదుటిమీద ముద్దుపెట్టుకున్నది. ఆమెను తన పక్కనే కూర్చోపెట్టుకుని, తన మెడలోని ఏడుపేటల పెద్దముత్యాల హారాన్ని ఆమె మెడలో వేసింది— జుబేదా అల్‌రషీద్‌ను పెళ్ళాడిన క్షణం నుంచీ ఆ హారం ఆమె మెడలోనే ఉంటున్నది.

"సౌందర్యరాశీ, నీ అందం వర్ణించటానికి ప్రయత్నించడంలో నా జానిస పొరపాటు చేసింది. ఎందుకంటే అందుకు కావలసిన మాటలు లేవు. అయితే నీకు పాటలుగాని, నాట్యంగాని, వాద్యాలుగాని వచ్చునా? వచ్చే ఉండాలి. నీలాటిది ఎందులోనైనా రాణిస్తుంది," అన్నది జుబేదా.

కాని రోష్ని, "అమ్మా! నాకు పాటలురావు, నృత్యాలు రావు, వాద్యాలూ రావు. యువకులు సామాన్యంగా నేర్చి ఉండే విద్యలలో నాకు ప్రావీణ్యం లేదు. కాని, మీకు ఆశ్చర్యం కలిగించే విద్య ఒకటి నాకు వచ్చును— నేను గాలిలో ఎగరగలను," అన్నది.

"అద్భుతం! ఆశ్చర్యం!" అన్నారు ఆడవాళ్ళందరూ.

"అందులో ఆశ్చర్యం ఏమీలేదు. ఎందుకంటే హంసల శరీరాలలో ఉండే పొంకమంతా నీ శరీరంలో కనిపిస్తున్నది. అయినా మమ్మల్ని సంతోషపెట్టటానికిగాను రెక్కలు లేకుండా ఎగిరే నీ శక్తిని ఒకసారి ప్రదర్శించి చూపు," అన్నది జుబేదా.

"దేవీ, నాకు రెక్కలు లేకపోలేదు. అయితే అవి నావద్ద లేవు. మా అత్తగారిని మీరు కోరిన పక్షంలో ఆమె నా ఈకలతొడుగు తెచ్చి ఇస్తుంది," అన్నది రోష్ని.

జుబేదా ముసలావిడకేసి తిరిగి, "అమ్మా. ఈకలగొడుగట తెస్తారా? ఈ పిల్ల ఎగరటం చూస్తాం!" అన్నది.

"కొంపమునిగింది!" అనుకున్నది హసన్ తల్లి. ఆ గొడుగు చూస్తే హసన్ భార్యకు ఎగరాలనిపించి తీరుతుంది. తరవాత ఏం జరిగేదీ భగవంతుడికే తెలియాలి.

"ఏలినవారి సమక్షంలో మా పిల్ల మారిపోయి మాట్లాడుతున్నది. ఈకలు ఎవరైనా ధరిస్తారా పక్షులు ధరించాలి గాని!" అన్నదామె.

రోష్ని ఆమె మాటకు అడ్డుతగిలి, "మహారాణీ, మీమీద ప్రమాణం చేస్తాను. నా ఈకల తొడుగును ఇంట ఎక్కడో రహస్యంగా దాచి ఉన్నది.

జుబేదా అమూల్యమైన తన కంకణం ఒకటి తీసి హసన్ తల్లికి ఇస్తూ, "అమ్మా ఆ తొడుగు తీసుకురా. ఒక్కసారి చూసి తిరిగి ఇచ్చేస్తాను," అన్నది.

కాని ముసలావిడ తనకు ఆ తొడుగు గురించి ఏమీ తెలీదని పెద్దపెద్ద ఒట్లు పెట్టుకున్నది. అందుచేత జుబేదా

 

మస్రూర్‌ను పిలిచి, హసన్ ఇల్లంతా గాలించి ఈకల తొడుగు తెమ్మని ఆజ్ఞా పించింది. మస్రూర్ బలాత్కారంగా ముసలావిడవద్ద ఇంటి తాళంచెవులు తీసుకుని, హసన్ ఇల్లంతా గాలించి, నేలలో దాచిపెట్టిన పెట్టెనుంచు తొడుగు తీసి, జుబేదా వద్దకు తిరిగి వచ్చాడు. జుబేదా దాన్ని వింతగా పరిశీలించి, రోష్నికి ఇచ్చింది.

రోష్ని దానిలోని ప్రతి ఈకనూ జాగ్రత్తగా పరీక్షించి, అది హసన్ దగ్గిరికి వచ్చినప్పుడు ఎలా ఉన్నదో ఇంకా అలాగే ఉన్నదని రూఢీ చేసుకుని దాన్ని తొడుగుకుని, అందరిఎదుటా పెద్ద పక్షిలాగా నిలబడి, హాలు వెంబడి కొద్దిగా ఎగిరి, వెనక్కు తిరిగివచ్చి, కింద వాలింది. తరువాత ఆమె ఇద్దరు పిల్లలనూ ఎత్తి చెరొక భుజంమీదా ఎక్కించుకుని, మళ్ళీ గాలిలోకి లేచి, ఎగిరి వెళ్ళి ఎత్తుగాఉన్న గవాక్షంమీద వాలి ఇలా అన్నది. "చూడండి నేను వెళ్ళిపోతున్నాను."

"వెళ్ళిపోతావా, రోష్ని. మమ్మల్ని వంచించి పోతావా?" అన్నది జుబేదా.

"ఏం చెయ్యను? వెళ్ళిపోవాలి. వెళ్ళిపోయేది మరిరాను... హసన్ తల్లీ! వెళ్ళిపోవటం నాకు బాధగానే ఉంది. నిన్నుగురించీ, హసన్‌గురించీ నేను చింతిస్తున్నాను. ఆకాశం నన్ను ఆకర్షి స్తున్నది. నేను ఎగిరి తీరాలి. నీ కొడుకు నన్ను కలుసుకోదలిస్తే నాకోసం వక్-వక్ దీవులలో వెతకాలి, శలవు!" అని హసన్ తల్లికి వీడ్కోలుచెప్పి రోష్ని, తన ఇద్దరు పిల్లలతో సహా మబ్బుల ఆకాశానికి ఎగిరిపోయి, అదృశ్య మయింది.

అభాగ్యురాలైన హసన్ తల్లి నేల మీద నిశ్చలంగా పడిపోయి, చచ్చి పోయే దానిలాగా కనబడింది. జుబేదా తన స్పర్శతో ఆమెను ఊరడిస్తూ, "అమ్మా, ఏమీ తెలియదని బొంకక పోతే, ఆ తొడుగుతో రోష్ని ఎగిరి చక్కా పోతుందని హెచ్చరించలేక పోయావా? నీ కొడుకు పెళ్ళాడినది ఎగిరే భూతాన్ని అని నాకెలా తెలు స్తుంది? నా అజ్ఞానాన్ని క్షమించు. జరి గినదానికి నన్ను అంతగా తప్పు పట్ట వద్దు," అన్నది.

"తప్పంతా నాదే. బానిస మహా రాణిని క్షమించటం ఎక్కడైనా కద్దా? ఎవరి ప్రారబ్ధం వారిని వెన్నంటి ఉంటుంది. విచారంతో నేనూ, నా కొడుకూ చావటం మా ప్రారబ్ధం," అని హసన్ తల్లి రాజభవనంనుంచి బయలు దేరి, కాళ్ళీడ్చుకుంటూ తన ఇంటికి పోయింది. మనమలూ, కోడలూ లేని ఇల్లు బావురుమంటున్నది. ఆమె ఆ ముగ్గురికీ మూడు సమాధులు తయారు చేసి, అహోరాత్రాలు ఏడుస్తూ జీవించ సాగింది...

హసన్ ఏడుగురు అక్కలతో మూడుమాసాలు గడిపి ఇంటికి బయలు దేరాడు. ఈ ప్రయాణానికి అతను దప్పు సహాయంతో పది ఒంటెలను రప్పించాడు. అక్కలు అయిందింటిమీద బంగారమూ, వెండీ, మిగిలిన అయిదింటిమీద రత్నాలూ వేసి, వచ్చే ఏడు మళ్ళీ వచ్చేటట్టు హసన్‌వద్ద మాట తీసుకున్నారు.

అతను ఇంటికి తిరిగి వచ్చి తన తల్లిని గుర్తించలేకపోయాడు. నిద్రాహారాలు లేక, అస్తమానమూ ఏడుస్తూ ఆమె పూర్తిగా మారిపోయింది.

"నా పెళ్ళాం ఏదీ? నా పిల్లలెక్కడ?" అని హసన్ అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా ముసలిది వెక్కింది. హసన్ వెర్రివాడిలాగా ఇల్లంతా కలయతిరిగాడు. ఈకాలతొడుగు ఉండిన పెట్టె ఖాళీగా, తెరుచుకుని ఉండి కనిపించింది. వెనక్కు తిరిగేసరికి ఒక పెద్ద సమాధీ, రెండు చిన్న సమాధులూ కనిపించాయి. అతను విరుచుకు పడిపోయాడు. అతని తల పెద్దసమాధి రాతికి కొట్టుకున్నది. అతనికి స్పృహ తప్పింది.

తల్లి ఎన్ని శైత్యోపచారాలుచేసినా రాత్రి అయినదాకా అతనికి తిరిగి స్పృహ రాలేదు. స్పృహ వస్తూనే అతను తన బట్టలు చించుకుని, నెత్తిన దుమ్మూ, బూడిదా చల్లుకున్నాడు. ఆకస్మాత్తుగా అతను కత్తిదూసి గుండెల్లో పొడుచుకోబోయాడు. అతని తల్లి అడ్డుపడి అతన్ని కూర్చోబెట్టి, జరిగినదంతా కొంచెం కొంచెంగా అతనికి చెప్పింది.

చివరికామె, "నాయనా మనకు ఎంత విపత్తు వచ్చిపడినా, ఆశకు అవకాశం లేకపోలేదు, వక్ - వక్ దీవులలో నీ భార్య నీకు దొరకవచ్చు" అన్నది.

ఈ మాటతో హసన్‌కు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయియింది. అతను లేచి నిలబడి, "నేను వక్-వక్ దీవులకు పోతాను" అన్నాడు.

మరుక్షణమే అతన్ని అనుమానాలు ఆవరించాయి. ఆ దీవులు ఎక్కడ ఉన్నట్టు? సింధు సముద్రంలోనా, చీను సముద్రంలోనా, పర్షియా సముద్రంలోనా? ఈ అనుమానం తీర్చుకోవటానికి అతను ఖలీఫా కొలువులో ఉన్న పండితులను ఒక్కొక్కరినీ ప్రశ్నించాడు. ప్రతిఒక్కడూ, "నాకు తెలీదు. వాటిని గురించి ఎన్నడూ వినలేదు" అన్నాడు.

అతను నిరాశతో కుంగిపోతూ ఇంటికి తిరిగివచ్చి, "నేను వక్-వక్ దీవులకు పోవటం అబద్ధమూ, ప్రేతభూములకు పోవటం నిజమూనా" అన్నాడు.

అతను కొంతసేపు ఏడుస్తూ పడుకుని, చివాల్నలేచి, "అల్లా దారిచూ

పాడు. నేను ఏడుగురు అక్కల వద్దకు వెళ్ళి. వక్-వక్ దీవులకు దారితెలుసు కుంటాను" అన్నాడు.

హసన్ తల్లికి వీడ్కోలు చెప్పి, తన రెండుమూపురాల ఒంటెమీద మేఘ పర్వతంమీద ఏడుగురు అక్కలను చేరుకున్నాడు. అతను అనుకోకుండా వచ్చినందుకు వాళ్ళు మరింత సంతో షించారు. అతను గులాబ్‌తో, "అక్కా దుర్భరమైన కష్టంలో ఉండి, తరుణో పాయంకోసం వచ్చాను. రోష్నీ వెళ్ళి పోయింది. వెళ్ళిపోయేటప్పుడు తనకోసం వక్-వక్ దీవులలో వెతకమని మా అమ్మతో అన్నది. అక్కడికి ఎలా వెళ్ళాలి ?" అన్నాడు.

అక్కలు ఒకరిమొహాలు ఒకరు చూసుకున్నారు. వాళ్ళు అతనితో, "హసన్, వన్-వన్ దీవులను వెళ్ళటం కన్న చెయ్యి ఎత్తి ఆకాశాన్ని తాకటం తేలిక," అన్నారు.

ఈ మాటతో హసన్ దుఃఖం ఇనుమ డించింది. గులాబ్ అతన్ని ఓదార్చుతూ "హసన్, మనస్సును నిగ్రహించుకో. రాసి ఉన్నది ఎలాగూ జరుగుతుంది. నువ్వు నీ భార్యనూ పిల్లలనూ కలుసుకో వాలని రాసిపెట్టి ఉంటే ఎలాగైనా కలుసు కుంటావు. ఆ దిక్కుమాలిన ఈకల తొడుగును తగలబెట్టమని నీతో అందా మని, నోటిదాకా వచ్చికూడా, ఎన్నో సార్లు నీకు కోపం వస్తుందని మానే శాను." అన్నది.

తరువాత హసన్ వక్-వక్ దీవు లను వెళ్ళటానికి ఏదైనా ఉపాయం ఉందేమో ఆలోచించడానికి ఆమె తన అక్కలకు ఒప్పించింది.

ఈ ఏడుగురు అక్కలకు ఒక చిన్నాయన ఉన్నాడు. ఆయనకు పెద్ద అక్క అంటే చాలాఇష్టం. ఆమెను చూసిపోవటానికి ఆయన ఏటా వస్తాం టాడు. ఆయనపేరు అబ్దుల్ కద్దూస్. ఆయన కిందటిసారి వచ్చినప్పుడు. పెద్ద అక్కకు ఒక సంచీలో సుగంధద్రవ్యం ఇచ్చి, ఆమెకు ఏదన్నా కావలసినప్పుడు ఆ పదార్థాన్ని కొద్దిగా నిప్పులమీద వెయ్య మన్నాడు.

ఇప్పుడు పెద్ద అక్క తన చిన్నా యనను తలుచుకొని ధూపంవేసింది. ధూపంపొగ పెద్ద సుడిగాలిగా మారి, అందులో అబ్దుల్ కద్దూస్ తెల్లని ఏను గునెక్కి ప్రత్యక్షమై, "సువాసన తగిలి వచ్చాను. నీకు ఏంకావాలి తల్లీ ?" అని అడిగాడు.

పెద్దక్క ఆయన మెడచుట్టూ చేతులువేసి, "నువ్వు వచ్చి ఏడాది దాటింది చిన్నాయనా. అందుకని పిలి చాను," అన్నది.

"నేను ఎలాగైనా రేపు వద్దామనే అనుకుంటున్నాను. నాతో ఏదో పని

ఉండే పిలిచావు. దాచకుండా చెప్పు" అన్నాడాయన.

"నువ్వు ఒప్పుకుంటున్నావు గనక అడుగుతాను. మా తమ్ముడు వక్-వక్ దీవులకు వెళ్ళాలి. ఎలా వెళ్ళాలో చెప్పు."

షేక్ అబ్దుల్ కద్దూస్ చాలాసేపు దీర్ఘాలోచనచేసి, "మీ తమ్ముణ్ణి అనవసరంగా హైరాన పడవద్దని చెప్పు. అతను వక్-వక్ దీవులను చేరటం అసంభవం," అన్నాడు.

"అయ్యో, పాపం!" అన్నది పెద్దక్క.

గులాబ్‌మటూకు హసన్ చెయ్యిపట్టుకుని పెద్దవాడి వద్దకు తెచ్చి, "చిన్నాయనా, ఉండే ఇబ్బందులేవో ఇతనికి చెప్పు," అన్నది.

ఆయన హసన్‌తో, "నాయనా, ఎందుకు కష్టాలు కొనితెచ్చుకుంటావు? భూతగణాలూ తోకచుక్కలూ సహాయం చేసినా నువ్వు వక్-వక్ దీవులను చేరలేవు. ఆ దీవులలో ఎమెజాన్ కన్యలుంటారు. భూతలోక చక్రవర్తి అయిన నీ మామగారు అక్కడ ఉంటాడు. నువ్వు అక్కడికి పోవాలంటే ఏడు సముద్రాలనూ, ఏ లోతుతెలియని లోయలనూ, ఏడు ఎత్తుతెలియని మహా పర్వతాలనూ దాటాలి. అలా దాటటానికి నీకు మార్గం ఏదీలేదు. అందుచేత నీవు వక్-వక్ దీవుల ఆలోచన కట్టిపెట్టి మీ ఇంటికి తిరిగిపో, లేదా ఏడుగురు అక్కలవెంట ఉండు."

ఈ మాటలువిని హసన్ వాలిపోయి, ఒక్క కేక పెట్టి, మూర్ఛపోయాడు. ఏడుగురు అక్కలూ దీనాతి దీనంగా రోదనం చెయ్యసాగారు.

ఇదిచూసి వాళ్ళ చిన్నాయనకు హసన్‌పై జాలికలిగింది "ఊరుకోండి!" అని ఆయన అక్కలను మందలించి, హసన్ భుజంమీద చెయ్యివేసి, "ఏడవకు, నాయనా! ధైర్యం వహించు. అల్లా అనుగ్రహిస్తే నీపని అంత దుర్ఘటం కాకపోవచ్చు. లేచి, నావెంట బయలుదేరు," అన్నాడు.

హసన్‌కు పోయినప్రాణం తిరిగి వచ్చినట్టయింది. అతను చివాల్నలేచి, అక్కలకు వీడ్కోలు చెప్పి, వాళ్ళ చిన్నాయనతో, "సిద్ధంగా ఉన్నాను, మీ దానిసను!" అన్నాడు.

తూర్పు తెల్లవారుతుండటంచూసి, మంత్రికుమార్తె మౌనంవహించింది.





“రూపాయి విలువ బాగా పడిపోయింది.” అన్నాడు జగన్నాథం నిరాశనూ, విచారాన్ని స్ఫురింపజేస్తూ— యిక దినపత్రిక చూడబుద్ధికాదన్నట్లు దానిని మడిచివేస్తూ.

“అంతకంటె మనిషివిలువ మరీ బాగా పడిపోయింది. దానికి నువ్వు విచారించినట్టులేదు” అన్నాడు రాజారావు తాను చదువుతున్న మరో పేపరు క్రిందికిదించి.

“మనదేశంలో రూపాయి అంతటా ఒక్కటే. కాని మనుష్యులందరూ ఒకటి కాదు. ఒక్కొక్క మనిషి విలువ అతని చదువుమీద, సంస్కారంమీద, అతను పుట్టిపెరిగిన వాతావరణంమీద, ఆర్థిక స్తోమతమీద, ఆలోచనమీద, యిలాగ ఎన్నో అంశాలమీద ఆధారపడి వుంటుంది. ఎవరో ఎక్కడో దిగజారిపోయినారని మొత్తం మానవసమాజమంతా చెడిపోయిందని అంచనా వేయడానికి వీలులేదు.” అన్నాడు జగన్నాథం.

“నువ్వు చెప్పినది కొంతవరకూ ఒప్పుకుంటాను. ప్రభుత్వం చలామణీ చేసే ‘మనీ’ అంతా ఒకటేననీ: సృష్టికర్త సృష్టించిన మానవులందరూ మాత్రం ఒకటి కాదనీ నీ అభిప్రాయం.

కాని మానవసమాజాన్నంతటినీ తీసుకొని అందులో సగటు మానవుణ్ణి ఊహించు కొంటే మన ఊహకువచ్చే వ్యక్తిని నేను "మనిషి"ంటున్నాను .ఆ సగటు మనిషి విలువ ఒక్కొక్క తరానికి దిగజారి పోతోంది. బహుశా 'మనీ'కి మనిషి జీవితానికి వున్నసంబంధం నానాటికీ పెరగడంతో, డబ్బుతోపాటే మనిషి విలువలో తగ్గుదల ఏర్పడుతూ, మనిషి మూలవిలువలో దిగజారుడు ప్రత్యక్షంగా కనపడుతోంది." అన్నాడు రాజారావు.

"నువ్వు వృత్తిరీత్యా ప్లీడరువైతే అవవచ్చునుగాని, సగటు మనిషిని తీసుకున్నా మనదేశంలోని ఆధ్యాత్మిక విలువలూ, ధార్మిక విలువలూ, నైతిక విలువలూ యివన్నీ మంటగలిపి, ఆలోచన, వివేచనాశక్తులు గలిగిన మానవుడు వివేకం కోల్పోయి ప్రాణంలేని డబ్బుతో తన జీవితాన్ని ముడిపెట్టుకొని, తన విలువను నాశనం చేసుకుంటాడంటే మాత్రం నేను అంగీకరించను." అన్నాడు జగన్నాధం.

"మీ అందరితోనూ వచ్చిన చిక్కేదే నయ్యా, ప్లీడరు అన్నవాడు కోర్టులో తప్ప మరెక్కడా నోరు విప్పగూడదనీ, మాట్లాడగూడదనీ, మీ అభిప్రాయమేమో. నేను నిన్ను నమ్మించినా, ఒప్పించినా నువ్వు నాకిచ్చే ఫీజేమీలేదు. నువ్వు ఒక విషయాన్ని కదిపావు. దానిమీద నాకు తోచినది నేనన్నాను. ఇందులో వాద ప్రతివాదనలకూ, అభిప్రాయభేదాలకూ, గెలుపు ఓటములకూ ఎక్కడా చోటే లేదు. నువ్వు నాతో ఏకీభవించకపోతే నేనేమీ బాధపడను. కాని ఒక్కటి మాత్రం నువ్వు గుర్తుంచుకో. డబ్బుకి ప్రాణం లేకపోయినా, శక్తివుంది. ఆ శక్తి మన చదువుని, సంస్కారాన్ని, నీతిని, నియమాలను అన్నిటినీ వమ్ము చేసి దుమ్ములో కలపగలిగిన శక్తి. కాంతాశక్తిని మించిన శక్తి కనకానిది" అని రాజారావు కొంచెం ఆవేశంతో చెపి చదువుకునేందుకు పేపరెత్తాడు.

"ఓహో, లాయరుగారికి కోపం వచ్చినట్టుంది. ఇంతవరకూ మన చర్చను బిగిలాక్కొచ్చి, యిప్పుడు వదిలేస్తే 'శేషం కోపేన పూరయేత్' అన్నట్లవుతుంది. పోనీ, నేను నీతో వాదించనుగాని, సగటు మనిషివిలువ ఎలా పడిపోయిందో చెప్పు చూద్దాం. నీ దగ్గరికి అనేక రకాల మనుష్యులూ, అనేక రకాలైన కేసులూ వస్తూ వుంటాయి. మనుష్యుల మనస్తత్వ పరిశీలనకు మీకు ఎక్కువ సావకాశం వుంటుంది. ఇంజనీరుని నాకేం తెలుస్తుంది. ఎంతసేపూ ఎస్టిమేట్లూ, టెండర్లూ, పనులు పూర్తి చేయించడంతప్ప" అన్నాడు జగన్నాధం రాజాధోరణిలో.

క్లబ్బులో వారిద్దరి సంభాషణ ఎలా ముగుస్తుందోనని కుతూహలంతో మరో

టేబిలు దగ్గర కొద్దిమారంలో కూర్చుని వింటున్న, సుందరరామం, అన్నయ్యశాస్త్రి, కన్నయ్యదొర, వెంకట్రాజా తమ కుర్చీలు రాజారావు కుర్చీకి దగ్గరగా జరుపుకున్నారు.

జగన్నాథం ఆర్డరుచేసిన కాఫీలు వొచ్చాయి. "ఈ కాఫీలిచ్చి మమ్మల్ని ఋణగ్రస్థుల్ని చేశారు జగన్నాథంగారు. రెండు పేకదస్తాలతో రమ్మీ ఆడను, మరో ముగ్గురొస్తే మూడు పేకలమీద ఏడుగురూ ఆడుకోవచ్చునంటాడు అన్నయ్యశాస్త్రి. అతను తగ్గిపోతే మేము ముగ్గురమే అవుతాము. ముగ్గురిమీద ఆడనంటాడు కన్నయ్యదొర. ఒక్కొక్కరికి ఒక్కొక్కచాదస్తం" అని ఫిర్యాదు చేసినట్టుగా కాకుండా తన బాధ పైకి వెళ్ళగక్కుకుంటూ, రాజారావు కుర్చీదగ్గరికి జరిగినందుకు సంజాయిషీ చెప్పాడు సుందరరామం.

"నేను కాఫీలు తెప్పించానని మీరేం బాధపడనక్కరలేదుగాని, రోజూ ఆడుకొనే పేకాటేగదా, యీవేళ ఓ గంట ఆలస్యమయితేనేం. రాజారావు కేసు డైరీలోంచి ఓ చక్కటి కథవిందాం. ఎక్కడో భోపాల్‌దగ్గర పఠారీ సంగతి మనకెందుకు? మనిషి విలువ పడిపోతోందనేటందుకు నీకు స్వయంగా అనుభవం వున్న విషయం, నిజంగా జరిగినది ఏదైనా వుంటే చెప్పవయ్యా" అని హెచ్చరించాడు జగన్నాథం రాజారావుని.

కాఫీతాగి రాజారావు సిగరెట్టు ముట్టించాడు. "ఒక్కొక్క సంఘటనను ఒక్కొక్కరు ఒకోవిధంగా గ్రహిస్తారు. ఒకే సంఘటనను విన్నవాళ్ళుగాని, చూసిన వాళ్ళుగాని అందరూ ఒకేమాదిరిగా 'రిసీవ్' చేసుకుంటారనడానికి వీలులేదు. నాకు చాలా ఆశ్చర్యం కలిగించిందీ, నేనే బోల్తాపడినదీ ఒక సంఘటన మీకు చెబుతాను. డబ్బు సంపాదించడంకోసం మనిషి ఎంత నీచానికి దిగజారిపోతాడో మీకే అర్థమవుతుంది. వినండి" అని రాజారావు ఉపక్రమించాడు.

"ఇప్పటికి సుమారు ఒక సంవత్సరం క్రితం నాదగ్గరికి ఒక పెద్దయింటి, సంస్కారం కలిగినదానిలా కనపడే మధ్యవయస్కురాలైన ఆడమనిషి వచ్చి తన కూతురు, పద్దెనిమిరి సంవత్సరాల వయస్కురాలైనది కనపడడం లేదనీ, నాలుగు రోజులనుంచి ఎక్కడ వెతికినా దొరకలేదనీ ఫిర్యాదు చేసింది. నేనావిడ్ని 'పోలీసురిపోర్టు యిచ్చారా' అని అడిగాను, ఆమె యిచ్చానన్నది. కాని పోలీసువారేం చేస్తారు బాబూ, వారి డ్యూటీ వాళ్ళు చెయ్యడానికికూడా మనం వారి చుట్టూ తిరిగి వాళ్ళని ఏదోరకంగా ప్రసన్నుల్ని చేసుకోవాలి. తికమెండే షన్లు చేయించాలి. అంత శక్తి, స్తోమత నాకెక్కడిది. దినం గడవడమే కష్టంగా వుంది. మీలాటి మహానుభావుల కాళ్ళట్టుకుంటే మీరైనా కనికరించి నాకు

సాయం చేస్తారని మీదగ్గరికి వచ్చాను' అన్నది.

"ఐతే, నేను మీ అమ్మాయిని వెతకాలా?" అన్నాను.

"ఉమ్మమ్మా, అంత మాట శలవియ్యకండి బాబూ. తమరు ఒక్కసారి సబిన స్పెక్టరుగారిని కలుసుకుని చెబితే, వారు శ్రద్ధగా వెతికించి మా అమ్మాయి ఎక్కడున్నా పట్టుకొని అప్పజెపుతారని నా నమ్మకం" అన్నది.

"మీ అమ్మాయి కనిపించకుండాపోయి ఎన్నాళ్ళయింది? తనంతట తనే వెళ్ళిపోయిందా? ఎవరైనా బలవంతంగా తీసుకుపోయారా? మీరూ, ఆ అమ్మాయి దెబ్బలాడుకున్నారా? కోపంవచ్చి పోయిందా? మీఅమ్మాయి పేరేమిటి? ఎలావుంటుంది? గుర్తులు చెప్పండి అని చాలా వివరాలు ఒక్కటొక్కటే అడిగాను.

'మా అమ్మాయికి తండ్రి చనిపోయి ఐదు సంవత్సరాలవుతుందండి. ఆయన సంపాదించినఆస్తి ఏదోకొద్దిగావుండే దానితోను, అభిమానం చంపుకొని నా రెక్కల కష్టంమీద దాన్ని చదివించుకుంటూ వచ్చానండి. మా అమ్మాయి మెట్రిక్యులేషను ప్యాసయిందండి. నేను అనకూడదుగానండి, అది నా కడుపున పుట్టవలసిన పిల్లగాదండి. ఏ మహరాజుల యిళ్ళల్లోనో, తమలాంటివారి కడుపునో పుట్టవలసిన పిల్లండి బంగారపుబొమ్మ, దానికి 'ఉష' అని పేరు పెట్టాము. ఆ పేరు నచ్చలేదని తనే 'ఆశారాణి' అని పేరెట్టుకుందండి. మేము, దాని స్నేహితులూ, 'ఆశ' అని పిలిచేవాళ్ళమండి. దానికి సినీమాల్లోకి వెళ్ళిపోదామని వుండేది. కాని అక్కడ దీన్నెవరు చూస్తారు. అందమొకటీ వుంటే సరా, ఆ మాయప్రపంచంలో నెగ్గుకు రావడానికి ఎన్ని వుండాలి, అని నేనే వెళ్ళనివ్వలేదండి. కొన్నాళ్ళు ఉద్యోగం చేస్తానని పట్టుబట్టిందండి. మా వంశంలో ఆడవాళ్ళెవరూ ఉద్యోగాలు చేయలేదండి. నాకు దానినో అయ్యచేతిలో పెట్టి అత్తవారింటికి పంపితే నా బరువు, బాధ్యత తీరిపోతాయని వుండేది. ఏదో మా స్థితికి తగ్గినట్టుగా మంచి సంబంధాలేమైనా వుంటాయేమోనని వెతుకుతూ వుండేదాన్నండి. మేము రామారావుపేటలో ఒక చిన్నయింటిలో వుంటున్నామండి. ఆ యింటిదగ్గరే, ఎదురుగా మాకొక శనిగాడు దాపరించాడు వాడు మా అమ్మాయిమీద కన్నేసి మా యింటికి వచ్చి మా అందరితో పరిచయం పెంచుకున్నాడు. ఇప్పటికి సరిగ్గా ఐదు రోజుల క్రితం మా అమ్మాయి, వాడు ఒకేసారి కనపడకుండా పోయారండి. నేను అన్నివీధులూ వెతికించానండి. ప్రశ్న వేయించానండి. మా అమ్మాయి ఎక్కడో చిక్కడిపోయిందనీ, దొరుకుతుందనీ చెప్పారండి మరో రెండు రోజులుకి ఎక్కడినుండి వచ్చాడో




భాస్కరరావు పెట్టి పట్టుకొని వచ్చాడండి. భాస్కరరావు ఎవరా అని అనుకుంటున్నారా! అదేనండి మా యింటికెదురుగా వున్న చచ్చినాతండి. అతన్నడిగితే మా అమ్మాయి సంగతి తనకేమీ తెలియదన్నాడండి. తనకేమీ తెలియదని ఋజువు చేసుకునేందుకు కాబోలు వాడు నాతో కలిసి వెతికేవాడు. నేను తనకు పెళ్ళి చేయలేననీ, ఆ పరిస్థితులలో దాన్ని ఉద్యోగమైనా చెయ్యనివ్వననీ, సినిమాల్లో చేరనివ్వననీ, నిరాశతో యింట్లోంచి వెళ్ళిపోయి వుంటుంది మా ఆశ. దాన్ని ఏ కిరాతకుడైనా మానభంగంచేసి చంపేశాడేమోనని నా భయమండి. తమరు యీ ఫోటో చూస్తే మా అమ్మాయి ఎలా వుంటుందో తమకే బోధపడుతుంది' అని అంటూ ఆశ తల్లి ఒక ఫోటో యిచ్చింది. ఫోటోనుబట్టి చూస్తే ఆ పిల్ల చాలా అందంగా వుంది. ఆవిడ చెప్పినదంతా వింటే నాకు చాలా జాలి వేసింది. ఆమెకు తప్పకుండా సహాయం చెయ్యాలనిపించింది.

'మా అమ్మాయి ఎక్కడ వున్నా, ఏ పరిస్థితిలో వున్నా బతికివుంటే చాలండి. రోజులు చాలా దారుణంగా వున్నాయి. ఎవరైనా ఏమైనాచేసి దాన్ని చంపేశారేమోనని నా భయమండి. మీరే నాకు దిక్కండి" అంటూ ఏడుస్తూ నా కాళ్ళమీద పడింది.

"నేనావిడకు ధైర్యం చెప్పి, ఆశ ఫోటో తీసుకుని ఆ సాయంత్రం పోలీసు

స్టేషనుకు వెళ్ళాను. సబిన స్పెక్టరుతో మాట్లాడి ఫోటో యిచ్చాను.

"తర్వాత నాలుగు రోజులకి 'ఆశ' ఆచూకీతీసి పోలీసువారు ఆమెను ఒక వ్యభిచార గృహంనడిపే ఆవిడదగ్గర నుంచి స్వాధీనంచేసుకొని నాకు ఫోన్ చేశారు. నేను ఆశ తల్లికి కబురు పంపి ఆమెతో పోలీసుస్టేషనుకు వెళ్ళాను. తల్లినిచూసి ఆశ చాలా సిగ్గుపడి, తన దురవస్థకు ఏడ్చింది. ఎవరో దుర్మార్గుడు తనకి ఉద్యోగం యిప్పిస్తానని ఆశ పెట్టి తీసుకువెళ్ళి వ్యభిచారగృహం నడిపే 'కంపెనీ' యజమానురాలి యింటిలోచేర్చి వెళ్ళిపోయి నట్లు చెప్పింది ఆ కంపెనీ యజమాని ఆశను ఐదువందల రూపాయలకు కొన్నాననీ, వాడెవడో ఆశ మేనమామ నని చెప్పి ఆమెను తనకు అమ్మాడనీ, ఆశవల్ల అంతవరకూ తనకేమీ ఆదాయం రాలేదనీ, గోలపెట్టి చెప్పింది. పోలీసువారు కంపెనీ యజమానురాలిని దెబ్బలాడి, మందలించి పొమ్మన్నారు. కేసుపెట్టకుండా వదిలేస్తున్నందుకు సంతోషించమన్నారు. ఆశను ఆమె తల్లికి అప్పగించారు.

"మరో నెల్లాలయిన తర్వాత ఆ సబ్‌యినస్పెక్టరుకు కాకినాడనుంచి రాజమండ్రీ బదిలీ అయింది. మరో నెల్లాళ్ళకు నేను రాజమండ్రీ కోర్టుపనిమీద వెళ్ళినపుడు ఆ సబ్‌యినస్పెక్టరుగారిని కాకతాళీయంగా హోటలు అప్సరలో కలుసుకున్నాను.

"ఆ రోజున ఆ సబినస్పెక్టరుగారు నాకు చెప్పిన విషయం తలుచుకుంటే నాకే ఆశ్చర్యం వేస్తుంది. ఆయన నాతో యిలా అన్నాడు.

"చూడండి ప్లీడరుగారూ, కాకినాడలో నేను వున్నప్పుడు మీరు ఆశ అనే అమ్మాయి తల్లితో వచ్చి ఒక రిపోర్టు యిచ్చారే, వాళ్ళు యిప్పుడు యీ వూళ్ళోనే వున్నారు ఆవిడ యీవూళ్ళో యింకో ప్లీడరుగారిని పట్టుకొని అదేమాదిరి రిపోర్టుతో మా స్టేషనుకు వచ్చింది. నన్ను యిక్కడ చూసి గతుక్కుమంది కాని నా డ్యూటీ నేను చేశాను. వ్యభిచార గృహాలన్నీ గాలించి ఆ అమ్మాయిని పట్టుకొని తల్లికి అప్పగించాను. కాని నాకు అనుమానంవేసి ఆచూకీ తీశాను. ఆ తల్లే తన తమ్ముడిచేత తన కూతుర్ని కంపెనీలకు ఐదు వందలూ, అంతకంటె ఎక్కువకు అమ్మిస్తూ వుంటుంది తన కూతురు చచ్చిపోయిందేమో, ఎవరైనా చంపివేశారేమో, కన బడడం లేదని రిపోర్టు యిస్తుంది. ప్లీడర్లదగ్గరకు వెళ్ళి వారికి జాలి కలిగే లాగ ఏడుస్తూ తన కథంతాచెప్పి వారిని నమ్మిస్తుంది. ప్లీడర్లకు ఫీజు యివ్వకుండా వారిచేత, మాచేత పని చేయించుకొని, 'కంపెనీ'లో చిక్కు పడిపోయిన తన కూతురిని యివతలకి రప్పించుకొని

తీసుకు వెళ్ళిపోతుంది. మళ్ళీ యింకో దగ్గర అమ్మిస్తుంది. ఈ విధంగా డబ్బు సంపాదిస్తోంది. ఆమె ఆడే తెలివైన నాటకంలో మీలాటివారు, నాలాటివాళ్ళు పావులు కిరాతకుల్లాటి 'కంపెనీ' వాళ్ళకే మస్కాయిస్తోంది. ఇంత చదువుకునీ, యింత అనుభవం వుండీ మనం తెలివైన వాళ్ళమా, లేక తన పాత్రను బాగా పోషించుకుంటూ, రక్తికట్టిస్తూ నాటకమాడి, డబ్బు సంపాదించే ఆమె తెలివైనదా? కాకినాడలో ఆ పిల్ల పేరు 'ఆశ'. ఈ వూళ్ళో హేమ. మరోవూళ్ళో మరొకటి".

అని రాజారావు కథ ముగించాడు. "ఇప్పుడు చెప్పండి. మర్యాదస్థుల కుటుంబంలో పుట్టి కన్నకూతురినే వ్యభిచారగృహానికి అమ్మే తల్లి దిగజారి నట్లా కాదా. ఈ పనిలో తమ్ముడు సహాయకారి. దీనినిబట్టి మనిషి విలువ పెరుగుతోందా, తగ్గుతోందా" అని అడిగాడు రాజారావు,

"మనిషికి బ్రతుకుమీద ఆశ చావనపుడు, ఎలాగో ఒకలాగ బ్రతకాలి కదా. మర్యాదగా, గౌరవంగా బ్రతికే మార్గాలు వారు అన్వేషించకో, అన్వేషించినా దొరకకో, లేక వక్రమార్గం పట్టిన తెలివితేటల ద్వారా కష్టపడకుండా హాయిగా బ్రతుకవచ్చుననే భ్రమతోనో, యిలాటివాళ్ళు యీ విధమైన వ్యూహాలు పన్నుతారు. అలాగే ఎవళ్ళ తంటాలు వాళ్ళు పడతారు. మనం కొన్ని నియమాలు, నిబంధనలు, స్టాండర్డ్స్ పెట్టుకొని, ఆ కోణంలోంచే చూసి: ఎదటి వాళ్ళు, యిలాటి పనులు చేసేవాళ్ళు దిగజారి పోయారంటాము వ్యభిచారంతో, దొంగతనంతో, మోసంతో బ్రతకడం తుచ్ఛమైనదే; నేను కాదనను. కాని ఆ పరిస్థితులు సమాజంలో ఏ ఒక్కరికీ లేకుండా సమాజమూ, ప్రభుత్వమూ కృషిచేయాలి. అటువంటి బ్రతుకు బ్రతుకవలసిన అవసరం లేకుండాచేసినప్పుడు యింకా అటువంటి పనులెవరైనా చేస్తే వాళ్ళని కఠినంగా శిక్షించాలి. నేను నీతో వాదించకపోతే యీ కథ మాకు తెలిసేదికాదు గదా" అంటూ యింటికి వెళ్ళడానికి లేచాడు యింజనీరు జగన్నాథం.






కాశీపతి నాకు చాలా మంచి స్నేహితుడు. ఈనాటిదికాదు మా స్నేహం. ఇరవై తొమ్మిదేళ్ళనుంచి ఒకరినొకరం ఎరుగుదుం మేం. మా అభిరుచులు, మనసులు కలవటంవల్ల మా మైత్రి గట్టి పడుతూ వచ్చింది కాని, కొంచెం కూడా తగ్గలేదు.

కాశీపతి, నేను సమవయస్కులం. మొట్టమొదటిసారి, మా పదమూడో ఏట, కలిసాం ఇద్దరం. ఏ రోజో, ఎలాగో, నాకు గుర్తులేదు. మొదట ఏం మాట్లాడుకున్నామో కూడా గుర్తులేదు. కాని మా స్నేహం కలిసింది మాత్రం సంగీతం మేష్టారు ఇంట్లోనే.

నేను, కాశీపతి వీణ నభ్యసించాము. అదృష్టవశాత్తు కాశీపతికి వీణ వాయించటం బాగా పట్టుపడింది. నేను మధ్యలోనే మానేసి వుద్యోగంలో స్థిరపడ్డాను. కాశీపతి ఇప్పుడు గొప్ప వైణికుడు. కాశీపతి వీణ వాయిస్తూంటే వినడం ఓ చక్కని అనుభవం.

మా ఇద్దరికీ ఒకటి, రెండు సంవత్స

రాల తేడాలో వివాహాలు అయి పోయాయి కాశీపతికే అయింది ముందు. కాశీపతి మామగారికి రైస్ మిల్ ఒకటి వుంది. కాశీపతి, ఆయన తదనంతరం రైస్ మిల్‌ని నడుపుతూ, వీణ కచేరీలు చేస్తున్నాడు.

కాశీపతికి భార్యంటే వల్లమాలిన అభిమానం. "నా భార్య లేకపోతే నేను బ్రతకలేను" అని నోరుతెరిచి చెప్పక పోయినా, ఆ విధంగా ప్రవర్తించేవాడు. ఆవిడ నోరు అంత మంచిదికాదు. కాశీ పతిని తిట్టనిరోజు అరుదనుకుంటాను, ఆవిడ కాశీపతిని తిట్టడం ప్రారంభించిన రోజునుంచి, గయ్యాళి అయినా, ఆవిడకి కూడా కాశీపతి అంటే మక్కువ ఎక్కువ.

కాశీపతి నాకు మరింత దగ్గరయ్యాడు గత అయిదేళ్ళుగా. అందుకు కారణం నా భార్యపోయి, నేను వంటరిగాణ్ణి అవటం. సంతానం లేకపోవటంవల్ల నేను చెయ్యికాల్చుకుంటూ, నా తిండి నేనే వండుకోవాల్సి వస్తోంది.

నా పరిస్థితి కాశీపతికి బాగా జాలి కలిగించింది. నేనున్న స్థితిలో కాశీపతి బహుశ వుండలేడనుకుంటాను అలా భార్యావిహీనుడై వంటరిగా గడపడం కాశీపతికి నరకంతో సమానం అను కుంటాను. అందుకే అంటూంటాడు.

"మళ్ళీ పెళ్ళి చేసుకో."

నాకు పెళ్ళిమీద ఆసక్తి చచ్చి పోయింది మా ఆవిడ బ్రతికున్నప్పుడే. సంసారం అంటే విరక్తి ఏర్పడి చాలా సంవత్సరాలవడంవల్ల, జీవితం ఇప్పుడే బావుంటోంది అనిపిస్తోంది. మళ్ళీ ఆ పొరపాటు చేయదలచుకోలేదు.

ప్రేమ గురించి నాకు కొన్ని నిశ్చి తాభిప్రాయాలున్నాయి ఇద్దరు కలిసి ఒకేచోట జీవించటం జరిగితే, కొంత కాలానికి కాకపోయినా, కొంతకాలాని కయినా ఆ ఇద్దరిమధ్యా ప్రేమ జని స్తుంది. ముందరనుంచే ఒకరంటే మరొకరికి ప్రేమవుంటే, ఆ ఇద్దరూ కొంతకాలం కలిసి జీవిస్తే, వాళ్ళిద్దరి మధ్యా ప్రేమ నశిస్తుంది క్రమంగా... లేదా గాఢమవుతుంది. నా వుద్దేశంలో, అంటే, ప్రేమకి తొలిమెట్టు ఇద్దరు వ్యక్తులు దగ్గిరయే అవకాశం మాత్రమే. శారీరకంగానే బలపడుతుంది ప్రేమ.

అలాంటి అవకాశం శూన్యమయితే, ప్రేమ గురించిన ప్రశ్నే వుండదు. ప్రేమంటే ఇంతేనని నా అభిప్రాయం.

* * *

అర్ధరాత్రి కాశీపతి రెండో కొడుకు వచ్చి మా యింటి తలుపు తడితే మెల కువ వచ్చింది నాకు. లేచి తలుపు తెరచి ఏం జరిగిందని అడిగాను.

"నాన్నగారు పిల్చుకు రమ్మన్నారు మిమ్మల్ని వున్నపళంగా. వేదవతి చచ్చి పోయింది" చెప్పాడు.

"అరే! ఎప్పుడూ" అన్నాను. తలుపు దగ్గిరకి నొక్కి, బయట గొళ్లెం పెట్టి కాశీపతి దగ్గిరకు బయలుదేరాను. ఎదురిల్లే కాశీపతిది.

వేదవతి కాశీపతి రైస్ మిల్‌లో పని చేసే క్షేత్రి భార్య. ముప్పై, ముప్పై అయిదు మధ్యుంటుంది వేదవతి వయసు. మాకన్నా ముందే వేదవతి వివాహం అయింది. కాశీపతి మామగారు, కాశీపతి పెళ్ళయ్యాక, వేదవతి భర్తకి తమ మిల్లులో వుద్యోగం ఇచ్చాడు.

వేదవతి, కాశీపతి, నేను—మేం ముగ్గురం ఒకరికొకరు బాగా తెలుసు. వేదవతి పుట్టి, పెరిగింది కాశీపతి ఇంట్లోనే. ఇంటిపని చాలాభాగం వేదవతే చేస్తుంది

కాశీపతి ఇంటి వెనక అవుట్ హౌస్‌లో, వరండాముందు చాపవేసి పడుకోపెట్టారు వేదవతి శవాన్ని. చికెన్‌పాక్స్ ఆమెకి వచ్చిన సంగతి తెలియదు నాకు. మొహం ఘోరంగా మారిపోయింది చికెన్‌పాక్స్‌వల్ల. నాటు వైద్యంతో ముదరపెట్టిన కారణంగా ఆ పాడురోగం బలితీసుకుంది ఆ ఇద్దరు పిల్లల తల్లిని.

మనిషికి మరో మనిషి సహాయం ముఖ్యంగా మూడుసార్లు వస్తుంది. కానుపప్పుడు పెళ్ళి జరిగేటప్పుడు. మూడోసారి చావప్పుడు.

వేదవతి మొగుడు శవానికి కొద్దిగా దూరంగా కూర్చుని ఏడుపుని దిగమింగుతున్నాడు. కాశీపతి ధైర్యం చెప్తున్నాడు వేదవతి మొగుడుకి. అందరం తలోదిక్కూ బయలుదేరాం చేయాల్సిన కార్యక్రమానికి కావల్సిన ఏర్పాట్లకి.

నేను నాకు అప్పచెప్పిన ఏర్పాట్లు చేసి, తెల్లవారుజామున తిరిగి వచ్చాను. కాశీపతి భార్య నిద్రపోతోంది నేలమీద కొంగుపరచుకుని. కిటికీలోంచి ఆవిడ తప్ప, కాశీపతి కనబడలేదు నాకు.

ఇంటి వెనకాల అవుట్‌హౌస్‌వైపు నడిచాను. అవుట్‌హౌస్ ముందున్న దృశ్యాన్ని చూసి చటుక్కున ఆగాను. వేదవతి శవం అక్కడే వుంది వేదవతి మొగుడు లేడక్కడ. కాశీపతి కొడుకులూ లేరక్కడ. ఒక్క కాశీపతి మాత్రమే ఉన్నాడు ఇప్పుడు.

వేదవతి శవాన్ని తన ఒళ్లో పడుకోపెట్టుకుని శూనిరాగం తీస్తున్నాడు. ఎంతో బలవంతంగా కాశీపతి తన దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నాడని అర్థమైంది నాకు. అంతకు మునుపెన్నడూ కాశీపతి ఏడవటం గమనించలేదు నేను. తన మామగారు మరణించినప్పుడు కూడా ఇంతగా ఏడవలేదు కాశీపతి.

నాకు ఆశ్చర్యంవేసింది. చికెన్ పాక్స్ అందే అందరికీ భయమే. వేదవతి మొగుడే ఆ శవాన్ని తాకకుండా, దూరంగా కూర్చుని బాధ

పడ్డాడు. కాశీపతి మాత్రం ఆ శవాన్ని అక్కున చేర్చుకుని రోదిస్తున్నాడు, ఒంటరిగా, రహస్యంగా!

నా స్మృతిపథంలో లీలగా మెదిలిందో సంఘటన. చాలా చాలా సంవత్సరాల క్రిందటి సంఘటన. కాశీపతి పెళ్లికాక ముందు ఓసారి అయిదు రూపాయలు పెట్టి ఎర్రపూల రవికల గుడ్డకొన్నాడు

"దేనికి?" అడిగాను నేను.

"నా ప్రేయసికి" అన్నాడు ఎగతాళిగా నవ్వి.

"అబ్బో! ఎవరో?" అడిగాను

"రహస్యం."

గుళ్ళో అమ్మవారికి అయివుండచ్చనుకున్నాను. కాని కొన్నినెలల తర్వాత అచ్చం అలాంటి రవిక వేదవతి కట్టుకోగా చూసాను. ఆ సంగతి కాశీపతిని అడగలేదు నేను. కాశీపతీ చెప్పలేదు నాకు. మర్చిపోయాను.

నేను చూస్తూండగానే కాశీపతి గబగబా వేదవతి శవాన్ని చాపమీదికి జరిపి, దూరంగా జరిగి కూర్చుని, కళ్ళనీళ్ళు తుడుచుకున్నాడు.

నాకు ఎంతో విచిత్రం అనిపించింది కాశీపతి ప్రవర్తన.

* * *

'ప్రేమ' గురించి న్నాకు పూర్తిగా తెలుసనుకున్నాను. కాని నాది పొరపాటు. కేవలం ఇద్దరు వ్యక్తులు కలసి జీవించినంతమాత్రానే "ప్రేమ" కలగదు. ప్రేమకి తొలిమెట్టు దగ్గరయే అవకాశం మాత్రమే కాదు. శరీర సంపర్కం కూడా కాదు.

ప్రేమ శారీరకం మాత్రమే అవుతుంది అలా అయితే. మరో ప్రేమ కూడా వుంది. దాన్ని గురించి నాకు ఇంకా బాగా తెలియదు. కాశీపతి నేను అడగకుండా దాన్ని గురించి చెప్తాడను కోను నేనెలా అడగను? అందులో వేదవతి పనిమనిషి కూతురు.

ఒకటిమాత్రం తెలిసింది. ఒక రకం ప్రేమకి కొలబద్ద "ముద్దు" అయితే, మరోరకం ప్రేమకి ప్రమాణం "కన్నీటి బొట్టు" మాత్రమే. కాని, ఏది గొప్పది? నాకిప్పుడర్థమైంది.

# మారని కాలంలో మారిన మనుషులు

కురుమద్దాలి విజయలక్ష్మి

అయిదు గంటలయింది.

శ్రీపతి ఆఫీసునుంచి ఇంట్లో అడుగు పెడుతూనే బాత్‌రూమ్‌లోకి దూరాడు, కాఫీ అయినా తాగకుండ.

శకుంతల మనసులో లీలగా అనుమానం ప్రవేశించింది. అలా వంట గదిలో కూర్చుండిపోయింది.

శ్రీపతి స్నానం చేయటం అయింది కాబోలు. బెడ్‌రూమ్‌లోంచి కేక పెట్టాడు. "శకూ! కాఫీ తీసుకురా!" అని.

శకుంతల కాఫీ కప్పుతోపాటు అరిటికాయ బజ్జీలు ప్లేటు నిండుగా పెట్టుకు తీసుకు వచ్చింది.

"ఇప్పుడు బజ్జీలెందుకు? అనవసరం

సుదీర్ఘమైన లేఖ రాయటం ముగించి ౨తకం పెట్టింది పార్వతి.

౨డు నిమిషాం క్రితం వచ్చి గుమ్మంలో నిలిచిపోయిన కృష్ణ "అమ్మా!" అన్నాడు.

పార్వతి తలఎత్తి ాచింది. కృష్ణ తనవైపు రాసిన కాగితాలవైపు మార్చి మార్చి చూడటం గమనించింది. "ఎంత సేపయిందిరా కృష్ణా! నీ వొచ్చి" అంది, చేతిలోవున్న కాగితాలు మడు

"రెండునిమిషాలు కూడా యి వుండదు. మనిషి వచ్చిన అలికిడే నించకుండా అంతగా రాసింది ఏమి టమ్మా? కథ కాదు కదా! ఇప్పుడు ఇంటింటా ఓ రచయిత్రి వెలుస్తున్నది. మనింట్లోమటుకు ఆ లోటు ఎందుకుండా లని రచనలు చేస్తున్నావా ఏమిటి? మా అమ్మే ఓ రచయిత్రి అయితే యీ రచ యిత్రులంతా..."

"ఆపరా వేళాకోళం. ఏం నే మటుకు రచయిత్రి కాకూడదా? రాయతగనా?" కృష్ణ మాటలకు అడ్డువచ్చి నవ్వుతూ అంది పార్వతి.

"నువ్వు చరయిత్రివయితే కథల గురించి ఆలోచించే పనిలేదు, ముందుగా మన కథ రాయొచ్చు."

పార్వతి పేలవంగా నవ్వి వూరు కుంది.

"ఏమిటమ్మా! అన్ని కాగితాలు రాసావు?" కాసేపాగి కృష్ణ అడిగాడు.

"ఇక్కడ జరిగినదంతా శకుంతలకు రాశాను. జరిగింది నీకు తెలుసు, నాకు తెలుసు, రఘుకి తెలుసు. మన శకుకేనా తెలియంది. అందుకే వివరంగా అంతా రాశి పండక్కి పిలవటానికి నీవొస్తున్నట్లు కూడా రాసాను."

"మంచిపని చేశావమ్మా! రాస్తే బాగుంటుందని నాకూ తోచింది. నీతో ౩బుదామనుకుంటూ వుండగానే ఆపని పూర్తిచేసావు."

"నాకు తెలుసు కృష్ణా! నీగురించి నా అంచనా ఏ విషయంలోనూ పొరపా టుండదు, అనుకుంది పార్వతి."

"ఇప్పుడే పోస్ట్‌చేసి రానా?"

"వద్దు సాయంత్రం నే బజారు వెళ్ళాలి అప్పుడు పోస్ట్ చేస్తాను.." కాగి తాలు మడతపెడుతూ అంది పార్వతి.

తల వూపి కృష్ణ గదిలోకి వెళ్ళాడు.

"నా బిడ్డలు రత్నాలు." అనుకుంది పార్వతి

(సశేషం)




గుమాస్తా నరసింహానికి నారాయణ రావు మీద ఎంతో కసిగా ఉంది. కోపంగా ఉంది. పీక పిసికి చంపేద్దామన్నంత ఉక్రోషంగా ఉంది.

ఆలా ఎందుకుంది...ఎందుకు తను నారాయణరావంటే యింత జెలసీగా ఫీలవుతున్నాడూ అని నరసింహం ఎన్నో సార్లు తనను తాను ప్రశ్నించుకున్నాడు. కాని ఎన్నడూ జవాబు దొరకలేదు నరసింహానికి. అసలు ప్రత్యేకంగా సమాధానం ఒకటుంటే గదా దొరకడానికి.

నారాయణరావు తనకంటే కింద వాడు...తనకంటే చురుకైనవాడు... తనకంటే మంచివాడు. తన ఆఫీసులోనే, తన ఎదురు సీట్లోనే కూర్చుని తనకంటే గుమాస్తా పనిని బహుచక్కగా నిర్వహిస్తున్నవాడు...దీపంలాంటి తన ప్రక్కన ట్యూబ్‌లైటులా ఉండి తన ఉనికిని మరుగుపరుస్తున్నవాడు.

—అందుకే...అందుకే నారాయణ రావంటే తనకు ఈర్ష్య.

నారాయణరావంటేనే ఆఫీసులో అందరూ లైక్ చేస్తారు. అతనంటేనే ప్రతివారూ...లేడీ టైపిస్టు దగ్గర్నుండి ప్యూన్ మల్లయ్యదాకా అందరూ అభిమానిస్తారు. తమ బాస్, అసిస్టెంట్ డైరక్టర్

శ్రీమతిచంద్రిక కూడా నారాయణరావంటే ఎంతో ఆదరణగా చూస్తుంది. అదే తన నైతే...ప్చ్...ఒట్టి గంటిలో ఈగలా—

'నారాయణరావు...నారాయణరావు'- కసిగా గొణుక్కున్నాడు నరసింహం... గొణుక్కుని ఫైల్లో రాస్తున్నవాడల్లా గంభీరంగా తలెత్తి ఎదుటి సీటువంక చూశాడు. అతని ముఖం హత్య చేయ బోతున్న మనిషిముఖంలా ఎర్రగ ఉంది.

నారాయణరావు ఏదో ఫైలును మూడి వేసి ప్యూన్‌ను పిలిచి దాన్ని అసిస్టెంట్ డైరక్టర్‌కిమ్మని చెప్పి గబగబా బయట కెళ్ళిపోయాడు.

మల్లయ్య ఫైల్‌ను చంకలో పెట్టు కుంటూండగా నరసింహం పిలిచాడు. ఎంతో ఆతురతగా పిలిచి "మల్లయ్యా దాంతోపాటు నా ఫైల్‌ను కూడా మేడమ్ దగ్గరికి తీసుకెల్దువు గాని ఓ క్షణమాగు" అన్నాడు.

"మంచిదండీ" — బీడీ అంటించు కుంటున్నాడు ప్యూన్, నారాయణరావు బాపతు ఫైల్‌ను నరసింహం టేబిల్ పై పెట్టి.

ఫైల్లోని నోట్‌లో చివరి వాక్యం రాస్తున్న నరసింహం కలాన్నాపేసి "మల్లయ్యా — ఈలోగా క్యాంటీన్ కెళ్ళి నా ఖాతాలో నువ్వో టీ తాగి నాకో టీ పట్టుకొస్తావా" అన్నాడు ఎంతో లోతుగా ఆలోచిస్తూ.

"మంచిదండీ—"

"పో మరి."

మల్లయ్య వెళ్ళిపోయాడు.

నరసింహం ముఖంపై చెమటలు వరదలా ముంచుకొస్తున్నాయి... సెక్షన్‌లో ఎవరూ లేరు. తనొక్కడే. ఎదురుగా మేడమ్ గది. ముందర టేబిల్‌మీద నారాయణరావు సీట్లోని ఫైల్ — యిదే చక్కనిఅవకాశం...చక్కని అవకాశం.

చుట్టూ చూశాడు భయం భయంగా. చూచి నారాయణరావు ఫైల్‌ను విప్పి, తన ఫైల్ ప్రక్కనే పెట్టి, మళ్ళీ చుట్టూ ఓ సారి కలయజూచి, డ్రాయర్‌లోనుండి ఎప్పుడినుండో తను దాచి ఉంచిన కాగి తాన్ని బయటకి తీసి గబుక్కున నోట్ ఫైల్ కాగితానికి పిన్ చేసి, చక చకా రెండు ఫైళ్ళ రేపర్స్‌నూ కట్టేసి... నిండుగా నిట్టూర్చి...వెనక్కి సీట్లోకి ఒరిగి 'హమ్మయ్య' అనుకున్నాడు.

అలా నిశ్శబ్దంగా చూస్తూ కూర్చున్న నరసింహానికి ఎదురుగా ఉన్న రెండు ఫైళ్ళలోనూ నారాయణరావు ఫైల్ ప్రేల బోయే డైనమైట్‌లా కనిపిస్తోంది. అతని గుండెలు యిక ఆగిపోతాయా అన్నంత స్పీడ్‌గా కొట్టుకుంటున్నాయి

మల్లయ్య వచ్చాడు. వచ్చి టీ యిచ్చి ఫైళ్ళను తీసుకెళ్ళాడు.

నరసింహం కళ్ళు బాస్ గదినే చూస్తు న్నాయి. యిక జరుగబోయేదంతా అతని మనసుపై పరుగెత్తే నీడలా కదులుతోంది ...ఒకవైపు సంతోషం...మరో వైపు భయం. కాస్సేపయింతర్వాత నారాయణ రావు వచ్చాడు. అతను ఉరికంభ మెక్క బోయే ముద్దాయిలా కనిపిస్తున్నాడు నరసింహానికి.

బాస్ గదిలోనుండి బజర్ మ్రోగింది. ప్యూన్ మల్లయ్య ఉరికాడు లోపలికి. ఉరికినవాడు మళ్ళీ తుఫానుగాలిలా బయటికి పరుగెత్తుకొచ్చి "మేడమ్ మిమ్మల్ని రమ్మంటున్నార్సార్" అన్నాడు నారాయణరావుతో.

అంతా గమనిస్తున్నాడు నరసింహం ఫైల్లో ఏదో రాస్తున్నట్టు నటిస్తూ.

నారాయణరావు పులి నోట్లోకి మేకలా... యిక మేడమ్ గదిలో వాతావరణం బ్రద్దలైపోయి ... ప్రళయం సంభవించి—దీంతో నారాయణరావు సంగతి "ఫినిష్—"

నరసింహంలో సంతోషం వరదలా ముంచుకొస్తోంది

ఒకటి...రెండు...మూడు — పది నిమిషాలైంది...వ్చ్...ఏదీ ... మేడమ్ గాండ్రించడం లేదు. నారాయణరావు బయటికి రావడంలేదు. యింకా తనను కుంటున్న బీభత్సం జరగడంలేదు.

ఏమైంది...ఏమైంది.

యింకో రెండు నిముషాల తర్వాత నారాయణరావు బయటి కొచ్చాడు మేడమ్ గదిలోనుండి, ఎంతో మామూలుగా, చిరునవ్వుతో

మరి...మరి...తను పెట్టిన డైనమైట్ సంగతో — హృదయాన్ని పిసుక్కుంటున్న నరసింహానికి "మేడమ్ రమ్మంటున్నార్సార్" అన్న మల్లయ్య మాట వినబడింది

తనను రమ్మంటోందా...ఎందుకు... ఎందుకు...

మేడమ్ గదిలోకి వెళ్తూ నారాయణరావువంక చూశాడు నరసింహం... నారాయణరావు నిండుగా, గంభీరంగా, ట్యూబ్‌లైట్‌లా ఉన్నాడు ముఖంలో కాంతితో.

ఎదురుగా మేడమ్ ఆడపులిలా... నాల్కలు చాస్తున్న మంటలా ... అగ్ని గుండంలా—

"యూ బ్రూట్...ఏమిటిది—"

తన ఫైల్‌ను తన ముఖంకేసి కొట్టింది—

ఫైల్ చిందరవందరగా తెగిపోయి... తను పెట్టిన కాగితం ... ఎదురుగా, డియర్ చంద్రికా,

ఐ లవ్ యూ—

యువర్స్—

క్రింద పేరులేని ప్రేమలేఖ ... తనే సృష్టించిన ప్రేమలేఖ ... నారాయణరావును అపకీర్తిపాలు చేయాలని తనే రాసిన ప్రేమలేఖ—

నారాయణరావు ఫైల్‌లో పెట్టాలనుకుని తొందరలో, భయంలో, పొరపాటున కాగితాన్ని తన ఫైల్లోనే పెట్టాడా తను.

నరసింహం ముఖం కాలిపోయిన కాగితంలా నల్లగా వికారంగా తయారైంది.

"ఐయామ్ సస్పెండింగ్ యూ ఫర్ ఎ వీక్—గో" అరిచింది మేడమ్.

ఎవరో గుండెల్లో గునపాలతో పొడుస్తున్నట్టనిపించింది నరసింహానికి.



# అందిన ఉత్తరం

బాలసరస్వతీదేవి

నవంబరు నెం చివరిరోజులు. రాత్రి తొమ్మిది గంటలు దాటింది ఆకాశం పూచిన పువ్వులా చందమామ వికసిస్తోంది. వెన్నెల పరిమళం లోకమంతా కమ్ముకుంటోంది.

వాళ్ళిద్దరూ ఆ వెన్నెల్లో తడుచుకుంటూ, ఒకరి ప్రక్కన ఒకరు అడుగులు వేసుకుంటూ మౌనంగా గోదావరి ఒడ్డున నడుస్తున్నారు ఆమె అతనికన్నా ఓ అడుగు ముందు నడుస్తోంది. సన్నగా, బలహీనమైన శరీరం. పొడుగాటి ముక్కు. ఆ ముక్కుకు వెల మూడు వరహాలో, ముప్పయి పైసలో...ఎవరికీ తెలీదు.

అతను మాత్రం ఆమెని 'దేవత' అంటాడు...అనడు. లోలోపల అనుకుంటాడు. అనుకుంటూ ఆమెకేసి చూస్తాడు. అతను చూస్తున్నట్లు, ఆమె 'చూస్తుంది'! లోలోన నవ్వుకుంటుంది

నాలుగడుగులు వేసి, నరమావిడి చెట్టు దాటి, పచ్చిక పరుపుమీదికి వచ్చిన తర్వాత——

ఆమె ఆగింది

అతను ఆగేడు.

మౌనం నిశ్శబ్దంగా నిలుచుని చూస్తోంది. ఆమె అతనికేసి చూస్తోంది. ఆ చూపులో లక్ష ప్రశ్నలు. వెయ్యి సందేహాలు...

"ఇక్కడ కూచుందాం..."

తలూపింది. తెల్లపవిట భుజాలచుట్టూ తిప్పుకుని, తెల్ల కాగితంలో చుట్టి విసిరేసిన మొన్నటి మల్లెచెండులా ముడుచుకుని కూచుంది. ఆమెకి అడుగుదూరంలో అతను కూచున్నాడు. వాళ్ళిద్దరి నీడలూ పడ్డచోట పచ్చిక ఆశగా చూస్తోంది...

"చలేస్తోంది..."

"అవును!" అన్నాడతను. ఆమె కోసం ఆ చలినంతా మూటకట్టి బంగాళాఖాతంలోకి తన్నేయగల శక్తి తనకు లేనందుకు విచారిస్తున్నాడు.

"మీరు ... చలికోటు తెచ్చుకోవలసింది..."

"నేను కోటు కప్పుకుని వెచ్చగా కబుర్లు చెబుతూంటే, నువ్వి చలికి వణుకుతూ ఒంటిగా కూచోవటం ఏం న్యాయం?"

"ఫర్వాలేదు. చలిని భరించటం నాకు అలవాటే!"

"ఆ అలవాటు ఇంకా అయినట్లుగా లేదు. ఈ కాస్త చల్లదనానికే నీ వొళ్ళు ఎలా కంపిస్తోన్నదో చూడు."

"కంపించటం కూడా నా వొంటికి అలవాటే!" అని పల్చగా నవ్వింది. చెట్టుమీదినుంచి రెండు తెల్లపూలు రాలి పడ్డాయి.

"ఇంకా నీకు ఏవేం అలవాటు?" అన్నాడు నవ్వుతూ.

నవ్వింది!

అతను పచ్చికలో వెల్లకిలా పడుకుని, చేతులు తలకింద పెట్టుకుని...ఏదేకంగా ఆమెకేసి చూస్తున్నాడు...

"ఏవిటి?"

నవ్వేడు!

"పోనీ...మీ పేరు చెప్పండి, సర్దాగా!"

"వూహించు!"

"వేణు, గోపీ, ప్రసాద్, రాజు, శ్రీనివాస్, శశాంక ... లాంటి నూటొక్క పేర్లు చెప్పి, అలిసిపోయి...ఓడిపోయి ఒప్పేసుకుంది."

"నా పేరు చెప్పనా పోనీ?"

"తెలుసు!"

క్షణం వూరుకుని——"పది దినాలుగా

రోజూ అడుగుతున్నారుట...కదూ ?" అంది

అడగటంకాదు. తనకోసం కొన్ని వందల మైళ్ళు ప్రయాణంచేసి ... ఆత్రంగా పరిగెట్టుకు వచ్చేనంటే— "ఎందుకు ?" అంటుంది. ఏం చెబుతాడు ? పోనీ చెప్పేస్తే ? వద్దు. తనెవరో ఆమెకి తెలియనవసరంలేదు.

నవ్వి — "నిన్ను చూడాలని !" అన్నాడు.

"ఏవుంది నాలో ?"

"నీకు తెలీదూ ?"

తలొంచుకుంది. వాలిన ఆ రెప్పల మీద వెన్నెల నీలంగా వెలుగుతోంది.

నది నగ్నంగా నిద్రిస్తోంది. చంద మామ అమాయకంగా ఆకాశంమీదినించి కిందికి చూస్తోంది.

ఏదో పిట్ట వికృతంగా అరుచుకుంటూ తలమీదినించి ఎగిరి వెళ్ళింది. జడుసు కుని—ఆమె అతనిమీద పడింది !

"భయ వేసిందా... ?

"నోరు లేని జీవులంటే నాకు భయం లేదు !"

"మరి, ఎవరంటే భయం?"

మౌనం

"నీకు మనుషులంటే కోపం కదూ.."
అన్నాడు.

"మనుషులంటే నాకు కోపం అని ఎలా కనిపెట్టేసారండీ ? మీతో ఏవన్నా కోపంగా మాట్లాడేనా కొంపతీసి ?" అని నవ్వి—

"మీరు మనుషులేగా ! మీ మీద నాకేం కోపంలేదు. ఒట్టు !" అని తల మీద చెయ్యి పెట్టి నవ్వింది.

"అంటే — మరొకళ్ళమీద కోపం వున్నదన్న మాటేగా ?"

"ఎవరో ఒకళ్ళమీద, ప్రతి ఒకళ్ళకీ కోపం ఎప్పుడో ఒకప్పుడు వుంటూనే వుంటుంది. పులిమీద లేడికీ, పాము మీద కప్పకి కోపం ఎప్పుడూ వుంటుంది !"

"కాని మనుషుల్లో పులులూ ... పావులూ...వుండవు. మనిషి మనిషిని చంపితినడు !"

"తినడు ! కాని, చంపుతాడు... ! మీలాటివాళ్ళకి కనిపించని చావు. రోజూ రోజుకి చస్తూ ... క్షణం...క్షణం ... బ్రతికే చావు..."

"ఎవరు, నిన్నింతగా హింసించిన ఆ దురదృష్టవంతుడు ?"

గప్పున తలెత్తి చూసింది. తొట్రుపడింది. తలొంచుకుంది.

ఆమె అతనికి అర్థమయింది. నిశ్శబ్దం...

నిద్రలో కదులుతోన్న నదీకన్య నిశ్వాసాల సవ్వడి...భయ భక్తులతో వింజామరలు వీస్తోన్న చిరుగాలి రెప్పల చప్పుడు...

ఆమె—అతనికి తపోభంగం చేసింది

"ఏవిఁటి ఆలోచిస్తున్నారు ?"

"నీ గురించే. ఇందాకటి నీ అంచనా ప్రకారం, నేను పులినా ? పామునా ? అని."

"రెండూ కాదు. మనసున్న ఓ మనిషి !"

"నా మనసు గురించి నీ కప్పుడే ఎలా తెలిసిపోయిందబ్బా ?"

"నాకు మనసుల్ని చదవటం చేత నవుతుందబ్బా !" అని గలగలా నవ్వింది.

"అబద్ధాలు !" అన్నాడు దబాయింపుగా. "నా గురించి నీకు ఏవంత కూడా తెలీదు !"

"ఎందుకు తెలీదు ? మీ ఎత్తు ఐదడుగుల పదంగుళాలు బరువు సుమారు నూట యాభై పౌన్లు. కెరటాల్లా క్రాపూ...కలలు కాచేట్టు కళ్ళు...ఈ కళ్ళు అమ్మాయిల మనసుల్ని యాతన పెట్టేస్తాయి. ఎడ్వెంచర్స్ అంటే ఇష్టం. ఆడపిల్లలతో అపరాత్రి గోదావరి గట్టున కూచుని కబుర్లాడటం సర్దా. చాలా ? ఇంకా చెప్పేయనా ?"

"నే చెబుతాను అనగా అనగా ఓ వూళ్ళో ఒక అమ్మాయి. అందాల బొమ్మ. ఆ అమ్మాయిని ఓ అబ్బాయి చూసేడు. అబ్బాయిని అమ్మాయి చూసింది. అతను నవ్వేడు. ఆమె సిగ్గుపడి పారిపోయింది. తర్వాత, రోజూ అతను ఆమెకి కనిపిస్తాడు నవ్వుతాడు ఆమెకి భయం, ఎవరన్నా చూస్తారని బెదురుగా, భయంగా . చుట్టూ చూస్తుంది ఆమె భయాన్ని అతను గ్రహిస్తాడు ఫర్వాలేదన్నట్లు పల్చగా నవ్వి—కళ్ళతోనే ఆమెకి ధైర్యం చెబుతాడు.

ఒకరోజు అక్కో ... ఎవరో చూసేరు. కూకలు వేసేరు. ఆమె భయపడిపోయింది. అతనికి కనిపించటం మానేసింది. అతనికి కనబడకుండా కిటికీలోనించో చాటుగా అతన్ని చూస్తుంది. అతను దిగులుగా, ఆశగా... గుమ్మంకేసి చూస్తాడు. 'శూన్యం' చూస్తుంది. తల దించుకుని, భారంగా అడుగులు వేసుకుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోతాడు. ఆమె గుండె పగులుతుంది. పరుపుమీద పడి, ఆవురుమని ఏడ్చుకుంటుంది...

అతను పిచ్చివాడిలా ఐపోయాడు. గడ్డం మాసింది. దుస్తులు మాసేయి. నవ్వు మాయమయింది.

ఆమెకి ఆమె పెద్దలు వేరొకరితో వివాహం చేయడానికి నిశ్చయం చేస్తున్నారు...

ఈ సంగతి అతనికి తెలిసింది. గుండె పగిలింది. ఎలాగో ఆమెకి ఓ కబురు పంపేడు. సాయంకాలం, ఆలయం వెనుక తోటలోకి రావాలి..."

"అమ్మో.. !" అనుకుని, వణికింది.

ఏడ్చుకుంది. చివరికి తనకి తాను ధైర్యం చెప్పుకుని— బయలుదేరి వెళ్ళింది.

అతనిది కోపం కాదు. ఎంత సేపటికీ మాట్లాడడు. చివరికి. ఆమె ఏడ్చేసింది. అతను కరిగిపోయాడు.

''...నీవే ఇంత చదువుకుని నా మానాన నేను బతుకుతోన్న సామాన్యుణ్ణి నేను. నన్ను నీ చూపులతో కవ్వించి తపింపించి, మతి పోగొట్టి శలభంలా నీ చుట్టూ తిప్పుకున్నావ్. నీ అగ్నిజ్వాల నన్నేవిధంగా మాడ్చి పారేసిందో చూడు. అమాయకుణ్ణయిన నన్నెందుకిలా పుద్రేకపరిచావ్? ఇప్పుడెందుకిలా దూరమైపోతున్నావ్? మీవాళ్ళు నీకు వేరే సంబంధాలు చూస్తున్నారని తెలిసింది. మన పెళ్ళికి మీ ఇంట్లో ఎలానూ ఒప్పుకోరు. వెళ్ళిపోయి, రహస్యంగా వివాహం చేసుకుందాం...'' అన్నాడు.

ఆమె తలొంచుకుంది. మాట్లాడదు.

''అలా మౌనంగానే ఇన్నాళ్ళూ నన్ను ఏడిపించి చిత్రవధ చేసేవ్. ఇక వూరుకునేది లేదు. చెప్పు! నన్ను వివాహం చేసుకోవడం నీకు ఇష్టమా? కాదా?'' అన్నాడు గట్టిగానే. ఆమె తలొంచుకుని ఏడ్చింది.

''నువ్వు ఏడుస్తున్నావ్...! నన్ను ఏడిపిస్తున్నావ్...! నీ కిష్టంలేదూ, చెప్పు! వెళ్ళిపోతాను. ఇక్కణ్ణించే కాదు. శాశ్వతంగా ఈ లోకంనించి...'' అన్నాడు.

ఆమె కావురుమంది. వణికిపోతూ... అతన్ని కావిలించుకొని ఏడ్చింది!...

తర్వాత, ఇద్దరూ ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు సపథాలు చేసుకున్నారు.

—ఒకరోజు రాత్రి ఇద్దరూ కలిసి రహస్యంగా వెళ్ళిపోవడానికి నిశ్చయం చేసుకున్నారు...

''వొద్దు...వొద్దు...చెప్పొద్దు!'' అంటూ అరిచిందామె. మోకాళ్ళలో తలొంచుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

అతడు ఆగిపోయి, ఆశ్చర్యంగా ఆమెకేసి చూసేడు.

''నీలూ...'' అన్నాడు ఆర్ద్రంగా.

గప్పున తలెత్తింది. కళ్ళు జ్వలించేయి. ''ఎవరు మీరు?''

'ఎవరో' అతను చెప్పలేదు. చెప్ప వలసిన సమయమూ కాదు.

''ప్రపంచంలో...నన్ను నీలూ అని పిలిచేవాళ్ళు ఒకే ఒక్కరు వున్నారు. ఆ ఒక్కరూ...మీరు కాదని తెలుస్తూనే వుంది. మరి, ఎవరు మీరు...? ఎందు కొచ్చేరు? ఎందుకు...నన్నిలా చిత్రవధ చేస్తున్నారు...?'' ఏడుస్తోంది.

ఏమని చెబుతాడు? 'ఎవర్నని' చెబుతాడు? అసలు ఏవుంది చెప్పడానికి...?...

''ప్లీజ్...నీలూ...'' అన్నాడు. తలమీద చెయ్యి వేసేడు.

పవిట చెంగుతో కళ్ళు వత్తుకుంది. నిన్న పూచి రాలిన పువ్వులా...చూపు..

"మధు బావున్నాడా...?"

అతను ఓ గుటక వేసేడు: "మధు! నువ్వింకా మర్చిపోలేదా...?"

"లేడి, పులిని మర్చిపోతుందా... ఎక్కడున్నా?" అని నవ్వి— ఆ నవ్వులో విషాదానికి వెన్నెల చెమ్మగిల్లి...చలిగాలి జాలి కళ్ళతో దిగులుగా వీస్తోంది —

"మధు ... స్నేహితుడా? చూసి రమ్మన్నాడా సర్దాగా?"

"నిజంగా, 'మధు' ఎవరో నాకు తెలీదమ్మా?"

"తెలీదూ?" అంది తీక్షణంగా. ఆ చూపు అతన్ని చీల్చింది.

"నిజం నీలూ...మీ వూళ్ళో అప్పుడు నా ఫ్రెండు ఒకడు వుండేవాడు. అప్పుడప్పుడు అక్కడికి వచ్చినప్పుడు, నిన్ను చూసేవాణ్ణి. చాన్నాళ్ళ తర్వాత, ఓ సారెప్పుడో మాటల సందర్భంలో...నీ ప్రస్తావన వచ్చి నువ్వు కనబడటం లేదేవని అడిగితే...నువ్వు 'మధూ' అనే అతనితో వెళ్ళిపోయేవనీ...మీ ఇద్దరూ పారిపోయి వివాహం చేసుకున్నారనీ నా మిత్రుడు చెప్పేడు. ఏమయింది? మధూ నీ కూడా రాలేదా...?"

తలొంచుకుంది...కంటినించి ఓ నీటి బొట్టు రాలింది...

* * *

రాజు వర్తమాన రచయిత. సాహిత్యానికి శ్రీకారం చుట్టి పట్టుమని నాలుగేళ్ళు కాలేదు. అప్పుడే రచయితగా మంచి పేరొచ్చింది. అతని కథలు ఐదారు సంపుటాలుగా ప్రింటయి వెలుగులోకి వచ్చేయి. పేరున్న ఓ వారపత్రికలో అతను వ్రాసిన ఓ క్రొత్తనవల సీరియల్‌గా వస్తూ అసంఖ్యాకమైన పాఠకుల అభిమానాన్ని చూరగొంటోంది.

తన పాఠకులంటే అతనికి నిచ్చి ప్రేమ రోజూ ఆఫీసునుంచి రాగానే కాఫీ తాగి, గార్డెన్‌లో సిమెంటు బెంచీమీద ఒంటిగా కూచుని అభిమానుల వుత్తరాలు చదువుకోవడం—అతని దినచర్యలో ఓ భాగం.

ఆ రోజు పోస్టులో నీలంరంగులోవున్న ఓ కవరు అతన్ని అమితంగా ఆకర్షించింది. మిగతా వుత్తరాలన్నీ పక్కన పెట్టి, కవరు ఓపెన్ చేసేడు. అందులోనుంచి లేత నీలంరంగులో వున్న ఓ కాగితం కిందపడింది:

రాజుగారికి!

నమస్తే! మీరలా కాగితాలు వెనక్కి తిప్పేసి, పేరు చూసేసి, "ఎవరీ నీలా సుందరి?" అంటూ బుర్ర గోక్కోనవసరంలేదు. నా పేరు 'నీలూ'. 'సుందరిని' మాత్రం కాదు. కానందుకు విచారమూ లేదు. కాకపోతే మీ కథలంటే ప్రాణం. అవాల్టికి అన్నం మానేసన్నా ఆ డబ్బుతో మీ పుస్తకం కొనుక్కుని చదివేస్తాను. కడుపు నిండిపోతుంది. 'కోస్తోంది' అని నవ్వుకుంటున్నారు కదూ? అమ్మ బాబోయ్! ఎలా కని

పెట్టే [illegible] [illegible]
యలు [illegible]. [illegible]
[illegible]

మొన్న [illegible] [illegible]
మీ ఫోటో [illegible] చూసేను. [illegible]
చెప్పొద్దూ—! [illegible] [illegible]
ను పెళ్ళికి [illegible] [illegible]
వుంటారని [illegible] వూహించు[illegible].
[illegible] మీసాలతో... [illegible]...
మాడగానే ఊహించుకునేంత గంభీరంగా
వుంటారని కూడా అనుకున్నాను. మా
వూళ్ళో ఓ మాస్టారు[illegible]
[illegible]. మీరేమో ఉంగరాల
జుట్టుతో, తెల్ల బుష్ షర్టుతో ఫోటోలో
నించుని నవ్వేస్తున్నారు.. ! మొన్న మా
వీధిలో ఓ అబ్బాయిని చూసేను. అచ్చం
మీలానే వున్నాడు. మీరేనా ? ఓ వేళ
మీరు ఎక్కడున్నా తనపడ్డా—పడక
పోయినా సరే, మిమ్మల్ని ఆనవాలు
పట్టలేనేమో ! పత్రికలో చూసేనను
కోండి. ఫోటోలో వున్నట్లే నిజంగాకూడా
వుంటారన్న గ్యారంటీ ఏవిటి ?

అసలు సంగతి ఏవిటంటే-నిన్న
మీ 'కల్యాణి' చూసేను ! కథలో
కల్యాణి పరిస్థితుల ప్రాబల్యంవలన
'పతిత' అవుతుంది. ఒకరోజున ఆమెని
ఓ యువకుడు చూసేడు. అతని ఒళ్లు
ఝల్లుమంది. ఆమెని శాపవశాత్తూ
భూలోకంలో జన్మించిన దేవతగా భావిం
చుకున్నాడు ! (దేవతలు శాపంకొట్టి
భూలోకానికి వస్తుంటారన్న విషయం
నాకు తెలిసింది. కొంపతీసి, నేనుకూడా
అలాంటి దేవతను కానుకదా ?) ఎంత
[illegible] వచ్చింది [illegible]. అతను కల్యా
ణిని [illegible] [illegible]న్నాడు.
[illegible] [illegible]తో
చెప్పేడు. [illegible] [illegible].
(క్షమించటానికి కాదు. [illegible],
[illegible] [illegible] (?) [illegible]
పెళ్లి చేసేసుకున్నాడు!...

ఎవరండీ ఆ యువకుడు ... ప్లీజ్!
చెప్పరూ ? వూరికే పెళ్లి [illegible]
వచ్చేద్దాం అని. మన్లో మనమాట మీరు
చేసుకోగలరా కల్యాణిని ? ఏం పాపం?
యువకులేగా ? వివాహం కాలేదుగా ?
కోపం వస్తోందా...? రానీయండి.
లేకపోతే, ఈ కాకమ్మ కథలు రాయడం
ఎందుకు ? ఎవర్ని వుద్ధరించడానికి ?
పరమాన్నం తింటూ పేదల ఆకలి
వేగుల గురించి రాసేవాళ్లూ... పతివ్రత
లైన వెళ్లాలని పెట్టుకుని పతితల బతు
కుల గురించి గుండెలు బాదుకునేవాళ్లూ
అంటే అసహ్యం నాకు. మీరు చేయలేని
ధైర్యాన్ని ఎడ్వంచర్ నీ ఎవరో చేయాలి
ఆ 'ఎవరో' ఈ సమాజంనించే నడుం
చుట్టు తువాలు బిగించుకుని ముందుకు
వురకాలని మీ వుద్దేశ్యం. మీలాటి 'ఎస్కే-
పిట్టలకి' కథలురాసే అర్హతలేదు. కనీసం
'కల్యాణి' లాటివి. దయచేసి ఇకముందు
ఇలాటి పిచ్చి కథలు రాయకండి. రాజు

మంచి రచయిత. శక్తిగల రచయిత. ఆ శక్తే' నన్ను బంధించి, మీ అభిమానిగా చేసిపడేసింది. ఆ అభిమానం దెబ్బ తినకుండా కాపాడుకునే బాధ్యత మీ మీద వుంది. మీ బాధ్యతని మీరు మర్చిపోరు కదూ ?

మర్చిపోయినా...పోకున్నా...ఎప్పుడన్నా మీకు వుత్తరాలు రాస్తూనే వుంటాను. కాని... తిరిగి మీవద్దనించి జవాబులు అందుకునే 'అర్హత' నాకు లేదు. ఇంతకన్నా వివరించి చెప్పగల శక్తి లేదు. క్షమిస్తారు కదూ ?

మీ అభిమాన పాఠకురాలు
సీలా.

క్రింద అడ్రసులేదు. వూరు పేరు లేదు. కవరు వెనక్కి తిప్పి, పోస్టల్ ముద్ర చూసేడు. 'రాజమండ్రి' అని వుంది. తిరిగి వుత్తరాన్ని మొదటినించి చివరివరకు చదివేడు. మళ్లీ చదువుకున్నాడు.

పాఠకుల దగ్గర్నించి వుత్తరాలు రావడం అతనికి క్రొత్తకాదు. రోజూ ఎవరో ఒకరి దగ్గర్నించి ఒకటి రెండు వుత్తరాలు వస్తూనే వుంటాయి. పాఠకుల వుత్తరాలకి జవాబులు రాయడం తమ 'స్టేటస్'కి భంగం అనుకునే 'స్టేజి'కి ఇంకా రాలేదు కనుక, వెంటవెంటనే అందరికీ సమాధానాలు రాసేస్తూ వుంటాడు.

స్త్రీ పాఠకులు కూడా అప్పుడప్పుడు రాస్తుంటారు. వ్రాసినవాళ్లయినా కథ బాగోగుల గురించి రాస్తూ..."ప్లీజ్ ! జవాబు రాయరూ...?" అంటూ అభ్యర్థిస్తారేగాని, ఇలా వూరూ పేరూ లేకుండా ఇంత చలాకీగా, ఇంత ఘాటుగా, "మీరైతే కల్యాణిని పెళ్ళిచేసుకోగలరా ?" అంటూ సవాల్ చేసి చెవి మెలిపెట్టగల పాఠకురాలు అతని జీవితంలో తగల్లేదు.

వెనక్కి జారగిలబడి, కళ్లుమూసుకుని—"ఎవరీ సీలా ?" అంటూ ఆలోచించటం మొదలుపెట్టేడు. సామాన్యంగా పాఠకుల జీవితాలకి దగ్గిరగా వుండే పాత్రలే వాళ్లలో వుద్రేకాన్ని కలుగజేసి కలవరపడేలా చేస్తాయి. తను ఇంతవరకు వంద కథలు రాసేడు. దాదాపు వాటన్నిటినీ చదివివుంటుందని ఆమె వుత్తరాన్నిబట్టి తెలుస్తోంది. కాని, ఆమెని 'కదిపింది' కల్యాణి మాత్రమే !

సీలా లేఖలో మూడవ వాక్యం—

"అవాల్టికి అన్నం మానేస్తున్నా ఆ డబ్బుతో మీ పుస్తకం కొనుక్కొని చదువుతాను..."; అంటే తన తిండి తాను సంపాదించుకుని, తన బ్రతుకు తాను బ్రతకవలిసిన స్థితిలో వుందన్న మాట. ఆ స్థితికూడా—అన్నం మానేస్తే తప్ప అర్థరూపాయిపెట్టి ఓ పుస్తకం కొనుక్కోలేని హీనస్థితి—! అదుకునేందుకు సీలాకి అమ్మా, నాన్నా లేరు. 'భర్త' లేదు. అవివాహిత...

"ఇంతకన్నా వివరించి చెప్పగల శక్తి నాకు లేదు!" అంది. నీలాకి తన జీవితం గురించి చెప్పుకోవటం ఇష్టం లేదు అలా చెప్పుకోవడానికి సంకోచ పడే జీవితం' అయి వుండాలి. ఓ అపరి చితుణ్ణి పట్టుకుని– "మీరైతే అంత సాహసం చెయ్యగలరా?" అంటూ వుద్రేకపడిందంటే, అలా చెయ్యలేని వాళ్లమీద 'తనకి' కోపం. ఆ కోపా న్నించి జనించిన వేదనతోనే...ఇన్నా ళ్లగా తాను అజ్ఞాతంగా అభిమానించి ఆరాధిస్తోన్న రచయితకి 'తిడుతూ' వుత్తరం రాసింది. ఇంత రాసినా తన అడ్రసు ఇవ్వడానికి ఇష్టపడలేదు. ఇస్తే, తాను దాచుకున్నది వెల్లడయి పోతుందని భయం...! సమాజం తనని వెలివేసి, వేలెత్తి చూపుతోంది కనుక... ఆ సమాజంలోనే ఒకడైన రాజు కూడా తనని హీనంగా చూసి, అసహ్యించు కుంటాడని...భీతి!

ఓవేళ, నీలా నిజంగా 'అలాంటి' స్త్రీయే ఐతే– ఈమెలో ఇంత వుత్తమో త్తమ సంస్కారం, నిశితదృష్టి...ఇంత చక్కటి శైలితో వుత్తరాలు రాయగల నేర్పు ఎలా వచ్చేయి? బాగా చదువూ, వివేకం వున్న యువతి అయివుండాలి. పరిస్థితుల ప్రాబల్యంవల్ల రెల్లుపూవులా ప్రిదివి...ప్రవాహ వేగంలో కొట్టుకు పోతోంది...

—నీలాని ఇంత హీనస్థితికి దిగ జార్చిన 'పరిస్థితులు' ఏమైవుంటాయి?

ఆలోచనలతో అతనికి ఆ రాత్రంతా నిద్రపట్టలేదు.

నాలుగురోజుల తర్వాత మరో వుత్తరం వచ్చింది. అచ్చు ముందురాసిన వుత్తరంలాగే వుంది. అతని కథలన్నీ జీనీ పేరుపేరునా ఎత్తి, విమర్శించింది. తర్వాత, మరొకటి. అలా—అలా... సీరియల్‌గా వుత్తరాలు రావటం మొదలు పెట్టేయి. ఒక్క వుత్తరంలోనూ అడ్రసు ఇవ్వదు.

ఇలా ఆర్నెల్లు గడిచేయి.

అతనికి మతి పోతోంది.

మనసు–ఈ నీలా అనే అమ్మాయి మీదికి పిచ్చిగా పోతోంది. ఈ నీలా ఎవరో తెలుసుకుంటే తప్ప, నిద్రపట్టని స్థితి వచ్చేసింది.

ఆఫీసుకు పది దినాలు సెలవు పారేసి రాజమండ్రి బయలుదేరేడు. తను చేస్తు న్నది ఏవిటో...ఏం చేయాలనుకుంటు న్నాడో తనకే సరిగా తెలీదు రాజమండ్రి లాటి పట్టణంలో ముక్కూ ముఖం తెలీని ఓ అమ్మాయిపేరు పుచ్చుకుని వెదక డానికి బయలుదేరడం ఎంత హాస్యా స్పదమో...ఎవరన్నా వింటే ఎంత నవ్వుతారో తనకి తెలుసు. కాని...ఏదో ఆశ. నీలా నిజంగా అలాంటి స్త్రీయే ఐతే 'అలాటి' వాళ్ల వుండే ప్రదేశాలు కొన్ని వున్నాయి. 'వాళ్లలో' ఇంత మధురమైన పేరూ, రచనలమీద ఇంత ఆసక్తి వున్నవాళ్లు అరుదు. నీలా తప్ప

కుండా కనిపిస్తుంది. కనిపిస్తుందని ఏదో అదృశ్యశక్తి తన వెన్ను తట్టి చెబుతోంది...

ఒకవేళ నీలూ నిజంగా కనిపిస్తే, ఏం చేస్తాడు? తనని తాను పరిచయం చేసుకోవాలా? అవసరంలేదు. పత్రికలో చూసింది కనుక, ఆనవాలు పడుతుంది. పట్టి, ఆనందం పట్టలేక ఏడ్చేస్తుందా? లేక, ఆమె మొహం తనకి చూపలేక వెనక్కి తిరిగి పారిపోతుందా?...

ఒకవేళ — తనని మామూలుగా ఆహ్వానించి, కబుర్లుచెప్పి — "ఎందుకు వచ్చేరు రాజు బాబూ?" అంటే, ఏమంటాడు? "నిన్ను చూసేందుకు వచ్చేను నీలూ..." అంటాడా? ఎందుకు చూడటం? తను చూసినందువల్ల నీలూకి ఒరిగేది ఏముంది?

రాజమండ్రిలో అతనికి ఓ మిత్రుడున్నాడు. కనిపించినప్పుడల్లా ఒకసారి వచ్చి తమ వూరుని పావనం చెయ్యమని కోరుతున్నాడు. బ్రహ్మచారి వెధవ కనుక, నాలుగు రోజులు వాడిదగ్గర కాపురం పెట్టేసినా ఏడ్చుకోడు.

ముందుగా టెలిగ్రాం కొడితే, వాడిలి చస్తాడని రాజమండ్రి పురవీధుల్లో లెఫ్ట్ రైట్ కొట్టుకుంటూ మధ్యాహ్నం మూడు గంటలకి అంతఃపురానికి వచ్చిపడ్డాడు.

సారథి కొంపలోనే వున్నాడు.

అద్దంముందు నించుని క్రాపుదువ్వుకుంటున్నవాడల్లా కెవ్వున కావిలించుకుని, మంచంలో తోసేసి — "నిజం చెప్పు? ఇదంతా నామీద ప్రేమే?"

"నీ మీద వొట్టు!"

"నమ్ముతున్నాలేగాని. ఇడియట్. ఏంతింటున్నావ్? బుగ్గలొచ్చేస్తున్నాయే ఆడపిల్లలా..."

"చదివేం, మీ రాజమండ్రీ అమ్మాయిలంతా అమాంతంబుగ్గలు పెంచేసి నీలాంటి బ్రహ్మచారిగాడి ప్రాణాలు లాగేస్తూ ఏడిపించుకు తినేస్తారు. ఆ పాపం నాకు చుట్టుకుంటుంది"

"నా పాపం పారూకి ఎలానూ చుట్టుకుంటుంది."

"పారూ ఎవరమ్మా?" అన్నాడు ముదుగా.

"ఓ ముద్దుగుమ్మ..."

"యాపిల్ బుగ్గలుంటాయా?"

"రెండు జడలుకూడా వుంటాయి. మన్లోమనమాట. ఇంచక్కా వుంటాయి!"

"అమ్మ బాబోయ్! ఇదంతా ప్రేమే!"

"ఒట్టు. పెళ్ళిపెద్దవి నువ్వే!"

"అతే, పారూని చూపించవూ—?" అంటూ బ్రతిమాలుతున్నాడు.

"చూపిస్తే ఏమిస్తావ్?"

"నీ పెళ్ళికి ఏదన్నా కానిస్తాలే!"

"సరే!" అని ఆ సాయంకాలం చూపించేడు. దేవీచౌక్ పక్కనించి వస్తోంది. కోలముఖం. పాలమీగడలా

వుంది. సారథిని చూసి నవ్వి, రాజుని చూసి కంగారుగా తలొంచుకుంది.

"దుర్మార్గ్గా! [illegible] చెయ్యనేం?"

"వంకేవ్ [illegible] కాలేదు."

"వన్ వే ట్రాఫిక్కా!"

"చూసేవ్‌గా. నవ్వింది!"

రాజు చూసేడు. అదే సమయంలో పారూ వెనక్కి తిరిగి, రాజుకేసి చూసి బెదిరిపోయి తల తిప్పేసుకుంది.

రాజుకు నవ్వొచ్చింది. "నీ ప్రేయసి వుత్త పిరికిపిల్లరా."

"పెళ్లాలు అయేవరకు ప్రేయసీలు అలాగే వుంటారులే. తర్వాత తెలుస్తుంది."

"తెలుసుకోవాలని నీకు బాగా కంగారుగా వున్నట్టుంది. వాళ్ళింటికెళ్ళి మాట్లాడనా పాపం..."

"అంతపని చేసేవంటే నిన్నిపళంగా తన్నేసి రైలెక్కించేస్తాను లామేరేజి చేసుకోవాలని నా జీవితలక్ష్యం."

"నా కిపూటకి తిండి తగలేయించటం కూడా నీ జీవితంలో ఓ లక్ష్యంగా చేసుకో. టైమెంతయింది?"

బాగానే అయింది, హోటల్లో భోంచేసి సెకండ్ షో . ఓ చెత్త ఫిలించూసి, చూశాక మూడో రీలులో లేచిపోయి – లేచిపోవడం ఇంటికి, పదినిమిషాల్లో పరుపులో వాలిపోయి నిద్రలో పడ్డారు.

మర్నాడు లేచేసరికి తొమ్మిదయింది. [illegible] రాజమండ్రి [illegible]. [illegible] మనసు [illegible] పట్టూ [illegible]. సారథి రాజుని [illegible] చూస్తున్నాడు. [illegible] ఎలా?

సారథి 'హీరో'యే. కాని, సీలు గురించి చెప్పటం ఇష్టంలేదు. తనెవరో సీలుకి తెలియకుండా, [illegible] వెళ్ళిపోవాలి

ఎలా? ఎలాగబ్బా?

నిజంగా సారథి 'అబ్బ' – రాజు పాలిటి శ్రీకృష్ణుడిలా అడ్డుపడి, సారథికి లీవ్ ఇవ్వకుండా చక్రం అడ్డేసేడు.

సారథి ఏడుపుముఖం పెట్టేసేడు. ఓ పూటంతా రాజుని తినేసి వాళ్ల ఆఫీసరుమీద ఓ కథ రాయించి పోస్టుచేసి కసి తీర్చుకున్నాడు.

మర్నాడు సారథి కృష్ణశాస్త్రి విరహగీతం పాడుకుంటూ నైట్ డ్యూటీకి వెళ్ళింతర్వాత, రాజు రూంకి తాళంవేసి బయటికి వచ్చి మెల్లగా నడవటం మొదలుపెట్టేడు.

రాత్రి ఎనిమిది గంటలు దాటింది. దీపాలకాంతిలో వూరు వెలుగుతోంది. జనం పాక్కుంటూ పోతున్నారు. తెల్ల చీరకట్టుకున్న ఓ అమ్మాయి... తలొంచుకుని దిగులుగా నడుచుకుంటూ

పోతోంది. కదిపితే, ఓ కన్నీటి కావ్యం అవుతుందేమో.

చాలా సేపు సెంటర్లో తచ్చాడి, కొంత రాత్రి అయినతర్వాత ఆ వీధిచివరికి వచ్చి క్రీనీడలో నేరేడు చెట్టుకింద నించున్నాడు. నక్షత్రాలు ఆకాశంమీదనించి ఆత్రంగా కిందికి చూస్తున్నాయి.

నలుగురైదుగురు స్త్రీలు ముస్తాబు చేసుకుని చిట్టిన చేమంతి పూలలా ఇటూ అటూ తిరుగుతున్నారు. కొందరు కబుర్లు చెప్పుకుంటున్నారు. కొందరు గుంపుగా కూచుని ఏవో అనుకుంటూ పెద్దగా నవ్వుకుంటున్నారు. ఏ యువతిని చూసినా నీలాలాగే కనిపిస్తోంది ఓ అమ్మాయి, ఎర్రచీరతో...మంటల్లో నించున్న మంచుబొమ్మలా దీనంగా చూస్తోంది. నీలాయేనా...నీలాయేనా..

నిజంగా నీలా ఇలాంటి స్త్రీ కాదేమో! తను పొరపాటు పడుతున్నాడేమో..?

ఎవడో వచ్చేడు.

గళ్ళలుంగీ ... గారపళ్ళు ... కళ్ళలో కళ్ళుపెట్టి తూలుతూ ఏదో వాగుతున్నాడు. రాజుకి గొంతు పొడారిపోయినట్టుగా అయింది. వాడి భావం అర్థమయింది.

కాని...ఎలా? ఏమని అడగటం...? ...చివరికి అడిగాడు -- "ఇక్కడ అందరూ తెలుసా నీకు?"

"చెర్లో నీళ్ళకి చేపల గురించి తెలీకపోవచ్చునుగానీ బాబూ, ఇక్కడున్న పెతి ఆడదాని జాతకం మనకి వాల్ రైట్‌గా తెలుసు..."

"నీలా తెలుసా?" అన్నాడు గబుక్కున. గుండె గబగబా కొట్టుకుంటోంది.

వాడు బుర్రగోక్కొని ఆకాశంలోకి చూసేడు, మళ్ళీ తలదించి అతనికేసి చూసేడు మళ్ళీ బుర్రగోక్కున్నాడు.

వాడి తీరు చూస్తుంటే ... నీలా లేదేమో, అసలు అలాంటిది కాదేమో అన్న అనుమానం వచ్చి ఆనందంలాంటి 'రిలీఫ్' కలుగుతోంది.

"నీలా పేరెవళ్ళకీ లేదు బాబూ..."

"పోనీ నీలాసుందరి, నీలమ్మ... నీలవేణి...నీలమణి..."

"ఆ...ఆ...వున్నాది. నీలమణి వున్నాది."

అతని ఒళ్ళు జల్లుమంది. ఆకాశం మీదినించి ఓ వుల్క రాలిపడింది.

"నేను, నీలా ... నీలమణితో మాట్లాడాలి."

"యీలవదు బాబూ. అది సేటుతో టూరింగ్‌కి పోనాది. నాల్గురోజులదాకా రాదు. దానికన్నా మంచి పిల్లలు, సిన్మాస్టార్లలాగున్నోళ్ళు..."

"వొద్దు. నీలమణి వచ్చింతర్వాత చెప్పు. నేను రోజూ ఈ టైంకి వచ్చి ఆ కిళ్ళీ కొట్టుదగ్గిర నుంచుంటాను" అని పర్సులోనించి పదిరూపాయిలనోటుతీసి చేతిలో పెట్టేడు.

విచిత్రంగా చూసి—తలూపుకుంటూ.. శ్లోకాయిపదం పాడుకుంటూ పోతున్నాడు.

"ఇదిగో !" అన్నాడు.

దొర్లుకుంటూ వచ్చి, నమ్మినబంటులా నుంచున్నాడు.

"నీలూ...నీలమణి ఎలావుంటుంది?"

వాడు బుర్రగోక్కుని ఆకాశంలోకి చూసేడు మళ్ళీ తలదించి అతనికేసి చూసేడు. మళ్ళీ బుర్రగోక్కున్నాడు.

"ఎలాగుంటుందంటే...అందవా ? సిన్మా స్టార్లాగుంటుంది."

"అదికాదు వయసు ?"

"ఏం...పాతికుందదూ ?"

పాతిక ? నీలూ వయసును తను పాతిక్కి కొంత అటూ యిటూగానే వూహించుకున్నాడు. అందంగా వుంటుం దనికూడా అనుకున్నాడు.

ఇంటికొచ్చి ఎలాగో డ్రెస్ మార్చుకుని పరుపుమీద వాలిపోయేడు. నాలుగు దినాలూ నాలుగు అంతులేని దీర్ఘరాత్రు లుగా వూహించుకుంటున్నాడు...

ఈ నీలూ ఎవతైతే నాకేం ? ఎలాటి బ్రతుకు బ్రతుకుతూంటే నాకేం ? ఆమెకీ నాకూ ఏవిఁటి సంబంధం ? ముక్కూ ముఖం తెలీని ఓ పాతకురాలికోసం ఎందుకు తనకీ తాపత్రయం...అనవ సరపు వ్యర్థప్రయాస అని అనుకోలేక పోతున్నాడు.

అతను మనిషి. ఇంకా లోలోతులకి వెళ్లి నీలూలోని 'నీలూ'ని తెలుసుకోవా లన్న తపన. ఎప్పుడు నిద్ర పట్టిందో తనకే తెలీదు.

నాలుగు రోజులూ నాలుగు దీర్ఘ రోగుల్లా నడచి వెళ్లేయి.

'వాడు' వచ్చేడు, 'నీలూ' రాలేదు.

అతినికి దిగులేసింది. బాధనిపించింది. బరువుగా అడుగులు వేసుకుంటూ అక్కణ్ణించి కదిలిపోయేడు.

మరో రెండు రోజులు గడిచేయి...

మళ్లీ – మూడు దినాలు.

అతనికి విసుగొచ్చింది. కోపం వచ్చింది.

అక్కణ్ణించి వెళ్లిపోవాలనుకున్నాడు—

ఇంత శ్రమపడి...ఇన్నాళ్లు నిరీక్షించి చివరికి, నీలూని చూడకుండా వెళ్లి పోవడమా.. ? వీల్లేదు.

పదవనాడు రాత్రి 'వాడు' పరుగులు పెట్టుకుంటూ వచ్చేడు.

అతన్ని ఓ పెంకుటింట్లోకి తీసుకు వెళ్లేడు అతనికి ఎలాగో వుంది. గుండె భావాలకి అతీతమైన భావంతో... స్పందిస్తోంది...

లాంతరు వెలుగుతో...నతిగిన నీలంచీరతో...

నీలూ...నీలూ...

—నీలూయేనా ?

నవ్వి – "రండి..." అంది చూపుతో

అతనిలో ఎక్కడో ఏదో తెగింది. నిలబడలేనట్లుగ కుర్చీలో కూలబడ్డాడు.

గూట్లో దీపం దిగులుగా చూస్తోంది.

ఆమె అతన్ని ఆనవాలు పట్టినట్టుగా లేదు. నిజమే. పత్రికలోని తనఫోటో నాలుగైదేళ్ళ క్రితం నాటిది. అప్పటికీ ఇప్పటికీ బాగా మారేడు.

కళ్ళలోకి చూసి...పల్చగా నవ్వింది.

"ఏవిఁ"టన్నట్టు చూసేడు.

"ఏం లేదు" అన్నట్టు తలతిప్పింది. ఎవరో బలవంతాన రాల్చేసిన పిచ్చి పువ్వులా...అనిపించింది...

అతనికి ఆ ఒంటి గదిలో తన్ను కుంటున్నట్టుగా వుంది. చిలక పంజరంలో చిక్కుకుని సతమతమవుతున్నట్టుగా వుంది.

"ఇక్కడొద్దు...అన్నాడు మెల్లిగా.

"మరి ?...అన్నట్టు ఆ కోలకళ్ల అరవాల్చి పల్చగా నవ్వుతోంది.

"కూచోండి. ఒక్క క్షణం:" అంటూ నవ్వి లోపలికి వెళ్లింది వంకీలు తిరిగిన పొట్టిజడ.

నిట్టూర్పు విడిచి,

గదంతా కలియ జూస్తున్నాడు. ఓ పక్కన పట్టెమంచం, పచ్చ దుప్పటీ, దండెంమీద రెండు మూడు చీరలు...చిరిగిన ఓ లోపావడా, బాడీ...

స్టూలుమీద రెండు పుస్తకాలు.

ఒకటి చందమామ. మరొకటి...

చెక్క బీరువాలో చిందర వందరగా పడి వున్న పది పుస్తకాల్లో అతని ఫొటో వున్న పత్రిక...

వచ్చింది. తెల్ల చీర కట్టుకుంది తెల్ల కాగితం పువ్వులా...లాంతరు వెలుగులో నించుని, నవ్వుతోంది. ఇలాటి జీవితంలో ఇంత అమాయకత్వం ఎలా సాధ్యం ?

నవ్వి – "పుస్తకాలు బాగా చదువు తున్నావా ?" అన్నాడు.

నవ్వింది.

"నాక్కూడా పుస్తకాలంటే పిచ్చి రచయితల్లో చాలా మంది తెలుసు"

ఏదో అనబోతోంది...బయటినుంచి ఎవరో పిలిచేరు. వెళ్ళింది వినిపించీ... వినబడకుండా ఏవో గొంతులు.

అతని రక్తం లావాలా రేచింది. లేవబోతున్నాడు.

రెప్పలు వాల్చుకుని లోపలికి వస్తోంది,...రేగిన జుట్టు. చెంపమీద కమిలిన వేళ్ళ గుర్తు...

అతనికి కడుపులో దేవినట్లుగా బాధ పుట్టింది. "ఏవిఁటి..." అన్నట్టు జాలిగా చూసేడు.

తలొంచుకుంది. 'సీలూ'కి స్వవిష యాలు చెప్పుకోవటం ఇష్టంలేదు.

"...కాస్త ముందుకు వంగి, ఆ గూట్లో తాళం చెవి...కప్పా..."

అందుకుని ఆమె చేతికిచ్చేడు. పొడు గాటి వేళ్ళు! ఆ వేళ్ళకి కుంచె అందిస్తే., పిచ్చి గీతలు—ఆమె నుదుటి గీత ల్లాగా..."

ఎక్కడో గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

తాళం వేసి, తాళం చెవి చేతిలోఉన్న పూసల పర్సులో వేసుకుని...నీలాకాశం కింద సించుని అమాయికంగా అతనికేసి చూస్తోంది...

"గోదావరి గట్టున కూచుందాం..."

చిత్రంగా చూసి తలూపింది.

—అతను రచయిత. జీవితంలో కొన్ని వందలమందిని చూసేడు. కొన్ని వేల కథలు విన్నాడు. కొన్ని లక్షం కన్నీటి బొట్లు పరిశీలించాడు. అంతటి అనుభవంతో...ఆమె జీవితాన్ని అంచనావేసి, ఆమె ఏమై వుంటుంది? అని వూహించి...తన మేథాశక్తితో, సరదాగా ఓ కథ అల్లి చెప్పేడు.

చిత్రంగా...ఆమె 'హర్ట్' అయింది. ఆ 'మధు' ఎవరో తనకు తెలుసుననీ... ఆమె గత జీవితంతో తనకు సంబంధం వున్నదనే అనుకుంటోంది.

ఎవరీ మధు? మధు కలశాన్ని లాగి తన్నుకోగల దురదృష్టవంతుడు ఎందు కయేడు? ఎలా అయేడు?

ఆమె చెప్పదు!

తెలుసుకుంటే తప్ప—అతినికి మన శ్శాంతి లేదు!...

"పోనీ...నేను చెప్పనా? మధు ఏదో వుద్రేకంలో అందర్నీ వదులుకుని నీ వెం' వచ్చేసాడే గానీ...కొద్దిరోజులు గడిచేసరికి మొహం మొత్తింది. మోహం తీరింది. ఇక, నీ దారి నీది—నా దారి నాది—అంటూ రెక్కలు కొట్టుకుంటూ తన మానాన తను ఎగిరిపోయేడు..."

"కాదు..." అన్నట్టు తల తిప్పింది. అతను ఓ క్షణం ఆలోచించాడు.

"—ఎక్కడో వున్న మధు తల్లి దండ్రులకి ఈ సంగతి తెలిసింది. వచ్చి, కొడుకుని మందలించేరు. వచ్చెయ్య్యమన్నారు.

ప్రేమిస్తాడు. మనసిస్తాడు. బాసలు చేస్తాడు. ఆమె తనకు ప్రాణం. తన వూపిరి. ఆమె లేకపోతే...తను పిచ్చి వాడయి పోతాడు!

ఒకరోజు వస్తుంది. నాన్న తుపాకి తీస్తాడు. అమ్మ ఏడుస్తుంది. చెల్లెలు దిగాలు పడిపోతుంది. ఆకాశంనించి ఓ కాటా దిగి వచ్చి—ముందు నించుం టుంది. ఓ వేపు అమ్మా, నాన్నా కన్నీళ్ళు...ఓ వేపు ప్రేమా, ప్రేయసీ, కన్నీళ్ళు...ఎవరు నీ వాళ్ళు? ఇద్దరూ నా వాళ్ళే అనగల గుండె వుండదు. ఎదిరించలేడు. తనకు కావలసినదేవిఁటో చేయి చాచి అందుకోగల చొరవ చూప లేడు. పిరికివాడై పోతాడు. ప్రేమనించి, సమస్యనించి, జీవితాన్నించి...పలాం యనం చిత్తగిస్తాడు.

"లేదు...మధుకి అమ్మా, నాన్నా, అయినవాళ్ళు ఎవరూ లేరు. ఏకాకి..."

మరి?

అతనికి మతి పోతోంది.

సమాజం మొత్తం పరిశీలించి వందల

కొద్దీ కథలు వ్రాయగలిగిన అతనికి ఓ ఆడపిల్ల జీవితాన్ని అంచనా వేయలేక పోతున్నానే అన్నబాధ ! ఓడిపోతున్నా నేమో...అన్న భయం !

ఆఖరి బాణం వదిలేడు !

"అంతవరకు ఐశ్వర్యాల మధ్య పెరి గిన నీకు, మధూతో పంచుకొన్న చిన్ని జీవితం నచ్చలేదు. విలాసాలు కావాలి ! అతన్ని చిత్రవధ చేసేవు. హింసించేవు. చివరికి మధూని ఇంటినుంచి వెళ్ళ గొట్టేవు ! మధుఫలం అనుకుని దీపం దగ్గిరికి పరుగెత్తిన రెక్కల పురుగులా-" అతను ఆగేడు.

'ఆమె' ఐరన్ట్ అయింది. బావురు మంది. కొంతసేపటికి కోలుకుంది.

తరువాత జరిగిన కథ చెప్పింది :

...ఇక రెండు రోజుల్లో తన పెళ్ళికి ముహూర్తం పెడతారనగా, ఆ రోజు రాత్రి మధూ తను కలిసి వెళ్ళిపోవడానికి నిశ్చయం చేసుకున్నారు. రాత్రి అంతరూ నిద్రపోయిన తర్వాత ... కొట్టు కుంటున్న గుండెలతో మంచంమీద లేచి కూచుంది...ఆ వూరుకి తన తండ్రి మకుటం లేని రాజు. మోతుబరి ఈ తన ప్రయత్నాన్ని ఇంట్లో ఏమాత్రం పసి కట్టినా, చంపేస్తారు !...

మధు-లేని తనకి ఈ బ్రతుకెందుకు!

వణుకుతున్న చేతులతో ఎలాగో ఓ చీటీ రాసి, టేబుల్‌మీద పెట్టి సూట్ కేసులో రెండు గుడ్డలు పడేసుకుని దొడ్డి గుమ్మంలోనుంచి ఇవతలికి వచ్చింది. రోడ్డు దాటి, చీకట్లో పొలాలకి అడ్డంపడి స్టేషను వేపుపరిగెత్తింది....

టైమెంతయిందో తెలీదు. మధు వచ్చేడో, ఎక్కడున్నాడో...అంత కన్నా తెలీదు ! ఎవరో తెల్లబట్టల్లో వున్న ఆసామీ చుట్ట కాల్చుకుంటూ పక్కనించి పోతున్నాడు. ముఖం కనబడకుండా చీకట్లోకి లాక్కుని, టైమడిగింది.

పదిమీద, ఓ ఐదు ?

తామిదరూ పదకొండు గంటలకి స్టేషన్లో కలుసుకోవాలనుకున్నారు మధు తమ ఇంటి దగ్గిరికి వచ్చి నుంచుంటా నన్నాడు. తనే, ఎవరన్నా చూస్తే ప్రమాదం...వద్దంది. 'విధి' వద్దంది.

కాలాన్ని కళ్ళతో కొలస్తూ... భయంగా ఓ మూల ఒదిగినించుంది. ఏదో బండి కూతపెట్టుకుంటూ అటువేపు నించి వచ్చి ఆగింది. ఓ ముసలాయనా, అవ్వా, నలుగురైదుగురు యువకులూ, ఓ కళ్ళీ లాల్చీ, చంటిపాపని ఎత్తుకున్న ఓ యువతీ కిందికి దిగారు. ఆఖర్న— పంచకట్టు . బుంగమీసాలూ... చేతిలో చేసంచీ...

కెవ్వున గుండె గావుకేకపెట్టి— బ్రతికుందో చచ్చిపోతోందో...తెలీని స్థితిలో అందుబాటులోవున్న ఓ పెట్టె లోకి గెంతి, లోపల గడియ పెట్టేసుకుని, స్పృహ తప్పి పడిపోయింది.

తెలేవి వచ్చేసరికి, వెలుగు వచ్చింది

జరిగినదంతా గుర్తొచ్చింది. గజగజా వణికిపోతూ...బావురుమని ఏడ్చుకుంది. అమ్మ గుర్తొచ్చింది. నాన్న గుర్తొచ్చారు. నాన్న...రాత్రి స్టేషన్లో తను ఆయన కంటపడివుంటే?...

—మధు ఏమయేడు భగవాన్?

...రాత్రి స్టేషనుకు వచ్చి, తను కనబడకపోవటంతో క్రుంగిపోతాడు. తనను మోసగత్తె అనుకుంటాడు. బాధతో, కోపంతో ఇంటికి వెళ్ళిపోతాడు. పిచ్చివాడయిపోతాడు...

తెల్లవారేసరికి తను కనబడటం లేదన్న వార్త తెలుస్తుంది. బహుశః తెలీదు. తమలాటి పెద్ద ఇళ్ళల్లో జరిగే సంఘటనలు అంత గప్పున బయటికి తెలియనీయరు. కప్పిపెట్టి, ఈపాటికి తనవాళ్ళంతా కత్తులూ కటార్లూ పుచ్చుకుని తనకోసం వేటకు బయలుదేరుతారు. చీటీలో తను మధూ పేరు రాసివుంటే?...

ఎవరో తలుపు తడుతున్నారు...

మృత్యువా...? మృత్యువా...?

టికెట్ కలెక్టర్.

ఏదో చెప్పి, అతను చెప్పినదంతా పర్సులోనుంచి లాగి చేతిలో పెట్టింది.

"ఎక్కడికి?"

ఎక్కడికో తనకి తెలీదు...పక్క స్టేషన్ కి—

హైద్రాబాద్! ఎలాగో ఓ మూరుమూల హోటల్ గదికి పిచ్చుక పిల్లలా రెక్కలు కొట్టుకుంటూ...పారిపోయి, కవరు తెప్పించుకుని జరిగినదంతా చెబుతూ .వెంటనే బయలుదేరి రమ్మని.. తనకు చాలా భయంగా వుందని... మధూకి వుత్తరం రాసింది.

క్షణాలు కొలుచుకుంటూ...

కన్నీళ్ళు తుడుచుకుంటూ...

గా! సవ్వడికి...తుళ్ళి...తుళ్ళి... పడుతూ—

కన్నీళ్ళు ఐపోయేయి కాలం చచ్చిపోయింది!...

మృత్యువు నోటినించి బయటపడి... నెల దినాల తర్వాత కళ్ళు విప్పేసరికి—

డాక్టరు బిల్లు—వందరూపాయిలు.

హోటల్ వాడికి—నూటయాభై!

తన ఒంటిమీద వున్న ఒక్క దుద్దులజతా అమ్మితే — వందమీద, ఓ పాతిక...

...జీవితంలో తారసిల్లిన మనిషి—బాసలు చేసి, శపథాలు చేసి, చివరికి... నడిసముద్రంలో వదిలేసి......తన మానాన తను ఎగిరిపోతే...ఐదో తరగతి చదువుకున్న ఓ ఆడపిల్ల...దిక్కులేని ఓ పిచ్చి పువ్వు...

...ఇంతకన్నా ఏంచేస్తుంది?

ఏం చేయలేదా...ఏం చేయలేదా...

ఏం చేయాలని తను కథల్లో చెప్పేదో గుర్తులేదు. ఆమె కన్నిటికి అంతం లేదు...! అంత ప్రేమించి, విలపించి,

ఆమెకోసం పిచ్చివాడయిపోయిన మధూ...నీలాని అంత దౌర్భాగ్య పరిస్థితిలో వదిలేసి వూరుకున్నాడని అనుకోవడానికి మనసు ఒప్పడంలేదు...

ఓవేళ—మధూకి ఆ వుత్తరం అందలేదేమో !

గప్పున తలెత్తింది. పిచ్చిచూపులు...

"అవునమ్మా! అంత ప్రేమతో, ఆరాధనతో నీ కోసం మతి పోగొట్టుకున్న మధు—నీ వుత్తరం అందిన మరుక్షణం రెక్కలు కట్టుకుని నీ దగ్గిరికి వచ్చి వాలేవాడు ఒకసారి ఇలాగే నా ఫ్రెండొకడు తమ వివాహ విషయంలో తన ప్రియురాలు వ్రాసిన వుత్తరం అతనికి అందలేదు. దాంతో...ఆమె అతన్ని అపార్థం చేసుకుని, వేరొకర్ని పెళ్ళి చేసేసుకుంది !...

ఆ మరునాడు బయలుదేరి రాజా తమ వూరు వచ్చేసేడు. ఆమె తన పాఠకురాలు నీలానో...కాదో అతనికి తెలీదు. తెలుసుకోవాలన్న 'కోరిక' లేదు.

'నీలా' అతనికి ఓ బాధ ! ఓ బంధం ! 'మధు' ఏవయేడు అన్నది అతనికి అర్థంకాని—ఓ వేదన !...

* * *

రాత్రి పన్నెండు గంటలయింది.

"సమాప్తం" అని వున్న ఆఖరు పేజీ పూర్తిచేసి, పుస్తకం టేబిల్ మీదకి విసిరి "అమ్మయ్య" అనుకుంటూ...కళ్ళు మూసుకుంది నీలా.

మనసంతా నవలలో వున్న విషాదానికి చలించి...భారంగా తయారయింది. మాటి మాటికి కథలోవున్న 'కాదంబరి' దయనీయమైన రూపం కళ్ళముందు కదులుతూ హృదయాన్ని వేదనతో నింపుతోంది...

లేచి, కూజాలో వున్న నీళ్ళు గ్లాసులో వొంపుకుని తాగి, టేబుల్ సొరుగులో నించి కాగితం, కలం తీసుకుని—ఆ పుస్తకం రాసిన తన అభిమాన రచయిత రాజుకి వుత్తరం రాయటం మొదలుపెట్టింది...

ఇవాళ ఈ నవల కొనుక్కోవడానికి తను యజ్ఞంచేయాల్సివచ్చింది. పాపం అమ్మా నాన్నా మంచివాళ్ళే! ఏవో చిన్న చిన్న పత్రికలూ అవీ కొంటూనే వుంటారు. ఈ కరువురోజుల్లో అంత లేసి డబ్బులుపోసి అన్ని పుస్తకాలూ కొనుక్కోగలగడం తమలాటి మధ్యతరగతి కుటుంబీకులకి సాధ్యంకాని పని. తను మాత్రం అన్ని పుస్తకాలూ కొని పెట్టమని ఎప్పుడన్నా అడిగిందా? కాని... 'రాజా' పుస్తకాలు చదవకపోతే మాత్రం... తనకి మతిపోతుంది. ఆయన తన అభిమాన రచయిత. ఎంచక్కానో, గొప్పగా రాస్తాడు. ప్రపంచంలోవున్న ఆకలీ... అన్యాయం... కన్నీళ్లూ... అన్నిటి గురించీ కూలంకషంగా చర్చిస్తూ ఆవేదనతో రాస్తాడు.. అలాటి చర్చలు అంటే తనకి మొదటి

నించీ ఇష్టం. విషాదగాధల్ని వించే తను చలించిపోతుంది. ఆ విషాదానికి కారకులైన మనుషులమీదా...ప్రపంచం మీదా కోపం వస్తుంది. 'కల్యాణి' చదివి నప్పుడు తనకి అలాగే కోపంవచ్చింది. ఏడుపొచ్చింది. ఆ కోపంతో, బాధతో వెంటనే కాగితం కలం తీసుకుని ఆ రచయితని చెడామడా దులిపేస్తూ వుత్తరం రాసేసింది. తన వ్రాతలు చదువుకుని ఆయన ఏమనుకుని వుంటారు‌? తనని తిట్టుకుంటారా? తిట్టుకోనీ. తనకేం భయం లేదు. తను తప్పేం రాయలేదు. తను ఎంతమంది రచయితల్ని చూడలేదు? అందరూ పతితలగురించీ పేదలగురించీ గుండెలు బాదుకునేవాళ్ళే. ఉపన్యాసాలు ఇచ్చేసేవాళ్ళే, గాంధీకి, వీరేశలింగానికి కూడా... మంచి సాంప్రదాయసిద్ధమైన... పతివ్రతలైన భార్యలున్నారు. కనీసం మనకున్న రచయితల్లో సగం మందిఒక్కొక్కళ్లూ ఒకోపాపపంకిలంతో వున్న స్త్రీని తమ జీవితంలోకి ఆహ్వానించి వుంటే...సమాజం ఇలావుండదు. ఈ విషాదం వుండదు. 'కల్యాణు'ల బ్రతుకుల్లో "కన్నీళ్లు" వుండవు...

తన వ్రాతలకి రాజుగారు ఎలాటి సమాధానాలు చెబుతారో వినాలని ఎంతో కుతూహలంగా వుంటుంది. కాని...తనకా అదృష్టం లేదు. అమ్మా నాన్నా— ఓ పరాయి పురుషుడితో తమ కూతురు కలంస్నేహం చేయడానికి ఒప్పుకోరు. రచయిత మాత్రం మగాడు, కాదూ? అంటారు. తిడతారు, నానా రభసా చేస్తారు. అంచేత, తను మాత్రం వుత్తరాలు రాస్తూ... ఎవరూ చూడకండా రహస్యంగా వుత్తరాలని పోస్టుచేస్తుంది.

నీలాకి తన అభిమాన రచయితతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకునే ధైర్యం లేదు—

రచయితలకి తమ కథల్లో వర్ణించే ఆశయాలు నిజజీవితంలో ఆచరించే ధైర్యంలేదు. 'లేదు' అనే పదం మన రక్తనాళాల్లో వుంది. మన బ్రతుకుల్లో వుంది. మన ఆలోచనల్లో వుంది. లేని దెక్కడ?—

తను అన్నం మానేస్తే మాత్రం అమ్మా నాన్నారూ తల్లడిల్లిపోతారు. పోనీ... బయటికి వెళ్ళి ఏదన్నా తినమని నాన్నారు డబ్బులిస్తారు. ఆ డబ్బులన్నీ పోగేసి, తను రాజు పుస్తకాలన్నీ కొనుక్కుంటుంది.

పదిహేడేళ్ల 'నీలా' ఆ చిన్నగదిలో టేబుల్‌ముందు కూచుని కాగితం కలం తీసుకుని... తను అప్పుడే ముగించిన 'అగాధాలు' నవలగురించి, తమ అభిమాన రచయిత రాజుకి వుత్తరం రాయటం మొదలుపెట్టింది...

* * *

ఆర్నెల్ల తర్వాత— ఓ సంఘటన జరిగింది.

రాజు భార్యనీ, మూడేళ్ల కొడుకునీ తీసుకుని ఓ ఫ్రెండు ఇంటికి 'టీ' కి వెళ్ళేడు.

కాఫీలు అయింతర్వాత అంతా కబుర్లు చెప్పుకుంటూ తోటలో కూచున్నారు.

దేవి ఆల్బం పట్టుకొచ్చి అందరికీ చూపిస్తూ ఎవరెవరో వివరిస్తోంది. ఉన్నట్టుండి, రాజు తుళ్ళిపడ్డాడు. చూపులు ఓ ఫొటోమీద నిలిచిపోయేయి.

"ఎవరీ అమ్మాయి?" అన్నాడు.

దేవి దిగాలుపడిపోయింది. కళ్లలో నీళ్ళు తిరిగేయి.

తన స్నేహితురాలు 'నీలమణి' ప్రేమకథ చెప్పింది...

"నీలమణీ... మధూ... కలిసి వెళ్ళిపోయేరని అప్పుడు అంతా అనుకున్నాం...! కాని... ఏమయిందో తెలీదు. మధూ ఒక్కడూ ఎందుకు తిరిగొచ్చేడో తెలీలేదు...

మూడోనాటి మధ్యాహ్నం అతనికి ఎక్కణ్ణించో ఓ వుత్తరం వచ్చిందిట. అప్పటికే... మధూకి ఒళ్లు తెలియని జ్వరం. ఆ వుత్తరం చూస్తూనే కంగారుగా సూట్‌కేసు సర్దేసుకుని, తను అర్జంటుగా బయలుదేరి 'హైద్రాబాద్' వెళ్లాలనీ... అతను అడిగిన పుస్తకాలు తర్వాత ఇస్తాననీ... అక్కడే వున్న ఇంటివారబ్బాయితో చెప్పి, హడావుడిగా బయలుదేరి వెళ్లిపోయేడుట...

స్టేషను చేరేసరికి... రైలు కదులుతోంది. మధూ పిచ్చిగా ముందుకు పరుగెత్తి, ఇనపకడ్డీ అందుకోబోయేడు. అంతలోనే బేలన్స్ తప్పి— పట్టాలమధ్య పడి...

* * *

...ఆదే సమయంలో రాజమండ్రీ స్టేషన్లో రైలుగేటు పక్కన నించుని... కాగితం ముక్కలు అందరికీ పంచిపెడుతూ పకపకా నవ్వుతోంది ఓ పిచ్చిది.

అంతలోనే జుట్టు పీక్కుంటూ గట్టిగా ఏడుస్తోంది...

"వుత్తరం అందలేదు... అందితే రాదూ...?.. వుత్తరం అందలేదు"






**చింపిరి** దెయ్యంలా, అమావాస్య చీకటిలా ఉంది ఆ చింతచెట్టు. ఆ చెట్టు చాలాకాలంనుంచీ అక్కడే ఉంది. ఊరి మధ్యగా ఉన్న, ఆ చింతచెట్టు తరతరాల మనుష్యులను చూసింది. విభిన్న మనస్తత్వాలుగల మనుష్యులనూ చూసింది. ఆ చెట్టు ఎన్నోసార్లు ఆకులు రాల్చింది, పూలు పూసింది, కాయలు కాసి ఊరి

కె. లలితాచలం

వారికి ఇచ్చింది. మాటలు రాని ఆ చెట్టులో మార్పులు ఊరివారికి అందంగా కనుపించాయి. ఆ చింతచెట్టులో ఎన్ని మార్పు లొచ్చినా, ఆ ఊరివారిలో ఏ మార్పూ రాలేదు. ఆ ఊరిలోకూడా ఏ మార్పూ రాలేదు.

ఆ చింతచెట్టు నీడే ఆ ఊరి రచ్చ బండగా మారింది. ఊళ్ళో జరిగే ప్రతి విషయం రచ్చబండ చేరాల్సిందే. ఆ రచ్చబండ ఆ ఊరికి న్యాయస్థానం. అది అన్యాయాన్ని న్యాయంగా మార్చి తీర్పుచెప్పే నేర్పు స్థానం. న్యాయాన్నీ, సత్యాన్నీ పచ్చిఅన్యాయంగా, అబద్ధంగా మార్చి, అక్రమంగా తీర్చి దిద్ది, అదే న్యాయమని కరాఖండిగా తీర్పు నిచ్చే మార్పు స్థానం. ఆ ఊరివారు ఇచ్చిందే తీర్పు. వారి నేర్పుకు తీర్పు లొంగి పోయింది.

చింతచెట్టు న్యాయాన్ని ఏనాడూ వినలేదు. కాని అన్యాయాల్ని మాత్రం చాలాసార్లు చెవులు బెరడు కట్టేటట్లు విన్నది. కాని తను చూచింది న్యాయ మైనా, అన్యాయమైనా, ఏమీచెయ్య లేకపోయింది. చింత చావకపోయినా పులుపు చచ్చినదానిలా నోరు మూసు కుంది. న్యాయం ఛస్తున్నా, తను చావ కుండా ఉండాలనుకుంది మనుష్య లందరిలా. ఎప్పటికైనా తాను చచ్చినా న్యాయం బ్రతకా లనుకునేది పిచ్చిగా. ఏమిటో ఆ పిచ్చి కోరిక, పిచ్చి నమ్మకం, న్యాయం బ్రతుకుతుందని!

మనసులో కక్ష పేరుకుపోయింది, చింతచెట్టుకు. కాని అసమర్థులైన మను ష్యుల్లా ఏమీ చెయ్యలేక, శకుని మామ కౌరవులను ప్రేమించినట్లుగా, తన నీడన జూదగాళ్ళకు చోటిచ్చింది. అన్యాయవాదులకు చోటిచ్చింది. అందుకే ఆ చింతచెట్టంటే వాళ్ళందరికీ ఇష్టం. వాళ్ళందరూ కలసి ఆ చెట్టుచుట్టూ సిమెంటు చప్టా చేయించారు. దాని ముందర గాంధీబొమ్మకూడా పెడదా మనుకున్నారు. కాని ఎందుకో పెట్టలేదు. అల్లూరి సీతారామరాజు బొమ్మ పెట్టారు. ఎప్పుడైనా ఆ సీతారామరాజు బొమ్మకు 'ప్రాణం వచ్చి, మనిషిగా మారితే బాగుండు' ననుకునేది చింతచెట్టు అనుక్షణం దాన్నే చూస్తూ.

చాలా ఎత్తుగా పెరిగిన చింతచెట్టుకు ఎన్నెన్నో కనిపిస్తాయి. రచ్చబండ మీద కూర్చునేవారికి కనపడనివి కూడా కనిపిస్తాయి. రచ్చబండ దగ్గరకు చేరేవారి మనోభావాలూ స్పష్టంగా తెలుస్తాయి.

దూరంగా పచ్చని పంటపొలాలు. పొలాల్లో, ఒళ్ళు వంచి పనిచేసే ఆడ వాళ్ళు, వాళ్ళపైటలు తొలగి ఒళ్ళు కన బడుతుంది. రచ్చబండమీద కూర్చున్న వాళ్ళ లొట్టలు వినిపిస్తాయి. ఆ పొలాల ప్రక్కనే ఉంది చింతల చెరువు. పొద్దున్నే బిందెలు పట్టుకుని చెరువు గట్టంటపోయేకన్నెపిల్లలు, పిల్లలతల్లులు,

తల్లుల పిల్లలు కనిపిస్తారు. స్నాన మాడే తల్లుల ఒంటికి అతుక్కుపోయిన చీరల్లోనుంచి కొట్టొచ్చినట్లు కనబడే ఒళ్ళు, స్పష్టంగా కనబడుతుంది. రచ్చబండమీదివారికి అదొక వింత. ఆ వింతలో గిలిగింత. గిలిగింతలో పులకింత. ఆ కనుపించేది తల్లో చెల్లో తెలుసుకోకుండా, కామం నింపుకున్న కళ్ళతో, కైపెక్కిన వాళ్ళలాగా చూస్తారు. వెకిలి వేషా లేస్తారు. చొల్లు కారుస్తారు. బూతులు మాట్లాడుతూ, తమకు తామే ఆనందిస్తారు. వీలుచాలు చూసుకుని ఆ స్త్రీల శీలాన్ని నీళ్ళలో పాతేస్తారు. మరునాడు శవం తేలుతుంది. ఇలా ఎన్ని శవాలో ఎన్నెన్ని శవాలో చూసింది ఆ చెట్టు. చేతనైనన్ని వేడి నిట్టూర్పులు కూడా వదిలింది చింతిస్తూ. అందుకే అది చింత–చెట్టు.

ఆ చెరువుకు అల్లంతదూరంలో పాడుబడ్డ శివాలయం, దాని పక్కనే దయ్యాల మర్రి. పట్టపగలే రాత్రి ఆ శివాలయం దగ్గర. ఆలయం దగ్గరనుంచి ఎన్నెన్నో ఆర్తనాదాలు విన్నది చెట్టు. చింతపోయింది. కాని, చింత తీర్చలేక నిస్సహాయురాలిగా నిలచింది చింత చెట్టు ఆలయప్రాంగణం ఆర్తనాదాలకు నిలయం. శీలానికి బలిపీఠం. ఆ బలిపీఠంముందు, దళారిలా నిలచిన దెయ్యాలమర్రి విషాదం దాచుకుని వికటాట్టహాసం చేస్తుంది.

ఆ గుడికేసి ఎవ్వరూ పోరు. చచ్చిన దెయ్యాలంటే వాళ్ళకి చాలా భయం. పాపం ! చచ్చిన దెయ్యాల మంచితనం తెలుసుకోలేని అమాయకులు, పచ్చి నెత్తురు పీల్చే మనుషులనే పూజిస్తారు.

ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా తెలిసినా, చింతచెట్టు చెప్పదు, చెప్పలేదు. చింతచెట్టుకు తమ విషయాలన్నీ తెలుసుననుకున్నారో, లేక అదికూడా ఆడదే కదా అనుకున్నారో, దానిమీదకూడా కన్నేసారు, పగపట్టారు.

కాని, ఇప్పుడా చింతచెట్టును చూస్తేనే జనం ఉలికిపడతారు. వేడి నిట్టూర్పులు వదుల్తారు కొందరు. ఏమీ చెయ్యలేక కన్నీరు కారుస్తారు కొందరు. విరగబడి నవ్వుతారు మరికొందరు; అప్పుడే బలుస్తున్న బుర్రమీసాల మధ్యనుంచి పగలబడి నవ్వుతారు మరికొందరు. 'చూసోక్ ! నా తఢాకా !' అన్నట్లుగా పోతుమీసాలు దువ్వుతారు. వాళ్ళ నవ్వులు చూసి, చింతచెట్టు తను కూడా నవ్వుతుంది విషాదంగా.

అదే చింత, అదే చెట్టు. అది ఇప్పుడు రచ్చబండ కాదు. న్యాయస్థానం అంతకంటే కాదు. చింతచెట్టు పేరు చెబితేనే కొందరికి మహాభయం, కొందరికి గర్వం. మీసాలు మెలేసేవారు కొందరు. మీసాల చాటున రోసాలు దాచేస్తారు మరి కొందరు.

నలుపు, కారునలుపు. చింతతోనే ఆ

చెట్టును చూస్తారు. నిట్టూరుస్తారు. కళ్ళ ముందు కదిలే భయంకర దృశ్యాన్ని, అప్పుడే జరుగుతున్నట్లుగా భావిస్తారు. పటపటా పళ్ళు కొరుకుతారు. తళతళ లాడేట్లు కత్తులు నూరా లనుకుంటారు. హత్యలమీద హత్యలు చెయ్యా లనుకుంటారు.

కాని ఏమీచెయ్యలేక, అధికారం కాళ్ళ కింద న్యాయంలా, బండిచక్రాలకింద నల్లేరులా నలిగిపోతున్నారు. వారితలల్లో అన్నీ సందేహాలే. ఎలా ? ఎప్పుడు ? పగతీర్చుకునే మార్గమేది ?

ఆ సందేహాలు వారి గుండెల్లో హాలాహలంలాగా మంటలు రేపుతుంటే, ఆ మంటలన్నిటిని పరమశివుడిలా అధికారం నోరు తెరిచి మింగేస్తోంది.

అదే దృశ్యం. మళ్ళీ అదే దృశ్యం. పదేళ్ళనాటి దృశ్యం. పదేళ్ళ కిందట సంగడు పాతికేళ్ళవాడు. పగ తెలియని వాడు. అమాయకుడు. మూగవాడు. పెడితే తినడంతప్ప, అడగడం ఎరుగనివాడు. ఆంజనేయులవారు రాముల వారిని కాపలా కాసినట్లుగా, యజమానిని కాపాడటమే తన ధర్మంగా అనుకున్నవాడు. ఆడవాళ్ళంతా సీతమ్మ తల్లులని మొక్కేవాడు సంగడు. సంగడికి వారసత్వపు ఆస్తి బోలెడుంది. అదే తరతరాలుగా తరగకుండా పెరుగుతూ వస్తున్న వెట్టిచాకిరీ. అదే, ఖజానాలో మూలుగుతున్న బంగారంగా తలచుకుని మురిసిపోతూ ఇంటెడుచాకిరీ చేసేస్తాడు యజమానిభార్య పెట్టే పాసిపోయిన పట్టెడు కూడే పంచభక్ష్య పరమాన్న మనుకుని తృప్తిగా తినడం నేర్చుకున్నవాడు సంగడు. కుక్క కాపలా కాయడం సంగడికి తెలుసు. యజమాని చెంచయ్యనాయుడికి కాళ్ళు పడతాడు సంగడు. 'చాల'న్నట్లు గుర్తుగా చెంచయ్య ఒక తాపు తంతాడు కాళ్ళతో. సంగడు నవ్వుతూ వెళ్ళిపోతాడు. ఎవరైనా 'సంగడు విశ్వాసపాత్రుడు' అంటే, తను కూడా అందామనుకుంటాడు చెంచయ్య. కాని అనడు.

ఒక రోజున — ఊరు లేవలేదు. సూర్యుడు రాలేదు. చీకటి పోలేదు. సంగడ్ని ఇద్దరు చింతలేని మొద్దులు ఈడ్చుకొచ్చారు. నడివీధిలో కింద పడేశారు. కాళ్ళతో తన్నారు, కొట్టారు, తిట్టారు. కామందుల కుక్కలు మొరగాలి కామోసని మొరిగాయి. ఊరూ వాడా లేచింది. కళ్లు నులుముకుని చూసింది. మంచుతో కప్పడిపోయి, అవతల ఏం జరుగుతోందో కనుపించటం లేదు.

పొద్దెక్కింది. జనం మూగారు. కళ్లప్పగించి చూశారు. పెదవి విప్పలేక పోయారు. 'ఏమిటి ?' అని అడగలేక పోయారు. కాని కళ్లు, దానిని స్పష్టంగా




చూసాయి. చింతచెట్టు మొదలుకు సంగడి చేతులూ కాళ్ళూ విరిచి కట్టబడి ఉన్నాయి.

నోరులేని సంగడు ఏమేమో చెప్పుకోవాలని తాపత్రయపడుతున్నాడు. చేతులుకట్టి ఉండకపోతే, సంజ్ఞలతో ఏదైనా చెప్పగలిగి ఉండేవాడేమో! కాని, వాడి నోరు భగవంతుడు కట్టేశాడు. తరతరాల వారసత్వం మూగది కదా; వీడికిమాత్రం నోరెందుకని కాబోలు, ఆ దేవుడు, సంగడిని మూగవాడ్ని చేశాడు.

దేముడు కనికరించి ఒక్క నోరు కడితే, చెంచయ్యనాయుడు, కాళ్ళూ, చేతులూ గూడా కట్టేశాడు

"వాడిని నిలువునా కాల్చండిరా! సజీవదహనంచెయ్యండి." ఆజ్ఞాపించాడు చెంచయ్యనాయుడు గుడ్లెర్రచేస్తూ. ఆ పని క్షణాల్లో జరిగిపోయింది సంగడి జ్ఞాతుల చేతుల్లో. సంగడు బూడిదై పోయాడు. భగభగ మంటలు లేస్తూ, తను దహించుకుపోతున్నా చింతచెట్టు ఏమీ చెయ్యలేకపోయింది. నోరులేని సంగడు, మాటలురాని చింతచెట్టు కలిసే కాలారు. సంగడి తల్లీ, చెల్లీ, తమ్ముడూ దూరంగా నిలబడి మూగగా మొత్తుకోవడం తప్ప ఏమీ చెయ్యలేకపోయారు.

"సంగడికి అలాగే జరగాలి" అన్నారు, సాటి పెద్దల మనుకునేవారు. "అలాటివాడికి, ఇలా చెయ్యడమే న్యాయం" అన్నారు, ఆ న్యాయ నిర్ణయం సబబే అన్నట్లుగా. చెంచయ్యనాయుడి మీసాలు మరింత ఉబ్బాయి.

"చెంచయ్య కూతురు ఉరేసుకు చచ్చిపోయింది. దానికి సంగడే కారణంట. సంగడు చచ్చికూడా చెంచయ్యను సాధించా డన్నారు. అసలు రహస్యం ... సంగడు, అమాయకు రాలైన చెంచయ్య వెధవ కూతుర్ని చెరిచాడుట. వాళ్ళిద్దరూ అర్ధరాత్రప్పుడు మామిడి తోపులోనుంచి రావడం చెంచయ్య కళ్ళారా చూశాడుట.

శివాలయం దగ్గరనుంచి, ఒక ఆడ కూతురు శీలం అపహరింప చూసిన వాడికి, "అదే శిక్ష" అన్నారు. "పాపం ! అయినింటి ఆడబడుచు అవమానం భరించలేక ఉరేసుకు చచ్చింది" అన్నారే కానీ, అర్ధ రాత్రప్పుడు శివాలయందగ్గర చెంచయ్య కేం పని అని అడిగిన వారొక్కరూ లేరు. ఇది గుసగుసలతో ప్రారంభమై ఊరిన పడ్డవార్త. ఇది పాత కథగా మారిపోయింది. బహుశః ఆ కథ అందరూ మరిచిపోయికూడా ఉంటారు.

కాని, ఆ చెట్టు మరచిపోలేక పోతోంది ఎత్తున నిలబడి నిజాన్ని కళ్ళారా చూసిన ఆ చెట్టు, సంగడికి జరిగిన అన్యాయాన్ని ఏటా తలుచు కుంటుంది. సంగడితోపాటు తనూ కాలి పోయినా, సంగడికి జరిగిన అన్యా యాన్ని, ఊళ్లో జరిగే అక్రమాల్ని ఎదిరించేవాళ్ళు పుట్టకపోతారా ! అని ఏటికొకసారి చిగురిస్తూనే ఉంది, చావని ఆశతో. కళ్ళు కాయలు కాచేలా కాస్తూనే ఉంది. ఆశ నిరాశై ఆకులు రాలుస్తూనే ఉంది. కనుచూపుమేరలో తన ఆశ చిగురించే అవకాశం లేదేమో నన్న చింతతో మోడుబారిపోయింది.

కాని, తాను చూచిన నిజం ఆరని నిప్పుకణంలా ఆ చెట్టు గుండెల్లో నిత్యం రగులుకుంటూనే ఉంది.

ఊరు మాటుమణిగాక, కటిక చీకట్లో, తనలో తనే మననం చేసుకుం టుంది ఆ చెట్టు. సంగడు ఆ రోజు రాత్రి ... కర్రతో అలికిడి చేస్తూ దెయ్యాలమర్రివైపు నడుస్తున్నాడు. తెల్లచీరకట్టుకుని కొంగు నిండా కప్పు కుని, చెంచయ్యనాయుడి వెధవ కూతురు సంగడి వెనక నడుస్తోంది. దెయ్యాలమర్రి దగ్గర మునసబు తమ్ము డిని కలుసుకుంది. "నాకు నెల తప్పింది. ఊరు వదిలి ఎక్కడికైనా పోయి పెళ్ళిచేసుకుందాం" అని బ్రతిమి లాడింది. ఇటువంటి దీనాలాపాలు ఎంతమందో చేశారు. విన్నాడు మున సబు తమ్ముడు. వాళ్ళ కిచ్చిన సమా ధానమే నాయుడి వెధవ కూతురికీ ఇచ్చాడు.

"నెల తప్పినదాన్నల్లా పెళ్ళిచేసు కుంటే, నా పెళ్ళాలతో ఊరే నిండి పోతుంది. నా నెలవే తప్పిపోతుంది" అని పెద్దగా విషపునవ్వు నవ్వాడు.

ఆమె గుండె దద్దరిల్లేటట్టు, బద్ద లయ్యేటట్టు.

చెంచయ్యా చాటునుంచి అంతా విన్నాడు. తను కాక ఇంకెవరన్నా తన కూతుర్ని చూశారేమో అన్న భయం కంటె, సంగడే ఊరంతా చెప్పేస్తాడని అనుమానం చెంచయ్యని పీడించింది. ఆమె వెనకాల వచ్చిన సంగడిమీదకు ఆ నేరం నెట్టేస్తే సరిపోతుందను కున్నాడు. మనసులో నిజం దహించి వేస్తున్నా, అవమానం ఆవేశంగా మారి చెంచయ్యకు ఒళ్ళు తెలియనివ్వలేదు.

మునసబు తమ్ముడిని ఏమీ చెయ్యా లేక, నోరులేని సంగడిమీద తన ప్రతాపం చూపించాడు చెంచయ్యా. వాడి చావుకు కారకుడయ్యాడు. బెబ్బులికి కుందేలు లోకువ.

ఈ నిప్పులాంటి నిజం ఆ చింత చెట్టు ఒక్కదానికే తెలుసు. తెలిసింది నలుగురికీ చెప్పాలంటే సంగడిలా తనకూ నోరులేదు. అందుకే, సంగడికి జరిగిన అన్యాయం మరచిపోలేక తన వేపు చూసే ప్రతివారికీ, సంగడ్ని జ్ఞాపకం చేస్తూ ఉంది. పగ తీర్చుకో మంటోంది.

కాని చేవవుండీ చచ్చినవారు ఆ ఊరివాళ్ళు. తను చచ్చిపోతున్నా చేవ చావనిది ఆ చింతచెట్టు ఒక్కటే. అందుకే ఆ చెట్టువంక చూడటానికే భయపడుతున్నారు కొందరు.

మళ్ళీ ఇన్నాళ్ళకు... అదే దృశ్యం. పది సంవత్సరాల తరువాత, మళ్ళీ అదే దృశ్యం, అదే చోటు, అదే చింత. చింతచెట్టుతోపాటు అందరూ వింతగా చూశారు. అందరి కళ్ళూ చూస్తున్నాయి.

కాని ఈనాడు ఆ సంగడు కాదు, మరో సింగడు కాదు, వాడి పాలివాళ్ళూ కాదు, వాడి కులపువాళ్ళూ కాదు, కుందేలు పులిని పట్టేసింది.

సంగడి స్థానంలో చెంచయ్యా కొడుకు గురప్పనాయుడున్నాడు. అదే చెట్టుకు కాళ్లూ, చేతులూ విరిచి తాడేసి కట్టారు, కొట్టారు.

చెంచయ్యా పరుగు పరుగున వచ్చాడు, గురప్పని విడవమన్నాడు, పోలీసుల్ని పిలిపిస్తానన్నాడు. పంచా యతీ పెడతానన్నాడు, అసలేం జరిగిందో గురప్పని చెప్పనీయ మన్నాడు.

చెంచయ్యనాయుడు మాటలు వింటుంటే జనంలో మంటలు రేగాయి. ఎదురు తిరిగిన కుందేలుకు కొండంత బలం వచ్చింది. "సంగడికి లేని న్యాయం గురప్ప కెందు కుండాలి" అన్నారు ధైర్యం కూడకట్టుకుంటూ.

కడుపులో మంటలు రేగుతున్నాయి. సంగడి తమ్ముడు శ్రీశైలం బెబ్బులిలా అరిచాడు ..

"నా అన్న తప్పు చేసినప్పుడు

రాని పోలీసులు ఇప్పు డెందుకు రావాలి ? నా అన్నకు పంచాయితీ పెట్టించలేదు. నువ్వే తీర్పు యిచ్చావే ఆ తప్పుకు శిక్ష సజీవదహనమే, అన్నావ్. నీకో న్యాయం, నాకో న్యాయం ఉండటానికి వీల్లేదు. నా అన్న నోరులేనివాడు సంజ్ఞలతో నిజం చెప్పుకోవాలని తాపత్రయపడ్డాడు. వాడికి ఆ అవకాశం ఇస్తే, నిజం ఎక్కడ చెప్పేస్తాడో అని భయ పడ్డావ్. కాల్చేయమని ఉత్తర్వు జారీ చేశావ్. ప్రతి మనిషికీ న్యాయం, ధర్మం ఒక్కటే ఉండాలి. ఒక తప్పుకు తీర్పు ఒక్కటే ఉండాలి."

"గురప్పని కాల్చి చంపాల్సిందే," అక్కడ మూగినవారంతా శ్రీశైలంతో ఏకీభవిస్తూ ఏకకంఠంతో అరిచారు ఆవేశంతో.

'అల్లూరి సీతారామరాజు బొమ్మకు ప్రాణం వచ్చింది' అనుకుంది చింత చెట్టు.

"వింటున్నావా చెంచయ్యనాయుడూ! నువు సంగడ్ని కాల్చి చంపినప్పుడు ఈ జనానికి కళ్ళు తప్ప నోరులేదు. ఈనాడు నోరొచ్చింది. అంటే న్యాయం మూగది కాదు. దానికి కళ్ళు చెవులతోపాటు నోరు కూడా వచ్చింది. ఇక నువ్వు, నీ తరం మూగపోవాల్సిందే.

"సాటి మనుషులని మనుషులుగా నువ్వెప్పుడూ చూడలేదు. నీ రోజులు జారి ముక్కలైపోయాయి.

"ఆనాడు మా అన్న ముఖాన అందరి చేతా ఉమ్మేయించావు. ఇప్పుడు నీ కొడుకు ముఖాన మా అందరితోపాటు నువ్వూ ఉమ్మెయ్యి. నీ కొడుకును నిలువునా కాలుస్తాం, చూడు, ఆ రోజు, ఒక తల్లి కడుపుశోకంతో విలపిస్తుంటే, నువ్వు పగలబడి నవ్వావ్. ఈ రోజు, మేం నవ్వుతాం. విను. చూడు. ఏడు.

"ఊ, కాల్చండిరా !" ఆవేశంతో అరిచాడు శ్రీశైలం. ఒకనాడు న్యాయాన్ని రెక్కలు విరిచి తనకు కట్టి సజీవదహనం చేసినప్పుడు విలవిల లాడింది ఆ చెట్టు. కాని, ఈనాడు అన్యాయాన్ని తనకు విరిచి కట్టి దహనం చేస్తుంటే, తృప్తిగా తనలో తానే నవ్వుకుంది

ఇంతలో శ్రీశైలం చెల్లెలు పరుగెత్తు కొచ్చింది.

"ఆగండి ! ఆగన్నయ్యా, ఆగు. తరం మారిందన్నావు. మనం మారా లన్నావ్, మారామన్నావ్. ఇప్పుడు మనం చదువుకున్నవాళ్ళం. గురప్ప నాయుడ్ని చంపితే ఏమొస్తుంది ? పది మందిలో పగ రేగుతుంది. ఆ పగ పాములా పిల్లల్నెడుతుంది.

"శీలం ఏ ఆడదానికైనా అతిపవిత్ర మైనది. మారిన తరంలో రేగుతున్న మంటలు ఏమైనా చేయగలవని, చేస్తా




యని ఇప్పుడు చెంచయ్యనాయుడుకి బాగా తెలుసు.

తన కూతురు శీలాన్ని దోచాడన్న నేరారోపణతో సంగడిని సజీవదహనం చేయించాడు చెంచయ్యనాయుడు. మరి, ఆ సంగడి చెల్లెలు శీలాన్ని దోచిన తన కొడుకును ఏం చెయ్యాలో ఆయన్నే చెప్పనీయండి.

"మనుషులు మారినా న్యాయం, ధర్మం, చట్టం మారడానికి వీల్లేదు," అంది ఆమె.

ఆ మాట అందరికీ నచ్చినట్లుంది. అయినా చూద్దాం అని గురప్పని ఒది లేశాడు శ్రీశైలం.

చెంచయ్య కళ్ళు బైర్లుకమ్మాయి. కళ్ళు నులుముకున్నాడు. కళ్ళు చెమ్మ గిల్లాయి. కళ్లు తుడుచుకుని శ్రీశైలాన్నీ, చెల్లెల్నీ, గురప్పనీ, మాడిపోయి మసి బొగ్గులా ఉన్న చింతచెట్టునీ మార్చి మార్చి చూశాడు. గతంలో ఎన్నో విషయాలు కళ్ళముందు కదలాడి నట్లయినై. కొన్ని క్షణాలసేపు చైతన్య రహితుడై కొయ్యబారినట్లు ఉండి పోయాడు చెంచయ్య.

గురప్ప చేతుల్లో శ్రీశైలం చెల్లెలు చెయ్యిపెట్టాడు చెంచయ్యనాయుడు.

"నేను ఓడిపోయాను. మీరే గెల్చారు. నా తరం గతించింది" అన్నట్లుగా తలెత్తి నలుగురివంకా చూడలేక తల దించుకున్నాడు చెంచయ్య నాయుడు.

ఇన్నాళ్ళకు తన నీడన ఒక న్యాయం జరిగినందుకు తృప్తిగా కన్నుమూసిందా చెట్టు చింతలేకుండా.



-'దేశం నాకేం చేసింది ? ...' అని అడగకు ... 'నువ్వు దేశానికి ఏంచేశావ్ ? ...'అన్న ప్రశ్న వేసుకో... అని కాబోలు,అన్నట్లున్నారు

"నువ్వు ఎంత యివ్వగలవో అంతే పొందుతావు"...కొలత ప్రామాణికంగా ఒక మతగ్రంథం చెప్పిన మాటలివి. ఇవీ విన్నాను...

అదే కొలత ప్రమాణంగా, నాకు దేశం ఎంత చేస్తే ... నేనూ దేశానికి అంతే చేస్తాను...అని అన్నపుడు, నేను పొందినంతే యితరులకి యివ్వగలననీ అన్నపుడు ... నాన్న నన్ను 'మూర్ఖుడు' అనేశారు. అమ్మ కూడా నాకు నచ్చచెప్పాలని ప్రయత్నించిందే కానీ, నా మాటను అర్థంచేసుకుని... నన్ను నన్నుగా అర్థంచేసుకున్నవాళ్లు నాకు కన్పించలే దింతవరకూ !

నన్ను కన్నవాళ్ళు ... కనుక, మా అమ్మా, నాన్నా నాకన్నా పెద్దవాళ్ళు, నాకంటే అనుభవజ్ఞులు, ... బహుశా, నన్ను మించిన తెలివిగలవాళ్ళు అని సర్దుకున్నా!...కానీ,

...నా ఒడిలో కళ్ళుతెరిచి, నేను ఎత్తుకుని మాటలు నేర్పించి ... పెంచి పెద్దచేసిన పిల్లలు ... వాళ్ళు నాకు ప్రత్యర్థులౌతారని వాళ్ల పుట్టినపుడు నా కన్పించలేదు...

కానీ...యిప్పుడు ... జీవితపు చర మాంకంలో... 'ప్రాయపు ప్రొద్దు పడ మట గ్రుంకేవేళ ...' యీ విషయం సమస్యగా పరిణమించి, పరిష్కారం కోసం తరచుగా మనసును తరచవలసి వస్తూంది !...

" ... మీరు చేయవలసినది మీ ముందుండగా, యిప్పుడు... యీ వయ సులో మీ వాళ్ల మీకేం చేశారు ? దేశం మీకేం చేసింది ? ... అని తీరికగా కూర్చుని ఆలోచించడం భావ్యంకాదు. మీరు చేయవలసినదేదో, చేతులు దాటి పోకుండా చేయండి ! ... " అంటుంది సద్గుణ.

సుధ పెళ్ళివిషయంలో నేను చేతులు కట్టుక్కూర్చున్నానని తన ఉద్దేశ్యం. ఇరవై నిండిన కూతుర్నింకా యింట్లో ఉంచుకోవడంలో నా అసమర్థతను అంచనా వేస్తుంది, సద్గుణ.

పిల్లల విషయంలో తలిదండ్రుల పాత్ర సమానమేనని ఊహించలేని సద్గుణ, కన్నతల్లిగా తనుపడే ఆవేదనను చెప్తుందే కానీ, తండ్రిగా నాకూ భాగం ఉందని అనుకోదు ... నా చేతకాని తనాన్ని ఎంతగా మాటల్లో విన్పించ గలదో ... అంతగా విన్పిస్తూనే ఉంటుంది.

అయినా ... దేశం విషయంలోనూ, యితరుల విషయంలోనూ నాకు కొన్ని ప్రిన్సిపుల్స్ ఉన్నట్లుగానే, ఎవరితోనూ మాట మిగలడం కానీ, తగువు పెట్టు కోవడం కానీ ... వగైరాలు లేకుండా ఉండటం కూడా ఒక ప్రిన్సిపులే !...

అందుకే నా శ్రీమతి ఎన్ని మాటలు అన్నా, "నన్ను తను అర్థంచేసుకున్న తీరు అది ... " అని సర్దుకోవడానికే ప్రయత్నిస్తాను !...కనుకనే మా మధ్య అలకలు, కోపాలు, తాపాలు, విడి పోవడాలు, విడాకులూ ... వంటివి, కనీసం మాటవరసకైనా రాలేదు !... కానీ, అప్పుడప్పుడూ యిలాగే సమ స్యలు రావడం, వాటిని పరిష్కరించే నిమిత్తం ఆలోచించవలసిరావడం... నా ఆలోచన ముగిసేలోగా, ఏదో జరిగి పోవడం...మామూలై పోయాయ్!...

"...ఇదిగో ! ... ఏమండోయ్... భగవద్గీత చేతుల్లో ఉంచుకుని భారత దేశ సమస్యలను గురించి ఆలోచిస్తు న్నారులా ఉంది ... కొంచెం లేచి,

మార్కెట్టుదాకా వెళ్ళిరాకూడదూ ?..."
సద్గుణ వచ్చింది.

మార్కెట్టంటే మాటలుకాదు ... పావలా పెడ్తే సరిపోతుంది అనిపించే కూర ఒక్కొక్కసారి మూడూ ముప్పా వలాదాకా అమ్ముతుంది. అదేం ఖర్మమో కానీ, నేను వెళ్ళిన రోజునే కూరలు మూడూముప్పావలా రేటులో ఉంటాయ్ !...

"ఏమి టాలోచిస్తున్నా రింకానూ ? అమ్మాయి ఆఫీసుకెళ్ళి ఓ రెండ్రూ పాయలు తీసుకుని వెళ్ళి రండి !...అదీ ఆఫీసునుంచి రాగానే విసుగ్గా కూడా ఉంటుంది...వెళ్ళి రండి !..."

వచ్చే పించను అయిపోగానే, వక్క పొడికూ్కడా అమ్మాయి నడగాలి... తప్పదు!...

సంచి చేతబుచ్చుకుని, ఆఫీసు చేరే సరికి మూడుగంటలు దాటింది.

ముప్పై అయిదు సంవత్సరాలు అలవాటయిన పరిసరాల్లో మళ్ళీ అడుగు పెడ్తుంటే... ఏమిటో ... 'నాది' ... అన్న భ్రమే కానీ ... నాకు మిగిలిం దేమిటి ?...

'ఇక నీ సేవ చాలు !... నీ నుంచి మేం పొందగలిగిం దేమీలేదు ... ' అంటూ రిటైరు అయిపొమ్మంది ఆఫీసు ! ఆఫీసు రూల్సు ప్రకారం ఉద్యోగ విరమణ అంటే, విశ్రాంతి తీసుకోవడం !...

కానీ ... రిటైరయిన మనిషంటే... సంఘానికి పనికిరానివాడు ... జీవితం నుంచే విరమించుకోవలసినవాడు ... అన్న విషయం ఆఫీసు కేంతెలుసు? ...తెలియదు.

నేను ఉద్యోగం చేసేరోజుల్లో ... ఠంఛనుగా పదిగంటలకల్లా సీట్లో కూర్చుని, అన్నీ సర్దుకుని పదిన్నర కల్లా పని ప్రారంభించి, మధ్యలో టీ టైములో కూడా మంచినీళ్ళ దగ్గర్నుంచీ సీటుదగ్గరకు తెప్పించుకుని ...ఆపైన, అయిదు గంటలకి దుకాణం కట్టేసి, అయిదుగంటల పదినిమిషాలకి ఆఫీసు ఆవరణం దాటి వస్తూంటే,...

"ఆఫీసుగారి భార్య ... " అనీ, "గాడిద చాకిరీచేసి చెడిపోతున్నాడు..." అనీ, "ఆ కుర్చీలో కూర్చుంటే, విక్ర మార్కుడి సింహాసనంలోలా... ఏదైనా "మాహాత్మ్యం" ఉందా ఏవిటి ? ..." అనీ ... వ్యంగ్యమూ, వెటకారమూ విన్పించినా...

ఆఫీసు ప్యూను దగ్గర్నుంచీ, ఆఫీ సరువరకూ అందరూ నవ్వుతూ పలక రించేవారు...

ఆ రోజులు పోయాయ్!...యిప్పుడు ఎవరైనా కన్పించినా, నేనే ఎక్కడ పలుకరిస్తానో నన్నట్లు, తప్పించుకు పోవడం, చూసినా చూడనట్లు ప్రవ ర్తించడం ! ... ఛ ! ... ఛ ! ... మనుషుల్లో కనీస పరిమాణాల్లో ఉండ

వలసిన అభిమానాలు కూడా కన్పిం చడంలేదు... ప్చ్ !...

ఏదో ఆలోచిస్తూ వెళ్ళిపోతున్నాను- అమ్మాయి పనిచేసే సెక్షను మూడో అంతస్తులో కాబోలు ... ఉందని చెప్పి నట్లుంది...

మెట్లెక్కుతుండగా ... ఎదురుగా మెట్లుదిగుతూ వచ్చిన వ్యక్తి దగ్గరగా, నిల్చుని,...

"ఓ ! మాష్టారూ ! ... బాగు న్నారా ? చాలారోజుల తర్వాత కన్పించారు ! ... " నవ్వుతూ పలక రించాడు...

అతను శివానందం...

...నేను మరో అయిదేళ్ళకి రిటైరయి పోతా ననగా...మా సెక్షనుకి క్రొత్తగా యు. డి. ఆడిటరుగా వచ్చాడు ... నేనే అతడికి ఒక సంవత్సరంపాటు పనిలో మెలకువలు...వగైరాలు చెప్పాను...

... మెరికలాంటి కుర్రవాడు ... చెప్పినదంతా త్వరగా అల్లుకుపోయే వాడు. అప్పట్నుంచే మాష్టారని పిలిచే వాడు. చనువుగా మాట్లాడేవాడు. అభి మానంగా చూసేవాడు. ఎప్పుడైనా... యిలా ఆఫీసు కొచ్చినా, "మాస్టారూ!" అని నోరారా పిలిచి మాట్లాడేది అత నొక్కడే !...

"ఏమిటి, మాష్టారూ ... సుధాగారి కోసం వచ్చారా? ... " అతడు వేసిన ప్రశ్నలన్నింటికీ సమాధానంగా నవ్వుతూ...

"అవునోయ్ ! ... మార్కెట్టుకని బయల్దేరాను. దారేకదా, చూసిపోదామని వచ్చానోసారి ... " డబ్బులకోసమే వచ్చానని చెప్పలేక...చెప్పాను...

"రండి ... మాష్టారూ ! ... నా రూంలో కూర్చుందాం ... పైన, సుధ గారిప్పుడు ఉండరనుకుంటాను..." అంటూ తన గదిలోకి నడిచాడు... అతన్ననుసరించాను...

కుర్చీ చూపించి కూర్చోమంటూ, అన్నాడు శివానందం... "ఎలా ఉంది, మాష్టారూ రిటైర్డ్ లైఫ్? ఏంచేస్తున్నారు తీరికసమయంలో ..."

"ఏముందోయ్ ... ఏవీఁ లేదు !... అంతా 'రిటైర్డ్'గానే గడుస్తూంది!..."

"మాష్టారూ !...రిటైరయినాక మా నాన్నగారు ఎంతో దిగులుగా ఉండే వారండీ ! ... సరైన కాలక్షేపంలేక, ఏదో ఆలోచిస్తూ ... తన కేదో అన్యాయం జరిగిపోయిందని, తనకు చేయవలసినది చేయలేదని ... చిరాకు పడేవారనుకోండి !...రిటైర్డ్‌గా ... మీ రన్నట్టు గడపడమంటే, ఆయన కెంతో కోపం వచ్చేది !..."

అతడు చెప్పే మాటలు వింటు న్నాను...

"... ఆయన బాధ చూడలేక, ... మేం బాధపడవలసి వచ్చేదనుకోండి ! ...ఏమిటో ... ఆయన ఘటం అలాగే వెళ్ళిపోయింది !...కానీ, మాష్టారూ...

నేను మాత్రం యిప్పట్నుంచీ ప్రణాళిక తయారుచేసుకుంటున్నాను — అప్పటి జీవితంకోసం! ...ఈ మధ్యే అరవిందుల వారు వ్యాఖ్యానించిన భగవద్గీతకి ఆర్డ రిచ్చాను...రాజాజీ భారతం ... రామాయణం ... ఉన్నాయి నా దగ్గర ! ... ఫిలసాఫికల్ పబ్లికేషన్స్‌కి కూడా డొనేషన్స్ కడుతున్నాను ! అరవిందుల భగవద్గీత చూశారా, మీరు? ... యివాళే నా చేతికి వచ్చిందది ... మీరు చదివి చెప్పం డెలావుందో ... " అంటూ ఆ గ్రంథం నా చేతి కందించాడు...

"మాష్టారూ ! ... అసలు మనిషికి ఏ వయసులోనైనా, సరైనా వ్యావృత్తి ఉండాలంటాను ... లేకపోతే ... మనిషి మెదడు ... 'డెవిల్స్ వర్క్-షాప్' సామ్యంగా తయారవుతుంది ! ... మూడేళ్ళుదాటితే పసిపిల్లలయినా ... అల్లరిగా తిరుగుతుంటే, చికాకన్పిస్తుంది ... చదువులో పెడతాం ! ... అలాగే, అరవై దాటిన తర్వాతకూడా... మనసు పరిపరివిధాల పోకుండా ఉండాలంటే, ...యిలాంటి సత్కాలక్షేపం ఉండాలంటాను ! ... ఏమంటారు ... మాష్టారూ ? ... నా మట్టుకు నాకు, ఆ వయసులో ఏకాంతంగా కూర్చుని, ఏదో ఉన్నది తిని, ఆధ్యాత్మికత అలవరచుకోవాలనుంది ! ... ఈ ప్రాపంచిక వాసనలకి దూరంగా వెళ్ళిపోవాలనుంది ..." అంటున్న శివానందం మాటలు వింటూ, అరవిందుల భగవద్గీత లోకి చూస్తున్నాను...

నేనూ ... ఒకప్పుడు ... అంటే, శివానందం వయసులో ఉన్నప్పుడు, భావిజీవితాన్ని గురించి ఎన్నో అనుకున్నాను.

ఇప్పుడు అనుభవించవలసి వచ్చే సరికి ... యిప్పటి యీ జీవితంమీద అప్పటి... ఆ ఆసక్తి చచ్చిపోయిందనే అనిపిస్తోంది ! ... 'ఏకాంతం' — ఒంటరితన మనిపిస్తోంది. జీవితం ముగింపుకు దగ్గరగా వచ్చేస్తూందని... మనసు మూలల్నుంచి మూలుగుతూంది !...

కానీ,... నా యీ స్వీయానుభూతిని చెప్పి, ఆ కుర్రవాడి మనసును చంపటం,...అతడి ఆశయాన్ని గురించి నేను నిరాశాజనకంగా మాట్లాడటం మంచిదికాదేమో!...

" ... అవునోయ్ ! ... భగవద్గీత ఉంది చూశావ్ ... ఎన్నో చేయాలనుకున్నవాడ్ని, అన్నీ చేయమని ప్రోత్సహిస్తుంది ... మానవ జీవితాన్ని వడపోసిన సారం తెలుసుకోవాలనుకునే వాడికి, అదీ తెలియజేస్తుంది. దీని ప్రాశస్త్యం గురించి ప్రపంచ తత్త్వవేత్తలుకూడా తెలుసుకోవాలని రిసెర్చ్ స్టడీ చేస్తున్నారట కదూ ?... యిప్పుడు పద్దెనిమిద్గో అధ్యాయం చదువుతున్నాను

...మోక్షమూ, సన్యాసమూ గురించి చెప్తున్నాడు శ్రీకృష్ణుడు..."

"ఏమిటి మాస్టారూ, మీ సుధగారి పెళ్ళికూడా దగ్గరపడిందనా, అప్పుడే సన్యాసమూ, మోక్షమూ అంటున్నారు మీరు?..." నవ్వుతూ అంటున్నాడు శివానందం.

ఆ గదిలో గడియారం నాలుగు గంటలు కొట్టింది.

"నాలుగవుతాందోయ్ శివానందం! ...ఓసారి సుధ దగ్గరికెళ్ళి..." అంటూ లేవబోయాను.

"అదేమిటి మాస్టారూ? యివాళ సుధగారు ఆఫీసుకు రాలేదు ... మీకు తెలియదా? ... రిజిష్టరాఫీసుక్కాబోలు వెళ్ళాలన్నట్లున్నారు!"

సుధ ఆఫీసుకి రాకపోవడమేమిటి? ... యివాళ ఓ గంట ముందుగానే బయలుదేరింది కూడాను ... యింటి నుంచీ!

శివానందం మాటలు నా కర్థంకావడం లేదు .. కానీ, ఏదో చెప్పాలి... కన్న కూతురి విషయం తండ్రికి తెలియ దంటే, ఎదుటివాడి దృష్టిలో పలచనేగా మరి!

"అవును కదుటోయ్! ... మరిచే పోయాను! ..." వయసు పైబడుతుంటే ఏదీ గుర్తు ఉండటంలేదు! ... యివాళే పన్నెండింటికి మూడోవాడి దగ్గర్నుంచి వచ్చాను ... ఇంటిదగ్గర మా ఆవిడ చెప్పినట్టుంది ... ఏదో ధ్యాసలోపడి వచ్చేశాను..." గొణుక్కుంటున్నట్లు గానే అన్నాను.

"కూర్చోండి మాస్టారూ! ..." అని కూర్చోబెట్టి, ప్యూన్‌ని పిలిచి రెండు కాఫీలు తెమ్మని అన్నాడు శివానందం

"మాస్టారూ!..అప్పట్లో మీరు చెప్పే వారు – మగపిల్లలకి కట్నం తీసుకోకు, ఆడపిల్లలకి యివ్వకు ... అని! ... నిజంగా మీలాంటి పెద్దలెందరుంటారు చెప్పండి! ప్రస్తుతం మీవంటి తల్లి దండ్రుల ప్రోత్సాహం కావాలి మాకు! ... నిజం, మాస్టారూ! సుధగారు రాజన్‌గారిని పెళ్ళిచేసుకోవడం ... అందులోనూ రిజిష్టర్ మారేజి చేసు కోవడం... మాకు వచ్చే నెల ఎనిమిదిన పార్టీ ఏర్పాటు చేయడం..యివ్వాళ విన్న ప్పుడు మాత్రం, మీతో నాకు పరిచయం కలగడం అదృష్టంగా అనుకున్నా నను కోండి! ... మా 'స్టాఫం'తా కూడా ఆ యిద్దరికీ హార్టీ కంగ్రాచ్యులేషన్స్ చెప్పాం! ...యువతరం యిలా ముందంజవేయడం ... అందుకు పెద్ద వాళ్ళ ప్రోత్సాహం ఉండటం ... నాకు నిజంగా చాలా సంతోష మనిపించింది... యికపైన మాకు కూడా వీళ్ళు ఆదర్శం!

సహజంగా మాటకారి అయిన శివా నందం మాటలు క్రొత్తగా విన్పిస్తు

న్నాయి. మనసులో ఏదో అలజడిని రేపుతున్నా య్.

అయినా ... పైకి నవ్వేశాను... సంతోషం నటించాను !...

ఇంక లైటమవుతోందని చెప్పి, బయటి కొచ్చాను.

సుధ పెళ్ళి !...రిజిష్టర్‌మా రేజి !.

"రాజన్" అంటే, ... భాషాంతరం ...బహుశా వర్ణాంతర వివాహమేమో కూడా !

వచ్చే నెల ఎనిమిదిన పార్టీ !... అందరూ కంగ్రాచ్యులేషన్స్ చెప్పారు!

ముందంజ ! ...యువతరం !

వింతగా వినిపించి, నా తప్పును వేలెత్తి చూపుతున్నట్లుగా మెదడును తొలిచివేస్తుంటే ... నేనేం చేయగలుగు తున్నాను ? ...అన్న ప్రశ్న వేసు కుంటే, సమాధాన మేంచెప్పుకో గలను ?

మగపిల్లలకు కట్నం తీసుకో కూ డ దు ! ..ఆడపిల్లలకు యివ్వ కూడదు ! ... ఇది నా ప్రిన్సిపుల్ ! ...అప్పట్లో... అంటే... ఒకప్పుడు !

నిజమే ! ...రామానికి, శంకరానికి, సుందరానికి వరుసగా పుట్టిన ముగ్గురు మగపిల్లలకీ కట్నం తీసుకోలేదు ... వాళ్లు కావాలనుకున్న పిల్లలనే తెచ్చి పెళ్ళిళ్ళయ్యా యన్పించాను.

లక్ష్మి, ఆ ముగ్గురి తరవాత దానికి, మేనరికం ముడిపెట్టినపుడు నా ప్రిన్సిపుల్ నిటారుగానే నిల్చుంది...

రమణి, లక్ష్మి తరవాత అమ్మాయి! ఎదిగే వేళకు నా రిటైర్‌మెంట్ చేరువ కావడంతో, యిన్స్యూరెన్స్ తాలూకు డబ్బును నీళ్ళల్లా ఖర్చుచేసి, దానికి మొగుణ్ణి కొన్నపుడే ... నేను నా నియమానికి నీళ్ళు వదులుకోవలసి వచ్చింది !

ఆఖరుది సుధ.

సుధ పెరిగేసరికి, నాకూ దేశానికీ బంధం తెగిపోయింది. చేతకానితనం, అసమర్థత ఆవరించాయి .. వచ్చిన పి. యఫ్. తో గ్రాడ్యుయేషను వరకూ చెప్పించాక, ఉద్యోగంలో చేరతానని, సుధ అన్నపుడు వద్దనలేకపోయాను. చదువుకున్నదాన్ని, ఉద్యోగంచేసే పిల్లని...కట్నంలేకుండా చేసుకొనడానికి ఎవరూ ముందుకు రాకపోవడంతో ఎంతో కొంత యివ్వాలన్నా ... ఆ 'నీళ్లూ' మిగలలేదు!

ఆడకూతురికి పెళ్ళిచేయడం నా బాధ్యత ! ... సద్గుణ గుర్తుచేస్తూనే ఉంటుంది. ముప్పై అయిదేళ్ళ సర్వీసును పునరావృతం చేసుకుని, 'మంచి' మిగి లిన మనిషెవరైనా కన్పిస్తారేమోనని గాలిస్తున్నాను !

ఇంతలోనే ... సుధ పెళ్ళి ! రిజిష్టర్ మారేజి ! ... 'మనవాడు' కాని వాడితో పెళ్ళి !

ఈ మాటలు వింటూ ఉంటే, తండ్రిగా నా బాధ్యత – నన్నే నిల దీస్తోంది !... ఇప్పుడు నేనేం చేయాలి? ...ఏం చేయగలను ?

"......"

"ఏమిటి ? ... ఎప్పుడొచ్చి కూర్చు న్నారు చప్పుడు లేకుండాను ! ... కూరలు తెచ్చినట్లు లేదేం ?..." సద్గుణ వచ్చి పలుకరించింది.

సమాధాన మేం చెప్పాలి ? ... మూసిన కళ్ళు తెరవకుండా పడక్కు- ర్చీలో పడుకున్నవాణ్ణి పడుకున్నట్లే ఉన్నాను.

ఏదో విసుగ్గా గొణుక్కుంటూ వెళ్ళి పోయింది సద్గుణ.

సుధ ఎనిమిది గంటలవేళ కాబోలు వచ్చింది ... ఆలస్యానికి కారణం తల్లి అడిగితే ఏదో 'కథ' చెప్తోందది !

తల్లికి తన విషయం తెలియదు కనుక...ఏదో కథ చెప్పి నమ్మించ గలుగుతుంది ... ఇపుడు నేను కల్పించు కుని, అసలు విషయం సద్గుణకి చెప్తే, ... దాని పరిణామం ఎలా ఉంటుంది ?"...

బి. పి.. పేషంటు సద్గుణకి, రక్త ప్రసరణవేగం పెరిగి కళ్ళు తిరిగి పడి పోతే, తల్లిబాధను సుధ అర్థంచేసు కుంటుందా ? ...

బహుశా ... అర్థంచేసుకునే, తల్లికి అసలు విషయం చెప్పడం లేదేమో అది ! ... నిజమే కావచ్చు ! ... పెళ్ళి అయిన తరువాతనైనా ఆ విషయం తెలియకుండా ఉందను... మరి అప్పుడు అదేం చేస్తుంది ?

కానీ...యిప్పుడు నేనేం చేయాలి ?

తన విషయం సుధ చెప్పకపోయినా ... నేను తెలుసుకున్నానని తెలియ చెప్పేటందుకు దాన్ని నిలదీస్తే ? యింతవరకూ ఎదురు ప్పని తన కూతురు తనకు ఎదురు తిరిగితే ... తను భరించగలదా ?

వచ్చే వయసు మనిషినేకాక, మన సునూ సడలించి పారేస్తోంది !

ఈ విషయంలో పెద్దవాణ్ణి కదిలించి చూస్తే ?

ఆ మర్నాడే, కారణం ఫలనా అని చెప్పకుండా పెద్దవాడి దగ్గర కెళ్తున్నా నని బయలుదేరాను.

* * *

రామంతో సుధ విషయం చెప్పి, 'ఏం చేస్తే బాగుంటుంది ?' ... అని ఎంతో ఆత్రుతతో అడిగితే ,.. వాడు అది చాలా చిన్న విషయమన్నట్లు ... 'యిప్పుడు అటువంటివి మామూలే' నన్నట్లు మాట్లాడి, వయసుతో పెరిగి, అన్నీ ఆలోచించుకుని, పెళ్ళివరకూ వచ్చిన చెల్లెల్ని అభినందించాడు... కాలంతోపాటు ముందడుగు వేస్తున్న సుధ పెళ్ళికి తను తప్పకుండా వస్తా నని, నన్ను దానికి చెప్పమన్నాడు !

వాడి ధోరణి అది !...

కన్నతండ్రి మనసు యివాళ వాడికి తెలియదు!...రేపొద్దున వాడి కూతురే వాడిని కాదని యిలాంటి పెళ్ళిచేసు కుంటే, యింత నిర్లిప్తంగా ఉండ గలడా ? ... దగ్గరుండి యిటువంటి పెళ్ళిచేస్తానని అనగలడా ?

నా పిచ్చి కానీ, ... బహుశా, అంటాడేమో !...

వాడి తండ్రిని నేనైనా, మా యిద్దరి మధ్యా, ఒక తరం అంతరం ఉంది. ఇవాళ నా కూతురు తనంతట తాను ఎవర్నో చేసుకుంటూ ఉంటే, ... నా తండ్రిలా – కూతుర్ని చావగొట్టి చెవులు మూయక,... 'ఏంచేస్తే బాగుం టుంది ?' అని ఆలోచిస్తున్నాను !... వీడి కూతురు పెరిగేసరికి, మరో పదిహే నేళ్ళకి, ఆలోచన అచరణలోకి వస్తుందేమో ! ...

మళ్ళీ యింటికి వచ్చేశాను.

* * *

ఆ రోజే ఎనిమిదో తారీఖు !...

సుధ పెళ్ళిరోజు ! ... దాని పెళ్ళి అదే చేసుకునే రోజు ! ...

కాకారవాలతో కాకులు రొదచేస్తూ ...గూళ్ళు చేరుకుంటున్నాయ్ !... అది ఆఫీసునుంచి వచ్చేవేళ దాటిపోయింది ...సుధ యింకా గూడు చేరలేదు...

"అమ్మాయి ఇంకా రాలేదేంవి టండీ ? ..." అంటూ యింట్లోకీ, బయటికీ కాలుగాలిన పిల్లిలా సద్గుణ తిరుగుతుంటే ... తన కేమని చెప్పాలో తెలియక నిర్లిప్తంగా ఉండిపోయాడు.

సర్వకర్మ ఫలత్యాగంచేసి, సన్యాసం పొందమంటున్నాడు కృష్ణుడు !... అన్యమనస్కంగా ఆలోచిస్తూ...పరిపరి విధాల మనసు పోతూంటే, వాలు కుర్చీలోనే కూర్చున్నాను !

తొమ్మిది దాటాక కాబోలు...

"ఏవేం సుధా, యింతాలస్యమైందేం? ... ఆ అబ్బాయెవరూ ? ..." సద్గుణ మాటలకు కళ్ళు తెరిచి చూశాను.

...క్రొత్తచీర కట్టుకున్న సుధ ముఖంలో...ఏదో వింత కళ ... బహుశా వివాహకాంతి కన్పిస్తోంది ... దాని వెనక, రాజన్ ... సుధ భర్త నిలుచున్నాడు !

... యిద్దరూ లోపలికి రావడానికి అనుమతి యివ్వమన్నట్లుగా చూస్తున్నారు.

... వాళ్ళిద్దరినీ ప్రక్క ప్రక్కన చూస్తుంటే,...'యికముందు జీవి తంలో, కష్టసుఖాలలో చెరిసగం పంచు కుని, జతగా కలిసి నడుస్తాం !' అని చెప్తున్నట్లన్పించగానే ... సుమారుగా పదిరోజుల్నుంచీ అనుభవిస్తున్న సాగర మథనంలోనుంచి ... అమృతం ఉద్భ వించిన అనుభూతి కలిగింది ! ... మనసుపడ్డ మథనంతా మాయమయినట్లు తోచింది ! ... నేను ధైర్యం చేయని,



చేయలేని పనిని వాళ్ళు సాధించారని సంతోషం అంకురించింది ! ... గుండె లోతులలో ... ఏదో ఒక మూల ... మూలుగుతున్నట్లనిపించినా ... ప్చ్... యిక యింతే ! ...

భగవద్గీత ప్రక్కనపెట్టి, లేచి ... "రండమ్మా ! ... లోపలికి రండి!... రా బాబూ!"...అని ఆహ్వానించాను.

ఇద్దరూ కాళ్ళకు నమస్కరించారు.

కొద్ది సెకన్ల మౌనం తరవాత నేను నా మనసుతో ఘర్షణపడుతుంటే...

"యిక ... వెళ్ళిమస్తావండి !..." రాజన్ అంటున్నాడు, సుధ చిటికెన వ్రేలు పట్టుకుని.

నా కళ్ళు చెమ్మగిల్లాయి... యిరవై ఏళ్లు పెంచిన నా బిడ్డను, చిటికెనవ్రేలు పట్టుకుని తీసుకెళ్ళిపోతానని అతనంటుంటే !

"ఇదేమిటి, బాబూ !... యీ రోజు యిక్కడ నిద్రచేసి వెళ్ళండి ! ... మామగారినా నేను ఏమీ చేయలేను ! ... నా మీద ఆ మాత్రం అభిమానం ఉంటి, ... ఒక్క రాత్రి యీ యింట గడపలేరా ? ..."

కండువాతో కళ్ళువత్తుకుని ... "అమ్మాయి సుధా ! ... నీ గదికోకి తీసుకెళ్ళమ్మా ! ... అమ్మ వంటచేసి, నీ కోసమే ఎదురుచూస్తోందిప్పటి దాకా..." అంటూ వాళ్ళను పంపించి, సద్గుణకోసం చూసేసరికి...గోడకు చేర గిలబడి, కొంగు నోట్లెగుక్కుకుని ఏడు స్తోంది సద్గుణ !

సద్గుణ దగ్గరగా వెళ్ళి...భుజంమీద చేయివేసి ... "సుధ పెళ్ళిచేసుకుంది సద్గుణా !... రాజు మన అల్లుడు..." అన్నాను.

కానీ ... తన కన్నీటిని ఆపి సముదాయించగలనా ? " ... అయినా ప్రయత్నించాలి.

"బాధపడకు సద్గుణా ! ... మన తరం దాటిపోతూంది ... యిది క్రొత్త తరం ! ... వాళ్ళకి అడ్డునిలవడం మంచిదికాదు ... మనం చేయలేనిది వాళ్లు చేసినందుకు మనం సంతోషిం చాలి..."

"ఏం సంతోషమండీ ? ... కన్న కడుపులో చిచ్చుపెట్టి, నవ్వమంటే ఎలా నవ్వగలనండీ ! ... పెట్టుకుని పెంచి. వాళ్ళమీదే ఆశలు పెట్టుకున్నందుకు...మన కడుపున పుట్టినవాళ్ళకి మనమే పరాయివాళ్ళం అయిపోయామా ? ... చివరకు మనకు వాళ్ళు చేసేది యిదా ? ... " సద్గుణ గొంతులో బాధ ఉంది.

ఆరునెలల సహవాసమే యిద్దరికి, ఒకే రకంగా ఆలోచించడం నేర్పుతుం దన్నమాట నిజమయినపుడు, యిన్నేళ్ళ సాహచర్యంలో, సద్గుణ కూడా...తన బిడ్డలు తనకేం చేశారు ! ...అన్న ప్రశ్న వేస్తుంటే... ఒకప్పుడు ... "దేశం నాకేం-చేసింది ? ... " అనుకున్న విషయం గురుతు వస్తున్నది...

నిజాని కా ప్రశ్న తప్పే!...

నోరులేని పక్షులు వంటివి ... రెక్కలు రాని కూనలకు తాము కష్టపడి తెచ్చినది నోట చేర్చి. పెంచి, రెక్కలు యిచ్చి పంపేస్తుంటే,...ఎన్నో తెలుసు కుంటున్న మనిషి తన బిడ్డలు తనకేం చేశారని ప్రశ్నించుకోకూడదు ! రోజులు మారుతున్నాయ్ ...విలువలూ మారు తున్నాయ్ !...

'దేశానికి నేనేం చేయగలను' !... యిదే నేను ఆలోచించాలి...

ఇప్పుడు సద్గుణ ప్రశ్నకి సమా ధానం కూడా నేనే చెప్పాలి...

"మన పిల్లలకి మనం ఎంతో చేశా మనుకుంటామే కానీ, సద్గుణా!... విలు




వలు మార్చేస్తున్న కాలంతో పెరిగే మన పిల్లలకి, మనం చేయనిది, వాళ్ళకు కావలసినది ... యింకా ఏదో కొరత గానే కనిపిస్తుంది !...మనకేం చేశారని ప్రశ్నించకుండా, వాళ్ళు ముందంజ వేస్తే మనం సంతోషించాలి ! ... మన పిల్లలకి మనం ఎప్పుడూ పరాయివాళ్ళం కాము!...వాళ్ళంతవాళ్ళు అయిన తరు వాత, మంచి చెడులు తెలుసుకుని, వాళ్ళకు మంచి అన్పించినది వాళ్ళు చేసినపుడు, అది సబబేనని మనమూ ఆమోదించడమే వాళ్ళకు కావలసినది ! మనం చేయగలిగిన అంతేదీ !...లే... లేచి ... నీ చేతివంట, యిద్దరికీ రెండు ముద్దలు తినిపించి, ఆశీర్వదించు ! ... మన పిల్లలని మనం దీవించాలే కానీ, శపించకూడదు !..."

సద్గుణ నెమ్మదిగా లేచి వంట గది లోకి వెళ్ళింది.

తల్లి మనసులో ఏదో సలుపు తూంది ... ఆమె అడుగులలో అది వినబడుతూంది.

తమని కాదని...తమ పిల్లలు స్వతం త్రంగా వ్యవహరిస్తున్నారంటే, తల్లి దండ్రులబాధ... పిల్లలూ అర్థంచేసుకో గలరు !... కానీ, ముందుచెప్తే, కాదం టారేమోనన్న భయం వాళ్ళను చెప్ప నీయదు!.

అయితే ... యిది మా తరం అర్థం చేసుకోవడానికి మరికొంతకాలం పడు తుంది !

బహుశా...అప్పటికి, "దేశం నాకేం చేసింది ? ... " అన్నదానికి రోజులు చెల్లిపోతాయనుకుంటాను !




(గత సంచిక తరువాయి)

**4**

"ఓ అదృష్టదేవతా! నిన్ను ఈ మాణిక్యంలో బంధించి, ఉంగరం గలవాడి బానిసగా చేసినదెవరు ?" అని మారూఫ్ అడిగాడు.

ఉంగరంనుంచి ఇలా జవాబు వచ్చింది.

"మనం ఇప్పుడున్న ప్రదేశం ఇరామ్ నగరం నిర్మించిన షద్దాద్ ఇబన్ ఆద్ యొక్క ఖజానా. ఆయన కాలంలో నేను ఆయన బానిసనై, ఈ ఉంగరంలో నివసించాను. ఆ ఉంగరం ఇప్పుడు నీ అధీనంలో వుంది."

ఆ ఉంగరం ధర్మమా అంటూ, కైరోలో ఎర్రవీధిలో వుండే చెప్పులు మరమ్మతు చేసేవాడు కాస్త్రా నిమ్రాడ్,

షడ్డావేలకు నేరుగా వారసుడయాడు. అతను ఉంగరం మహిమ తక్షణమే పరీక్షించగోరి, "ఉంగరంలోని బానిసా, ఈ నిధులన్నీ తీసుకుపోయి ఆరుబయట పెట్టగలవా ?" అని అడిగాడు.

"సునాయాసంగా," అన్నాడు అదృష్టదేవత.

"అలా అయితే, ఇక్కడ ఒక్క నలుసు మిగలకుండా పైకి చేర్చు," అన్నాడు మారూఫ్.

"ఒరే, పిల్లలూ ! ఒరే, పిల్లలూ !" అన్న కేక ఉంగరంనుంచి వినపడింది.

పన్నెండుమంది అందమైన పిల్లలు, నెత్తిన తట్టలు పెట్టుకుని, మారూఫ్ ఎదట ప్రత్యక్షమయారు. వాళ్ల అతనికి వంగి సలాంచేసి, మెరుపులాగా చకచకా మూడు గదులూ ఖాళీచేసి, నిధులన్నీ బయటికి చేర్చారు. తరవాత వాళ్ళు అదృశ్యమయారు.

"భేష్ ! ఇప్పుడు ఈ నిధులన్నిటినీ ఇత్తియాన్ అల్ఖతాన్ చేర్చటానికి పెట్టెలూ, కంచరగాడిదలూ, వాటిని తోలేవాళ్లూ, ఒంటెలూ, ఒంటెలవాళ్లూ కావాలి," అన్నాడు మారూఫ్ ఉంగరంతో.

ఉంగరంలోనుంచి ఒక్కకేక విని పించేసరికల్లా, కంచరగాడిదలూ, ఒంటెలూ, వాటిని తోలేవాళ్లూ, పెట్టెలూ, తట్టలూ, ఆరువందలమంది మమ్లూక్లూ ప్రత్యక్షమయారు. కన్ను మూసి తెరిచేలోపల నిధులన్నీ పెట్టె లలో సర్దటమూ, వాటిని జంతువుల మీదకి ఎత్తటమూ, మమ్లూక్ల రక్షణ కింద బిడారు తయారుకావటమూ జరిగి పోయింది.

మారూఫ్ ఉంగరంతో, "అదృష్ట దేవతా ! మరో వెయ్యి జంతువులు కావాలి. వాటిమీద విలువైన వస్త్రాలు సిరియావీ, ఈజిప్టువీ, గ్రీసువీ, పర్షి యావీ, ఇండియావీ, చీనావీ, ఎత్తి ఉండాలి," అన్నాడు.

అనటమే వ్యవధిగా వెయ్యి ఒంటెలూ, కంచరగాడిదలూ సరుకుతో సహా బిడారులో చేరాయి.

మారూఫ్ తృప్తిపడ్డాడు. అతను ఉంగరంతో, "నే నిప్పుడు భోజనం చెయ్యాలి. ఒక సిల్కు డేరా వేయించి, చల్లని మద్యాలూ, మంచి మంచి ఆహా రాలూ సిద్ధంచేయించు", అన్నాడు.

డేరా, విందుభోజనంతోసహా చల్లా తయారుగా ఉండే సమయానికి, గ్రామానికి వెళ్ళిన రైతు, నెత్తిన కొయ్యపాత్రతో ఇన్ని నూనెలో వేపిన చిక్కుళ్లూ, చేతిలో నల్లరొట్టే, ఉల్లి పాయలూ, చంకలో గుర్రానికి ఎండు గడ్డికట్టా పట్టుకుని వచ్చాడు.

సిల్కుడేరాలో ఠీవిగా కూర్చున్న మారూఫ్నూ, అతనికి వడ్డన చేస్తున్న బానిసలనూ చూసి రైతు ఆందోళన చెంది, "సుల్తాను రానే వచ్చాడు.

లాగింది. ముందుగా సుల్తాను రాక తెలపటానికి మష్రూక్ వచ్చి ఉంటాడు. నా రెండు కోళ్లూ అపునేటితో వండి ఎందుకు సిద్ధం చేశానుగాను ! ఎంత అప్రతిష్ఠ !" అనుకుని కోళ్ళను చంప టానికి పోబోతుండగా మారూఫ్ అతన్ని చూసి తన బానిసలతో, "ఆ మనిషిని పిలుచుకురండి," అన్నాడు.

బానిసలు రైతును నెత్తిమీదా, చేతిలోనూ, చంకలోనూ ఉన్న వస్తువు లతోసహా పిలుచుకు వచ్చారు. మారూఫ్, అతన్ని కౌగలించుకుని, "ఏమిటి తెచ్చావు, సాటి పేద అన్నా?" అని అడిగాడు.

అంత గొప్పవాడు తనమీద అంత ఆపేక్ష చూపటం రైతుకు ఆశ్చర్యం కలిగింది. తనను సాటిపేద అన్నవాడు పేద అయితే తాను ఏంకావాలి ?

"యజమానీ, నీకు భోజనమూ, నీ గుర్రానికి దాణా తెచ్చాను. నా అజ్ఞా నాన్ని క్షమించు. నువు సుల్తానువని తెలిసి ఉంటే నా కోళ్ళను వండిపెట్ట టానికి సంకోచించేవాణ్ణికాను. కాని పేదరికంతో బుర్ర చెడుతుంది, కళ్లు చూడలేవు," అంటూ రైతు అవమాన భారంతో తలవంచుకున్నాడు.

తాను ఈ పేదరైతుకన్న పేదవాడి నన్న సంగతి గుర్తువచ్చి మారూఫ్ కన్నీరు కార్చాడు.

"విచారించకు, అన్నా. నేను సుల్తానును కాను. ఆయన అల్లుణ్ణి మాత్రమే. మాకూ మాకూ మధ్య చిన్న స్పర్థ వచ్చి, రాజభవనం వదిలి వచ్చే శాను. కాని మా మధ్య సంధి కుదిరి నట్టు గుర్తుగా ఆయన ఈ బిడారు నాకోసం పంపాడు. నేను నగరానికి తిరిగి పోబోతున్నాను. కాని నే నెవరో తెలియకుండానే నాకు ఆతిథ్యం ఇయ్య టానికి సిద్ధపడిన నీ దొడ్డబుద్ధికి ప్రతి ఫలం ఉండకపోదు," అని రైతును తన కుడిప్రక్కన కూర్చోబెట్టుకుని మారూఫ్, "ఎన్నిరకాల మాంసం కూర లున్నాయో చూడు. అయినా నేను నువు తెచ్చిన ఆహారమే తింటాను," అని తాను రైతు తెచ్చిన నల్లరొట్టె వగైరాలు తింటూ, రైతుకు తన బానిసలచేత రుచికరమైన పదా ర్థాలు వడ్డింపజేశాడు. అవి తింటూ రైతు పొందిన పారవశ్యం చూసి అతను ఆనందించాడు.

ఇద్దరి భోజనాలూ ముగిసినాక మారూఫ్ అల్లాకు ధన్యవాదాలు చెప్పు కుని, రైతును బిడారుకేసి తీసుకు పోయి, బిడారు రెండు భాగాలనుంచీ రెండేసి ఒంటెలనూ, రెండేసి కంచర గాడిదలనూ ఏరుకోమన్నాడు.

"అన్నా, వాటిమీద ఉన్న సరుకు అంతా నీదే. సిల్కు డేరా, అందులో ఉన్న సమస్తమూ నీదే. తరవాత అతను రైతు వెలిబుచ్చే కృతజ్ఞతలు

 

వినిపించుకోకుండా, సెలవు పుచ్చుకుని, తన సైన్యాన్ని బిడారు లంకు దాపు వేయించి, తాను వస్తున్నట్టు రాజుకు వార్త చెప్పటానికి శీఘ్రవార్తాహరుణ్ణి ముందుగా పంపాడు.

వార్తాహరుడు రాజభవనం చేరేసరికి వజీరు రాజుతో ఇలా అంటున్నాడు :

"మోసపోకండి, మహారాజా! మీ అమ్మాయి తన భర్త వెళ్ళడం గురించిన కథ నమ్మకండి. అమీర్ బిడారును తీసుకురావటానికి వెళ్ళలేదు – అసలు బిడారు. అంటూ ఉంటేే గద ? –– తన అబద్ధాలకు శిక్ష తప్పించుకోవటానికి చీకట్లో రహస్యంగా పారిపోయాడు."

సగం అదే అభిప్రాయంలో ఉన్న రాజు జవాబు చెప్పటానికి నోరు తెరిచేటంతలో మారూఫ్ పంపిన వార్తాహరుడు రాజు ఎదటికి వచ్చి, "శుభవార్త, మహారాజా. నా యజమాని అమీర్ మారూఫ్ త్వరలో వచ్చి చేరుతున్నారు. ఆయన వెంట ఉన్న భారీ అయిన బిడారు కొంచెం నింపాదిగా కదులుతున్నది," అని వార్త చెప్పి, వంగి సలాంచేసి, వెళ్ళిపోయ్యాడు.

రాజుకు ఆనందం కలిగింది, అయితే అంతకన్న హెచ్చుగా వజీరుమీద ఆగ్రహం లేచింది. ఆయన వజీరును శాపనార్థాలు పెట్టసాగాడు. వజీరు ఆయన కాళ్ళమీదపడ్డాడు. రాజు ఆయనకేసి చూడకుండా, లేచి, నగరం అలంకరణకూ, తన అల్లుణ్ణి ఊరేగింపుతో తీసుకురావటానికి ఏర్పాట్లు చేయబోయాడు.

ఆయన తన కూతురి మందిరానికి వెళ్ళి, శుభవార్త తెలిపాడు. అయితే, తాను సృష్టించిన బిడారు నిజంగా వస్తున్నదని తండ్రి చెపితే, ఆమెకు ఏమనటానికీ పాలుపోలేదు. తన భర్త రాజును మళ్ళీ మోసగిస్తున్నాడా ? లేక, తన ప్రేమను పరీక్షించటానికి తాను దరిద్రుణ్ణని చెప్పాడా ? ఏమైనా తాను సుఖంగా ముఖంపెట్టి, బిడారుకు ఎదురుకోల ఇయ్యటానికి తన తండ్రిని తొందరపెట్టటం మంచిదని ఆమె అనుకున్నది.

అయితే అందరికన్న అమితంగా ఆశ్చర్యపడినవాడు మారూఫ్ చిన్ననాటి స్నేహితుడైన సజ్జనుడు అలీ. మారూఫ్ పెద్ద బిడారుతోసహా తిరిగి వస్తున్న సందర్భంలో ఆర్భాటంగా నగరమంతా సింగారించటం చూసి అతను, "చెప్పులు కుట్టేవాడు మళ్ళీ ఏం కొత్త ఎత్తు ఎత్తాడు ? చెప్పుల మరమ్మతుతో బిడార్ల యాజమాన్యం సాధ్యం కావటం నేనెన్నడూ వినలేదు. ఏమైనా నా మిత్రుడు అనుమానం పాలు కాకుండా ఉండాలి," అనుకుని, అందరిలాగే రాగలదానికి ఎదురు చూడసాగాడు.

త్వరలోనే బిడారు నగరప్రవేశం చేసింది. మారూఫ్ గుర్రంమీద ముందున్నాడు. అతను ఏ రాజుకన్నా ఎన్నోరెట్లు కళగా ఉన్నాడు. బ్రహ్మాండమైన బిడారూ, దాన్ని నడిపే మమ్లూక్లూ, అతి ఖరీదైన వారి దుస్తులూ చూసి పౌరులు నోళ్లు తెరిచారు. అలీ ఎలాగో తోసుకుంటూ మారూఫ్‌ను చేరబోయి, రహస్యంగా, "ఏమిటీ కొత్త దొంగవేషం! ఇంద్రజాలంగాని చేస్తున్నావా? నీ ఎత్తులు పారాలిగాక!" అన్నాడు

మారూఫ్ నవ్వి, మర్నాడు ఇద్దరూ కలుసుకునేటట్టు చెప్పాడు.

మారూఫ్ రాజు వెంట గుర్రాలమీద రాజభవనానికి వచ్చి, రాజుగారి ఆలోచనా మందిరంలో సింహాసనంమీద రాజుతోబాటు కూర్చున్నాడు. ముందు ఖజానాను బంగారంతోనూ, రత్నాలతోనూ నింపి, తరువాత అమూల్యమైన బట్టల తానులు విప్పదీయించి, తన చేతిమీదుగా పెద్ద కుటుంబాలవారికీ, వారి భార్యలకూ, తానెరిగిన వర్తకులకూ ఎడాపెడా బహుమతు లిచ్చి, రెండో బిడారు ఖాళీ అయేట్టు చేశాడు.

"చాల్లే, బాబూ! ఇంక ఆగు!" అని రాజు రహస్యంగా చెవిలో పోరుతున్నా వినిపించుకోలేదు, "నా సంపద తరగదు", అన్నాడు.

తన బిడారు సత్తా ప్రదర్శించిన మీదట మారూఫ్ తన భార్య మందిరానికి వెళ్ళాడు. ఆమె ఆనందాశ్రువులతో అతనికి ఎదురువచ్చి, "నీ దారిద్ర్యం గురించీ, గయ్యాళి భార్య గురించీ చెప్పినదంతా హాస్యానికా? ఏమైనా నా ప్రవర్తనకు నేను అల్లాకు ధన్యవాదా లర్పిస్తాను." అతను ఆమెను కౌగలించుకుని, ఒక అద్భుతమైన అంగరఖా, పావురాయి గుడ్లంత ముత్యాలు నలభైగల చేర్లు పది, మంచి నగిషీగల పాంజేబులూ ఇచ్చాడు.

ఆమె పరమానందం చెంది, "వీటిని ప్రత్యేక సమయాలలోనే ధరిస్తాను", అన్నది.

"అవసరంలేదు. నీకిలాటివి రోజూ బహూకరిస్తాను. చివరకు నీ పెట్టెల్లో వాటికి చోటు లేకుండాపోతుంది", అన్నాడు మారూఫ్.

మర్నాడు అతనింకా పక్కమీది నుంచి లేవకముందే రాజు వచ్చి దిగులు ముఖంతో, "నాయనా, దుర్వార్త! ఉన్నట్టుండి నీ ఒంటెలూ, కంచర గాడిదలూ, మమ్లూక్లు అంతా మాయమయారు", అన్నాడు.

మారూఫ్ గట్టిగా నవ్వి, "మీరేమీ విచారించకండి. ఇలాటి బిడార్లు రోజూ వస్తాయి కావాలంటే," అన్నాడు.

ఈ మాటలు విని రాజు మరింత నిర్ఘాంతపోయాడు. ఆయన ఈ సంగతి

తన వజీరుకు చెప్పి, "ఇప్పుడే మంటావు ?" అన్నాడు.

పగ తీర్చుకోవటానికి మంచి అవకాశం దొరికిందనుకుని వజీరు, "మహారాజా, నా అల్పబుద్ధితో మీ మనసులోని అంధకారం తొలగటం సాధ్యంకాదు. అయినా నన్ను అడిగారు గనక చెబుతున్నాను. మీ అల్లుడుగారి ఈ సంపదకంతకూ మూలం ఏమిటో తెలియాలంటే అతన్ని తప్ప తాగించండి," అన్నాడు.

"ఈ ఉపాయం బాగుంది," అన్నాడు రాజు.

ఆ సాయంకాలం మారూఫ్‌తోబాటు రాజూ, వజీరూ తాగటానికి కూర్చున్నారు. త్వరలోనే చెప్పులు కుట్టేవాడికి బాగా నిషా ఎక్కిపోయింది.

"నాయనా, నీ అద్భుతమైన జీవిత కథ మా కెన్నడూ చెప్పావు కావు. అందులో ఎన్నో వింత విషయాలుండి ఉంటాయి," అన్నాడు సుల్తాను.

పూర్తిగా మతిపోయి ఉన్న మారూఫ్ తన మొదటి భార్యతో కాపరం మొదలుకుని రైతు పొలంలో నిధి దొరకటం దాకా అంతా చెప్పేశాడు.

రాజూ, వజీరూ ముఖాలు చూసుకున్నారు.

వజీరు అతనితో, "అయ్యా, తమ ఉంగరం ఒకసారి చూడవచ్చునా ?" అని అడిగాడు.

మారూఫ్ ఉంగరాన్ని తీసి వజీరుకిచ్చి, "చూడండి, అదృష్టదేవత ఆ మాణిక్యంలో ఉంటుంది", అన్నాడు.

మెరిసే కళ్ళతో వజీరు ఉంగరాన్ని తనవేలికి తొడిగి, మాణిక్యాన్ని రుద్దాడు.

వెంటనే ఉంగరంలోని గొంతు ఏంకావాలని అడిగింది.

"ఈ వెర్రిరాజునూ, ఈ చెప్పులు కుట్టేవాణ్ణీ విశాలమైన ఎడారి మధ్య చేర్చు," అన్నాడు వజీరు.

మరుక్షణం వారిద్దరూ శ్మశానంలాటి ఎడారిమధ్య ఉన్నారు.

వజీరు సభచేసి, రాజ్యక్షేమంకోసం సుల్తానునూ, అతని అల్లుణ్ణీ దేశబహిష్కారంచేసి, తాను పరిపాలన చేపట్టవలసి వచ్చిందనీ, కొత్త పరిపాలనను ఆమోదించనివాళ్ళు ఎడారిలో దాహంతో చస్తారనీ తెలిపాడు. అందరూ అతని ఆజ్ఞ శిరసావహించారు. అతను కొందరిని పైకెత్తి, కొందరిని దించి, శయనించటానికి వస్తున్నానని రాజకుమార్తెకు కబురుచేశాడు.

వజీరు తిరుగుబాటు గురించి అంతకు మునుపే వినిఉన్న రాజకుమార్తె, మిమ్మల్ని స్వీకరించటానికి నాకు ఆనందమేగాని ప్రస్తుతం నేను బయట ఉన్నాను. మైలస్నానం అయాక మీ కోసం కబురుచేస్తాను," అని కొజ్జా ద్వారా జవాబు పంపింది.

"నాకు మైలలూ, గీలలూ పనికి రావు. నేను వెంటనే బయలుదేరి వస్తున్నాను", అని వజీరు తిరిగి వార్త పంపాడు.

"వచ్చి నన్ను కలుసుకోండి," అని ఆమె జవాబు పంపింది.

ఆమె దివ్యంగా అలంకరించుకుని ముస్తాబై, అత్తర్లు ఘుమాయిస్తూ, వజీరుకు నవ్వుతూ స్వాగతం చెప్పింది, "మహాభాగ్యం !" అంటూ.

వజీరు ఆమెను బట్టలు విప్పి పడు కోవటానికి రమ్మని ఒత్తిడిచేశాడు. ఆమె బట్టలు విప్పబోతూ కెవ్వున అరిచి, ముఖంమీద మేలిముసుగు కప్పుకున్నది.

"ఏమయింది ? ఎందుకు కేకపెట్టి, ముఖం దాచావు ?" అని వజీరు అడిగాడు.

"కనిపించటంలేదూ ?"

"నా కేమీ కనిపించటంలేదే!"

"ఎంత సిగ్గు ! ఎంత తలవంపు ! నగ్నంగా ఎరగనివాడి ఎదటపడనా ?" అన్నది రాజకుమార్తె.

"ఎక్కడ ? ఎక్కడ ?" అంటూ వజీరు ఇటూ అటూ చూశాడు.

"అదుగో, ఆ ఉంగరంలో."

"అల్లా ! ఆ మాట నిజమే. నాకు తట్టలేదు. కాని అదిమనిషికాదే, భూతం."

"భూతమా ! నా ప్రారబ్ధం !" అంటూ రాజకుమార్తె దిళ్ళలో ముఖం దాచుకుని మూలిగింది. తరవాత ఆమె, "నాకు భూతాలంటే చెడ్డ భయం. దయ చేసి దాన్ని ఎక్కడన్నా దాచెయ్యండి," అన్నది.

ఆమెను తృప్తిపరచటానికి వజీరు ఉంగరం తీసి దిండు కిందపెట్టి, ఆమెను సమీపించాడు.

అతన్ని దగ్గరిదాకా రానిచ్చి అతని పొట్టలో చాచి తన్నింది. ఆ దెబ్బతో అతను మడతపడి, కిందపడిపోయి దొర్లాడు. ఆమె చప్పున ఉంగరం తీసుకుని, రుద్ది, "ఈ పందిని లోతైన చీకటి కొట్టులో వేసి, నా తండ్రినీ, భర్తను క్షేమంగా తీసుకురా," అన్నది.

మరుక్షణం వజీరు రాజభవనంలో కెల్లా లోతైనా చీకటి కొట్టులో వున్నాడు. రాజూ, మారూఫ్ రాజ కుమార్తె గదిలో ప్రత్యక్షమయ్యారు. రాజు భయంగాని, మారూఫ్ నిషాగాని ఇంకా పూర్తిగా పోలేదు. ఆమె వారిద్దరికీ ముందు భోజనం ఏర్పాటు చేసి, తాను వజీరును ఎలా మోసం చేసినదీ చెప్పింది.

"వాణ్ణి కొరతవేస్తాం", అన్నాడు రాజు.

" మహరాజుగా ! " అన్నాడు మారూఫ్.

అతను తన ఉంగరాన్ని తన కిచ్చెయ్యమని భార్యను అడిగాడు.

"నీ ఉంగరాన్ని నువు దక్కించుకో లేకపోయావు. అందుచేత అది ఇక నా దగ్గిరే వుంటుంది," అన్నది రాజకుమార్తె.

"అదీ సబబే"; అన్నాడు మారూఫ్.

తరవాత రాజు తనతోబాటు మారూఫ్‌ను కూడా రాజ్యపాలన చెయ్య నిచ్చి, చివరకు అతన్నే రాజుగా చేశాడు. మారూఫ్ రాజకుమార్తెతో దీర్ఘకాలం సుఖంగా జీవించాడు.

(అయిపోయింది)




"తెల్లకాగితాలు ముందేసుకుని ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

తలెత్తి చూశాను. మా మురళీధరం మావయ్య, నవ్వుతూ కన్పించాడు.

"నువ్వా! మావయ్యా!...రా..రా.. దారితప్పి వచ్చినట్లున్నావే!"

"దారి తెలిసే వచ్చాను. ఏమిటి, ఏదో రాయాలనే ప్రయత్నంలో వున్నట్లున్నావ్ ?" అన్నాడు మావయ్య.

"అవును, ఈ రోజు ఆదివారంగదా, ఏదైనా కథ రాయాలనుకుంటున్నాను."

"నేను నీ మూడ్ చెడగొట్టాననుకుంటాను. సరే కానివ్వు, నేనీలోపల అమ్మతో బాతాఖానీ వేస్తుంటాను," అంటూ లోపలకు వెళ్ళబోయాడు.

"నో...నో...నేనింకా మూడ్‌లోకి రాలేదు. సరైన ప్లాట్ దొరకడంలేదు."

"అలాగా! నేనొక ప్లాట్ చెప్తాను గాని నా కేమిస్తావ్?"

"లంచమా?"

"ఆ మాట ఇందుకు వర్తించదు. కథ నాది. కేవలం మాటల గారడీ నీది. నీకు పత్రికవాళ్ళు రెమ్యూనరేషన్

ఇస్తారు నువ్వు నాకు నవయుగాలో వెట్ పార్టీ ఇవ్వాలి. ఓ.కే."

"నువ్వు చెప్పే ప్లాట్ నాకు నచ్చాలి. నేను రాయాలి. అది పత్రికలో పడాలి. అప్పుడుగదా పార్టీ. ఓ.కే." అన్నాను.

"అయితే రాసుకో. కథ పేరు ప్రిస్టేజ్ "

"కొంపదీసి ఏ ఇంగ్లీషు కథకో అనువాదం కాదుగదా," అన్నాను అను మానంగా మావయ్యవంక చూస్తూ.

"యూ, సిల్లీ! ఇది పూర్తిగా నా స్వంత అనుభవం. ఏ ఇతరుల అనుభ వానికి అనుసరణ కాదని హామీ ఇస్తు న్నాను. చాలా? అయితే ఈ మధ్య తెలుగుకథకు ఇంగ్లీషు పేరుతో ముస్తాబు చెయ్యడం ఫ్యాషన్," అన్నాడు మావయ్య నవ్వుతూ.

"సరే కానివ్వు."

"ఆ రోజు నేను సత్తెనపల్లి బస్ స్టాండ్‌లో నిల్చున్నాను మాచెర్ల వెళ్ళాలి నేను. గుంటూరునుంచి హైదరాబాద్ వెళ్ళే ఎక్స్‌ప్రెస్ బస్ వచ్చేటైము అది. షెడ్యూల్ టైమ్ దాటిపోయింది. ఎక్స్ ప్రెస్ బస్ రాలేదు చాలా విసుగ్గావుంది నాకు నీకు తెలుసుగా సత్తెనపల్లి బస్ స్టాండ్‌లో కూర్చోవడానిక్కూడా చోటువుండదు. ఇంతలో గుంటూరు నుంచి మాచెర్ల వెళ్లే ప్యాసింజర్ బస్ వచ్చింది. ప్యాసింజర్‌లో ప్రయాణం నాకు బోర్‌గా వుంటుంది. ఇక్కడ నిలువుకాళ్ళమీద నిల్చోవడంకంటే అందులో ఎక్కి కూర్చోవటమే గుడ్డిలో మెల్లలా నయం అని ఎక్కాను. డ్రైవరు, కండక్టరు, కొందరు ప్రయాణీకులు బస్ దిగి హోటల్లలోకి వెళ్ళారు. పావు గంట తర్వాత కండక్టరు వచ్చి టిక్కెట్లు ఇచ్చాడు. తర్వాత ఎక్స్ ప్రెస్ సర్రున దూసుకొచ్చింది హడా వుడిగా. తొందరపడి ఇందులో ఎక్కి నందుకు నన్ను నేనే తిట్టుకున్నాను. మా బస్సు బయల్దేరింది. చిన్న చిన్న స్టాప్స్‌లోగూడా ఆగుతూ, ముక్కుతూ మూలుగుతూ పోతూవుంది. పిడుగు రాళ్ళ పొలిమేరల్లో ఎక్స్‌ప్రెస్ మా బస్‌సు ఓవర్‌టేక్ చేసింది.

పిడుగురాళ్ళలో ఆగిన తర్వాత ఒక యువతి, బస్ ఎక్కి, "నేను గుంటూరునుంచి రెంటచింతలకు టిక్కెట్ తీసుకున్నాను. సత్తెనపల్లిలో నేను భోజనంచేసి వచ్చేలోపల మీరు వచ్చేశారు. తర్వాత నేను ఎక్స్‌ప్రెస్‌లో ఇక్కడికి వచ్చాను," అంది.

"అలాగా, సారీ మీరు ఎవరికీ చెప్పి వెళ్ళలేదా?" అన్నాడు కండక్టర్.

"లేదండీ. నెవర్ మైండ్," అని ఆమె సరాసరి లోపలికి వచ్చి నేను కూర్చున్న వెనుకసీటులో కిటికీ ప్రక్కన కూర్చున్న ఒక యువకుడితో "నేను ఇప్పుడే కూర్చుని గుంటూరునుంచి వస్తున్నాను. సత్తెనపల్లిలో భోజనానికి దిగాను. వెళ్ళేటప్పుడు ఈ సీట్లో వీక్లీ వుంచాను " అంది.

ఆ యువకుడు మారుమాట్లాడకుండా లేచి ఆమెకు సీటు ఇచ్చాడు. ఆమె కూర్చుని "ఇక్కడ వీక్లీ వుండాలి," అంది.

అతను అటూ, ఇటూ చూసి పైన రాక్ లో వున్న వీక్లీ తీసి ఆమె చేతి కిచ్చాడు. ఆమె వీక్లీ పేజీలు తిరగేసి "మైగాడ్," అంది కంగారుగా.

అంతా ఆమెవైపు చూశాం ఏం జరిగిందా అని.

"ఇందులో వందరూపాయల కాగితం వుండాలి," అంది ఏడుపు ముఖంతో.

బస్ నిశ్శబ్దమైపోయింది. కండక్టర్ లేచివచ్చాడు. అప్పటివరకూ ఆ సీట్లో కూర్చున్న యువకునిముఖం పాలిపోయి వుంది.

"నాకేం తెలియదు," అన్నాడు.

"తీస్తే ఇచ్చెయ్యండి ప్లీజ్," అన్నాడు కండక్టర్.

"నిజం. అసలు నేనా వీక్లీ చూడ లేదు," అన్నాడు నెమ్మదిగా. అతని ముఖం అవమానంతో కుంచించుకు పోయింది.

"ఈ వీక్లీలో వంద కాగితం పెట్టి వెళ్ళారట ఆమె. ఎవరైనా తీసివుంటే ఇచ్చెయ్యండి దయచేసి," అన్నాడు కండక్టరు.

ఎవరూ మాట్లాడలేదు. ఒకళ్ళ ముఖం మరొకరు చూసుకున్నారు. తర్వాత గుసగుస లాడుకున్నారు.

"అందర్నీ చెక్ చెయ్యండి," అన్నారు ఎవరో వెనుకనుంచి.

"బాగుందండీ. ఎవరైనా పుస్తకంలో డబ్బు పెట్టి వదిలేసి వెళ్తారా? అయినా చెక్ చేస్తేమాత్రం ఎలా దొరుకుతుంది? ఇదుగో నా దగ్గిర పది వంద కాగితాలు వున్నాయ్ అందులో ఒకటి ఆమెదే అనుకోండి. ఎలా తెలుస్తుంది?" అన్నాడు ఖద్దరు బట్టలు తొడుక్కున్న పెద్దమనిషి. బహుశా ఎవరో వ్యాపారస్తుడనుకుంటాను.

పావుగంటసేపు తర్జనభర్జన జరిగింది.

"అసలు మీరు వీక్లీలో వందకాగితం ఎందుకు పెట్టారు?" అన్నాడు కండక్టర్ ఆమెతో.

"గుంటూరులో బస్ ఎక్కి కూర్చున్న తర్వాత మా బాబాయి ఇచ్చాడు. నేను సూట్ కేస్ తెరిచి పెట్టడానికి బద్ధ కించి చేతిలోవున్న వీక్లీలో పెట్టాను. తర్వాత అందులో పెట్టిన సంగతి మర్చి పోయి సత్తెనపల్లిలో దిగాను. భోజనం చేస్తుంటే మధ్యలో జ్ఞాపకంవచ్చిందిగాని నేను వచ్చేసరికి బస్ లేదు." అంది ఆమె.

బస్‌లో కొందరు విసుగు ప్రద ర్శించారు.

"ఎంతసేపు ఆపుతారు. రైట్ చెప్పండి,"అన్నారు ఎవరో అసహనంగా.

"పోనివ్వండి, ఏం చేస్తాం?" అంది ఆమె

కండక్టర్ రైట్ చెప్పాడు. బస్ బయల్దేరింది.

బస్సులో ప్రయాణీకులు చాలామంది ఆ అమ్మాయి వీక్లీలో వందకాగితం పెట్టిందంటే నమ్మలేదు. ఇదొక బడాయి

అన్నారు. అసలా పిల్లకు మతిమరుపు ఎక్కువలాగుంది. ఎక్కడో పారేసుకుని పుస్తకంలో పెట్టానని గొడవచేసింది అన్నారు.

ఎవరూ నమ్మకపోయినా నేను నమ్మాను. ఎందుకు? చెప్పు," అని అగాడు మావయ్య.

"ఆ అమ్మాయి అమాయకురాలని నువ్వు గ్రహించివుంటావు. డబ్బు పోక పోయినా పోయిందని నలుగురికీ చెప్పు కున్నందువలన లాభం ఏముంది? ఆ అమ్మాయి చెప్పింది నిజమే" అన్నాను.

మావయ్య పక పకా నవ్వాడు. నేను విస్తుపోయి చూశాను.

మావయ్య నవ్వు ఆపుకుని, "పప్పులో కాలువేశావు" అన్నాడు.

"నువ్వే చెప్పు బాబూ" అన్నాను.

"ఆ వీక్లీలో వందకాగితం తీసుకుంది నేనే," అన్నాడు మావయ్య.

మూర్ఛపోయినంత పనైంది. నిజమా అన్నట్లు కళ్ళు పెద్దవిచేసి మావయ్య వంక చూశాను.

"నిజమే. సత్తెనపల్లిలో ఎక్కినప్పుడు ఆమె సీట్లో కూర్చుంది నేనే. అప్పుడు వీక్లీ అక్కడేవుంది. బస్ బయల్దేరినా ఎవరూ రాకపోయేసరికి, ఎవరో మర్చిపోయి దిగివుంటారనుకుని వీక్లీ చేతిలోకి తీసుకుని పేజీలు తిరగేస్తుంటే వందకాగితం కనిపించింది. మతిపోయినంత పని జరిగింది. ఎవరైనా అడిగితే ఇవ్వాలనే అనుకున్నాను. కాని ఎవరూ అడగలేదు. కాసేపటికి బస్ ఏదో వూరిలో ఆగింది, నా ముందు సీట్లో వాళ్లు దిగిపోయారు. ముందుసీట్లలో కాస్త సుఖంగా వుంటుంది. కుదుపులు వుండవు. అందుకని ముందుసీటులోకి మారిపోయాను. పోయేముందు ఆ వీక్లీలో వందకాగితం కాస్తా జేబులో వేసుకుని, వీక్లీని పైన రేక్‌మీద పడేశాను. ఇక పిడుగురాళ్ళలో ఆమె ఎక్కి వందకాగితం పోయిందని గోల పెట్టిన తర్వాత నేను జేబులోనుంచి తీసి ఇద్దామా? అనుకున్నాను. కాని ఇవ్వలేకపోయాను. ఎందువల్ల? ప్రెస్టేజ్. ఆ వందకాగితం అలాగే వీక్లీలోవుంచేసి వుంటే తిరిగి ఇచ్చినా బాగుండేది. కాని తీసి జేబులో పెట్టుకుంటిని. ఇప్పుడు జేబులోనుంచి తీసి ఇస్తే అందరూ ఏమనుకుంటారు? భలే పెద్దమనిషిరా! ఎవరూ అడక్కుండావుంటే కొట్టేద్దామని జేబులో పెట్టుకున్నాడు అనుకుంటారు గదా. అందుకని ఆ వందకాగితం ఇవ్వాలనివున్నా ఇవ్వలేకపోయాను. ఆమె నాతోపాటు మాచెర్ల వచ్చివుంటే కథ వేరుగా వుండేది. బస్ దిగినతర్వాత ఆమెను ఒంటరిగా కలుసుకుని డబ్బు ఇచ్చి 'సారీ' చెప్పుకునేవాడిని. కాని ఆమె రెంటచింతలలో దిగిపోయింది. మళ్ళీ ఎప్పుడైనా కనిపిస్తుందేమోనని ఇప్పటికీ ఆ లైన్‌లో ప్రయాణం చేస్తున్నప్పుడు చూస్తూనే వున్నాను. చ్చ...చ్చ...ఆమె కన్పించనేలేదు." అని ముగించాడు మావయ్య.



# పల్లకి చెప్పిన కథ

వేమకోటి సీతారామశాస్త్రి

ఇది కథ కాదు. జీవన చైతన్యస్రవంతి.

ఈ శిథిల కుడ్యాల మధ్య, గత వైభవానికి చిహ్నంగా, కృశించుతూ మిగిలిపోయాను, నేను. నేను మాత్రం యెంతకాలం వుంటాను. నాకూ కాలం చెల్లిపోతున్నది. ఈ విశాల భవన ప్రాంగణంలో నాకే ప్రాణం కొట్టుకుంటున్నది. జీవన్మరణాలకు మధ్య, బంధానుబంధాలకు మధ్య, ఐహికానికీ ఆముష్మికానికీ మధ్య......

సుమారు నాలుగు దశాబ్దాలకు క్రితం, ఈ భవనం కళకళలాడుతూ వుండేది. దాన ధర్మాలతో, ప్రతిరోజూ యేదో వ్రతమో, పండుగో, ఉద్యాపనో జరుగుతూ కనుల వైభవంగా వుండేది. ఆ భవనానికి యజమాని చైనులు. ఆయనకు తిలారులో అగ్రహారం భూములుండేవి. యింట్లో యెక్కడ చూసినా ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి తాండవించేవి.

ఊళ్ళోనే కాదు, మిగతా ఊళ్ళలో జరిగే పెళ్ళిళ్ళకు గూడా, నన్నిచ్చేవారు చైనులుగారు. ఎన్నో పెండ్లిళ్లు, ఉచితంగా చేయించేరు.

చాలా కాలానికి ఆ పుణ్య దంపతులకు శారదమ్మ పుట్టింది. బారసాల గొప్పగా చేసారు. పండితులందరిచేత

ధన ధాన్య, ఐశ్వర్యాలతో సౌభాగ్య వతిగా జీవించాలని మహదాశీర్వచనము చేయించి, వారికి బంగారు కాసులు, కాశ్మీరు శాలువలు యిచ్చారు.

వాస్తవానికి శారద నిజంగా చదువుల దల్లే. అందమైన యెర్రని లేత పెదవుల్లో కోకిల కంఠంతో ఆంధ్రం అమరం వల్లె వేస్తుంటే యెనిమిదోయేటకే సరస్వతీ దేవి భువినుండి దివికి దిగివచ్చినట్లుగా వుండేది. శారదకు యెక్కువస్నేహితులు లేరు. ఉన్నవాడు ఒక్కడే రామం. వాళ్ళిల్లు నాలుగిళ్ళ అవతల వుంది. శారదకన్నా రామం రెండుమూడు యేండ్లు పెద్ద. లేమి సంసారం. యజమాని లేని యిల్లు. ఉన్న ఒక్క కొడుకుని చదివించి వృద్ధిలోకి తీసుకు రావాలన్న తాపత్రయంలో రామం తల్లి ఊళ్ళో అందరికీ తలలో నాలికలా వుంటూ చిన్న పనులకు, పెద్ద పనులకు చైనులుగారింటికి వచ్చి, వాళ్ళ ఆదరాభిమానాలు సంపాదించింది.

వాళ్ళింట్లోనే రామం అన్నం తినేవాడు. అలాగ రామంకు, శారదకు స్నేహం కలిసింది. శారదకు ఎనిమిదో యేటనే చైనులుగారు పెండ్లి తలపెట్టారు. వరుడు విశాఖపట్నంలో ఎమ్.ఎ. చదువుతున్నాడు. అంత కలిగిన కుటుంబం కాదు. కాబట్టి ఇల్లరికానికి ఒప్పుకున్నాడు.

* * *

మేడంతా పెళ్ళిసందడితో కళకళలాడుతోంది. చైనులుగారు కనీవినీ యెరుగనంత గొప్పగా చేద్దామని భారీ యెత్తున ప్రయత్నాలు చేస్తున్నారు. చుట్టుప్రక్కల గ్రామాలన్నీ పెండ్లి గురించి గొప్పగా చెప్పుకుంటున్నారు.

రామం గదిలో అడుగుపెట్టాడు ఆగదికొక వింతశోభ వచ్చింది, అందమైన అలంకరణతో. ఆకుపచ్చ పట్టు పావడాతో, నల్లని పువ్వులున్న తెల్లని జాకెట్టుతో కర్జూరం చాపమీద కూర్చుని,

"శ్రీరామ జయరామ
శృంగార రామ యని
చింతింపరాదే ఓ మనసా"

పాడుతోంది, శ్రావ్యంగా.

రామాన్ని చూడగానే పాట ఆపేసింది, శారద.

''రా రామం. యేం యింతాలస్యమైంది'' అడిగింది. చాపకు కొంచెం ప్రక్కగా జరిగి. ఇద్దరూ కలిసి భాగవతం చదివేవారు రోజూ.

''నువ్వు మరి మాట్లాడవేమో ననుకున్నాను" అన్నాడు రామం బాధగా.

"యేం?"

"నీకు పెళ్ళికదా!" బిక్కమొహంతో. అన్నాడు శారద నవ్వేసింది. శారద పెళ్ళంటే రామంకు యెందుకో దిగులు. శారద యింట్లోకి వెళ్ళి లాడూలు తెచ్చి రామాని కిచ్చింది.

మర్నాడే పెళ్ళి పల్లకీని చాలా అందంగా బంగారు జరీతో అలంక రించారు. లోపల ముఖమల్ పరుపులు వేసారు. ఖరీదయిన సెంట్లు గుమ్మ రించారు.

పల్లకీ బయలుదేరింది, తోట సంబ రానికి. రామం పల్లకీ ప్రక్కనే నడుస్తూ, పెళ్ళికొడుకు క్రిష్ణమూర్తిని చూసాడు. అందమైన విగ్రహమే.

"పల్లకీ అంటే వధూవరులు నూతన జీవన యాత్రకు అధిరోహించే మొదటి ప్రయాణ సాధనం" అని చైనులుగారు యెవరితోనో నవ్వుతూ అంటూండగా విన్నాడు. ఎవరి పెళ్ళి ఊరేగింపో ఆ పల్లకీలో వస్తే, మేడమీద నుండి అతనూ, శారదా చూసేవారు రామం. తననీ, శారదనీ ఆ పల్లకీలో వధూ వరుల స్థానాల్లో మార్పిడి చేసుకుని ఊహించేవాడు. కానీ, ఈనాడు ఆ స్థానంలో శారద కెదురుగా యింకో వ్యక్తి కూర్చున్నాడు. అతని పసి ఊహలు పగిలిపోయాయి. ఐదురోజుల పెండ్లిలో అహోరాత్రాలు నిరతాన్న దానం జరిగింది. ఏడు వారాల నగలతో, వజ్రవైడూర్యాలతో అలంకరింపబడిన శారదను చూసేసరికి. ఆ తర్వాత రామానికి తన అంతస్థు గుర్తుకువచ్చింది. చిన్ననాటి మమతలు, అనుబంధాలు తనలోనే నిక్షిప్తపరుచుకున్నాడు.

* * *

"వెలుగు వెనుకనే చీకటి
చీకటిలో సన్నని వెలుతురు
వెలుగు చీకటు లలుముకొన్నది
బ్రతుకు దాగిలి మూతరా!"

క్రిష్ణమూర్తి యిల్లరికపు టల్లుడుగా ప్రవేశించినదగ్గర్నుంచీ ఆ యింటికి చీకటి కాటుక పులుముకొనటం ప్రారంభించింది బుద్ధిమంతుడూ, యోగ్యుడూ, సౌమ్యు డూలా కన్పించిన క్రిష్ణమూర్తికి లేని వ్యసనం అంటూ లేదు.

పుత్తడిబొమ్మ, అపర సరస్వతి, అమాయకురాలు అయిన తన కూతురి జీవితం నరకప్రాయం కావటం భరించ లేకపోయారు. ఆ ఆవేదనలోనే, సంవత్సరం తిరక్కుండానే తల్లి దండ్రులు శారదమ్మని ఒంటరిదాన్ని చేసి వెళ్ళిపోయారు. ఆస్తి తనపేర రాయకపోతే రైలుక్రింద బుర్రపెట్టి చచ్చిపోతానని బెదిరించి, శారదచేత రాయించుకున్నాడు క్రిష్ణమూర్తి.

జమీందారీలాంటి ఆస్తి క్రిష్ణమూర్తి చే తి లో బ డి హారతికర్పూరంలా హరించుకుపోయింది. అప్పటికే శారదకు యిద్దరు కొడుకులు. ఆమె జీవి తంలో భర్త అనురాగానికీ, ఆప్యాయతకీ నోచుకోలేదు. పైగా భర్త వేశ్య లనే తన భవంతిలోకి తెచ్చేవాడు. భవంతిలో పొంగి పొరలుతున్న యౌవనం నవ్వులు, మధ్యలో క్రిష్ణ మూర్తి దగ్గుతెరలు విన్పించేవి.

అన్నిటినీ ఆ మహాసాధ్వి భరించింది. పిల్లల్నిద్దర్నీ రెండు కళ్ళలా చూసుకుని మంచి చదువు చదివించాలని, గొప్పవాళ్ళని చెయ్యాలని ఆశతోనే కళ్ళలో ప్రాణాలు నిలుపుకుని బ్రతుకుతోంది.

* * *

చాలా సంవత్సరాల తర్వాత, రామం అగ్రహారం వచ్చాడు, తల్లి చనిపోతూ తనకు మిగిల్చిపోయిన యిల్లును బాగుచేయిద్దామని. రామం హోదా చాలా పెరిగిపోయింది. అమెరికాలో ఏరోనాటిక్సు మీద రీసెర్చి చేసాడు. తర్వాత హైద్రాబాద్‌లో ఉద్యోగం వచ్చింది. కంపెనీ మళ్ళీ అతన్ని అమెరికా పంపించవచ్చు. హోదా, డబ్బు వచ్చిన తరువాత అందరు బంధువులు ఆదరిస్తారు. వరసలు కలుపుకుంటారు.

శారద భవనానికి వెళ్ళాడు. అప్పటి కళలేదు, ఇంటికి. ఆ హోదా లేదు. సాయంసంధ్యకన్నా ముందే ఆ యింట్లో చీకట్లు అలుముకున్నాయి.

చనువుగా అన్ని గదులు దాటుకుని, వంటింట్లోకి వెళ్ళాడు. జీర్ణ వస్త్రంతో, కిరసనాయిలు బుడ్డీ దీపందగ్గర వచ్చి కట్టెలు ఊదుతూ పొగలో సతమతమవుతూ, మధ్య కన్నీళ్ళు తుడుచుకుంటున్న ఒకనాటి స్వర్ణమూర్తి శారద రూపం, రామం కన్నీటి తెర మధ్య అస్తవ్యస్తంగా కన్పించింది. అడుగుల చప్పుడు విని వెనక్కి తిరిగింది.

"ఎవరూ ?" అడిగింది ఆతృతగా.

"నేను శారదా, రామాన్ని" అన్నాడు రామం, గాద్గదికంగా ఒకప్పటి ఆ యింటి శోభను జ్ఞప్తికి తెచ్చుకుంటూ.

"నువ్వా రామం ! బాగున్నావా?" అంది గుమ్మందగ్గరకు వచ్చి పైట భుజం నిండుగా కప్పుకుని.

"బాగున్నాను. ఏమిటి శారదా యిది. యెందుకిలా జరిగింది." రామం హృదయంలో వేయి ప్రశ్నలు, సమ్మెట పోటుల్లా బాధిస్తున్నాయి. సజల నేత్రాలతో శారద రామంవేపు చూసింది.

ఇంతలో ముందు గదిలో ఖంగు ఖంగుమని దగ్గు వినిపించింది.

"రా, రామం, వారిని చూద్దువుగానీ" అంటూ రెండుగదుల అవతల గదిలోకి తీసికెళ్ళింది. పందిరిమంచం మీద, పీక్కుపోయిన కళ్ళతో ఒక వయసుమళ్ళిన వ్యక్తి ఆయాసంతో వాగరుస్తున్నాడు. దగ్గుతూ, పక్కనున్న పీకుదానాలో కాండ్రించి ఉమ్ముతున్నాడు. రామం గుర్తించాడు. అతనే క్రిష్ణమూర్తి. శారద పెళ్ళికీ యిప్పటికీ చాలా మారిపోయాడు. అనుభవాలమధ్య వయస్సు పెరిగి, శరీరం ముడుతలు పడిపోయింది.

అనుమానంగాచూసాడు, వాళ్ళిద్దర్నీ.

"రామం అని, చిన్నప్పుడు మన

యింట్లోనే వుండి చదువుకునేవాడు. మిమ్మల్ని చూద్దామంటే..." భయం గానే మాట్లాడింది.

"ఆఁ!" అన్నాడు ఆయాసంగా. రామం నమస్కారం పెట్టాడు. దగ్గరగా ఒక స్టూలు వుంటే కూర్చున్నాడు. ముగ్గురిమధ్యా క్షణంసేపు నిశ్శబ్దం రాజ్యంచేసింది.

"ఏమిటి మీ అనారోగ్యం?" రామం జాలిగా ప్రశ్నించాడు.

"డబ్బులేకపోవటమే ఈ లోకంలో ప్రతీ వ్యక్తికీ అనారోగ్యం. నా దగ్గర డబ్బు వుండేటప్పుడు యిలాంటి రోగం ఒక్కటీ దగ్గరికి వచ్చేది కాదు." అన్నాడు కర్కశంగా. మళ్ళీ దగ్గుతెర వచ్చింది.దెబ్బతిన్న పక్షిలా కిరకిరలాడి పోయాడు క్రిష్ణమూర్తి.

"మీరు అధైర్యపడకండి. రేపు పట్నంనుండి మంచి డాక్టరును తీసుకు వస్తాను. మీకు త్వరలో నయమవుతుంది." అన్నాడు రామం లేస్తూ. అతనేం మాట్లాడలేదు. కళ్ళు మూసుకున్నాడు. రామంతోబాటు శారద, వీధి గుమ్మంవరకూ వచ్చింది.

"పిల్లలతో వచ్చావా - రామం? రేపు మీఆవిడ్ని పంపించు." అడిగింది శారద.

"లేదు శారదా! నేనింకా పెళ్ళి చేసుకోలేదు."

ఆప్రతిభురాలైంది శారద.

"యింకా నీ పరిస్థితులు..."

"చాలా చక్కగావున్నాయి. నాకో పన్నెండు వందలు జీతం. ఒంటరి వాడ్ని..." అన్నాడు రామం గాద్గదికంగా.

"మరయితే పెళ్ళెందుకు చేసుకోలేదు.

శారద ఆవేదనగా ప్రశ్నవేసింది. రామం వీధి గుమ్మంలో వారగా మూలగా వున్న బూజుపట్టిన పల్లకీవేపు చూసాడు. శారద కళ్ళుగూడా పల్లకి వేపే చూసాయి.

"శారదా! శారదా!" గదిలోనుండి పెద్దకేక.

"వారు పిలుస్తున్నారు. వస్తా రామం" శారద వెళ్ళిపోయింది. రామం పల్లకీవేపే చూస్తున్నాడు. గత వైభవ దృశ్యాలు యెన్నో అతని మస్తిష్కంలో రంపపుపొట్టులా రాలి పోతున్నాయి. అవన్నీ ఒక్కసారి తెగిపోయాయి. గదిలో పెద్దగా కేకలు విన్పించాయి రామానికి.

"ఎవడే వాడు. నీ చిన్నప్పటి ప్రియుడా! మీ యిద్దరూ కూడబలుక్కుని, పట్నంనుండి డాక్టరును తెచ్చి బలవంతంగా నన్ను చంపివేస్తారా... ఒసేయ్, నేను అంత సులభంగా చావనే..."నేను యే డాక్టరు దగ్గరా మందు పుచ్చుకోనే. నన్ను నువ్వే డాక్టరుకు గానీ చూపిస్తే నామీద ఒట్టే."

అరుస్తున్నాడు. శారద ఏడుపు సన్నగా విన్పిస్తోంది.

బరువెక్కిన గుండెలతో గుమ్మాలు దిగిపోయాడు, రామం.

మర్నాడుదయం పట్నంవెళ్ళి డాక్టరును తీసుకువద్దామని రామం బట్టలు వేసుకుంటూ వుండే సమయానికి రామం వేలువిడిచిన పినతండ్రి కూతురు వచ్చి, "ఒరేయ్ అన్నయ్యా! శారదమ్మ పట్నంనుండి డాక్టరును తీసుకురావద్దని కబురు పంపించిందిరా" అంది.

నిరాశతో కూలబడిపోయాడు రామం. చెల్లెలువల్ల చాలా తెలుసుకున్నాడు. క్రిష్ణమూర్తికి క్షయ, ఒంటినిండా మచ్చలు, పొంగులు వున్నాయి. శారద పిల్లలు అట్టే తెలివైనవాళ్ళుకాదు. వాళ్ళకి చదువు సమంగా అబ్బలేదు. శారద పిల్లల చదువుకోసం ఆరాటపడిపోతోంది. క్రిష్ణమూర్తి అనారోగ్యంగా వున్నా వ్యసనాలు యేమీ ఆగలేదు. ఇంట్లో ఒక్కొక్క వస్తువు కరిగిపోతోంది. రామం చెల్లెలుచేత డబ్బు పంపిస్తే, భర్త అనుమానంతో మరింత బాధపడడం యిష్టంలేక తీసుకోలేదనీ, మరేమీ అనుకోవద్దనీ కబురు పంపించింది.

రామం ఎంతో బాధపడ్డాడు. శలవ లయిపోయాయి. మర్నాడుదయం తిరిగి హైద్రాబాద్ వెళ్ళిపోవాలి. తను ఆ భవనంలో తిని పెరిగాడు. తను ఇంతవాడు కావడానికి చైనులుగారు చేసిన గుప్తదానమే కారణం. అలాంటివారి కుటుంబాన్ని ఆదుకోవాలి. శారద నూరేళ్ళజీవితం చెడిపోగూడదు. ఆమె సౌభాగ్యవతిగా, కలకాలం ఆనందంగా జీవించాలి...యెలా...యెలా. ." అన్న ప్రశ్నలు అతని మస్తిష్కంలో పీఠం వేసుకుని కూర్చున్నాయి ఏదో నిశ్చయానికి వచ్చి, శారద భవనానికి వెళ్ళాడు.

ముందు గదిలో పిల్లలిద్దర్నీ ఒక లాంతరుముందు కూర్చోబెట్టుకుని చదువు చెబుతున్నది. క్రిష్ణమూర్తి వెనకగదిలో విపరీతంగా దగ్గుతున్నాడు.

"మీ వారితో మాట్లాడాలి శారదా" అన్నాడు నిశ్చలంగా.

"వొద్దు రామం. వారికి ఆరోగ్యం బాగులేదు," అంది లేచి నిల్చుని. క్రిష్ణమూర్తిని అనుమాన పిశాచం దహించివేస్తున్నది.

"కాదు శారదా! ఒకప్పుడు ఈ యింట్లో ఆశ్రయంపొందిన నేను, నీ స్నేహితుడ్ని, ఆపదల్లో వున్న నీ కుటుంబాన్ని ఆదుకోవటం తప్పా?"

మ్లానంగా నవ్వింది శారద.

"తప్పొప్పులు యెవరు నిర్ణయించగలరు, రామం" అంది, గాద్గదికంగా. ఇద్దరూ కలిసి క్రిష్ణమూర్తి గదిలోకి వెళ్ళారు.

"యేంబాబూ! మళ్ళీ యిలా దయ



చేసారు." క్రిష్ణమూర్తి ప్రశ్నలో వ్యంగ్యం ధ్వనించింది.

"రేపు నేను హైద్రాబాద్ వెళ్ళిపో తున్నాను."

"అయితే యేం?"

"యేంలేదు. మీరు అంగీకరిస్తే, మీ అబ్బాయిల్నిద్దర్నీ నాదగ్గరే వుంచుకుని చదివిద్దామని..." యింకా మాట పూర్తి కాలేదు.

"ఆహా! ఇదన్నమాట ప్లాను. ముందు పిల్లల్నిద్దర్నీ పంపించేసి, ఆ తర్వాత నన్ను ఒంటరిగా వొదిలేసి హైద్రాబాద్ వెళ్ళి వాడితో కులుకుదామనుకుంటున్నా వన్నమాట. నేను వారంరోజులుగా చూస్తున్నానులే, వాడి చెల్లెలితో రాయ బారాలు. రాక్షసీ...నా పిల్లలనుండి నన్ను వేరుచేస్తావే...అలా జరగనికి వీల్లేదు. నా పిల్లలు ఒకరి మోచేతిక్రింద

నీళ్ళు తాగరు ... ముందిక్కడనుంచి వెళ్ళిపో." ఆవేశంగా అరుస్తూన్న అతనికి దగ్గుతెర వచ్చింది.

రామానికి విపరీతమైన కోపం వచ్చింది. యేమైనా చేస్తాడు. కానీ శారద ముఖంలో దీనత్వంచూసి చల్లబడి వెనక్కి తిరిగిపోయాడు.

"నన్ను క్షమించు రామం. వారి మనః పరిస్థితి బాగులేదు. నీ సహాయంగూడా సరియైన సమయంలో పొందలేని నిర్భాగ్యులం. నావలన నీ కవమానం జరిగింది," అంటూ దీనంగా యేడ్చింది. రామానికిగూడా కన్నీళ్ళు తిరిగాయి. ఎన్నో బాల్యస్మృతులు ఇద్దర్నీ పెనవేసుకున్నాయి.

"శారదా, వ్యక్తిగత బంధం వేరు, సామాజికంగా నీ స్థానం వేరు. ఎలా చూసినా నేను యేమీ కాను మీకు... కానీ...కానీ...ఈ యింట్లో తిండీ, దాతృత్వం, కరుణ, దయ నా రక్తంలో ప్రతీ అణువును ఆక్రమించుకుని వుంది. నా కర్తవ్యాన్ని సమంగా నిర్వహించాలి" అన్నాడు.

"దేనికైనా అవకాశం రావాలి కదా. పరిస్థితుల కనుగుణమైన ఆలోచనే కర్తవ్యం అవుతుంది. లోకవృత్తాన్ని స్వభావ వైరుధ్యాల్ని, నీవు సమదృష్టితో చూడగలిగే శక్తి నీకుంది. మా కుటుంబం మా బాధలు మాట అలా వుంచు. త్వరలో నీవో యింటివాడివి కావాలని నా కోరిక."

రామం పేలవంగా నవ్వాడు.

"అవినీతి కానివి. ఆర్ద్రమైన కోరి కల జాజిలతలే నా కాళ్ళకు అదృశ్య బంధాలు. అవి తెంపుకోలేను. వాటిని చిన్నప్పట్నించీ ఊహ అనే పన్నీరుతో పోసి పెంచుకున్నాను. నే నెక్కడ వున్నా వాటిని సంరక్షించుకోవటం నా విధి," అన్నాడు రామం. శారద నిట్టూర్చింది. స్ఫురద్రూపి, ఆజానుబాహు వైన రామం కళ్ళలో నిశ్చలత్వం, పట్టుదలా చూసింది.

"నీ కెప్పుడు ఏ సహాయం కావాలన్నా, మా చెల్లెలు వాళ్ళింట్లో నా యెడ్రసు వుంది. తప్పకుండా రాయి. చేస్తాను" అంటూ మూలనున్న పల్లకీని ఒకసారి చూసి మెట్లుదిగి పోయాడు.

ఎదురుగా ఒక పెళ్ళి వూరేగింపు వస్తోంది. అయితే పల్లకీ లేదు. కారులో వధూవరులు ఊరేగుతున్నారు. శారద వీధిద్వారం తలుపుల్ని మూసేసింది.

* * *

యథోదకం దుర్గే వృకష్టం.
పర్వతేషు విధావతి!

పర్వత శిఖరముపై బడిన వర్షపు నీరు కొండ నలుప్రక్కలా పాయలు పాయలుగా అనేక మార్గాల ప్రవహించి పోతుంది.

స్త్రీ జీవితానికి ప్రయాణ సాధనాలు, చిన్నప్పుడు తల్లిదండ్రులు, తర్వాత భర్త, తర్వాత బిడ్డలు. మొదటిదశలోనే




సరియైన న్యాయం జరిగింది. తర్వాత న్యాయం జరగలేదు. పండంటి శారద జీవితం నాశనం, నరకప్రాయంచేసి క్రిష్ణమూర్తి నరకయాతన అనుభవించి చనిపోయాడు. యెంతో కష్టపడి, యింట్లో ఉన్నవన్నీ అమ్మి, పిల్లల్ని చదివించి, పెండ్లిచేసి, వాళ్ళ నీడన సేద దీరుదామంటే, ఇద్దరు పిల్లలు భార్యల మాటవిని, ఇంట్లో వున్న పాత్ర సామాను అంతా పంచుకుని, "అమ్మా! మేం ఉద్యోగాలు చేసే ఊళ్ళలో నీ వుండలేవు. ప్రతీ నెల చెరొకరం పదోపాతికో పంపిస్తాం." అంటూ కప్పదాటువేసి పారిపోయారు.

ఇంకెవరున్నారు ఆ యింట్లో. యింకే మున్నాయి ఆ యింట్లో. "వృద్ధాప్యావత్ చింతాసక్తకి" శారదే మిగిలిపోయింది. వయస్సుతెచ్చిన అనుభవాల రధచక్రాల కింద నలిగిపోయి గాయపడి వెలకట్టలేని కర్ర బీరువాలు, కుర్చీలు వున్నాయి. మూలన నేను మిగిలి పోయాను.

అగ్రహారంలో యెన్నో మార్పులు వచ్చాయి. రాజకీయాలు వచ్చాయి. మనుషుల మనస్సుల్లో నిస్వార్థం స్థానంలో స్వార్థం పెరిగింది. ఊళ్ళో చిన్న చిన్న వ్యాపారస్థులు, వందలు, వేలు పెట్టినా దొరకని కర్రవస్తువుల్ని చవగ్గా కొనేసేవారు, మేడలోవి ఎంత కాలం వస్తుంది ఆ డబ్బు. శారదమ్మకి ఉపవాసాలే శరణ్యమయ్యాయి.

అయినా యేనాడూ ఆ తలుపు తీసి యెరుగదు. ఒకరికి పెట్టుటయే కాని చెయ్యిజాపి యెరుగదు. ఆమె తల్లి దండ్రులు చేసిన వ్రతాలూ, దానాలూ, ఆమె పట్టిన నోములు, నిరతాన్న దానాలు, పూజలు, పునస్కారాలు యేమీ ఆమె జీవితానికి సరియైన న్యాయం చేకూర్చలేకపోయాయి.

అయినా ఆమె ఆ పూజామందిరం విడువ లేదు.

నాలుగు రోజుల క్రితం, ఒకనాటి సాయంకాలం పూజామందిరంలో వణుకు తున్న కంఠంతో—

"తళుకు చెక్కులముద్దు బెట్ట కౌసల్య
ముసుతపమేమి జేసెనో తెలియ"

అని పాటపాడుతూ, కెవ్వుమని కేక వేసింది, గుండెనొప్పితో. అంతే! తర్వాత తెలివిలేదు.

ఆ రాత్రే వూళ్లో కొందరు పెద్దలు చందా వేసుకుని డాక్టరును తెప్పించారు. తర్వాత కొడుకులిద్దరికీ టెలిగ్రాము లిప్పించారు. ఇవాల్టికి నాలుగోరోజు, సాయంకాలం యెవ్వరూ రాలేదు.

నా పల్లకిలో ముగ్ధగా, వధువుగా, సర్వలక్షణ శోభితమైన ఆనాటి శారదమ్మ...అంతిమ యాత్రకు ఆయాస పడుతోంది. ఆమె చచ్చిపోతుందని ప్రకృతికి గూడా తెలుసు కాబోలు హఠాత్తుగా కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది.

అదిగో ఆ వానలో ముత్యాల తలంబ్రాలు పోసుకుంటూ, శారదమ్మ ఆత్మ రామనామస్మరణ చేసుకుంటూ మీదకు ప్రయాణిస్తోంది. ఇంకేం మాట్లాడను నేను...అన్ని బంధాలు అనుబంధాలు తెగిపోయాయి. నా గొంతులో స్వరాలు తెగిపోయాయి.అబ్బా......ఆఁ......

* * *

అపుడే చాలా దేశాలు తిరిగి, యెంతో డబ్బు, ఖ్యాతి ఆర్జించి, శేషజీవితాన్ని సుఖంగా గడపాలని కారులో ఊళ్లోకి వస్తున్న రామం, మేడముందు జనాన్ని చూసి, కారాపి జనంమధ్యకు వెళ్ళాడు.

పై ఊరు వెళ్ళి వచ్చి వెదుక్క తేవడానికి టైముచాలక వరండాలో పల్లకీ తీసి శుభ్రంగా కడిగి శారదమ్మ మృత దేహాన్ని కడిగి అందులోనే ఉంచారు.

"చచ్చిపోయినా కొడుకులిద్దరూ రాలేదు. తలకొరివి పెట్టడానికి. విశ్వాస ఘాతకులు" అంటున్నారెవరో.

పల్లకీ కదిలింది.

శారద అంతిమయాత్రకు ప్రయాణ సాధనమైంది. దాని జన్మ చరితార్థమైంది. రామం యింటికి వెళ్ళి అక్కడ నుండి కదిలాడు, చెరువుగట్టు క్రింద వుండే శ్మశానానికి.

"యెన్నిసార్లు ఉత్తరం రాస్తానన్నా, తన బాధలు నీకు ఉత్తరం రాయొద్దని, తన మంగళసూత్రంమీద వొట్టుపెట్టింది. అందువలవ ఈ పరిస్థితులు నీకు రాయలేకపోయాను " అన్న చెల్లెలు మాటలు చెవిలో గింగురుమన్నాయి, రామానికి.

ఆకాశానికి చీకటి పులుముకుంటున్నది. రామం మనస్సంతా చీకటిమయం. చీకటిలో ఎర్రని జీవాగ్ని మండుతోంది. రామం చీకటిహృదయంలో సన్నని సౌందర్యపు వెలుతురు శారద పల్లకిలో ప్రయాణిస్తోంది.




గోవిందరాజు సీతాదేవి

# సింగరేణి సుందరి

హైదరాబాద్‌లో ఎగ్జిబిషన్ చూసేం దుకు జనం విపరీతంగా వచ్చారు. రకరకాల షాపులూ, రకరకాల సామానులూ, ఒకటేమిటి పీచుమిఠాయి దగ్గర నించి పింగాణి సామానువరకూ అదీ యిదీ అన్న భేదంలేకుండా అన్నీ ఉన్నాయి అక్కడ.

ఈ రద్దీలో పచ్చిమిరపకాయ బజ్జీల దగ్గర వాసుమూర్తి మరో స్నేహితుడితో బజ్జీలు తింటూనే కబుర్లు చెప్తున్నాడు.

"అరె వాసూ ... ఈ ఊళ్లో ఉంటు న్నావురా?" సూటూ బూటూ ఉన్న యువకుడు వాసుదగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యివేశాడు.

వాసు క్షణం పరికించాడు. అంతే. ... "అరె లక్ష్మీకాంత్ ! యిప్పుడీ హైదరాబాద్‌లో ఉండటంలేదు కదూ ! యెప్పుడొచ్చావు ? ఎక్కడికి వచ్చావు?"

బాల్యమిత్రుడైన లక్ష్మీకాంత్‌ని ఆత్మీయంగా పలకరించి అతనికి నాలుగు బజ్జీలు యివ్వబోతూంటే అతను పుచ్చుకోలేదు.

"బాబోయ్ కారం. యివి తినటం అలవాటు తప్పింది."

"అయితే పద మా యింటికి పోదాం. అన్నట్లు నా పెళ్ళికి నీకు శుభలేఖ పంపిద్దాం అంటే నీ యిప్పటి అడ్రస్ దొరకలేదురా."

"పోనివ్వగానీ గృహస్తువి అయావన్నమాట."

"ఊ...నువ్వే ముందు అయావుగా. యింతకీ మీ శ్రీమతిని తీసుకురాలేదా!"

"లేదు."

"ఏం...ఉద్యోగంలో సెటిల్‌అయిన తర్వాత కూడా ఆరేళ్ళు అమ్మాయిలు నచ్చలేదు అంటూ కాలక్షేపంచేసి ఆకరికి అందాలబొమ్మనే చేసుకున్నావుట కదూ !"

"ఊ...మరి నువ్వు ?"

"ఇంటికి పద చూపిస్తాను."

"యిప్పుడు కాదు. మరో ఫ్రెండ్‌కి వస్తానని మాటిచ్చాను. రేపు తప్పకుండా వస్తాను."

"తప్పక రావాలి. చూడూ సెలవు పెట్టి వెయిట్ చేస్తూంటాను. యిదిగో అడ్రస్."

వాసు అడ్రసు యిచ్చాడు. లక్ష్మీకాంత్ దాన్ని ఓసారి చూస్తూ "అరె... యిదివరకూ నే నీ ఊళ్ళో ఉన్నప్పుడు యీ ఏరియాలోనే ఉండేవాడిని. యీజీగా తెల్సుకుంటానులే." షర్టు జేబులో పెట్టుకుంటూ అన్నాడు.

స్నేహితులిద్దరూ అక్కడినించి అలా అలా తిరిగి యెన్నో కబుర్లు చెప్పకొని విడిపోయారు. "తప్పక రారా." మరోసారి స్నేహితుడిని హెచ్చరించి గబగబా తన బస్ స్టాప్‌దగ్గరికి వస్తూండగానే కదలబోతూన్న బస్‌ని చూసి పరుగున వచ్చి ఎలాగో బస్ యెక్కేసి అమ్మయ్య అనుకున్నాడు బస్‌లో జనాన్ని ఓసారి కలయజూస్తూ.

## 2

అన్నట్లుగానే వాసుమూర్తి సెలవు పెట్టి స్నేహితుడికోసం యెదురుచూస్తూన్నాడు. పదిగంటలు అవుతూండగానే లక్ష్మీకాంత్ రానే వచ్చాడు ఆటోలో. వాకిట్లోనే స్వాగతం యిచ్చి లోపలికి తీసుకువచ్చి కుర్చీ చూపించాడు.

"మంచినీళ్లు కావాలా ?" అడిగాడు.

"ఊ." గదిని కలయచూస్తూ అన్నాడు.

"మాది చిన్నయిల్లు. నా జీతమూ చిన్నదే అనుకో. రెండుగదులూ, ఒక చిన్న వంటగదీ... యింతే. మా యిద్ద

రికి ప్రస్తుతం చాలు. దీనికే నూట యాభై అద్దె యిస్తున్నాం." వాసు లోపలికి వెళ్ళాడు.

లక్ష్మీకాంత్ గదిని మళ్ళీ పరీక్షించ సాగాడు. గది వాకిలికీ, కిటికికీ గులాబి రంగున్న అద్దకంపూవుల కర్టెన్‌లు వేలాడుతున్నాయి. గది మధ్యగా చిన్న టీపాయ్, దానిచుట్టూ నాలుగు కుర్చీలు వేసి ఉన్నాయి. టీపాయ్‌మీద దిన పత్రికా, వారపత్రికలు రెండూ పెట్టి ఉన్నాయి. ఒక అల్మారా ఉంది. దానికి తలుపులు లేవు. పల్చని కర్టెన్ వేలాడు తోంది. లోపల ఇంగ్లీషూ, తెలుగు నవలలు వరసక్రమంలో సర్ది ఉన్నాయి. గోడకి ఒక్క కాలెండర్ తప్ప మరె లాంటి ఫొటోలూ లేవు. ఓ మూలగా వేసి ఉన్న చిన్న స్టూలుమీద కొండపల్లి ఏనుగు అంబారీ బొమ్మ పెట్టి ఉంది. దానికి దగ్గరే రెండు డాన్సు బొమ్మలు కూడా ఉన్నాయి. యిదంతా చూస్తూ అనుకున్నాడు - వీడి శ్రీమతి చాలా ఓపికమంతురాలులా ఉందే అని.

''మంచినీళ్ళు తీసుకోరా." వాసు అందమైన పువ్వులున్న తెల్లటి గాజు గ్లాసు ఇచ్చాడు, "ఏమిటి యేదో ఆలో చిస్తూన్నావు" అంటూ.

"అబ్బే యేంలేదు." గ్లాసు అందు కుని నీళ్ళు తాగి యిచ్చేస్తూ.

"గ్లాసూ బాగుంది, అందులోని షరబత్‌కూడా బాగుంది యింతకీ యిప్పుడు యివెందుకు.''

''మా శ్రీమతి ఎండలో వచ్చిన వాళ్ళకి కాఫీ చస్తే యివ్వదు."

"మంచి అలవాటే కదూ'' లోపల గదివైపు చూస్తూ అన్నాడు.

''ఒరేయ్. నువ్వు రాక రాక వచ్చావు. మా శ్రీమతిని పరిచయం చేద్దాం అనుకున్నాను నీకోసం స్వీటూ, హాటూ వగైరా అంతా చేసింది. యింతలో మా పక్కింటిలోని ఆమెని డెలివరీకి హాస్పిటల్‌కి తీసుకువెళ్ళవల సిన అవసరం వచ్చింది. పాపం ఆమెకి యెవ్వరూ లేరు. అందుకే తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చింది. 'సారీ అని చెప్పండి' అని చెప్పి వెళ్ళింది."

''అరెరె..." నిరుత్సాహపడ్డాడు లక్ష్మీకాంత్.

''సాయంత్రంవరకూ ఏంచేస్తావు నువ్వు వచ్చెయ్యి అని చెప్పాను."

"సరే'' తలఊపాడు లక్ష్మీకాంత్. యింక వాసు యెప్పటెప్పటివో కబుర్లు మొదలెట్టి చెప్పుకుపోతూంటే లక్ష్మీ కాంత్ ఆశ్చర్యంగా వింటూ అను కున్నాడు–

వీ డిదివరకు మాటే మాట్లాడేవాడు కాదు. యిన్ని కబుర్లు యెక్కడ నేర్చు కున్నాడు. చాలా హుషారుగా ఉన్నాడు. బహుశా భార్య అనుకూలవతి అయి ఉంటుంది.

''లక్ష్మీకాంత్, వంట అంతా చల్లారి పోతుంది. భోజనంచేసి కబుర్లు చెప్పు

కుందాం. రా లోపలికి'' అంటూ లేచి లోపలికి నడిచాడు లక్ష్మీకాంత్ అతన్ని అనుసరించాడు పడకగదిలా ఉంది. డబుల్‌కాట్ ఉంది. దానిమీద హోంస్లూమ్ బెడ్‌షీట్ పరిచి ఉంది. రెండు దిళ్ళు ఉన్నాయి. దోమతెర దించి ఉం . ఒక పక్కన రెండు పెట్టెలూ, ఎయిర్‌బ్యాగూ ఉన్నాయి. హేంగర్స్‌కి వాసువి కాబోలు పాంట్లూ, షర్టులూ వ్రేలాడుతూన్నాయి. రెండు చీరెలూ, రెండు జాకెట్లూ, రెండు బ్రాలూ, ఓ తువ్వాలూ రెండు లోపల వేసుకునే లంగాలూ మడతలుపెట్టి హేంగర్స్‌కి వ్రేలాడుతూన్నాయి. ఒక చిన్న బెంచీ మీద ఓ అద్దం, దువ్వెనా, పౌడరూ, కుంకుమా వగైరా ఉన్నాయి. అక్కడే కనకాంబరాలూ మరువం కలిపి కట్టిన మాల పెట్టి ఉంది ఇల్లాలు హడావుడిగా బయటికి వెళ్ళబోతూ మర్చిపోయి నట్లుంది. కొన్ని కూరలు వేటికవి ఓ ప్లాస్టిక్ ట్రేలాంటిదానిలో విడివిడిగా పెట్టి ఉన్నాయి.

లక్ష్మీకాంత్ అన్నింటినీ కుతూహలంగా చూస్తూ అనుకున్నాడు.

వీడికి జీతం చాలా తక్కువ. కనుక వీడి శ్రీమతికి యింటి పనిభారం యెక్కువే ఉండి ఉంటుంది. పాపం యెలా అవస్థపడుతోందో యేమో! అనుకుంటూ వంటగదిలోకి కాలు పెట్టాడు.

''అరేయ్ నీళ్లు చెంబులో ఉన్నాయి. కాళ్ళూ, చేతులూ కడుక్కో. వడ్డిం చేస్తాను."

రెండు పీటలువేసి రెండు అరటాకులు పరిచి ఉన్నాయి. గ్లాసుల్లో నీళ్ళుపెట్టి వాటిమీద మూత కూడా పెట్టి ఉంది. యివేకాక వంట తయారుచేసిన గిన్నె లన్నీ కూడా అక్కడ పెట్టి ఉన్నాయి. అవి వడ్డించుకునేందుకు స్టీలు గరిటలూ, చెంచాలూ కూడా పెట్టి ఉన్నాయి. వాసు ఆకులమీద నీళ్లు చల్లి మరోసారి ఆకులు తుడిచి వడ్డించటం మొదలుపెట్టాడు. లక్ష్మీకాంత్ కాళ్ళు కడుక్కుని అక్కడే ఉన్న టవల్‌తో తుడుచుకుని వచ్చి పీట మీద కూర్చున్నాడు.

రెండు కూరలూ, పప్పూ, కొబ్బరి చట్నీ, వడియాలూ, పులిహోరా పాయసం చాలా ఉన్నాయి పదార్థాలు. వాసు ఒక్కొక్కటీ వడ్డించి నెయ్యి దగ్గర పెట్టి–

''ఊ ... భోజనంచేసి చెప్పు. రుచి ఏది యెలా ఉందో !'' వాసు భోజనం చేస్తూనే మళ్ళీ కబుర్లు మొదలుపెట్టాడు. కానీ లక్ష్మీకాంత్‌కి కబుర్లమీద లేదు మనస్సు. వంటగదిలో యెక్కువ ఖరీదైన సామాను లేకున్నా సర్దుకున్న తీరు నచ్చింది. శాంతినిలయంలా ఉన్న యీ యింటి యిల్లాలిని చూసితీరాలి అని మనసు తహతహలాడుతోంది. అప్పుడే తన ఊహల్లో ఒక రూపం కదులుతోంది.

తన ఊహకి తనకే నవ్వు వస్తోంది. అంతలోనే తన యిల్లూ, యిల్లాలూ గుర్తుకి వచ్చింది. భార్య అనూరాధ అందమైన బొమ్మలా ఉంటుంది. అసలే అందమైనది, అలంకరణలో మరీ ఆ అందాన్ని పెంచుకుని యెదటివాళ్ళని యిట్టే ఆకర్షిస్తుంది.

ఆమెకి మేకప్ కావటానికి రెండు గంటలయినా టైము కావాలి. యే చీరె మీద యే జాకెట్ నప్పుతుందో ఆమెకి బాగా తెలుసు. హెయిర్‌స్టయిల్ కూడా రకరకాలుగా మారుస్తూ ఉంటుంది. పెళ్ళి అయిన కొత్తలో అనూని తీసుకుని యెక్కడికి వెళ్ళినా అందరి కళ్ళూ తన మీదే. అలాంటప్పుడు అనూ తన భార్య అని బోలెడంత గర్వంగా ఉండేది. అంతకి మించిన తృప్తిగానూ ఉండేది. కానీ ఆ సంతోషం యెన్నాళ్ళో నిలవలేదు.

యింట్లో ఏ పని చేసుకోవాలన్నా అనూరాధకి విసుగే, చికాకే, అసహనమే. ఏ పనీ నా చేతకాదు, నాకు అలవాటు లేదు అంటూ నిర్లక్ష్యంగా మాట్లాడే అనూని కొన్నాళ్లు విసుక్కోకుండా తనే అన్నీ చేసుకునేవాడు. యిలా యెన్నాళ్ళో చేయలేకపోయాడు. ఒకసారి అన్నాడు.

"నిన్ను చస్తే బయటికి తీసుకుపోను. అలంకరణకి వెచ్చించే టైముని యింటిని శుభ్రంగా వుంచుకోవటానికి వినియోగించు" అని.

అనూరాధకి కోపం వచ్చేసింది. గయ్యిన లేచింది.

"నేను ఖర్మకాలి మీ పెళ్ళాన్ని అయ్యాను. యీ వెధవ సంసారంలో మునిగిపోలేను. ప్రతిరోజూ అలా ప్రపంచం చూడకుంటే బ్రతకలేను. నాకిలా అలవాటు లేదు, కాదు." అయిదు సార్లు పదోతరగతి తప్పి చదువుకి గుడ్‌బై చెప్పిన అనూరాధ యిలా అనేసరికి లక్ష్మీకాంత్‌కి మరీ కోపం వచ్చింది.

డిగ్రీలు తీసుకుని ఉద్యోగాలున్న అమ్మాయిలు యెందరో వచ్చినా అందంగా లేరు అన్న ఒక్క కారణంతో అందరినీ తోసేశాడు తను. అలా నిరాకరించబడిన అమ్మాయిలు అప్పుడప్పుడూ అక్కడక్కడా కన్పిస్తూనే వుంటారు. మనస్సుకి కాస్త బాధగానే ఉంటుంది. కానీ తనేం చేస్తాడు. తనకి అనాకారులంటే అసహ్యం. అందుకే యేరి కోరి అనూరాధని పెళ్ళాడాడు. అనూ అంటే యిష్టమే. కానీ ఆమె మాటలూ, పనులూ, అలవాట్లూ, మన స్తత్వం అస్సలు నచ్చటంలేదు. దానిని మార్చాలని యెన్నోవిధాల ప్రయత్నించాడు. ప్రయత్నిస్తూనే వున్నాడు. కానీ కాస్తకూడా లాభంలేకుండా వుంది. తన కొత్త కాపురం చూడాలని ఏ స్నేహితులన్నా

వస్తే 'భోజనానికి పిలుస్తాను' అంటే చాలు అనూకి చాలా కోపం వస్తుంది.

"ఎవరు చేస్తారు బాబూ! వంట మానేసి ఇవాళ్టికి నేనూ వాళ్ళతోబాటు హోటల్‌కి వస్తాను, హాయిగా," అంటుంది. మహాబద్ధకస్తురాలైన అనూకి ఒక్క విషయానికే ఓపిక వుండేది. అందంగా అలంకరించుకుని అది మాయ కుండా అందరూ చూడాలి అన్నట్లుగా తిరగాలి. ఒకప్పు డీ అందాన్నే చూసి మురిసి అనూని పెళ్ళాడినా యిప్పుడీ విషయానికే చాలా చికాకు వస్తోంది. అందమైన వాళ్ళందరూ చెడ్డవాళ్ళుకారని తనకి తెలుసు. కానీ అనూ మనస్తత్వం అంతుబట్టకుండా వుంది.

ఒకసారి తన స్వంత చెల్లెలు భర్తతో కలిసి అన్నయ్య కాపురం చూడాలి, 'వదిన అందాల సుందరి' అని పొంగి పోతూ వచ్చింది. అర్ధపూటకూడా వుండ లేక వెళ్ళిపోయింది. కారణం యేంలేదు. "ఆ అమ్మాయి నల్లగా వుంటుంది. ఆమెని చూస్తే నాకు భయం'' అంది అనూరాధ, తలుపుమూసుకుని గదిలో నించి బయటికి రాకుండానే.

చెల్లెలు అలా వెళ్ళిపోయినందుకు లక్ష్మీకాంత్‌కి మండిపోయింది. ఆడ బడుచు వెళ్ళిన తర్వాత హమ్మయ్య అనుకుంటూ బయటికి వచ్చిన అనూ రాధని చాచి చెంప పగలగొట్టాడు. అంతే మరో గంటకే అనూరాధ ఇంటినీ, భర్తనూ వదిలి పుట్టింటికి పోతూ "చస్తే మళ్ళీ నీ గడప తొక్కను. గాడిదకేం తెలుసు గంధంపొడి వాసన అని సామెత వుంది. నా విలువ నీలాంటి వాడికి యేంతెలుసు," అని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది. పోనీ ఆమె తలిదండ్రులకన్నా బుద్ధిలేదు మళ్ళీ తీసుకువచ్చి కూతురు కాపురం నిలబెట్టాలని.

యిలా జరిగిపోయింది. జరిగినదానికి యిద్దరూ పశ్చాత్తాపపడి సర్దుకుందా మన్న ప్రయత్నమే లేదు. యివన్నీ గుర్తుకు వచ్చి మనస్సు అంతా అదోలా అయిపోయింది లక్ష్మీకాంత్‌కి. వాసు మాత్రం యిదేం గమనించకుండా గడ గడా కబుర్లు చెప్తూ మధ్య మధ్య కొసరి కొసరి వడ్డిస్తూన్నాడు. మధ్య మధ్య లక్ష్మీకాంత్ కాపురం గురించిన వివరాలు అడుగుతూన్నాడు.

"ఏం చెప్పను" నిర్లిప్తంగా నవ్వి లేచి చెయ్యి కడిగేసుకుని ముందు గది లోకి వచ్చాడు.

"కిల్లీ వేసుకోరా." యిచ్చాడు వాసు తనోటి వేసుకుంటూ.

"మామయ్యగారూ మరే మరే అత్త గారు ఫోన్‌చేశారు" అంటూ వచ్చాడు పదేళ్ళ కుర్రాడు.

"ఏమని?"

"అత్తగారికి సాయంత్రంవరకూ రావటానికి వీలుకాదని చెప్పమన్నారు."




"సరే." కుర్రాడు వెళ్ళిపోయాడు.

"వాసూ ! మీ పెళ్ళి ఫొటో అయినా లేదేంరా యెక్కడా?"

"ఆల్బంలో వుంది, చూపిస్తాను" అల్మారాలోనించి ఆల్బం తెచ్చాడు వాసు.

"మీ అత్తవారి ఊరు యీ ఊరే కదూ ?"

"ఊఁ..."

"మీ శ్రీమతి పేరేమిటి !"

"సుందరి."

"ఏ సుందరి. శ్యామసుందరా, అజంతా సుందరా, రూపసుందరా, అందాల సుందరా," నవ్వుతూ అడిగాడు. వాసు ఆల్బం పేజీలు తిప్పి ఫొటోల వివరాలు చెప్తూ చూపిస్తున్నాడు.

"ఏ సుందరకీ కాదు... వట్టి సుందరి ...యిదిగో నా సుందరి..."

పెళ్ళికూతురు అలంకరణలో పూవుల జడలో పీటలమీద తలవంచుకు కూర్చున్న సుందరిని చూసి లక్ష్మీకాంత్ ఉలిక్కిపడ్డాడు. ఆ ఫొటోని యింకా యింకా పరీక్షగా చూస్తున్నాడు.

వాసు ఆ పేజీ తిప్పి మంగళ సూత్రం కడుతున్నదీ, తలంబ్రాలు పోస్తున్నదీ, పట్టుచీరెలో నిండుగా ముస్తాబు అయినదీ, సాయంత్రం స్నేహితుల మధ్య భర్తతో తీయించుకున్నదీ, ఒక్కొక్కటీ చూపిస్తున్నాడు. ఆఖరున సుందరి గృహిణిగా యేదో పనిచేసుకుంటూ విరగబడి నవ్వుతూన్నట్లున్న ఫొటో చూపించాడు. దాన్ని తదేకంగా

చూస్తూన్న లక్ష్మీకాంత్ నోరు తడారి పోయింది.

సుందరి యెదురుగా నిల్చుని తనని చూసి విరగబడి నవ్వుతూన్నట్లుగా అన్పిస్తూంటే గుండె వేగ గా కొట్టు కుంటూ వుంటే అదిమి పట్టుకున్నాడు.

"లక్ష్మీకాంత్ యీ సుందరిని పెళ్ళి చూపులకంటూ వచ్చి చూసి చాలామందే పెదవి విరిచి వెళ్ళిపోయారుట. సుందరి కొన్నాళ్ళు ఉద్యోగం చేసిందిలే. సహఉద్యోగి వెధవ ఒకడు సినిమాలకీ, షికార్లకీ వస్తావా అంటూ పరిచయం పెంచుకోజూసి పెళ్ళి అనేసరికి సుందరిని పరిహసిస్తూ నిక్‌నేమ్ పెట్టి పారిపోయాడట. ఆ పేరేమిటో తెలుసు నాకు."

"సింగరేణి సుందరి. వెధవ రాస్కెల్, స్టుపిడ్ బ్రూట్. గృహిణిని యెంపిక చేసుకునేటప్పుడు అందం చూడటం అవసరమే కావచ్చు కానీ 'గుణం' లేని అందానికి ప్రాధాన్యత యివ్వటం బుద్ధిహీనుల పని. ఆడదానికి ఓర్పూ, నేర్పూ, ఆత్మీయతా, ఆదరణా వుంటే వెలకట్టలేని అందాన్ని ఆ గుణాలే తెస్తాయి. యివి తెలియక కేవలం శరీరపు రంగు నలుపుని చూసి 'సింగరేణి సుందరి' అన్న ప్రబుద్ధుడు నాక్కనిపిస్తే గూబ గుయ్ మనిపిస్తాను."

లక్ష్మీకాంత్ వళ్ళంతా చెమట పట్టేసి షర్టు అంతా తడిసిపోయింది. ఊపిరి ఆడనట్లు అయిపోతోంది. యిదేం పట్టించుకోని వాసు తన ధోరణిలో చెప్తూన్నాడు.

"ఆ సింగరేణి సుందరే నా యిల్లాలై యీ ఇంటిని ఆనంద నిలయంగా మార్చింది. ఆ వెధవ యెప్పుడైనా ఒక్క సారి వచ్చి చూస్తే బాగుండు అన్పి స్తోంది," అంటూ ఆల్బం మూసి యిప్ప టికి స్నేహితుడిని చూశాడు.

"అరె ... ఏమైందిరా ... ఎందు కలా అయిపోతూన్నావు." గాభరాగా అడిగాడు.

''ఏంలేదు. ఏంలేదు. అర్జంట్‌గా వెళ్ళాలి. అదిగో ఆటో ... ''చెప్పులు వేసుకుంటూన్న స్నేహితుడివైపు పిచ్చిగా చూస్తూ–

''మా సుందరిని చూడకుండానే వెళ్ళిపోతావురా."

''అర్జంట్‌గా వెళ్ళాలి ... చూడూ వెడుతూన్నాను'' ఆటో అని అరిచి ఆపి అందులో కూలబడ్డాడు.

"అరేయ్ యిదేమిటిరా?'' అంటూన్న వాసుతో–

''మీ సుందరిని నే నెరుగున్నాను. నన్ను క్షమించరా! ఆమెకి శుభాకాంక్షలు చెప్పు.''

ఆటో వెళ్ళిపోయింది.

"మా సుందరిని వీడు యెరు గున్నాడా!'' ఆశ్చర్యంగా అలా చూస్తూ నిల్చుండిపోయాడు వాసుమూర్తి.

# భవిష్యత్ చిత్రం

అరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

"మానవుడు చంద్రమండలంమీద విహరించి జెండా ఎగరేసి వచ్చాడు" అన్న ప్రకటన విశేషం బాగానే వుంది—బాగానే ఏమిటి—ఘనంగానే వుంది కాని అతడు తెచ్చిన వివరాలు మాత్రం ఏమీ ఆనందదాయకంగా లేవు నామటుకు నాకు.

చంద్రమండలాన్ని త్రవ్వి, ఇంత మట్టీ యిన్ని రాళ్లూకూడా మోసుకొచ్చాడు. చంద్రమండలంపై అతడు చూచినంత వరకూ అంతా రాయీ, రప్పా, మట్టీ! 'చంద్ర శిల!' అంటూ ఏదో పేద్ద పేరు పెట్టారు కానీ, ఏ రాయైతేనేం పళ్ళూడ గొట్టుకోవడానికి?

చంద్రుడిని మానవుడు త్రవ్వి పారేస్తుంటే ఇహ అతడి మహిమేముందీ? సూర్యచంద్రులు విష్ణుమూర్తి యొక్క రెండు నేత్రాలూనట! శ్రీ లక్ష్మీదేవితో బాటు పాలసముద్రంలో పుట్టి ఆమెకు తమ్ముడైనందున, ఈ చంద్రుడు లోకమందరికీ చందమామ! ఇహ శృంగారానికా—ఈ చంద్రుడంతటివాడు లేనే లేడు! దక్ష ప్రజాపతియొక్క ఇరవై ఏడుగురు కుమార్తెలనూ పెళ్ళాడిన ఘనుడు ఆ తర్వాత వాళ్ళని సరిగా చూడక, దక్షుడి ఆగ్రహానికి గురై, శంకరుని శరణువేడి అతడి జటాఝూటంలో దాక్కొని, చావు దప్పి కన్ను లొట్టబోయినట్టుగా—నెలలో ఓ పక్షం రోజులు తరుగుతూ మరో పక్షంరోజులు పెరుగుతూ వస్తున్నాడు. అవే కృష్ణపక్షం, శుక్లపక్షం. చంద్రుడు పూర్తిగా మాయమైతే అమావాస్య. నిండుగా వున్ననాడు పున్నమి. ఇదంతా గాక గురుపత్ని 'తార' తోనే ప్రణయం సాగించిన సాహసి ఈ చంద్రుడు. ఇంత రసికుడు కావటం వల్లనేనేమో ప్రేయసీ ప్రియులకు అతగాడు అంత అపురూపంగా కన్పిస్తాడు!

ప్రేమికులకూ, క్రొత్త జంటలకూ అతి ప్రియమైనదీ, అపురూపమైనదీ పూర్ణిమ. కోరికలు రగిలించేవాడూ, ఆశలూరించేవాడూ, ఒక్కోతరి రాయబారం నడిపేవాడూ కూడ అందాల చందమామే! ఒకప్పుడు అవతారపురుషుడైన రఘు

రాముడే ఏడ్చి మారాంచేశాడట చంద మామ కావాలని! ... అమ్మమ్మకైతేనేం, గురువర్యులైతేనేం ఉగ్గుపాలతో రంగ రించి పోసి జీర్ణింపజేసిన పురాణాలు యివి హైందవులందరికీ.

మరి ఇవన్నీ ఇప్పుడసలు నిజమేనా అన్పించటం లేదూ? "ప్రేయసీ నీ నగు మోము చంద్రబింబమువలె నున్నది!" అంటే "ఓకే. ఎంత పొగరు! నేను మచ్చిముద్దలాగున్నానా?" అంటూ పళ్లు రాలగొట్టక పోతుందా ఏ ప్రియురాలు మాత్రం! ప్రాచీనమైన వాల్మీకి రామా యణంనుండి ఈనాటివరకూ ఎక్కడ చూచినా కవితలో చంద్రుని ప్రశంసే! అందానికి చంద్రుని మించిన ఉపమానం లేనేలేదు యింతవరకూ! కాని ఇప్పుడు! అంతా తలక్రిందులై పోయి మెదడు వేడెక్కిపోవటం లేదూ?

"మన మిరువురం .... తారాచంద్రు లం...." అనుకుంటూ ప్రేయసీప్రియులు యుగళగీతాలు పాడ కొనే అవకాశం లేదింక! అసలు చంద్రుడే వట్టిది— అదో గ్రహం అంటూంటే ఇంక తార కోసం ఎక్కడ ఆలోచించేది!

అందుకే చంద్రునితో కలిపిన ఏ ప్రేమగీతం విన్నా వెనుకటంత సంతోషం ఇప్పుడు కలగటంలేదు.

ఇంతకూ చంద్రునితో ముఖ్యాను బంధం గల మన గొప్ప పండగ—పర్వ దినం వినాయక చవితిమాట ఏమిటి? వినాయకుని గుజ్జరూపం చూచి నవ్వివ చంద్రుడు పార్వతీదేవి శాపం పొందడం, ఆ చవితి చంద్రుని చూచిన శ్రీకృష్ణునికి అపవాదు రావడం ఇదంతా అబద్ధమేనా? చంద్రుడే అబద్ధమంటే ఈ పురాణాలూ అబద్ధమే ననుకోవాల్సిందేనా? ఈ చాంద్రా యణమంతా కల్పనేనా?

పాపభూయిష్ఠమైన ఈ లోకాన్ని చూడలేక శ్రీ వేంకటేశ్వరుడు శిలా రూపం ధరించాడన్నట్లుగానే ఈ పాపిష్టి లోకంలోని కర్మకాండలన్నీ చూడలేక చంద్రుడుకూడా రాయీ రప్పాగా మారి పోయాడా? లేక తార విషయంలోలాగానే ఏదైనా కొంటెపని చేస్తే కోపం వచ్చి సాంబశివుడు తన నెత్తిమీదినుంచి తొలం గించి నేలకేసి కొట్టాడా ఈ చంద్రుణ్ణి? అటువంటిదేదో జరగకపోతే అంత అగ్రస్థానంనుంచి యింత అధమస్థానాని కెందుకు దిగజారిపోతాడని?

జ్యోతిశ్శాస్త్రంలోకూడ చంద్రునిది అతి ముఖ్యమైన స్థానం—ఇటు హైందవ శాస్త్రంలోనూ, అటు ఆంగ్లేయ శాస్త్రం లోనూ కూడ! పౌర్ణమి ముందు, అమా వాస్య తర్వాత — అంటూ చంద్రుని పెరుగు తరుగులనుబట్టి మనం ఎన్నో పనులు చేయటం అనవాయితీ చంద్రుని తరుగూ పెరుగులకూ, సముద్రపు ఆటు పోటులకూ ఎంతో సంబంధం. పౌర్ణమి రేయినాడు సముద్రం ఎగిరెగిరి పడుతుంది కెరటాలువేస్తూ! పిచ్చివాళ్లకూడా పౌర్ణమి



యు వే







ముందు పట్టపగ్గాలు లేనంతగా వుంటాయి మరి! పిచ్చివాడిని lunatic అనడంలో గల అర్థం అదే. ఆకాశంలో వున్న మట్టి ముద్దకు ఈ మానవమేధపై ఇంత అధికారం ఏమిటో తెలియదు కదా!

పోనీ వట్టి మనుషులమేనా అంటే కాదే! పూలూ చెట్టుచేమలూ కూడా ఆరాధిస్తున్నాయి ఈ చందమామని. అంత ఎత్తున ఆకసాన ఆ చంద్రుడుగారు కన్పించనిదే ఇక్కడ నేలమీద కలువ భామ వికసించదు ; చంద్రకాంత హసించదు! మేంమాత్రం తీసిపోయామా అన్నట్టుగా పక్షులుకూడా తయారు! చక్రవాకం ఎవరెరుగనిది! చంద్ర చకోరానుబంధం ఎవరికి తెలియనిది! వెన్నెల పులుగు అనే నామాంతరం సంతరించుకున్నదికూడా అందుకే కదా!

"చంద్రుణ్ణి చూసొచ్చాను. చంద్రుడి మీద నడిచొచ్చాను" అంటూ ఏదో దేశంవాడు ఎగిరెగిరి పడ్తే పడొచ్చుకాని చంద్రుని చుట్టూ పరిభ్రమించే భారతీయ సుందర శృంగార కవితకుమాత్రం ఇది గొడ్డలిపెట్టు. ఈ ఘనవిజయం హైందవ కవిహృదయాలకేమాత్రం సంతోషప్రదం కాదు. అందానికీ ఆహ్లాదానికీ మారుపేరే చంద్రుడనుకొంటూ "సుధాకరుడు" "సుధాంశుడు" "వెన్నెలరేడు" అని కీర్తిగానం చేస్తూ కావ్యసృష్టి చేసే అవకాశం శాశ్వతంగా దూరమైపోయింది కదా! అసలు చంద్రుడు లేని కథా, కావ్యం వున్నాయా ఇంతవరకూ? ఇక ఏ ముఖం పెట్టుకొని సుందరమూర్తులను

చంద్రుడితో పోల్చగలం? నిండుచంద్రుని చూస్తూ నాయికానాయకులు పాటలు పాడుకుంటూ గంతులు వేసే దృశ్యం చిత్రీకరించటాని కిక ఏ సినీ డైరెక్టర్ మాత్రం సాహసించగలడు?

వెనుకటి రోజులలో నవల వ్రాయాలంటే చక్కటి కథాంశం, లిఖించేందుకు తగిన సమయం, నామకరణం—ఇవి మాత్రమే సమస్యలుగా వుండేవి. ఇప్పుడు సరిక్రొత్త సమస్య ఎదురైంది. చంద్రుని ఎట్లా వర్ణించేది? ఏమి వ్రాయాలి? పోనీ వదిలేద్దామా అంటే అదీ అంగీకారంగాలేదు. 'అతిలోకసుందరి—అతి సున్నితమైన రూపం—ఆహ్లాదకరమైన స్వభావం....' అంటూ లక్షవర్ణనలు చేసినదానికంటె, 'చంద్రునితో సరితూగు మోము' 'కలువల రేనినే కవ్వించగల సౌకుమార్యం' అని ఒక్కవాక్యం వ్రాస్తే సరిపోయేది. ఇప్పుడిక క్రొత్తగా ఏ విధంగా వర్ణనలు చేసేది? మానసికంగా దెబ్బతిన్న ఈ పరిస్థితిలో ఈ చందమామగారిని ఇటు పరిగ్రహించనూ లేక అటు పరిహసించనూ లేక అవస్థగా వుంది. కాగితం కలం తీస్తే ముందు యిదే సమస్య తలెత్తుతోంది.

"....పున్నమీ వెన్నెలలు పూలపానుపుగా...." అంటూ కమ్మనిగానం వింటూ పరవశించే అవకాశం ఇంకెక్కడిది! పున్నమివెన్నెల కురిపించే ఆ చందమామను చూచి మనసులో ఇపుడు ఉల్లాసానికి బదులు కల్లోలం రేగుతూన్నది.

డాబామీద .... ఒంటరిగా .... నిండు చంద్రుని చూస్తూ నిలబడిపోయి సర్వం మఱచిపోవటం నాకు అలవాటు. ఈనాడూ అలాగే నిలబడ్డాను.

"ఏమిటోయ్ అంత ఆలోచన! ఇక్కడ యింకా మనుషులం వున్నాం కాస్త మాట్లాడకూడదూ? .... సారీ, డిస్టర్బ్ చేశానా?"

నాకు నవ్వు వచ్చింది.

అన్నింటిలో ఏ మాటకూ బదులు పలుకలేదు.

అది ఎవరి ప్రవేశమైనా కావచ్చు: డిస్టర్బన్సే నిస్పందేహంగా. ఆలోచించేప్పుడు ఏకాంతాన్ని అభిలషిస్తాను.

"మమ్మీ .... డాడీ పిలుస్తుంటే .... మాట్లాడవేం?" నేనూ ఉన్నానంటూ రెండేళ్ళ మాధవి అధికారం!

నేను మాట్లాడలేదు.

పరీక్షగా చూస్తున్నారనుకుంటా నన్ను, తండ్రీ కూతుళ్లు.

"ఏమిటంత దీక్షగా చూస్తున్నావు చంద్రుణ్ణి? మనం ఎప్పుడు వెళ్ళగలమా—ఏమున్నాయో చూచివద్దామా అనా?.... ఇన్ని విచిత్రాలు జరుగుతూండగా లేనిది—ఇక ఆ రోజులు మాత్రం రాకుండా వుంటాయా? చూద్దాం లే!"

"హతోస్మి! ఆఫీసులో రొటీన్ వర్కుకు అంకితమైపోయే ఈ మర మనుష్యులకు యింతకంటె వేరే కవిత్వం




ఎక్కడినుంచొస్తుంది?''

''మమ్మీ'' చేతులు చాపింది మాధవి.

దాన్ని యాంత్రికంగా అందుకున్నానే కాని నా దృష్టి చంద్రుని మీది నుండి మరల లేదు.

రెండు నిముషాలు నిశ్శబ్దం.

''మమ్మీ!'' ఎంతో మెల్లగా, మధురంగా పిలుస్తోంది మాధవి.

నేను పలుకలేదు.

షికారుకో పార్కుకో తీసుకుపొమ్మని చేరిందేమో! అంతకంటె పనేముంటుంది దానికి.

''ఇలా చూడు మమ్మీ!'' మళ్ళీ పిలుస్తూ నా రెండు చెంపలకూ తన చిన్నారి చేతులు ఆన్చి బలవంతంగా తన వేపు త్రిప్పుకుంది.

''ఏమిటి?'' చీకాకు పడుతూ అడిగాను. పరిష్కారం లేని సమస్యతో నేను బాధపడ్తూంటే దీని అర్థం పర్థం లేని గొడవ ఒకటీ మధ్యన!

''అటు చూడు మమ్మీ!'' చంద్రుని దెసగా చూపుడువేలుతో చూపుతోంది. ''ఆకాశం పెద్ద బొట్టు పెట్టుకుంది కదు మమ్మీ!''

ఉలికిపడింది నామనస్సు.

నా పరధ్యానం పరుగులెత్తి పటాపంచలైంది.

''కదు మమ్మీ!'' రెట్టించింది మాధవి.

పరీక్షగా చూచాను!

నిర్మల నీలాకాశం!

అపుడే ఉదయించిన నిండు చంద్రుడు!

పసిమి మిళితమైన అరుణ రాగం విరజిమ్ముతూన్న పూర్ణ బింబం!

ఇన్నాళ్లుగా నన్ను బాధిస్తూన్న సమస్యకు పరిష్కారం లభించినట్లయింది!



మాధవి పసిదైనా ఉపమానం చక్కగా, అందంగా చెప్పిందనిపించింది.

ఒక ప్రత్యేకమైన పరిధిలో, ఒక రీతిలో ఆలోచించడం అలవాటై పోయిన మన తరం రచయిత్రీ రచయితల వల్ల ఇక కవితలో క్రొత్త పోకడల నాశించడం అనవసరం. భవిష్యత్తులో ఈ పసివాళ్ళే పసిడి భావాలు వెదజల్లాలి!

"నువ్వు పెట్టుకొనే బొట్టులాగే వుంది మమ్మీ!" మాధవి ఇంకా వర్ణిస్తూనే వుంది.

"అవునమ్మా! అవును!" సంతోషంగా ముద్దుపెట్టుకొన్నాను.

[illegible] తన మాటలు విని, తన భావానికి ఆమోదం వెలిబుచ్చడంతో మాధవికి ఎక్కడలేని సంతోషం వచ్చింది. కేరింతలు కొడ్తూ వెళ్ళిపోయింది ఆడుకోవడానికి.

సమస్యకైతే ఏదో పరిష్కారం లభించింది కాని, నా మనస్సుకు బాధోపశమనం కలుగలేదు.

అతిగా మన్నన పొందుతూ మేడిపండులా బ్రతికే ఒక్కో ఉన్నతోద్యోగి కిరకు లంచాల కారణంగా పదవీచ్యుతుడై విసర్జింపబడిన చందాన—అత్యుత్తమమైన, అపురూపమైన, అనుపమానమైన కవితాపీఠం నుండి తొలగింపబడిన ఓ చందమామా—నీకు నా సానుభూతి.



# ప్రతిధ్వని

ముదిగొండ శివప్రసాద్

ఇది సత్యజిత్ రే బెంగాలీలో నిరుద్యోగ సమస్యమీద తీసిన సినిమా కథ అనుకునేరు—కాదు: గుంటూరు బ్రాడీపేట ఓవర్ బ్రిడ్జ్ దగ్గర జరిగిన ఓ అమ్మాయి కథ.

లక్ష్మి పెద్ద అందమైనది కాకపోయినా అనాకారిమాత్రం కాదు. ముఖ్యంగా ఆమె సౌజన్యం. సౌశీల్యం ఆమెకు పెట్టని అలంకారాలుగా శోభించాయి. దానికితోడు కవుల ప్రబంధాల్లో వర్ణించేటట్లుండే ఆమె కళ్లు చూపరులను ఇట్టే సమ్మోహితులను చేసేవి. గుంటూరు బ్రాడీపేట నాలుగోలైను నుంచి బయలుదేరి ఓవర్ బ్రిడ్జ్ మీదుగా దిగి తన కాలేజీవైపు వెళ్తుంటే రెండువైపులా నల్లకలువల తోరణాలు కట్టినట్లుగానూ, తుమ్మెదల బారులు తీర్చినట్లుగానూ, మరుని తూపులన్నీ చూపులరూపంలో చూపరులను ఉన్మత్తులను చేసేటట్లుగానూ వుండేవి. అయితే మధుకరునికి సంపెంగల పొత్తు అసంభవమయినట్లే ఆమె సౌశీల్యంవల్ల ఈ కల్హార మాలికలుకూడా ఎవ్వరి మెడలోనూ పడలేదు. అలా పడలేదు కదా అని సమాజం తనదారిని తాను పోతే ఈ కథ అసలు జరిగేదే కాదు. స్వయంవరంలో రాజులు పంక్తులుకట్టి కూర్చు

వస్తే స్టూడెంట్లు ఓవర్‌బ్రిడ్జి పైనా క్రిందా గజానికొకడు నిలబడి ఎప్పుడామె కటాక్షవీక్షణం తమలో ఏ అదృష్టవంతుడి మీద ప్రసరిస్తుందోనని అలా నిరీక్షణలో తమ అమూల్యమైన కాలాన్ని వాళ్ళ తండ్రులు ఇంటినుండి పంపే డబ్బు కన్నా ఇంకా నిర్లక్ష్యంగా లెక్కాపత్రం లేకుండా ఖర్చుపెట్టేసేవారు. అయినాసరే ఆమె అలా తలవంచుకొనే కాలేజీకి పోయేది. అలా తలవంచుకొనే ఇంటికి చేరేది. దీనితో పిల్లలలో పంతం హెచ్చింది. వాళ్ళ పంతంతోబాటు ఈమె సౌశీల్యంకూడా రెట్టింపయింది.

లక్ష్మి తలవంచుకొని ఇంటినుండి బయలుదేరేది. వాకిట్లోనే రెండు ఇకిలింపులు, మూడు సకిలింపులు. మరి నాలుగు అడుగులు వేశాక కిళ్లీకొట్టువద్ద నిలబడ్డ గొట్టాంపాటు కుర్రాడిపాట "చెలియా కనరావా!". గమ్యమెరిగిన సాధకునిలా లక్ష్మిమాత్రం అచంచలంగా నిర్భయంగా ఎడంచేత్తో పుస్తకాలను హృదయానికి హత్తుకొని తనమార్గాన తలవంచుకొని సాగిపోయేది. ఇంతలో బ్రాడీపేట మెయిన్‌రోడ్ - ఓవర్ బ్రిడ్జ్. పట్ట శక్యంకానంత ట్రాఫిక్. గజానికొక టీన్-ఏజ్ రోమియో. అయితే ఈ పద్మ వ్యూహం అవలీలగా చీల్చుకొని ముందుకు సాగడం లక్ష్మికి వెన్నతోబెట్టిన విద్య. సూర్యుడు ఉదయించడమన్నా ఆలస్యం చేస్తాడేమో కాని వాసు ఓవర్‌బ్రిడ్జ్‌వద్ద అటెండెన్సు వేసుకోవడం మాత్రం అన్ని ఋతువులలోనూ క్రమం తప్పకుండా టంచన్‌గా చేసేవాడు. జోజప్ప వైద్యశాలవద్ద అదే సమయానికి రవి ప్రత్యక్షం. మరో యాభై గజాల కవతల దారితప్పిన ప్రయాణీకునిలా పోయిన వస్తువును వెతుక్కుంటున్నట్లు కాసేపు నేలనూ, మరి కాసేపు శూన్యాన్ని చూస్తూ తిరిగే జాన్—హిప్పీ స్టయిల్‌లో చెంపలు కిందిదాకా పెంచిన బక్కపలచని కుర్రాడు. అయితే లక్ష్మి సమానాంతర రేఖలనుండి వెల్వడే కల్వపూల దండలు ఎంతసేపూ కాలేజీగేట్లవైపే చూస్తుండటంతో రోడ్ల పక్క పాంథులకు ఈ చూపుల ఒయాసిస్సులు గగనకుసుమాలైనాయి. కుందేటి కొమ్ములైనాయి. అందని మ్రానిపండ్లయినాయి.

లక్ష్మి, పద్మాక్షి ప్రాణ స్నేహితురాండ్రు. మంచీ చెడులు ఏకాంతంగా ముచ్చటించుకునేవారు.

పద్మాక్షి అనేది "అక్కా నీ కళ్ళు దేవుడు నాకిస్తే నా ఓహ్—ఈ ప్రపంచాన్నంతా ఏకచ్ఛత్రాధిపత్యంతో ఏలేదాన్ని" అని.

లక్ష్మి నవ్వి "పిచ్చిపిల్లా—ఆడదానికి అంత అందం మంచిదికాదు కూడాను. అయినా నీ కళ్ళకుమాత్రం ఏంలోపం! కాస్త కాటుక పెట్టుకుంటే చాలు. కళకళలాడుతూ రంభలా వుంటావు."

"నువ్వు పొగడాల్సిందే నన్నూ-

కూడక్కా—నీ చూపులకోసం ఎన్నెన్ని చాతకాలు అలా పడిగాపులు కాస్తున్నాయో.''

''అది నా దురదృష్టం. నేనేం ఉద్యోగాలు చేసి ఊళ్లేలబోవడం లేదు. బ్యూటీ కంటెస్టులో పాల్గొనడమూ లేదు. పెళ్ళి బెయివింగులో ఇదొక భాగమని మా వాళ్లు ఇంట్లో బలవంతం చేస్తే గత్యంతరం లేక ఒప్పేసుకున్నాను. లేకుంటే నాకీ కాలేజీ ముఖమే చూడాలని జీవితంలో కోరిక లేదు. ఏదో కాలక్షేపానికి ఇంట్లో పుస్తకాలు చదువుకుంటూ వంట చేస్తానే కాని—అక్బరు ఏ సంవత్సరంలో ఏ కోటను ముట్టడించాడూ. అబుల్‌ఫజల్ వ్రాసిన జమాపద్దుల చిట్టాలో—ముట్టడిలో ఆదాయం ఎంత వుంది, వ్యయం ఎంత వుందీ, జంకిన్స్ చెవిని కోసినందుకు ఎన్ని సంవత్సరాలు తన్నుకుచచ్చారూ— ఈ వివరాలన్నీ నాకెందుకు పద్మాక్షీ— నేనేం హిస్టరీ లెక్చరర్ని కాబోవడం లేదు—పైగా ఇవి నా నిత్యజీవితావసరాలకు ఏ విధంగానూ తోడ్పడవు.''

''నీవు బీ సి. నాటి పిల్లవు అక్కా! బ్రహ్మదేవుడు పాత చింతకాయ పచ్చడి వంటి బూజుపట్టిన భావాలు కల నీవంటి వాళ్ళకు బ్రహ్మాండమైన సౌందర్యం ఇస్తాడు. ప్రోగ్రెసివ్ వ్యూస్ కల నావంటి వాళ్లకుమాత్రం న్యాయం చేకూర్చడు. సృష్టిలో ఇదొక వింత—ఏం చేస్తాం''

''పద్మా—అజ్ఞానంలో పడి కొంపరకీ ఎట్రాక్షన్స్‌కూ, సినిమాల ప్రభావానికీ లోబడి ఇలా మాట్లాడుతున్నావు కాని ఈ బాధ పగవాడికక్కూడా వద్దు. హాయిగా స్వేచ్ఛగా నా ఊపిరేదో నన్ను పీల్చుకోనీయకుండా అంగరక్షకుల్లా నిరంతరం నన్ను అణువణువూ పరీక్షిస్తూ ఇలా వెంటనంటుతుంటే ఎంత బాధ వేస్తుందో తెలుసా! బాధను మించిన అసహ్యమూ జుగుప్సాకూడా కలుగుతుంది. ప్రతిరోజూ ఈ చదువు మానేసి ఇంట్లో కూర్చుందామని పొద్దునొకసారీ సాయంత్రం ఒకసారీ అనుకుంటాను నేను. కాని తప్పదు. కర్తవ్యం—గత్యంతరం లేదు. ఇలా అవస్థ పడవలసిందే. ఆ వచ్చే వరుడెవడో సెలెక్ట్ చేసుకోవాలంటే ఈ డిగ్రీకూడా తోకలా వ్రేలాడుతుండాలట కదా! మా నాన్న రోజూ పదిసార్లంటారీ మాట. నిజంగా ఆయనకెక్కడ గుండెపోటు వస్తుందో నావల్లనని, ఇలా నోరుమూసుకొని తల వంచుకొని చదువుల నాటకం ఆడేస్తున్నాను.''

''కోతలు కొయ్యకోయ్. నా దగ్గర కూడా ఎందుకు దాస్తావు నిజం. ఇలా ఇంతమందిని నీవు ఆకర్షించగలిగావంటే అది నీకు నిజంగా గర్వకారణం కాదా? కాబట్టే ఊరుకున్నావు కాని లేకుంటే వాళ్ళమీద ఎప్పుడో పోలీసు రిపోర్టు ఇచ్చి వుండేదానివి. నా వెంటనే కనుక వాళ్లలా పడివుంటేనా ఓ ఆట పట్టించివుండేదాన్ని.''

"బుద్ధిలేని పిల్లా—సినిమా డైలాగులు వల్లించకు. సినిమాలు వేరు. జీవితాలు వేరు. తెరమీదిదంతా నటన. ఇదంతా జీవితం కఠోర సత్యం. నీవా మగపిల్లలను ఆటపట్టిస్తావా? ఏం ఆట పట్టిస్తావే నీ బతుక్కి. ఆకుమీద ముల్లుపడ్డా, ముల్లు మీద ఆకుపడ్డా ఆకే చిరిగిపోయింది. ఆ పోలీసులు కూడా మనుషులే. మొన్న కొత్తగా వచ్చిన పోలీసాఫీసరు పట్టపగలే ఈవ్‌టీజర్స్ నందరినీ అరెస్టు చేశాడు. బ్లేడుతో గొట్టాం ప్యాంట్లను కోసి రోడ్డు మీద నడిపించాడు. అలా చేయబడ్డ వాళ్లలో ఓ పెద్ద రాజకీయనేత్తా బిజినెస్ మాగ్నెట్ కొడుకు కూడా వున్నాడట. ఫలితం. పోలీసాయనకు ట్రాన్స్‌ఫర్. ఇలా వున్నాయి పరిస్థితులు."

"పోనీ ఒక్కసారైనా నువ్వు మృదువుగానైనా ఒక్కర్ని మందలించినట్లు చూడలేను నేను."

"అందుకని ఈ జాకర మొత్తమూ నాకు ఇష్టమని నిర్ణయానికి వచ్చావేమిటి? స్టుపిడ్‌ని—నీకు నిజంగా బ్రైన్ లేదు పమ్మా. మంత్రాలకు చింతకాయలు రాలవు. మన మందలింపులకూ, బెదిరింపులకూ వాళ్లు లొంగిరారు. మొన్న బెజవాడ వారపత్రిక ఆఫీసు రోడ్డున మా బంధువుల అమ్మాయి కుసుమ పోతుంటే ఓ ఈవ్ టీజర్ వెంటపడ్డాట్ట. "ఏకేం బుద్ధిలేదా—నీకు తల్లిలేదా? అక్కాచెల్లెళ్లు లేరా? అని అనవసరంగా ఈ పిల్ల రభస చేస్తే వాడు "లేకేం—అంతా వున్నారు పిల్లా—ఒక్క భార్యమాత్రమే లేదు" అని నలుగురూ గుమిగూడే లోపల సైకిలెక్కి పారిపోయాడట. వెధవ సినిమా డైలాగులు వాడాను. అందుకే తలవంచుకొని లేని ధైర్యసాహసాల్ని అరువుతెచ్చుకొని ఇలా కాలక్షేపం చేస్తున్నాను నేను పమ్మా! ఎంత తల దువ్వుకోకుండా ఫ్యాషనబుల్ చీరెలు కట్టుకోకుండా, సంసార పక్షంలో పోతున్నా ఈ పోరు తప్పడంలేదు."

"ఆ మూడుముళ్ళయినా త్వరగా పడేటట్లు మీ నాయన్ని చెయ్యమను. మంగళసూత్రం చూస్తే ఈ పిట్టలకి తుపాకీ గుండ్లని చూసినట్లవుతుంది."

"అఘోరించినట్లుంది నీ తెలివి — అదే అయితే ఇంక అసలు చదువెందుకే నాకు—దానికోసమే ఈ పాట్లన్నీ."

"పోనీ నేను కడతాను కట్టించుకో."

"నోరు మూసుకో. నీ జోక్స్‌కు హద్దూ పద్దూ లేకుండా పోతున్నాయి. జీవితం కథ కాదు. కఠోరసత్యం. ఇది గుర్తు పెట్టుకుంటే నీకీ పరాచికాలూ, వ్యామోహాలూ రెండూ వుండవు."

కాలేజీలో స్టూడెంట్స్ యూనియన్ ఎన్నికలు.

అంతా ఎటుచూసినా కోలాహలమే.

ఓ. ఎం. ఎల్. ఏ. ఎలక్షనంత హడావుడి పెరిగింది. కరపత్రాలు, గోడలపై వ్రాతలూ, కార్లతో ప్రచారాలూ అంతా




రాజకీయ వాతావరణమే. అందులో ఒక గ్రూపు తమ రాజకీయాలకు అనుగుణంగా అందరు అభ్యర్థులనూ నియమించుకొని లాంగ్వేజి ఎసోసియేషన్ పోస్టుకు ఒక స్త్రీని నిలబెట్టాలని నిశ్చయించారు.

"ఎవరిని నిలబెట్టాలి?" ప్రశ్నించుకున్నారు వాళ్లు.

"ఇంకెవరిని. లక్ష్మిని నిలబెడితే సరి—ఆమె మనవెంట వుంటే చాలు. మొత్తం గ్రూపంతా గెలుస్తుంది. పిచ్చెక్కినట్లు వచ్చి ఓట్లేసి పోతారంతా మనకే"

అందరిదీ ఇదే అభిప్రాయం.

ఇంకేం వెళ్ళి ఆమెను వప్పిస్తే సరి

కాని ఒప్పుకుంటుందా??

ఏమో....

ఈ సదవకాశాన్ని ఉపయోగించుకునేందుకు ట్రిమ్‌గా తయారై బయలుదేరాడు వాసు.

లేడీస్ వెయిటింగ్ రూం ఇవతల కాచాడు.

క్లాసు కాగానే గదిలోకి వెళ్తూ కొంచెం దూరంనుంచే గమనించింది వాసును. ఇవ్వాళ వీడేదో సాహసానికి పూనుకున్నాడే అనుకున్నది.

"ఏమండీ...."

"ఆఁ—ఏమిటి?" జంకూ గొంకూ లేకుండా నిలదీసి అడిగింది లక్ష్మి.

"మేం ఎలక్షన్లకు పోటీ చేస్తున్నాం"

"సరే—నా ఓటు మీకే వేస్తాను."

లక్ష్మి వెళ్ళబోయింది.

"మేమంటే నేను కాదు — మా గ్రూపు వాళ్లు. వాళ్లు మిమ్మల్ని కూడా లిటరరీ అసోసియేషన్‌కు అభ్యర్థిగా ఎంచు

తున్నారు.''

''క్షమించండి. నాకిలాంటివి నచ్చవు.''

''మీరట్లా అంటే మా గ్రూపంతా ఏం కావాలి?''

''మీ గ్రూపు ఏ గంగలో నన్నా దిగండి. నాకీ ఎలక్షన్లు వగైరాలు నచ్చవు. క్షమించండి'' వెయిటింగ్ రూంలోకి వెళ్ళిపోయింది. మూడుముక్కల్లో సంభాషణ తేలిపోయింది.

వాసు యుద్ధంలో ఓడిపోయిన వీరుడిలా తిరుగుముఖం పట్టాడు.

చూస్తుండగానే పదిమంది జమకూడారు.

''ఏం మాట్లాడిందిరా వాసూ—మాకు చెప్పకూడదా?''

''ఒప్పుకుందా? మనతోబాటు కాన్వాసుకు వస్తానందా?''

ప్రశ్నల పరంపర—

''నువ్వదృష్టవంతుడివిరా — నీతో మాట్లాడింది.''

అభినందనల వర్షం—

''అరేయ్—నన్ను చంపకండి—ఏ గంగలోనన్నా దూకమని తిట్టి పంపింది.''

''అరే—అలా అన్నదా—అయితే ఇంకా అదృష్టవంతుడివి — ఆవిడచేత తిట్లు తిన్న మొదటి హీరోవు నీవు. ఇంకేం దూకు లక్కీ—సౌందర్య గంగలో—ఒకటే గోల.

* *

''ఏమంటాడే వాసు?'' పద్మాక్షి ప్రశ్న.

''ఆఁ—ఏవో వాడి మొఖం ఎలక్షన్ల్సట — నిలబడాలిట — ఇదో నెపం పలకరించేందుకు'' నిర్లక్ష్యంగా అన్నది లక్ష్మి.

''అసలు సంభాషణ ఏం జరిగింది?''

''పద్మాక్షీ—ఏం నీకు మతిపోతున్నది రోజురోజుకూ. ఇలాంటి అల్పవిషయాలపై అంత ఫాసినేషన్ పనికిరాదు. ఎవ్వళ్ళో సవాలక్షగాళ్ల వస్తుంటారు. పోతుంటారు. కాని మన లక్ష్యమేమిటో అదే చూచుకోవాలి.''

పద్మాక్షిమాత్రం లక్ష్మిని తమ మధ్య నిలబడ్డ ఓ 'హెలెన్ ఆఫ్ ట్రాయ్'లా భావించి చూస్తున్నది. ఈజిప్ట్ రాణి క్లియోపాత్రాలా అనుకొని మనస్సులోనే ఆరాధిస్తున్నది—

''ఏమిటే ఈ తన్మయత్వం.''

''అక్కా — నీ అదృష్టానికి నేను అసూయపడుతున్నాను—నువ్వెంత అందమైనదానివి.''

''మూర్ఖురాలా—అందం అశాశ్వతమైనది. శరీర సౌందర్యం ఏముంది? ఏ జబ్బు వచ్చినా నశించిపోవచ్చు.''

''భగవద్గీత ఇంట్లో విని విని నాకు వంటబట్టినట్లుందక్కా. కావి చూడు నువ్వంటే ఎంత గ్లామరో—ఎట్రాక్షనో... నీకుకూడా మనసులో ఏ మూలో ఆనందం వుండే తీరాలి ఈ ఘనతకు.''

"అందుకే నిన్ను నేను స్టుపిడ్ అంటున్నది—ఈ వందిమాగధుల కైవారాల సంకెళ్ళనుండి విముక్తి ఎప్పుడా అని భావిస్తుంటే నాకిది ఆనందమా?"

"కాకుంటే ప్రిన్సిపాల్‌కు ఒక్కరి మీదనన్నా ఎందుకు రిపోర్ట్ చేయలేదు."

"ఆయనది రెండువైపులా వాడిగల కత్తి. అటు ఉపాధ్యాయులను సస్పెండు చేయడంతోపాటు బికినీ పెరేడ్‌లా ఏమిటీ వేషాలు; ఇది కాలేజీ అనుకున్నారా? బ్యూటీ కాంపిటీషన్‌లో పాల్గొనేందుకు వచ్చారనుకున్నారా?" అని ఈ గుర్రపు జూళ్ల కన్నిటికీ ఫైన్ వేస్తాడు—రచ్చ కెక్కడం ఎవరికిమాత్ర మేమంత ఆనంద

కొద్దిరోజుల్లోనే ఎలక్షన్లకు అభ్యర్థులు నిలబడ్డారు ప్రెసిడెంట్, వైస్ ప్రెసిడెంట్, సెక్రెటరి, జాయింట్ సెక్రెటరీ, ఆర్ట్ రిప్రెజెంటేటివ్, లాంగ్వేజ్ రిప్రెజెంటేటివ్, గేమ్స్ సెక్రెటరీ, క్లాస్ రిప్రెజెంటేటివ్—మొత్తం ఎనిమిది ఓట్లు—నాలుగు గ్రూపులు — ఇండిపెండెంట్లతో కూడా కలిపి మొత్తం నలభైమంది అభ్యర్థులు. ఒక్కొక్క అభ్యర్థికీ ఇరవైమంది వందిమాగధులు.

అంతా లక్ష్మి చుట్టూ ప్రదక్షిణం చేశారు.

తడవ కొక దొక కరపత్రం తీసుకొని లక్ష్మి కందించి "మీ ఓటు మాకే వేస్తారు కదూ—ష్యూర్‌గా—" ఇలా ఏదో మాట్లాడానన్న సంతృప్తితో వెళ్ళేవాడు.

వీళ్ళ వెర్రి మొర్రి వేషాలు చూసి అసహ్యించుకొని ఈ కరపత్రాల నన్నిటినీ ఇంట్లో వాళ్ళ నాన్న షేవింగ్ సబ్బు తుడుచుకునేందుకు పడేసింది.

కొద్దిరోజుల్లో ఎలక్షన్లయినాయి.

పోలింగుకుకూడా వెళ్ళలేదు లక్ష్మి.

ఎవరో కొందరు గెలిచారు. కొందరు ఓడారు.

ఈ వాతావరణాన్ని సహించి

పీడ వదిలిపోయింది అనుకుంది లక్ష్మి.

మళ్ళీ ఆమె కాలేజీ ప్రయాణం ప్రారంభం.

మళ్లీ "చెలియా కనరావా" పాట.

మళ్ళీ ఓవర్‌బ్రిడ్జ్‌వద్ద వాసు అటెండెన్స్.

ఆర్య జోజప్ప వైద్యశాల ముందు రవి.

అలాగే శూన్యాన్ని చూస్తూ చెంపలు పెంచుకున్న జాన్.

అంతా మామూలే.

*                    *

ఇలా వుండగా కాలేజీలో ఓ విచిత్రం జరిగింది.

కలకత్తాలోని ఆందోళనల కారణంగా పలుకుబడి కల చాలామంది సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగులు వివిధ ప్రాంతాలకు ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నారు.

అలా వచ్చినవారిలో ముకుల్ బెనర్జీ ఒకడు. ఆయన చాలాకాలం విజయ వాడలో పనిచేసి ప్రమోషన్ మీద కలకత్తా వెళ్ళాడు. అక్కడి అవ్యవస్థవల్ల తిరిగి ఆంధ్రప్రదేశ్‌కు పంపమని కోరాడు. పై వాళ్ళు అంగీకరించారు. తెచ్చి గుంటూ రులో పోస్టు చేశారు.

రాగానే కుమార్తె సురేఖను కాలేజీలో చేర్పించాలని ప్రిన్స్‌పాల్‌కు ఫోన్ చేశాడు.

"ఓహో — బెనర్జీ సాబ్ — మళ్లీ వచ్చేశారేమిటి! మీరు మా ప్రాంతానికి ఇదివరకే చాలా పాత పరిచయం వుంది."

"అవునండీ — అమ్మాయికి సీటు కావాలి"

"ఓ యస్. ఖాళీలున్నాయి పంపండి ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్లు వగైరాలతో."

కార్లో తెచ్చి డ్రాప్ చేసి వెళ్ళిపోయాడు కూతుర్ని.

సురేఖ కాలేజీలో చేరింది!

కాలేజీ మొత్తం విద్యుత్తాడనం, ఎల క్ట్రిక్ షాక్‌తో కంపించినట్లు చలించి పోయింది.

సురేఖ నిజంగా అందగత్తెల జాబితా లోనే చేరింది. కలకత్తా జామకాయలాంటి రంగు, కావ్యాల్లో వర్ణించేటట్లుండే సంపెంగ పువ్వువంటి నాసిక, విదియ చంద్రునివంటి నుదురూ, శ్రీకారం చుట్టి నట్లున్న పెదవులూ, తుమ్మెదల్లాంటి ముంగు రులూ, అస్తినాస్తి విచికిత్సతో కన్పడే కటీ, చిగురుటాకుల్లాంటి చేతులూ, అరటి బోదెలవంటి ఊరువులూ, కృష్ణా పులిన తలాలవంటి నితంబాలూ, హంసలవంటి నడక. చిలకలవంటి పలుకులూ, అలం కార సామగ్రి మొత్తం ఒకచోట కుప్ప పోసినట్లూ, కవుల లక్షణాలన్నిటికీ లక్ష్య మన్నట్లూ క్షణికం కాని విద్యుల్లతలా మెరుస్తుంది సురేఖా బెనర్జీ.

సౌందర్యం భాష అయితే ఈమె బాలవ్యాకరణం.

సౌందర్యం భావమయితే ఈమె శబ్ద రత్నాకరం.

సౌందర్యం వసుచరిత్ర అయితే ఈమె సరస భూపాలీయం.

సౌందర్యం ఒక మహాకావ్యమయితే ఈమె ధ్వన్యాలోకం.

సురేఖా బెనర్జీ ఒక లక్షణం—ఆమే ఒక లక్ష్యం!!

రోజూ ఆఫీసుకెళ్తూ ముకుల్‌జీ కూతు రును కారులో కాలేజీవద్ద డ్రాప్ చేసి వెళ్లే వాడు. వచ్చేటప్పుడు మాత్రం స్నేహితు రాండ్రతో కబుర్లు చెప్పుకుంటూ ఇంటికి పోయేది సురేఖా బెనర్జీ!

ముకుల్‌జీ బ్రహ్మో? సురేఖకుకూడా ప్రార్థనా సమాజంతోనూ, సాంఘికోత్స వాలతోనూ బాగా పరిచయమే. అందు కనేమో చూస్తుండగానే తీగెలా అల్లుకు పోయింది మిత్రులతో. కలకత్తా సోషల్ లైఫ్ ముందు సురేఖకు గుంటూరు సముద్రం ముందొక చెరువులా కన్పిం చింది ఎవరే పార్టీకి పిలిచినా సురేఖా




ఎనర్జీ సిద్ధం. ఎవరూ పిలవకపోతే వాళ్ళింట్లోనే పార్టీలు ఏర్పాటుచేసేది. కాలేజీలో గర్ల్ ఫ్రండ్స్‌తోబాటు బాయ్ ఫ్రండ్స్‌కూడా ఉత్సాహంగా పాల్గొనేవారు పార్టీలల్లో. వీటితోబాటు చిన్న చిన్న పిక్నిక్స్, సినిమా ప్రోగ్రామ్ — ఓహ్! గుంటూరుకు మినియేచర్ 'ఓహ్ కల్‌కటా' స్థాయి వచ్చేసింది.

ఇప్పుడు లక్ష్మి బయలుదేరగానే 'చెలియా కనరావా' వినిపించడం మానివేసింది. లక్ష్మి థియేటర్‌దగ్గ బీట్ కానిస్టేబులు వాసు అదృశ్యం. జోజప్ప వైద్య కళాశాల దగ్గర రవి కనపడటం మానేశాడు. అవతల శూన్యంలోకి చూచే హిప్పీ జాన్‌కూడా పత్తాలేదు. ఇప్పుడిక లక్ష్మి ఆనందాన్ని వర్ణించేందుకే భాషా చాలదు. ఒక్కసారి శృంఖలాలనుంచి బయటపడ్డ రామచిలుకలా హాయిగా స్వేచ్ఛా వాయువులను పీల్చింది. 'పీడ వదిలిపోయింది పద్మాక్షీ' అని తన సంతోషాన్ని వ్యక్తం చేసింది పద్మతో. తన కిక ఈ అంగరక్షకుల కాపలా తీరిపోయిందన్నమాట! ఆ సురేఖ నెత్తిన పాలు పోద్దామనిపించింది లక్ష్మికి.

లక్ష్మి మొదటినుంచి చాలా ముక్తసరిగా మాట్లాడేది. అందుకనే సురేఖతో వెంటనే స్నేహం కలుపలేకపోయింది. నిజాని కామె కంత అవసరంకూడా లేకపోయింది. సురేఖమాత్రం కనబడ్డ ప్రతి వారినీ పలకరించేది. లక్ష్మిని కూడా 'హలో' అంటూ నలుగురితోబాటే రెండు మూడు సార్లు విష్‌చేసింది కూడాను.

సురేఖలో ఏదో వశీకరణ శక్తి వుంది. ఇట్టే స్నేహితులను ఆకర్షించి తన వెనుక బడి తిరిగేటట్లు చేసుకోగలిగేది. ఒక్క లక్ష్మి తప్ప తక్కినవారంతా ఆమెకు వందిమాగధులే. ఆమె రూపమే వేరు. ఆమె కారే వేరు. ఆ స్టేటసే వేరు

కాలేజీలో కల్చరల్ డెలిగేషన్‌కు సెలెక్షన్స్ వచ్చాయి. పేర్లు ఇవ్వవలసిం దని కోరారు. చాలామంది తమ పేర్లి చ్చారు. కాని దాదాపు ఏకగ్రీవంగా అందరూ తమ టీమ్‌కు సురేఖా బెనర్జీ నాయకత్వం వహించాలని కోరారు. లక్ష్మికి వాళ్ళ వెర్రిని చూచి ఏడ్వాలో, నవ్వాలో తోచలేదు. పూర్వమయితే ఇలాంటి అవకాశమేదైనా వస్తే చాలు ఈగల్లా ముసిరేవారు ఫాన్స్. ఏదో ఒక వంక పెట్టుకొనివచ్చి తనతో మాట్లాడి పోవడానికి పరితపించేవారు. తాను నిర్ల క్ష్యంగా కసిరేది. అయినాసరే వాళ్ళు చిన్నబుచ్చుకొనకుండా 'అదే మహా ప్రసాద' మన్నట్లు స్వీకరించి పోయేవాళ్లు. కాని నేడు....ఎంత తేడా! ఎంత హాయి!! తన పేరును ప్రతిపాదించినవాడూ లేడు. తన్ను రమ్మని పిలిచిన దుర్మార్గుడూ లేడు.

ఆరోజు మామూలుగానే కాలేజీకి పోతున్నది. బ్రిడ్జిదగ్గర వాసు వెళ్తూ కన్పించాడు. తన్ను చూడగానే ఏ పిపం గినో, పెద్దపులినో చూచినట్లు భయపడి ఇంచుమించు పరుగెత్తినట్లు నడుచు కుంటూ వెళ్ళిపోయాడు. పారిపోయే వాసును ఏడిపించాలనీ పరాచికమాడాలని అనిపించింది లక్ష్మికి. ఈ విషయం పద్మతో చెప్పాలని కాలేజికి పోగానే చూచింది స్నేహితురాలి కోసం. కాని పద్మ కన్పడలేదు. కాలేజీకూడా చాలా డల్‌గా, కలర్‌లెస్‌గా వుంది. సాయం త్రానికి పద్మ కన్పడింది.

హడావుడిగా "ఏమిటీ అబ్బాయిల్లాగా నువ్వు కొంపదీసి కాలేజీ మానుకొని ఏ మార్నింగ్ షోకో చెక్కెయ్యలేదు కదా."

"లేదే. ఇవ్వాళ రాజా రామ్మోహన్ రాయ్ జన్మతిథి. అందుకని సురేఖ గారింట్లో పార్టీకి వెళ్లాను. ఓహ్! నిజంగా ఏం ఉత్సాహం, ఏం తన్మయం."

పద్మకూడా సురేఖ వలయంలో తిర గడం లక్ష్మి ఎన్నడూ ఊహించనేలేదు.

పద్మ అలా జన్మతిథి విశేషాలు వర్ణిం చుకు పోతున్నది. వేడుకలను స్వభావో క్తులతో, అతిశయోక్తులతో వివరిస్తూ వున్నది. లక్ష్మి కాసేపు విని విసుగు దలతో "ఎంత సేపూ ఈ సురేఖా మాహాత్మ్యమేనా? వేరే కబుర్లేమైనా వున్నాయా."

"కాదే లక్ష్మి. చెపితే నీ కాశ్చర్యంగా వుంటుందేమో కాని, ఓహ్! అసలా కల్చరే వేరనుకో. ఆ భక్తి, ఆ తాదా త్మ్యం, ఆ సోషల్ గాదరింగూ—లక్ష్మీ నువ్వు అనుభవించాల్సిందే కాని నేను వర్ణిస్తే లాభంలేదు."

లక్ష్మికి చికాకు క్షణక్షణానికి పెరుగుతున్నది. పద్మమాత్రం ఇదేమీ గమనించకుండా వెర్రిగోల మేసుకొని సురేఖ ఘనతను వర్ణిస్తోంది. "మన కాలేజీ పిల్లలే కాదు. కలెక్టరుగారూ, పెద్దపెద్ద ఆఫీసర్లూ ఎంతమంది వచ్చిపోయారో పొద్దుటినుంచీ పొద్దుగ్రుంకేదాకా — నీ కసలు బొత్తిగా తెలియనే తెలియదా లక్ష్మీ?"

"ఊహూఁ."

"అవునులే. పాత చింతకాయ పచ్చడిలా నువ్వే మూలనో నక్కి వుంటావు. లేకుంటే సురేఖ నీకూ స్వయంగా ఇన్విటేషను ఇచ్చేస్తుందేమి—ఆమె హృదయం ఎంతో విశాలం లక్ష్మీ."

లక్ష్మికి పద్మను చెప్పుతో తన్నాలనిపించింది.

విదిలించుకొని లేచి నిలబడి "చాల్లే నోరు మూసుకో—ఈ బోరు కట్టిపెట్టు."

"కాదే లక్ష్మీ—నీ పాత అంగరక్షకులు లేరూ వాసూ, రవీ, జానూ వాళ్ళంతా అక్కడ పార్టీలో వాటర్ సప్లయ్ చేస్తున్నారు అతిథులకి—ఆ జానుగాడి అవస్థయితే రాను రానూ వర్ణించలేననుకో. ఏదో పారేసుకున్నట్లు పరుగెత్తుతూ, గెంతుతూ నౌకరీ చేశారు. అయితే ఎవ్వరూ దాన్ని నౌకరీగా భావించలేదు. ఉత్తమ సంస్కారంగా, సంఘసేవగా భావించారు."

లక్ష్మి నీలోత్పలాలు అరుణ కమలాలుగా మారాయి.

"పద్మా. మన స్నేహమీ బాగాలేదు. ఏదైనా సినిమాకెళ్దామా?" లక్ష్మికి సినిమాకెళ్లాలనే కోరిక కలగడం ఇదే మొదటి సారి.

"సారీ మాడమ్—ఈ రాత్రికి సురేఖ గారింట్లో సభ వుంది. చాలా పెద్దపెద్ద వాళ్లు వచ్చి మాట్లాడుతారట. తప్పకుండా రమ్మని ప్రామిస్ చేయించుకుంది. చేతిలో చెయ్యి వేసి మరీ సుహాసా. క్షమించు లక్ష్మీ మా..."

పద్మ చకచకా వెళ్లిపోయింది ...ంజెతి వాటి చూడకుండా.

లక్ష్మి నిర్ఘాంతపోయి చూస్తున్నది పద్మపోయిన దిక్కుకే.

ఆ రాత్రి లక్ష్మికి నిద్రపట్టలేదు. సమాజం ఎందుకిలా వ్యామోహాల వెంట పరుగెత్తుతున్నది?? చాలాసేపు ఆలోచించింది. అంతుబట్టలేదు. తనలో ఏదో చెప్పలేని బాధ.

అదీ ఇదీ అని నిర్వచించలేని వేదన.

తనకూ తన కళ్ళకూ ఏమయింది??

తనలోని ఆకర్షణాశక్తి నశించిపోయిందా??

నమ్మ బుద్ధి కాలేదు.

ఒకరాత్రప్పుడు అద్దంలో కళ్ళు చూసుకున్నది. అవి వెనకటిలా స్వచ్ఛంగా కన్పడలేదు. ఎర్రగా పచ్చగా రంగులు రంగులుగా కన్పడ్డాయి. భయంవేసి కళ్ళు మూసుకొని పడుకున్నది. కళ్లల్లో ఏవేవో వింత వింత జంతువుల విలయనృత్యాలు.

అశాంతి—ఆరాటం.

మర్నాడు ఉదయమే కళ్ల డాక్టరు దగ్గరి కెళ్లింది.

అంబిగొన్న తోదేబులా కూర్చొని వున్నాడు. బి. బి. పి. రావ్, "రా అమ్మా. లోపలికి రా. కూర్చో ఏదీ ఆ బోర్డు చదువు." రాగానే అక్షరాల చార్టు ముందు కూర్చోబెట్టాడు. నిద్రలేమితో అస్తవ్యస్థంగా చదివింది లక్ష్మి.

"ఏదీ మొదటి రెండు పంక్తులూ మళ్లీ చదువు."

చదివింది లక్ష్మి. ఇదేమిటి తనకీ పరీక్ష? తన కళ్ళ మెరుపుకోసం ప్రత్యేక చికిత్సలూ, ...లూ చెపాదేమోనని వెళ్ళిందసలు లక్ష్మి.

"చూడమ్మాయ్—నీవు తొందరగానే మేలుకన్నావు. ఫరవాలేదు. ట్రీట్ చేస్తానులే."

"దేన్నిసార్" ఆశ్చర్యపోతూ అడిగింది లక్ష్మి—

రావు ఏదో మూడు పంక్తులున్న పేరు చెప్పాడు అదొక జబ్బు పేరట జబ్బుకన్నా పేరే భయంకరంగా వుంది—

లక్ష్మి శూన్యంలోకి చూస్తున్నది మతి పోయినదానిలా

తనకి కళ్ళ జబ్బేమిటి? ఎవరన్నా వింటే నవ్వుతారు—కాని రావు వ్యవహారం చూస్తుంటే నమ్మక తప్పేట్లు లేదు.

"జోడు రేపు తీసుకుపో అమ్మాయ్. ఫరవాలేదులే—పో"

ఫీజు బిల్లు తయారుచేసి అందించాడు. బిల్లుతోసహా ఇల్లు చేరింది కళ్ళొత్తు కుంటూ—

తండ్రి ఏమీ అనలేదు—

తల్లి విసుక్కుంది—

మూలనున్న నాయనమ్మ అన్నది "అవేం మాయదారి జబ్బులో—ఇప్పుడందరికీ జోళ్ళే—వాళ్ళ చదువులు చల్లగుండా—మా రోజుల్లో అయితే ఋబ్బరంగా తవుడూ నెయ్యి తిని బతికేవాళ్ళం. ఏ జబ్బులూ వుండేవి కాదు—ఇప్పుడో, ఏం నూనెలో నమ్మా మా యిదారి నూనెలు—అసలీ చదువులేమిటి ఇరవై నాలుగ్గంటలూ అన్నం ముందు కూడా పుస్తకాలు పట్టుకొని కూర్చోడం—మా కాలంలో ఎరుగుదుమా ఎవరన్నా?"

లక్ష్మికి దుఃఖం వచ్చింది—తానేం పశువా తవుడు తినడానికి—బియ్యంపైన విటమిన్లు లేకపోతే అది తన దోషమా?

అయినా తనకు కళ్ళ జబ్బా—?

అసంభవం. అబద్ధం—

మర్నాడు తండ్రే వెళ్ళి బిల్లు పే చేసి జోడు తెచ్చియిచ్చాడు లక్ష్మికి.

* *

కాలేజీలో ఎలక్యూషన్ కాంపిటేషన్.

సెక్రెటరీ—పోటీ వివరాలు అందరికీ వివరిస్తున్నాడు—

పద్మ చెప్పింది "సురేఖ పాల్గొంటున్నదట ఇంగ్లీషు డిబేట్ లో — మవ్వు




పాల్గొంటే ఎంత బాగుండును లక్ష్మీ—''

''అవును పద్మా—ఆ రవిని పిలుస్తే— నేనూ పాల్గొంటాను—''

పద్మ వింతగా చూస్తోంది లక్ష్మి వైపు.

రవి వచ్చాడు—

కాని ఇతడు మునపటి రవి కాదు—

అతనికి ఏ కలువ పూలచందాలు కోసమూ నిరీక్షణ లేదు. ఎవరినీ ప్రసన్నం చేసుకోవాలన్న కోరికా లేదు.

వచ్చాడు భయం భయంగా, బిక్కు బిక్కు మంటూ—

''ఏం మిస్టర్ పెద్దపులిని చూచినట్లు ఎందుకలా భయపడతావ్—'' నవ్వుతూ అంది లక్ష్మి—

లక్ష్మి జీవితంలో కాలేజీలో నవ్వడం అదే మొదటి సారి. అయినా సరే ఆ నవ్వు రవికి భయదాయకంగానే వుంది.

లక్ష్మి సంగతి ఎవరికి తెలియదు?

తన పేరిచ్చింది డిబేటింగ్‌లో పాల్గొనేందుకు—అంతే పేరు రాసుకొని తిరిగి వెనక్కు కూడా చూడకుండా పోయాడు రవి.

''ఇప్పుడే వస్తాను లక్ష్మీ—'' పద్మ వెళ్ళిపోయింది.

ఆమె ఎక్కడికి పోతుందో లక్ష్మికి తెలుసు.

అయినా సరే పద్మను అపేక్ష లక్ష్మికి. రెండు కళ్ళు లేవు నాలుగు కళ్లున్నా సరే ఇప్పుడు లేదు.

డిబేటింగు పోటీ జరిగింది కొద్ది

రోజుల్లోనే. లక్ష్మికి ఇంగ్లీషుమీద మంచి కమాండ్ వుంది.

ముందు సురేఖాబెనర్జీ మాట్లాడింది. భాష, భావం పెద్ద బాగాలేకపోనా ఆకె ంట్ (ఉచ్చారణ) లో మంచి స్టైల్ మైన్ స్టైన్ చేపించి—ఆమె ప్రతివాక్యానికీ కరతాళ ధ్వనులే—ఉత్సాహ సూచకమైన శబ్దాలే.

హాలంతా పున్నమి చంద్రుణ్ణి చూచిన సముద్రంలా ఉప్పొంగింది.

ప్రసంగిస్తూ ఒక్కసారి జఘనాలను స్పృశిస్తున్న పొడవైన తుమ్మెద బారు వంటి ఆ జడను ముందుకు వేసుకొని బిబ్బీకొట్టి గట్టిగా ఒక పాయింట్ చెప్పింది.

సత్యభామ కన్పడింది కొందరికి

శశిరేఖ కన్పడింది మరికొందరికి.

శర్మిలా టాగూర్‌ను చూచారు మరి కొందరు.

ఆరేషన్‌లో ఆంగిక ప్రదర్శనకు మార్కులు పడవు—అదొక అవలక్షణం అని లక్ష్మికి తెలుసు—అయినా సరే ఈ గుంపుకు అదంతా ఎందుకు??

లక్ష్మి అసహ్యించుకుంది వీళ్ళ ప్రవర్తనకు.

ఈ చప్పట్లు ఆమె చెవుల్లో సీసం కరిగించి పోసినట్టు అనిపించింది

తర్వాత ఒకరిద్దరు ప్రసంగించారు—"మిస్ లక్ష్మి" పిలిచారు.

లక్ష్మి లేచింది—సభలో ఆశ్చర్యం!!

వచ్చి డయాస్‌పై వినమ్రంగా నిల బడి చేతులను విటారుగా పెట్టుకొని తల కదిలించకుండా ఆరేషన్ ప్రారంభించింది.

"చతుర్వేద్ర" వెనుకనుండే ఎవరిదో కేక. పక్కన నవ్వారంతా.

ముందు వరుసలో పెద్దలు మాత్రం కోపంతో చూచారు వెనక్కు తిరిగి—ఎవరన్నారో ఎలా తెలుస్తుంది??

అధ్యక్షుడు "సైలెన్స్" అంటూ బెల్లు వరిచారు

అవమానంతో లక్ష్మికి కాళ్ళు వణికాయి.

నోట మాట రావేదు.

హాల్లోంచి రవీ, వాసూ, జానూ, చాలామంది గర్ల్ ఫ్రండ్స్ బయటకు విష్క్రమిస్తున్నారు.

లక్ష్మికి కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది.

డయాస్ దిగిపోయింది—"ఓహో—" గోల చేస్తూ విర్విరామంగా చప్పట్లు.

మాట్లాడిన వారిలో సురేఖాబెనర్జీయే ఉత్తమంగా మాట్లాడినట్లు న్యాయనిర్ణేతలు తీర్పు చెప్పారు.

"ఆమె వస్త్రప్రాజా గెలుచుకుంది.

పూర్ణిమనాటి సముద్రంలా మళ్ళీ ఉప్పొంగిన జన సందోహం.

ఆ హడావుడిలో లక్ష్మి ఎప్పుడు ఇంటికి బయలు దేరిందో ఎవడికి పట్టింది కనుక.

*   *

"నాన్నా — నేనిక చదువుకోను—వాళు తగ్గవరుదే వస్తాడు—నేనుమాత్రం



యు



ఇక కాలేజీకి పోను—అంతగా కదంటే ప్రైవేటుగా కట్టుకాను—హింది నేర్చుకుంటాను" — ఈ జులాయిల బారికి పడలేక చివరకు మానుకున్న కూతురు సౌజన్యాన్ని. సౌశీల్యాన్ని తండ్రి మెచ్చుకున్నా పెండ్లి సమస్య తలయెత్తునే సరికి తిరిగి ఆమె చేసింది మంచి పని కాదేమో అనిపించింది.

అయినా—ఆమె ఇప్పుడు తిరిగి చదివింప జేయడం ఎవరి సాధ్య మవుతుంది.

లక్ష్మి ఎప్పుడు డిస్ కంటిన్యూ చేసిందో ఎవరికీ తెలియదు. ఎందుకు చేసిందో తెలుసుకునే కోరికా ఎవ్వరికీ లేదు కాలేజీలో. ఒక్క పద్మకు తప్ప. తక్కిన వారెవరూ ఆమె వస్తున్నదో లేదో కూడా పట్టించుకో లేదు.

కాని పద్మకుమాత్రం అసలు విషయం తెలుసు.

లక్ష్మి నేటివరకూ సమాజంలో ఒక సౌందర్య పీఠాన్ని అధిష్ఠించింది—ఆమెకీ మనసువరకూ అక్కర్లేదు నిజమేకాని అలా వాళ్లు తనచే తిరస్కరింప బడుతూనే తన్ను ఆరాధించడం మాత్రం ఆమె అంతరాంతరాల్లో తెలియకుండా దాగిన ఒక కోరిక కావచ్చు—ఆ పీఠాన్ని ఈనాడు ఆమె కోల్పోయింది. ఆరాధింప బడ్డ చోట ఆమె అవమానం భరించలేదు.

పూలమ్మిన అంగట్లో ఆమె కట్టెలమ్మ లేదు.

అందుకే ఆమె రంగస్థలం నుండి నిశ్శబ్దంగా నిష్క్రమించింది — తల్లిదండ్రులకూ లోకానికీ ఎవ్వరికీ తెలియని ఒక అంతరంగ రహస్యం ఇది.

అనావిష్కృతమైన కఠోర సత్యం ఇది.

వాళ్ళ నాయినమ్మ మాత్రం అంది "పాడు మనుషులూ పాడు బుద్ధులూ—మంచి వాళ్ళకు వీధిలో మసలడంకూడా కష్టమైపోతున్నది—ఏం రావణా కాలమో గాని—"



భూలోకంబున ఊర్వశి పేరున
అవార్డున్న చందంబున తన నామంబున
అవార్డు ఏదీ యని దుఃఖంబున
రంభ కోపగృహంబు చేరె - నారద!
రంభాప్రియా -
నలకూబర!
అవార్డునికిందగు
ఆందోళనంబు
రగిలింతము
రమ్ము!




We WANT RAMBHA AWARD
రంభ అవార్డు వెంటనే కావాలి!
100% సెక్సుతారకు రంభ అవార్డు ఏర్పాటు కావాలి!
రంభ జై!
ఉత్తమ సెక్సీ శృంగార తారకు రంభ అవార్డు వాంఛనీయం!




బస్సు ప్రయాణంలో చల్లటిగాలి సుఖం అనుభవించాలంటే కిటికీ ప్రక్కనే కూర్చోవాలి. ఎప్పుడు ప్రయాణంచేసినా, వెధవది, కిటికీ ప్రక్క సీటు చచ్చినా దొరకదు. కానీ ఈరోజెందుకో నా అదృష్టం బాగుంది.

స్నేహితుని పెళ్లికి బందరు వెళ్లవలసిన అవసరం కలిగింది. ప్రొద్దున్నే లేచి, ఆదరా బాదరా పనులన్నీ అవచేసుకొని బస్టాండుకు వెళ్లాను. కౌంటర్లో నిలబడి టిక్కెట్టు తీసుకొని. బస్సెక్కేసరికి నా కోసమే వున్నట్టుగా ఒక సీటు ఖాళీగా కనిపించింది. వెంటనే కిటికీప్రక్కగా బైఠాయించాను.

బస్సు కదలడానికి అయిదునిముషాల ముందుగా ఒకాయన వచ్చి నా ప్రక్కనే కూర్చున్నాడు.

"ముందుగా, ఈ కిటికీ ప్రక్కగా నేను కూర్చున్నాను మాష్టారూ! బస్సు కదలడానికి యింకా టైముందికదా అని క్రిందకు దిగాను. ఇంతలో మీరు వచ్చి కూర్చున్నట్టున్నారు.' సంభాషణ మొదలు పెట్టాడు.

కొంపదీసి యిప్పుడు నన్ను లేవమంటాడా అన్న భయం వేసింది. మరీ మర్యాదలేని మనిషిలా అనిపించాడు అత

గాడు, లేకపోతే "ఈ సీటు నాది" అని చెప్పడమేమిటి? అదే పరిస్థితులలో నే నుంటే, ప్రాణంపోయినా అవతలివాడితో అటువంటి విషయాలు మాట్లాడను. ఆత గాడికి మర్యాద తెలియకపోతే నాకు తెలి యదా? .... "లేచిపోదామా?" అను కున్నాను.

ఇంతలో అతనే, "ఇప్పుడు మిమ్మల్ని లేవమనడంలేదు మాస్టారూ! ఊరికే చెప్పాను." అనడంతో "బ్రతికానురా నాయనా!" అనుకుంటూ "థాంక్స్" అన్నాను.

విజయవాడ బస్టాండులోనుంచి బస్సు కదిలింది. ప్రొద్దున్నే, ఆరుగంటల సమయమేమో చల్లటిగాలి మొహానికి తగులుతోంది గాలివిసురుకు అప్పు డప్పుడూ వూపిరి పీల్చుకోవడం కష్ట మనిపించినా, హాయిగానే వుంది. రోడ్డు ప్రక్కగా వున్న పొలాలు, పరుగెత్తే గేదెలు, వాటి వెనుక పేడకోసం ఊరుకు పరుగుతో కుర్రవాళ్ళు, ప్రొద్దున్నే పొలా లకు పోతున్న రైతులు—చూసి, చూసి విసుగెత్తింది.

బస్సులోని జనంవేపు దృష్టి మళ్ళించి అందర్నీ పరిశీలించి చూడసాగాను. నా ప్రక్కగా కూర్చున్న పెద్దమనిషి చూడ టానికి దర్జాగా వున్నాడు. పంచె, లాల్చి, పైన జరీ కండువా.... నున్నగా, ఒత్తుగా జుట్టు; అరడుగుల పొడుగు; పొడుగుకు తగ్గ లావు.... ముక్కుమాత్రం ఎందుకో కొంచెం వంకర తిరిగింది. ఇందాకటిలా, బస్సులో "ఇది నా సీటు, అది నా సీటు" అని గొడవచేస్తే, ఎవడో ముక్కుమీద లాగి తన్నుంటాడనుకున్నాను.

వెనకవేపు సీట్లలో గ్లాస్కో లాల్చీలు, బుష్‌కోట్లు, వంటికి గట్టిగా పట్టుకుపోయిన పొడుగు లాగూలు వున్నాయి. అటువేపు సీట్లలో ఖద్దరు కుంకుమలు, తిలకాలు, చంద్రవంక బొట్లు; కంచి పట్టుచీరలు, బనారసు చీరలు, వాయిల్సు కూర్చు న్నాయి. అలా అందర్నీ చూస్తున్న నా కళ్ళు ఇద్దరు ఆడవాళ్ళమీద ఆగిపోయాయి.

వాళ్ళిద్దరూ అక్కాచెల్లెళ్ళో లేకపోతే స్నేహితురాళ్ళో తెలియదుగానీ వేషాలు మాత్రం ఒక్కలా వున్నాయి. పెదాలకు రంగు వేశారు. బొడ్డుక్రిందకు చీర, ఉల్లి పొర జాకెట్టు, అందులోనుంచి అతి స్పష్టంగా కనిపిస్తున్న బాడీ....అందం గానే కనుపిస్తున్నారు. సహజమైన అందం పెద్దగా లేకపోయినా, కట్టూ బొట్టూ తీరునుబట్టి ఆకర్షణీయంగా కనిపించొచ్చు అన్నదానికి వీళ్ళిద్దర్నీ ప్రతీకగా చూపిం చొచ్చు

వాళ్ళిద్దరూ ఏవిటో తెగ మాట్లాడు కుంటున్నారు. వాక్యం మొదలుపెట్టే టప్పుడూ ఆఖరు చేసేటప్పుడూ వొళ్ళంతా వూపుకుంటూ తెగ నవ్వుతున్నారు.

"వీళ్ళు ఎటువంటి మనుష్యులు?.... ఆడదానికి అంత విరగబాటా!" అను కున్నాను.

అప్రయత్నంగా అరుణ ఆకారం కనుపించింది. పెళ్ళయిన కొద్దినెలల్లోనే ఏడ్రాసిలా తయారయిన పెళ్ళాం గుర్తుకు రాగానే మనస్సంతా వికారంగా తయారయింది.

పెళ్ళి చూపులప్పుడు అందంగానే కనిపించింది అరుణ. కానీ యిప్పుడా నాజూకూ, అందమూ మచ్చుకైనా లేవు. ఇంకా ఏడి పెళ్ళయి రెండేళ్ళయింది. పిల్లా పీచు కలగకముందే యిలా తయారయిందే, యిద్దరు పిల్లల తర్వాత ఎలా వుంటుందో? ఇంతకీ నా అదృష్టం అలా ఏడ్చింది.

"ఈ ఆడవాళ్ళి క్కరూ ఏఁమి తింటారో! ఎంతసేపు అలా మాట్లాడినా అలుపన్నది లేదు వీళ్ళకు!"

సుశీల గుర్తుకొచ్చింది, ఈసారి.

యూనివర్సిటీలో చదువుతున్నప్పుడు నా క్లాసుమేటు సుశీల. అందంగా చలాకీగా వుండేది. చదువు అయిపోగానే ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకుందా మనుకున్నాను. గాఢంగా, అతి గాఢంగా ప్రేమించాను....కానీ, నా ప్రేమ సంగతి సుశీలకేనాడూ చెప్పలేదు. అసలు యూనివర్సిటీలో వున్న రెండు సంవత్సరాలలో ఎన్నిసార్లు మాట్లాడాను? ఒకరోజు వరండా మలుపు తిరుగుతున్నప్పుడు, అటువేపునుంచి వస్తున్న సుశీలను గుద్దబోయి. సిలవొక్కుకొని 'సారీ' అన్నాను. అదే మొదటిసారి మాట్లాడటం; ఆఖరుసారికూడా అదే.

సుశీలతో పెళ్ళవనందుకు నేను విచారపడలేదు, మొదట్లో ఏదో అజ్ఞానంలో పడి అలా అనుకున్నాను కానీ, అసలు అటువంటి అమ్మాయిలతో ఎటువంటి సంబంధమూ పెట్టుకోకూడదు. అందరి మొగాళ్ళతోనూ పూసుకు తిరగడం, వుంటుంటే స్టేజెక్కి పాటలుపాడడం.... ఛ ఛ

ఇప్పుడేం చేస్తోందో? .. ఏముంది, ఎవడ్నో పెళ్ళిచేసుకొని వాడి చెవులు పట్టుకొని ఆడిస్తూ, తనుమాత్రం జాలాయి పోకిన్న పోతూవుంటుంది. ఎంతైనా, నేను అదృష్టవంతుణ్ని.

'ఏముంది మాస్తారూ! పేపరు కొంచెం యిస్తారా?' అంటూనే నా చేతిలోని పేపరు తీసుకొని, అటువేపున్న ఆడవాళ్ల కందించాడు, ప్రక్కనున్న పెద్దమనిషి. ఇద్దరిలోనూ కొంచెం చిన్నదిగా కనిపిస్తున్న అమ్మాయి నవ్వుతూ పెదాలు కదిపింది.

బహుశా 'థాంక్స్' అనుంటుంది. వెధవ బస్సు....వెధవ రొద. వినపడి చావలేదు. కంఠస్వరం ఎలా వుందో?

నేను కొన్న పేపరు వాళ్ళ చేతులలో నలిగిపోతుంటే కళ్ళప్పగించి చూస్తున్నాను. వాళ్లు ఏదో ప్రకటన చూస్తున్నారు. అందులో ఒకమ్మాయి తొడలపైకివున్న గౌను తొడుక్కొని, చేతిలో పౌడరు డబ్బా పుచ్చుకు నిలబడింది. ఆ ప్రక




ఉనలో అంత పరీక్షగా చూడవలసిన అంశమేమిటో నా కర్థం కాలేదు....కొంప దీసి అటువంటి గౌను వేసుకోవా లను కుంటున్నారా?....

అరుణ సెకండ్ ఫారం ఫేలయ్యా చదువు మానేసింది. తెలుగు చదవడం, రాయడం వచ్చినా చేత్తో ఓ పుస్తకం పట్టుకొని చదవగా నే నెప్పుడూ చూడ లేదు.

అవును. ఇంటి చాకిరీతో సతమత మయ్యే ఆడదానికి పేపర్లు, వారపత్రికలు, నవలలు చదవడానికి తీరికెక్కడుంటుంది? ఇదుగో, యిటువంటి మహాతల్లులే అటు వంటి పనులన్నీ చేసేది. ఇంటిపనంతా పనిమనిషిమీద పెట్టి, మొగుడు సంగతి పట్టించుకోకుండా, పుస్తకం పట్టుక కూర్చుంటారు.

వీళ్ళకూ, నా భార్యకూ సాపత్య మెక్కడ?....నల్లగా, మురికి పట్టిపోయి మసిగుడ్డలా వుంటే మాత్రమేం—చీర వొంటినిండా కప్పుకుంటుంది. పరాయి మొగాళ్ళకు, ఆఖరికి నాకుకూడా తన శరీరంలోని అరంగుళం మేరైనా కనిపించనీయదు. అదీ, అలా వుండాలి ఆడదంటే! .... కొంచెం జిడ్డోడుతూ, మురికిగావున్నా అరుణ సాక్షాత్తు లక్ష్మిలా వుంటుంది. అసలు, లక్ష్మీదేవిమాత్రం నీటుగా, గోటుగా వుంటుందన్న గ్యారంటీ ఏదీ?

పేపరు చదివేసి అందిచ్చారు. ప్రక్క—

తను అందుకొని చూడటం మొదలు పెట్టాడు.

ఈ అమ్మాయిలు సిగ్గూ, శరం లేకుండా మొగాళ్ళతో మాట్లాడ్తారేమిటి? ఇప్పుడు వీళ్ళు పేపరు చదవకపోతే కొంప మునిగిపోతుందా? పేపరు తీసు కొనేటప్పుడోసారీ ఇచ్చేటప్పుడొకసారి నవ్వుతూ 'థాంక్స్' అనడం. అసలు చదవాలని, పేపరు తీసుకోరు యిటువంటి వాళ్లు ఏదో మిషతో మొగాళ్ళతో మాట్లా డాలని బాధ.

చదివిన తర్వాత ముందు పేపరు నా కందించబోయారు. చూడనట్టుగా తల తిప్పుతుంటే, అప్పుడు ప్రక్కతను అందుకున్నాడు. లేకపోతే, ఛండాలం.... యిటువంటి షోకిల్లాంతో మాట్లాడడ మేమిటి!

ఆడవాళ్ళంటే ఎలా వుండాలి!

మళ్ళీ, అరుణ ఆకారం ఎదురుగా నిల బడింది బంధువులుగానీ, నా స్నేహితులు గానీ యింటికివస్తే ఎప్పుడూ బైటకు రాదు. పడకగదిలో ముసుగుతన్ని పడు కుంటుంది. పొరపాటున యింటికొచ్చిన వాళ్ళ కళ్ళ పడవలసివస్తుందనే భయంతో వంటింట్లోకెళ్ళి కాఫీకూడా తయారు చేయదు.... అదీ, మనిషంటే!

ఎంతైనా నేను అదృష్టవంతుడ్ని. భగవంతుడు దయతల్చి అరుణలాంటి పెళ్లాన్నిచ్చి, యిటువంటి పోరంబోకు ఆడవాళ్ళనుండి నన్ను రక్షించాడు.

"ఏమండీ! మీరూ బందరుదాకా వస్తు న్నారా." ప్రక్కతను అడిగిన ప్రశ్నకు అవునన్నట్టుగా తలాడించాను.

"నేను యింతవరకూ బందరు వెళ్ళ లేదండి. మా మేనత్తకూతురి పెళ్లికి బయల్దేరవలసి వచ్చింది ఇంతకీ పంపుల చెరువు ఎక్కడో మీకు తెలుసా?"

"పంపులచెరువు దగ్గర ఎవరింటికి వెళ్లాలి మీరు?" అన్నాను కుతూహలంగా. నా స్నేహితుడు సూర్యనారాయణ పెళ్లి కూడా అక్కడే.

అతగాడు చెప్పిన వివరాలనుబట్టి, నేనూ, అతగాడూ ఒకటే పెళ్ళికి వెళు తున్నట్టుగా తెలిసి సంతోషపడ్డాను.

"అరె, యిందాకటినుండి చెప్పరేమి టండీ: నేనూ ఆ పెళ్లికే వెళ్తున్నాను. సూరిగాడూ, నేనూ చిన్నప్పటినుండి స్నేహితులం మావాడి బంధువులు కాబట్టి మీరూ నాకు కావల్సినవారే అంటూ కత్తు కలిపేశాను.

అతగాడి పేరు మాధవరావు. ఉద్యోగ రీత్యా బొంబాయిలో వుంటున్నాడట. అతగాడూ, నేనూ చాలా విషయాలు మాట్లాడుకొన్నాం. అపోల్లో వచ్చేను, బంగ్లాదేష్, ఇండో-సోవియట్ ట్రీటీ— అన్నివిషయాలు దొర్లిపోయాయి మా సంభాషణలో.

అదేం ఖర్మో, నా అభిప్రాయాలు, మాధవరావు అభిప్రాయాలు ఏ ఒక్క విషయంలోనూ కలవలేదు. "అపోల్లో







పదిహేను వైజ్ఞానికంగా గొప్ప ఫీట్'' అతగాడంటే, డబ్బు దండగపని అని ఒక్క మాటలో కొట్టేశాను: ''బంగ్లా దేశ్ విషయంలో మన పాలసీ నాకు నచ్చలేదు.'' అని అంటే నాకు నచ్చిం దన్నాను. అలాగే అతడు ఇండో-సోవి యట్ ట్రీటీ విషయంలో ఆశావాదం వ్యక్త పరిస్తే. దాన్ని నేను ఖండించే శాను.

మా సంభాషణలో రెండు విషయాలు కనిపెట్టాను. ఒకటి — మాధవరావు వొట్టి పిరికివాడు. అతగాడి అభిప్రాయా లను నేను ఖండిస్తే నవ్వుతూ వూరు కుంటాడేగాని ప్రతివాదన చేయడు. అసలే నేను ఎం.ఎ. సైకాలజీ వాడిని; వెంటనే కనిపెట్టేశాను అతగాడిపిన్ని ఎరుపెంచుకొన్న భావాలని,

నేను కనిపెట్టిన రెండో విషయం— ఆ అమ్మాయిలిద్దరూ. కుతూహలంగా మావంకే చూస్తూ, మా సంభాషణ అంతా వింటూ మధ్య మధ్యలో నవ్వడం. నా అభిప్రాయాలు వాళ్ళకు నచ్చి వుండాలి: అందుకే మెచ్చుకోలుగా నవ్వారు.

వీళ్ళిద్దరికీ నామీద అంత కుతూహలం దేనికో? .... వీళ్ళది ఎటువంటి క్యారెక్టరు? ఇద్దరు మొగవాళ్లు మాట్లాడు కొంటుంటే వినడం ఏమిటి? పైగా మధ్య మధ్యలో నవ్వడం.

ఈసారి మా సంభాషణ ఆడవాళ్ళ వేషభాషల మీదకు మళ్లింది. ఆడవాళ్ళు గౌనులు వేసుకున్నా, లంగాలు కట్టినా లేక లుంగీలు కట్టినా తప్పులేదన్నాడు

మాధవరావు. నాకు కోపం, జాలీ రెండూ వచ్చాయి — యితగాడింత పిచ్చివాడేమి టబ్బా అని.

చీరకున్న అందం మరిదేనికుంది? ఆ మధ్య ఎప్పుడో, ఎక్కడో చదివాను— అమెరికన్ ఆడవాళ్లు చీరల మీద మోజు పడుతున్నారని. ఆ మాటంటే మాధవ రావు "దానిదేముంది? మనం గౌనుల మీద మోజు పడుతున్నట్టుగా, వాళ్ళు చీరలమీద మోజు పడుతున్నారు." అన్నాడు.

చీరలో వున్న అందం చూసి వాళ్ళూ మారిపోతున్నారని ఎంత చెప్పినా మాధవరావుకు సరిగ్గా అర్థంకాలేదు.

"మన దేశంలో ఆడవాళ్లు చెడిపోవ డానికి మగాళ్లే కారణమంటే. ఒళ్ళంతా కనిపించే చీరలు కట్టి, మొగాళ్ళను ఆకర్షించడమే పనిగా పెట్టుకున్నారు చాలమంది." అన్నాను.

నేను ఎవరిగురించి చెప్తున్నానో మాధవ రావుకు అర్థంకాలేదు.

కొంచెం క్రిందకు వంగి, మాధవ రావుకు మాత్రం వినిపించేటంత మెల్లిగా అన్నాను.

"ఇందాక నా పేపరు తీసుకు చదివారే, ఆ ఆడవాళ్ళ మీద మీ అభిప్రాయ మేమిటి?"

మాధవరావు కొంచెం యిబ్బందిగా కదులుతూ, "అందంగానే వున్నారు." అన్నాడు.

"అదికాదండి నేను అడిగేది? వాళ్ళ క్యారెక్టరు ఎటువంటిదై వుంటుంది?" అని ప్రశ్నించి వెంటనే సమాధానంకూడా చెప్పేశాను.

"చెడిపోయిన .... పిల్లదరూ, లేక పోతే పిల్లల మీదకు చీర, జాకెట్టుకూ చీరకూ మధ్య పదంగుళాలు బట్ట లేకుండా వదిలేయటం .... ఏమిటి? అదీకాకుండా, మీరు కనిపెట్టారో లేదో, వాళ్ళ వెంట మొగాళ్ళెవరూ లేరు ఇటువంటి వాళ్ళంతా ఒంటరిగా ప్రయాణాలు చేస్తూ వ్యాపారం సాగిస్తుంటారు. వీళ్లు ఖచ్చితంగా సంసార్లు మాత్రం కాదు."

ఎందుకో మాధవరావు నవ్వు తున్నాడు. దాంతో కొంచెం కోపం వచ్చి భారత [illegible] సంప్రదాయం అన్న విషయం మీద మాట్లాడటం మొదలు పెట్టాను.

నేను చెప్పేవన్నీ వులుకూ, పలుకూ లేకుండా విని, ఆఖరుకి "మాస్టారూ! మీ వయస్సెంత?" అన్నాడు మాధవ రావు.

"ముప్పై. ఉన్నట్టుండి ఎందుకంత సందేహం వచ్చింది?"

"అహా, మరేంలేదు. మీరు మాట్లాడు తుంటే మా తాతగారు గుర్తుకొస్తు న్నారు." అంటూ పెద్దగా నవ్వసాగాడు మాధవరావు.

దొంగగాడిదకొడుకు. నేను మాట్లాడు తుంటే వాళ్ళ తాత గుర్తుకొస్తున్నాడా వెధవకి? అంటే నేనంత [illegible]స్తంగా

మాటాడుతున్నాననా వాడి అభిప్రాయం?

కానీ, మాధవరావు నవ్వులో ఎక్కడా ఎగతాళి కనిపించలేదు నాకు. బహుశా, ఇంత చిన్న వయస్సులోనే మా తాతగారి కున్నంత అనుభవం వుంది మీకు' అని అతగాడి అభిప్రాయం అయివుంటుందని నచ్చ చెప్పుకున్నాను.

అయినా, యిటువంటి వెధవలతో మాట్లాడకుండా వుంటే మంచిది.

"దిగండి, దిగండి మాస్టారు! బందరు వచ్చేసింది." మాధవరావు కేకతో, చేతి సంచీ పుచ్చుకు దిగాను. ఎదురుగా కని పిస్తున్న రిక్షావాడితో యిద్దరు మనుష్యు లకు ఎంత తీసుకుంటావంటూ బేరం సాగించాను.

"ఆగండాగండి మాస్టారూ! ఒక రిక్షా సరిపోదు. రెండు కావాలి." అంటూ వచ్చాడు మాధవరావు. అతగాడి వెనకాల ఆ యిద్దరు ఆడవాళ్లు నిలబడి వున్నారు.

"ఇదిగో మా ఆవిడ. పేరు అనూ రాధ. ఈ అమ్మాయి నా చెల్లెలు శ్యామల."

"నమస్తే" అంటూ చేతులు జోడిం చిన వాళ్లిద్దరినీ చూసి విభ్రాంత పోయాను. నోటివెంట మాట రాలేదు. అలాగే కళ్ళప్పగించి చూస్తున్నాను. తిరిగి నమస్కారం పెట్టాలన్న యింగితజ్ఞానం కూడా బుర్రలోంచి ఎగిరి పోయింది ఆ క్షణంలో.

"పదండి. బయల్దేరుదాం" అంటూనే "ఇంకో రిక్షానుకూడా పిలవరా, అబ్బీ." అంటూ రిక్షావాడిని పురమాయించాడు మాధవరావు.

అతగాడితో కలిసి ఒకే రిక్షాలో వెళ్ళడం ఎలాగో తెలియలేదు. బస్సులో దరిదాపుగా అరగంట అతగాడి పెళ్లాం గురించి, చెల్లెలి గురించి పిచ్చివాగుడు వాగాను....తీరా, కలిసి వెళ్లిన తర్వాత, ఏదో నెపంమీద పెళ్లిలో తంతాడేమో... మనిషి బలంగా వున్నాడు.

"ముందు మీరు వెళ్ళండి. నాకు బజారులో కొంచెం పనివుంది. అది చూసుకు వస్తాను." నోరు పెగుల్చుకు అన్నాను.

"ఏమన్నా ప్రెజంటేషన్ కొనాలా? అయితే సరే, వెళ్తున్నాం." అంటూ వెళ్లిపోయాడు.

ఈరోజుకు బ్రతికిపోయాను. వెంటనే తిరుగు బస్సులో బెజవాడ వెళ్లిపోవడం మంచి దనుకున్నాను. తర్వాత సూర్య నారాయణకు సర్ది చెప్పవచ్చు నను కుంటూ కదలడానికి సిద్ధంగా వున్న బస్సెక్కాను.






నేను గదిలోకి వెళ్లాను. గదిలోనుంచి పారిపోవాలనిపించింది. బడిలోనుంచి పారిపోవాలనిపించింది. ఎక్కడికి? ఎవ్వరూ కనిపించనిచోటుకి, ఎవ్వరికీ కనపడని చోటికి పారిపోవాలనిపించింది. మా అమ్మే వుంటే ఆమెను కావిలించుకుని యేడ్చేవాణ్ణి. మొన్న వాళ్ళబ్బాయికి ఏడుపువస్తే వాళ్ళ అమ్మ ఒళ్ళోకి తలదూర్చి. చీరె తడిసేదాకా యేడవలా? అట్లా ఏడ్చేవాణ్ణి. నాకు అమ్మలేదు. యెవరికి చెప్పుకొని ఏడ్వను?

అంతలో నాతో ఆ బళ్లో చదువుకునే పిల్లలు, రాముడూ, భీముడూ వచ్చారు. 'ఎందుకురా దొరగారు అడిగితే చెప్పలేదు' అన్నాడు రాముడు. 'దొరగారికే ఎదురు తిరిగావు. ఇక్కడనుంచి వెళ్ళగొడితే తిండిలేక మాడిచస్తావు' అన్నాడు భీముడు. 'పోలీసువాళ్ళు బొక్కలోకి

తోస్తారు ' అన్నాడు రాముడు.

నేను అట్లాగే నుంచున్నాను. నేను చేసినపని తప్పేనేమో! ఎందుకు చేశానో నాకే తెలియదు. దొరగారు అడిగిందానికి జవాబు చెపితే ఏంపోయింది! ఎన్నిసార్లు వారు అడగలేదు! ఎన్నిసార్లు నేను చెప్ప లేదు, కాని ఈసారి నాకెందుకో జవాబు చెప్ప బుద్ధిపుట్టలేదు. దొరగారికి కోపం వచ్చిందంటే వస్తుంది మరి!

జరిగిన సంగతంతా ఒక్కసారి జ్ఞాప కానికి వచ్చింది నాకు. ఆపుకుందామను కున్నా ఆగకుండా కళ్లవెంట నీళ్ళు కారు తున్నాయి. ఈ లోకంలో అనేకమంది పిల్లలున్నారు. వాళ్ళకు లేని కష్టం నాకెందుకు వచ్చింది! ఈ బళ్లో నాకుమల్లే తల్లీతండ్రీ లేనివాళ్ళు అనేకమంది చదువుకుంటున్నారు. వాళ్లెవ్వరూ నాకు మల్లే యాతనపడుతున్నవాళ్ళు లేరు. వాళ్లు నవ్వుతూ కేకలు పెడుతూ ఆడుకుంటూనే వుంటారు. నాకు మాత్రం ఆడుకో బుద్ధి అవదు, వాళ్ళతో కలిసివుండ బుద్ధిఅవదు కూడాను.

నేను ఒక పల్లెటూళ్లో పుట్టాను. అమ్మా, అయ్యా తప్ప నాకు తెలిసినంత వరకు, మాకు చుట్టాలెవ్వరూ ఆ వూళ్ళో లేరు. మా అయ్య ఎక్కడినుంచో బతక టానికి ఆ ఊరు వచ్చాడట. మా అయ్య కూలిచేసుకుంటూ వుండేవాడు. ఎక్కువగా రాళ్ళుకొట్టే పనికి వెళ్ళేవాడు. ఆ రాళ్ళు కొట్టే పనిమీద ఒక మేస్త్రీ వుండేవాడు.

ఆ మేస్త్రీ అప్పుడప్పుడూ మా ఇంటికి వచ్చిపోయేవాడు. ఆయనకు మా అమ్మ అంటే ఎక్కువ ఇష్టం. ఇల్లు జరగ నప్పుడు ఆయన డబ్బుకూడా యిస్తూ వుండేవాడు. ఆ మేస్త్రీ మా యింటికి రావటం మా అయ్యకు గిట్టేదికాదు.

ఒకరోజు ఆమేస్త్రీ ఆయన మా ఇంటికి వచ్చాడు. మా అమ్మా ఆయనా చాలాసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నారు. అవ్వాళ ఏం జరిగిందో ఏమో, మా అమ్మ ఏడుస్తూ ఆయనకు ఏమేమో చెప్పింది. ఆయన మా అమ్మను ఓదార్చాడు. వెళ్లేటప్పుడు కొద్దిగా డబ్బిచ్చి వెళ్లాడు. ఆ రాత్రి ఎని మిది గంటలకు మా అయ్య ఇంటికి వచ్చాడు. అది మామూలే. అట్టావచ్చి అమ్మతో కజ్జాపెట్టుకుని కొడుతూవుండటం కూడా మామూలే

వచ్చీ రావటంతోనే, "వాడు వచ్చా డంటే ఇక్కడికి?" అని అడిగాడు.

అయ్య ఎవర్నిగురించి అడుగు తున్నాడో అమ్మకు తెలుసు. "వచ్చాడు" అంది అమ్మ.

"వాడితో ఏమేమి చెప్పావ్?" అని అడిగాడు అయ్య.

"చెప్పటానికి ఏముంది? నీకోసమే వచ్చాడు. నిన్నడిగాడు. లేదన్నాను, వెళ్లి పోయాడు" అంది అమ్మ.

"అబద్ధాలు ఆడతావటే నాతో? నిన్ను కట్టుకుంది వాడా, నేనా?" అని మీదపడి కొట్టా... అమ్మని గొంతుపట్టుకుని నులి



మాడు. అమ్మ కుక్కిమంచంమీద అట్లాగే ఒరిగింది. చూరులోవున్న కొడవలి లాక్కొని "ఇవ్వాళ వాడి పని తేలుస్తా" అని బయటకు వెళ్ళిపోయాడు ఆయన.

నేను అమ్మ మీద పడి ఏడ్చాను. "అమ్మా, అమ్మా" అని పిలిచాను. ఇంకెక్కడి అమ్మ? అమ్మ నన్ను విడిచి పెట్టి వెళ్ళిపోయింది.

నా ఏడుపులకు ఇంటి చుట్టుపక్కల వాళ్ళు పోగయ్యారు. అమ్మని చూశారు. అయ్యని నానా బండబూతులూ కూశారు.

తెల్లవారి మా ఇంటికి పోలీసులు వచ్చారు. మా అయ్య ఆరాత్రే మేస్త్రీని కూడా చంపి ఎక్కడికో పరారయిపోయాడని పొరుగువాళ్లు వాళ్లల్లో వాళ్లు చెప్పుకుంటే విన్నాను. మా యిల్లు సోదాచేసి పోలీసులు వెళ్ళిపోయారు నా సంగతి ఆలోచించినవాళ్లు లేరు నేనేం చెయ్యాలి? ఒక పొరుగమ్మ నన్నుచూచి జాలిపడి వాళ్ళయింటికి తీసుకువెళ్లి నాలుగు మెతుకులు పెట్టింది. నాలుగురోజులు ఆ అమ్మ ఇంట్లోనే తిని, అక్కడే పడుకున్నాను. నాలుగోరోజు సాయంకాలం ఊరికి మైలు దూరంలో వున్న బావిలో మా అయ్య శవం దొరికిందని తెలిసింది. కొందరు పెళ్ళాన్ని చంపి, మేస్త్రీని చంపి, పోలీ

సులకు భయపడి బావిలోపడి చచ్చిపోయా డని అన్నారు; మరికొంతమంది పోలీసులను చూచి పారిపోతుంటే వాళ్లే కాల్చి చంపి తమమీదకు రాకుండా బావిలో పడేశారని అన్నారు.

నన్ను చూచి జాలిపడిన ఆ అమ్మకు నేను తప్పనిసరి అయ్యాను. ఆ అమ్మకు అయిదుగురు సంతానం. అందులో ఒక పిల్లవాడికీ నాకూ పడేదికాదు. నన్ను ఎప్పుడూ ఏదో ఒకటి అంటూ వుండే వాడు. మా అమ్మనిగురించి నీచపుమాటలు అనేవాడు. కొద్దిరోజులు ఏమన్నా నేను మెదలకుండా వూరుకునేవాణ్ణి. కాని ఒక రోజు ఎదురుతిరిగాను. ఇద్దరం కొట్టు కున్నాం. వాకే ఎక్కువదెబ్బలు తగిలినై. వాడుమాత్రం ఏడుస్తూవెళ్ళి వాళ్ల అమ్మకు చెప్పుకున్నాడు. అమ్మకు కోపంవచ్చింది. "తేరగా తిని కొవ్వి కొడతావట్రా నా కొడుకుని" అని నన్ను చితకకొట్టింది. నేను యెవ్వరికో చెప్పుకోను? అతనికి అమ్మవుంది—చెప్పుకున్నాడు. వాళ్లమ్మ కొడుకుని కొట్టాననే కోపంకొద్దీ నన్ను చితకకొట్టింది. నేను ఎవరితో చెప్పు కోను? నాకు అమ్మలేదు.

నాకు ఆ ఇంట్లోనుంచి పారిపోవా లనిపించింది. రెండురోజులు కాలవ కట్టలూ, గుట్టలూ, చేలూ పట్టుకొని తిరి గాను. అయ్య పడి చచ్చిపోయిన బావి దగ్గరకు వెళ్లాను. బావి గట్టుమీద కూర్చు న్నాను. లోపలకు తొంగిచూశాను. భయం వేసింది. ఆ రాత్రి చీకటిపడి యింటికి వెళ్లాను.

గడపలోనే ఆ యమ్మ కనిపించింది. ఎముకలు విరిగినయ్యే అనుకున్నాను. కాని ఆయమ్మ ఏమీ జరగనట్టుగానే, "పాతకుండలో నీళ్ళు కాగివున్నాయి, తోడకుని పోసుకురా అన్నం తిందువు గాని" అంది.

నా చెవులను నేనే నమ్మలేనంత విచిత్రంగా ఆమెను చూశాను.

"అట్లా చూస్తావేం? వెళ్ళు!" అంది.

ఆరోజునుంచి ఆయమ్మ నన్ను ఒక్క మాట అనలేదు. మా పోట్లాటల్లో కొడుకునే మందలించేది కాని, నన్నేమీ అనేది కాదు. ఏమంటే ఏం చేసుకుంటానో— అని దుడుకుపడ్డట్టు వుంది. ఈ పాపానికి నేనెందుకు వడిగట్టాలి—అని అనుకున్న ట్టుంది. మరునాడు ఈ మాటలే పొరుగింటి ఆవిడతో చెపుతుంటే నేను విన్నాను. కోపం వచ్చినప్పుడు తడి తగిలించినా ఆయమ్మ మంచిదే. మంచిది కాకపోతే అసలు నావంటివాణ్ణి యెందుకు దగ్గరకు జేరుస్తుంది? ఊళ్ళో యెవ్వరికి పట్టింది తానెందుకు పట్టించుకుంటుంది?

కాని, నన్నేం చెయ్యాలా—అనే విషయం ఆమెను యెప్పుడూ పీడిస్తూనే వుండేది.

ఆయమ్మకు ఒక చుట్టం వుంది. ఆమె పట్టణంలో పంతులమ్మ పని చేస్తూవుంది. ఆవ్వాళ ఆమె వచ్చింది. ఆవిడా ఆయమ్మా




ఏం మాట్లాడుకున్నారో!

"రేపు పట్టణం వెళ్దాం వస్తావా, అబ్బాయి?" అని అడిగిందా పంతులమ్మ.

"వస్తాను" అన్నాను. ఎక్కడైతే నాకేం? ఇక్కడ నాకు వున్నదేమిటి; అక్కడ లేనిదేమిటి?

"అక్కడ బళ్లో జేరిపిస్తాను. చదువు కుందువుగాని" అన్నది.

తల్లీతండ్రీ లేనివాళ్ళకి-అంటే దిక్కు లేని వాళ్ళకి ఆ పట్టణంలో బడివుందనీ, వారు అక్కడే అన్నంపెట్టి చదువు చెపుతారనీ చెప్పింది. అయితే ముందు కొద్దిగా డబ్బు కట్టాలని చెప్పింది. ఒక ఏభై రూపాయిలు ఆ యమ్మ ఇస్తే, తర్వాత ఏభై రూపాయలు ఇచ్చి అబళ్ళో చేర్పిస్తానన్నది. తరువాత చదువుకున్నన్ని రోజులూ అన్నానికి బట్టకిగాని, చదువుకు గానీ ఏమీ కట్టవలసిన పనిలేదని, అన్నీ వాళ్ళే చూచుకుంటారనీ చెప్పింది.

ఎక్కడ తెచ్చిందో ఆ యమ్మ ఏభై రూపాయీలు తెచ్చి ఆమె చేతుల్లో పోసింది. మరునాడు మే మిద్దరం పట్ట ణానికి బయలుదేరాం. ఆ యమ్మకు, పాపం, నన్ను విడిచి పెట్టటం కష్టం అయింది. కళ్ళ వెంట నీళ్లు పెట్టుకుంది.

మేము ఆ రాత్రంతా రైల్లో ప్రయాణం చేశాము. తెల్లవారి పది గంటలకు పెద్ద స్టేషన్లో దిగాం. నేను అంతకు ముందు రైలు ప్రయాణం చేసినవాణ్ణికాదు. ఇంత పెద్ద భవంతి ఇంతమంది మనుష్యుల్ని

చూచినవాణ్ణి కాదు. నా కంతా గమ్మత్తుగా, గందరగోళంగా వుంది.

నన్ను తీసుకు వచ్చిన పంతులమ్మ గేట్లో వున్నాయనకు టిక్కెట్టు ఇచ్చింది. "ఇక్కడే నుంచో అబ్బాయ్, ఇప్పుడే వస్తాను" అని చెప్పి బయటకు వెళ్లింది. నేను అక్కడే నుంచున్నాను.

జనం తుకిడీగా తుకిలుగా వస్తుడీన్నారు, వెళ్తున్నారు. పక్కన మంచి మంచి బొమ్మలున్న బుక్కులు అమ్మే కొట్టు వుంది. ఎదురుగా వున్న రోడ్డుమీద కారులూ, ట్రాములూ గోల చేసుకుంటూ వెళుతున్నాయి. వాటిపేర్లు నాకు అప్పుడు తెలియవు తరువాత తరువాత తెలిసింది. అప్పుడు మాత్రం నా కళ్లను నేనే నమ్మలేకుండా చూస్తూ నుంచున్నాను. అట్లా ఎంతసేపు నుంచున్నానో ఏమో! గబుక్కున నన్నక్కడ నుంచోబెట్టి వెళ్లిన పంతులమ్మ జ్ఞాపకం వచ్చింది. ఆవిడ రాలేదు. ఎంతసేపు నిలబడి చూసినా రాలేదు. కడుపు కొర కొర మంటూవుంది. రైలెక్కింతర్వాత ఇంతవరకూ నోట్లోకి ఒక్క మెతుకయినా వెళ్లలేదు. ఆమె ఏదో కొనుక్కు తింది; నాకు మాత్రం పెట్టలేదు.

నాకు ఏడుపు వచ్చింది. బిగ్గరగా ఏడ్చాను. నా ఏడుపుకి నాకే సిగ్గువేసింది. కాని ఏడుపు ఆపలేక పోయాను. చుట్టుపక్కల నిలబడ్డ వాళ్లంతా నన్నేచూస్తూ నిలబడ్డారు. ఎవరన్నా దయతలచి పలకరిస్తారేమో అనుకున్నాను. ఎవ్వరూ పలకరించలేదు. కాసేపు నిలబడి చూసేవారు; ఎవ్వరి దారిన వాళ్లు వెళ్లేవారు. గేట్లోవుండి టికెట్టు తీసుకుంటున్న మనిషి. "పో ఇక్కడనుంచి" అని గదమాయించి రెక్కపట్టుకొని ఈడ్చుకు వెళ్లి, రోడ్డు మీదకు తోశాడు. ఎక్కడికి వెళ్లేటట్టు; ఎటు వెళ్లేటట్టు? రోడ్డెమ్మటే నెమ్మదిగా నడిచాను. పంతులమ్మ యెక్కడన్నా కనిపిస్తుందేమోనని అటూ ఇటూ చూస్తూ నడిచాను. ఇంతమందిని ఎ నాడూ చూసి వుండకపోవటం మూలాన, నా కళ్లకి మొగవాళ్లంతా ఒకే మాదిరిగాను, ఆడవాళ్లంతా ఒకే మాదిరిగాను కనుపించారు. రోడ్డుకి అవతల పక్క ఒక ఆడమనిషి కనుపించింది. పంతులమ్మ అనుకున్నాను. ఆ మనిషి చీదరించుకు, తిడుతూ నన్ను నెట్టివేసింది. "మురికిచచ్చినాడా, కళ్లు కనపట్టంలేదట్రా" అని చెంప పగిలేటట్టు కొట్టింది. ఆమె పంతులమ్మ కాదు. ఎవ్వరో! నా కళ్లు తిరిగినై. చెంపమీద చెయ్యి పెట్టుకొని గోడ జేరగిలబడి నిలబడ్డాను. ఆమె వెళ్లి పోయింది.

అప్పుడు నాకుతటింది. పంతులమ్మ మోసంచేసి వెళ్లిపోయిందని. నన్నెక్కడో జేర్పించి చదువు చెప్పిస్తానని చెప్పి ఆయమ్మ దగ్గర డబ్బు తీసుకొని, నన్ను విరగడ చేసుకొని వెళ్లి పోయింది. పంతులమ్మ ఎవ్వరో నాకు తెలియదు. యెక్కడవుంటుందో అసలే తెలియదు.




షం చెయ్యను? కళ్లు యెక్కడకు తీసుకు వెళితే అక్కడికి నడిచాను.

పొద్దుగూక వచ్చింది. పొద్దున్నుంచీ ఏంపుల్లో నీళ్లుతప్ప కడుపులోకి యేమీ వెళ్లలేదు. ఆకలి మండుతోవుంది. కళ్లు తిప్పుకొళ్లుయినై. పక్కనే ఒక అమ్మి అన్నంపొట్లాలు కట్టి అమ్ముతావుంది. పొట్లం అణా, యెక్కడిది? "బాబూ! ఆకలి, ఒకపైసా యివ్వండి" అని యిద్దరి ముగ్గురు పెద్ద మనుష్యులను అడిగాను, ఇవ్వలేదు. దగ్గరగా బస్సు ఆగింది. జనం త్రొక్కిసలాడుతూ యెక్కుతున్నారు. ఆ జనంలో యెవ్వరో ఒకరు యివ్వక పోతారా—అని అక్కడకు వెళ్లాను. ఒకరిద్దర్ని అడిగాను. అంటే అడుక్కు తినడం మొదలు పెట్టానన్నమాట! యెవ్వరూ దయతలచలేదు. నాకు దగ్గరలో బస్సు యెక్కటానికి ఒక పెద్ద మనిషి లాంకోటు వేసుకొని నిలబడి వున్నాడు. ఆయన లాంకోటు జేబులో నుంచి రూపాయి కాగితం పైకి కనుపిస్తా వుంది. ఏం చేస్తున్నానో తెలియకుండా ఆ జేబులోకి చెయ్యి పోనిచ్చాను. నన్ను పట్టుకున్నాడు. అక్కడ వున్న వాళ్లంతా తలోకదెబ్బ వేశారు—"దొంగ ముండా కొడకా!" అన్నారు. దగ్గరవున్న పోలీసుని పిలిచి అతడికి అప్పగించారు.

ఆ రాత్రి నేను పోలీస్ స్టేషన్‌లోనే వున్నాను. తెల్లవారి నన్ను గదిలోనుంచి బయటకు తీసి, పెద్ద పోలీసుదగ్గరకు

తీసుకు వచ్చి నిలబెట్టారు. అక్కడ ఒక దొర వున్నాడు. ఆ దొరకు కొద్దిగా తెలుగు వచ్చు.

"వీడేనా?" అని అడిగాడు.

"అవును, ఈ పిల్లవాడే" అని జవాబు చెప్పాడు పెద్ద పోలీసు.

నన్ను గురించి అంతకు ముందే మాట్లాడు కున్నట్లున్నారు. నన్ను తన బడికి తీసుకు వెళ్లాడు దొర.

ఆ బడి పట్టణానికిదూరంగా కొండల మధ్య వుంది. ఒక మైలు దూరంలో చిన్న వూరు వుంది. ఆ వూరునుంచి చదువుకోటానికి పిల్లలు వస్తుంటారు. నా వంటిపిల్లలు పదిమంది అక్కడే తిని అక్కడే చదువుకుంటూ వున్నారు.

ఆ బడికి నన్ను తీసుకొని వెళ్లిన దొరే పెద్ద. ఇంకా చిన్న దొరలు ముగ్గురున్నారు. వాళ్లంతా కలిసి ఈ బడిని నడుపుతున్నారు.

పెద్దదొర పట్టణాన్నుంచి గొప్పగొప్ప వాళ్ళందర్నీ తీసుకవచ్చి బడిని చూపిస్తూ వుండేవాడు. అప్పుడు దిక్కులేక అక్కడే తిని చదువుకుంటున్న మమ్మల్ని పిలిచి, మా సంగతులన్నీ చెప్పమనేవాడు. నేను మా అమ్మసంగతి చెప్పేటప్పుడు, "ఆమె చెడుగా జీవించేది లెంకి" అనేవాడు పెద్దదొర. నాకు మనస్సులో చాలా కష్టం వేసేది. కష్టం వేస్తే మాత్రం చేసే దేముంది? అట్లాగే నా సంగతంతా వారికి చెప్పేవాణ్ణి. "వీరే గనక నన్ను దయ తలచి తీసుకురాకపో దొంగతనాలు అలవాటై ఈపాటికి ఏ జైల్లోనే వుండేవాణ్ణి" అని చెప్పేవాణ్ణి. నేను బస్సు ఎక్కి ఆయన జేబులోనుంచి రూపాయికాగితం ఏ విధంగా దొంగిలించానో చెప్పేవరకూ దొర నన్ను విడిచిపెట్టేవాడు కాదు. మా సంగతులన్నీ చెప్పిన తరువాత "ఇటు వంటివాళ్ళ ప్రవర్తనను మార్చి మంచి వాళ్ళను చెయ్యటానికే ఈ బడి పెట్టాం. లేకపోతే వీళ్ళంతా దొంగలూ, తాగు బోతులూ, జూదర్లూ అయ్యేవారు" అని చెప్పేవాడు పెద్దదొర. గొప్పవాళ్ళంతా వాళ్ళకు తోచినట్లు చందాలిచ్చి వెళ్తుండే వాళ్ళు.

ఈ మాదిరిగా నా సంగతి చెప్పుకో వలసి వచ్చినప్పుడల్లా కష్టంవేసేది. "మా అమ్మ చెడ్డది, చెడుగా బతికేది" అని చెప్పవలసి వచ్చినప్పుడల్లా కళ్ళల్లో నీళ్ళు తిరిగేవి. నేను చేసిన దొంగతనాన్ని గురించి చెప్పవలసి వచ్చినప్పుడల్లా గొంతులో ఏదో పట్టుకున్నట్టు అయ్యేది.

కాని మా యాతన పెద్దదొర గుర్తించే వాడు కాదు. ఆయనకు మేము యెంత చెడు వాళ్ళమో, మా అమ్మలూ, అయ్యలూ యెంత చెడువాళ్ళో చెబితేగాని తృప్తిగా వుండేది కాదు. అట్లా చెబితేగాని తను యెంత మంచిపని చేస్తున్నదీ వచ్చిన గొప్పవాళ్లకి నచ్చదని ఆయన నమ్మకం. నిజమే కావచ్చు. కాని మా సంగతి మేము లెక్కలోనివాళ్లం కాము. మా

కంటే మమ్మల్ని బతికించడానికి పోగయ్యే చందాలు గొప్పవి ఆయనకి. ఏ గొప్పవాడు వచ్చినా, ఆ గొప్పవాని ముందు మేము మా సిగ్గును పరచవలసిందే. నేను 'మా అమ్మ చెడుది' అని చెప్పవలసిందే.

అలా చెప్పి ఆ రోజంతా ఏడుస్తూనే వుండేవాణ్ణి. వారం పదిరోజులు నిద్ర పట్టేది కాదు అన్నం సయించేది కాదు. కన్నుమూస్తే అమ్మ కనుపించేది. కళ్ళ వెంట నీళ్ళు కారుస్తూ యెదురుగా నిలబడేది. "నన్ను అమ్మకొని బ్రతుకుతున్నావా!" అని అడిగినట్లుండేది. అప్పుడు ఈ బతుకు బతికినదానికంటే చస్తే వచ్చే ఇబ్బంది ఏమిటి—అని అనిపించేది నాకు. బతకటానికి "మా అమ్మ చెడ్డది. చెడుజీవితం జీవించింది" అని చెప్పుకోటానికి జంకని నేను, పెద్దవాణ్ణయితే చెయ్యని పని అనేది యేముంటుంది. అట్లా దొర్లిపోయినయి రోజులు.

ఇవ్వాళ పొద్దున్న యెవ్వరో గొప్పవాళ్ళు వస్తారని తెలిసింది. బడంతా శుభ్రంచేశారు. పిల్లలందరూ స్నానంచేసి, ఉతికిన బట్టలు కట్టుకొని పదిగంటలకల్లా బడిహాల్లో హాజరు కావలసిందని చెప్పారు. ప్రతిరోజూ మేము స్నానంచేస్తే చేసేవాళ్ళం, లేకపోతే లేదు. మాకు రెండు జతల బట్టలు వుండేవి. ఒకటి కట్టుకొని ఒకటి ఉతుక్కుంటూ వుండేవాళ్ళం. చిరిగితే మేమే అతుకులువేసి కుట్టుకునేవాళ్ళం. ఎవ్వరో గొప్పవాళ్ళు బడిని చూట్టానికి వచ్చినప్పుడు తప్ప మా సంగతి ఎవ్వరూ పట్టించుకునేవాళ్ళు కారు. ఎవరైనా వచ్చినప్పుడు మాత్రం అంతా సందడే.

పదిగంటలకల్లా మేము హాల్లోకి చేరాం. మేము చేరిన కొద్దిసేపటికే దొరలూ, బడిని చూట్టానికి వచ్చిన గొప్పవాళ్ళూ వచ్చారు. వాళ్ళల్లో ఒక్క ఆడమనిషికూడా వుంది. బడి సంగతులూ, బడి దిక్కులేనివాళ్ళపట్ల చేస్తున్న పనీ చెప్పి మమ్మల్ని దగ్గరకు పిలిచాడు పెద్దదొర: నా కాళ్ళు వణికినై.

"వీళ్ళందరూ దిక్కులేనివాళ్ళు: చెడు జీవితాలకు అలవాటు పడ్డవాళ్ళు. తాము చేస్తున్న నేరాలకు వాళ్ళను పోలీసువాళ్ళు పట్టుకుంటే మేము తీసుకువచ్చి చదువు చెపుతున్నాం. వీళ్ళ జీవితాలు ఇప్పుడు పూర్తిగా మారిపోయినై. ఇక్కడ చేరక ముందు వాళ్ళజీవితాలు ఎట్లా వుండేవో వీళ్ళే చెపుతారు. వినండి' అన్నాడు పెద్దదొర.

గొప్పవాళ్లంతా చెవులు రిక్కించి వింటున్నారు. నేను ఆడమనిషివంక చూశాను. ఆమె చీరె సర్దుకొని కూచుంది—మా చెడుబతుకులు వింటానికి. ఒక్కొక్కరూ చెపుతున్నారు. మధ్యమధ్య 'అయ్యో' 'పాపం' అని అంటూవున్నారు గొప్పవాళ్ళు. నావంతు వచ్చింది.

"ఈ పిల్లవాడి బ్రతుకు మీరు వినదగింది. చెప్పు" అన్నాడు పెద్దదొర.

నేను మెదలకుండా నుంచున్నాను.

"చెప్పు అబ్బాయ్" అంది ఆడమనిషి.

"తన జీవితం తలచుకుంటేనే ఏడుపు వస్తున్నట్టుంది, పాపం .... చూశారా. ఎట్లా కళ్ళవెంట నీళ్ళు పెట్టుకుంటు న్నాడో?" అన్నారు ఒకరు

"ఈ పిల్లవాని తల్లి చెడ్డది. తండ్రి చెడ్డవాడు. బ్రతికినన్నాళ్లూ చెడుగా బ్రతికి చచ్చిపోయారు ఈ పిల్లవాడుకూడా తలి దండ్రులకు మల్లే చెడుగా బ్రతకటం మొదలుపెట్టాడు. మేము రక్షించి తీసు కున్నాం" అన్నాడు పెద్దదొర.

"పాపం" అన్నారు అంతా.

"చెప్పబ్బాయి నీ సంగతి" అంది ఆడమనిషి.

"నేను చెప్పను" అన్నాను.

"ఊ! చెప్పు" అన్నాడు పెద్దదొర.

"నేను చెప్పను" అన్నాను. వీళ్ళ అమ్మల సంగతి వీళ్ళ అయ్యల సంగతి వీళ్లెందుకు చెప్పుకోరు, అనుకున్నాను. చెప్పుకుంటే బాగుండును అనిపించింది. వినాలనిపించింది.

ఆ ఆడమనిషి నన్ను దగ్గరకుతీసి, "చెప్పు అబ్బాయి" అన్నది. నాకు ఆవిడ చేతులు చల్లగా తగిలినై మా అమ్మ జ్ఞాపకం వచ్చింది. ఇక అక్కడ నిలవ లేకపోయాను పెల్లుబికివస్తున్న ఏడుపును బిగపట్టుకొని గదిలోకి పరిగెత్తాను.

గదిలోకి వచ్చిన పిల్లలు వెళ్లిపోయారు. ఇక నేనే ఆ గదిలో ఉన్నది. పిల్లలు చెప్పినమాట నిజమే! ఇక పెద్దదొర నన్నీబడిలో వుండనివ్వడు. నేను బజారు కెక్కవలసిందే, ఎక్కుతాను. తప్పేది యేముంది! అడుక్కుతినవలసిందే. తింటాను. తప్పేది యేముంది? జేబులు కొట్టవలసిందే; కొడతాను. తప్పేది ఏముంది? అప్పుడు నాకు తెలిసివచ్చింది— మా అయ్యలో యేమన్నా చెడూ మా అమ్మలో ఏమన్నా చెడూ వుంటే దానికి కారణం యెవ్వరో! కారణం వీళ్లే— ఇటువంటివాళ్లే.



# రహస్యం

ముద్దాశెట్టి హనుమంతరావు



పద్మరాజు ఒంటరిగా గదిలో కూచుని దీర్ఘాలోచనలో పడ్డాడు.

బైట, కుండపోతగా వర్షం కురుస్తోంది చల్లగాలి రివ్వున వీస్తోంది.

తమ్ముడు పెళ్లి చేసుకుంటాననీ, ఒకటే పట్టుబడుతున్నాడు వాడి పట్టుదల యెలా సడలించడమో, అతనికి అర్థం కాలేదు.

పద్మలత గదిలో అప్పుడే అడుగు పెట్టింది.

"ఏమిటండీ అట్లా ఆలోచిస్తూ కూచున్నారు!" అనుకుంటూ భర్తకి దగ్గరగా వచ్చి, అతనికి అభిముఖంగా కుర్చీలో కూలబడింది.

"ఇంకేముంది ఆలోచించడానికి లతా? ఇప్పుడు మనల్ని యెదుర్కొన్న సమస్య మన రామం పెళ్ళి విషయమేగా! ఏం చెయ్యడమో నాకేం పాలుపోవడం లేదు" నిరుత్సాహంగా అన్నాడు పద్మరాజు!

"ఆ విషయంలో, వూరికే బుర్ర పాడుజేసుకుంటే, ప్రయోజనం యేమిటి చెప్పండి? పెద్దవాళ్ళుగా మనం చెబుతాం. వాళ్లు వినకపోతే, యేం చేస్తాం? వారి దురదృష్టానికి వాటిని వదిలేద్దాం."

"వాడు తెచ్చుకుంటున్న వెలజీతం, వాళ్ళిద్దరికీ సమృద్ధిగా చాలదు. అటు వంటిది, మరికొన్నాళ్ళకి వాళ్ళ కుటుంబం పెరిగితే, వాడు యెట్లా బ్రతుకుతాడా, అన్నది పెద్ద సమస్య. ఈ సమస్యను వాడు అర్థం చేసుకోవడం లేదు. మరో రెండేళ్లు గడిస్తే, వాడికి ప్రమోషను దొరికే అవకాశం వుంది. అప్పుడు పెళ్ళి చేసుకుంటే, సుఖంగా జీవించగల డేమో!"

"అవి మీరు ఆలోచిస్తున్నారు. అతడి మంచివి మీరు కాంక్షిస్తున్నారు. అయితే, ఆ ఆలోచన, ఆ భయం, అతనికి లేక పోతే, మీ తప్పేమిటి?"

"లోకం అలా అని వూరుకోరు లతా! 'పెద్దవాడు పద్మరాజు, అనాలోచితంగా తమ్ముడికి పెళ్ళి చేసేశాడు' అంటారు సమయం వస్తే." నిర్వేదంగా అన్నాడు పద్మరాజు.

"అటువంటప్పుడు, ఆలోచిస్తూ కూచుంటే, సమస్య పరిష్కార మవు తుందా? ఎప్పుడూ కాదు. ఏదో ఒకటి తేల్చేయండి" అంది పద్మలత, కాస్త విసురుగా.

పద్మలతకి, యిటువంటి నాన్పుడు వ్యవహారం నచ్చదు. ఏ విషయంలో నైనా అచ్చితంగా ఒక నిర్ణయానికి రావా లంటుంది.

సరిగ్గా అదే సమయంలో రామం, గొడుగు చేతబట్టుకొని, బైటికి పోతుం డటం గమనించింది పద్మలత.

"ఇదిగో రామం, ఓ మాట...." అంది, కాస్తంత గట్టిగా.

రామం గదిలోపలికి వచ్చాడు.

"ఇప్పుడెక్కడికి?" ప్రశ్నించింది పద్మలత.

"అర్జంటు పనిమీద వెడుతున్నాను వదినా!" అన్నాడు రామం.

"ఏమిటో ఆ అర్జంటు పని?"

"మా పెళ్ళికి మీరంతా అంగీకరించి నట్టు శారదకి ఉత్తరం రాశాను వదినా! దాన్ని పోస్టుచెయ్యాలని పోతున్నాను."

పద్మరాజు షాక్ తిన్నట్టుగా తమ్ముడి కేసి మౌనంగా చూసి, మళ్ళీ మొహం దించుకున్నాడు

పద్మలత సందిగ్ధంలో పడింది.

"అయితే, నీ పట్టుదల యింకా వదులుకోలేదన్నమాట!" అంది మెల్లగా.

"మళ్ళీ మొదటికే వస్తున్నావేమిటి వదినా! నా నిర్ణయం యెప్పుడో చెప్పే

మా మంత్రిగారికి ఈ నెలలో తీరికే లేదు! కరువు ప్రాంతాల్లో ముమ్మరంగా పర్యటించి ప్రజల్ని "ఓదార్చు తున్నారు" !!




కానుగా! అన్నయ్యకూడా అంగీకరించి వస్తే, 'సరే' నన్నాడు మరి!" అన్నాడు రామం.

పద్మరాజు మొహం అరుణకాంతుల్ని పుంజుకుంటూ వుండటం గమనించింది పద్మలత. లోలోన ఆమెకి భయం పుట్టింది, యేం జరుగుతుందోనని. పరిస్థితిని చక్కబెట్టాలని ఆమె మొదట్నుంచీ ప్రయత్నిస్తూనే వుంది.

"మరోసారి ఆలోచించు రామం! మీ అన్నయ్య నిస్సహాయ స్థితిలో 'ఊఁ' కొట్టారు. అయితేనేం—ఇంకా ఆలోచిస్తూనే వున్నారు, తర్వాత తర్వాత మన్వేం యిక్కట్లకు గురి అవుతామోనని. ఎందుకీ మొండి పట్టుదల చెప్పు...." అంది సౌమ్యంగానే.

పద్మలత ఆ మాటల్ని యెంత సౌమ్యంగా అన్నా, రామం మాత్రం వాటిని తేలిగ్గా తీసుకోలేకపోయాడు. అతనిలో అసహనం, అంచులు దాటింది.

"కేవలం నా మంచిని కోరి, యింత ఆలోచనల్లో పడుతున్నారంటే నేను నమ్మను. మీ ప్రమేయమేమీ లేకుండా, నాకు నచ్చిన పిల్లను పెళ్ళి చేసుకుంటున్నానని, మీకు ద్వేషంగా వుండొచ్చు. అందుకే, యీ విధంగా పన్నాగం పన్నుతున్నారు.... నా ఆఖరు నిర్ణయం చెబుతున్నాను వదినా! నా భవిష్యత్తు బాగోగుల గురించి మీరేం విచారించకండి.... నా మంచి నాకు తెలుసు...." అనేసి విసురుగా వెళ్ళిపోయాడు బైటికి.

పద్మలత నిర్విణ్ణురాలయ్యింది.

పద్మరాజు కోపంతో పళ్ళు పటపట కొరికాడు.

"రాస్కెల్! ఎంత పొగరు....పట్టు దల వాడికేనేవిఁటి? నాకూ వుంది. ఆ పెళ్లి యెట్లా జరుగుతుందో. నేనూ చూస్తాను...." అన్నాడు ఉక్రోషంతో.

పద్మలత ఆశ్చర్యంలోంచి తేరుకొంది. పరిస్థితిని స్వాంతం అర్థం చేసుకుంది. ఎంత అదుపులో పెట్టుకోవాలనుకున్నా, పరిస్థితులు కళ్లెంలేని గుఱ్ఱంలా పరు గెడుతూ వుంటే, ఆమెమాత్రం యేం చెయ్యగలదు?

"మీరు అనవసరంగా ఆవేశపడకండి. ఇప్పుడు మీరు యీ పెళ్ళి తప్పించా లనుకోండి....ఏదో విధమైన అపనింద వెయ్యక మానడు మీ తమ్ముడు. అతడి అర్జనకి ఆశించే, మనం యీ పెళ్లిని అపు తున్నామని అతడు ప్రచారం చేసినా, అందులో ఆశ్చర్యం లేదు. మీరిక మీ తమ్ముడి భవిష్యత్తును గురించి ఆలో చించడం మానేయడం మంచిది. బల వంతంగా యెవ్వర్నీ మార్చలేమన్న విష యాన్ని మర్చిపోకండి. ఆలోచించండి" అంది పద్మలత.

"సరే! వాడి ఖర్మ....అనుభవిస్తాడు, నాకేం?...." అనుకుంటూ చప్పున లేచి, ఆ గదిలోంచి వెళ్లిపోయాడు. మరో గదికేసి.

పద్మలత ఉస్సురనుకుని నిట్టూరుస్తూ, భర్తని అనుసరించింది.

రామం వివాహం, శారదతో జరిగి పోయింది. శారద, నలుగురిలో సంఘీ భావంతో, స్నేహభావంతో తిరగవల్సిన వ్యక్తికాదు. ఆమెలో 'నా' అన్న అహం అధికంగా వుంది గాబట్టి, తన ఆధిక్యత ప్రతిచోటా వుండాలని కోరే మనస్తత్వం ఆమెది. అందుకే తోడికోడలు పద్మ లతతో, యెక్కువరోజులు కలిసి మెలిసి వుండలేకపోయింది. వేరుకాపరం పెట్టా లని, భర్తను ప్రోద్బలపర్చింది.

రామం విస్తుపోయాడు. అయినా, భార్య వాదినాలుకకు భయపడి, యెదురు చెప్పలేకపోయాడు. బరువెక్కిన హృద యం విప్పి, అన్నయ్యా, వదినలతో ఓరోజు చెప్పాడు, తను వేరుకాపరం పెడుతున్నట్టు

పద్మరాజుకి చప్పున కోపం వచ్చింది. గాని, భార్య ఆనాడు అన్నమాటలు గుర్తు కొచ్చి, సంబాళించుకొన్నాడు.

పద్మలత ఆశ్చర్యపోలేదు. ఎందుకూ అంటే, యీరోజు యెప్పుడో వస్తుందని, శారద వచ్చిన కొద్దిరోజులకే ఆమె ఊహించింది. స్త్రీల మనస్తత్వం, స్త్రీలకే బాగా తెలుసు మరి!

"నీ ఇష్టంరా, రామం! నేను యే విషయంలోనూ ఆటంకపర్చను." ముక్త సరిగ అన్నాడు పద్మరాజు. లోలోన, మాత్రం, తమ్ముడు విడిపోతున్నందుకు.. యెంతగానో బాధపడ్డాడు.




ఇప్పుడు రామం, అదే వీధిలో ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకుని, వేరే కాపరం పెట్టాడు పద్మరాజు. తమ్ముడి సంసారానికి అవసరమైన సామాను ఏర్పాటుచేశాడు. ఏవిధంగానూ తాను కింద పడకూడదని, అతని అభిప్రాయం పాపం! తమ్ముడి సంసార జీవితం, సుఖమయంగా సాగాలని మనస్సులో కోరుకున్నాడు. అంతకంటె అతను యేం చేయగలడు?

శారద, సహజంగా ఆడంబరాలకు పోయే స్త్రీ. ఇరుగుపొరుగు స్త్రీలకంటె, తనకి పరిచయమున్న స్త్రీలకంటె, తాను ఆడంబరంగా అగుపించాలని. ఆధిక్యత గలదిగా వుండాలని ఆమె తాపత్రయం ప్రతి చేష్టలోనూ అగుపిస్తుంది. ఆ తాపత్రయంలో, ఆ ప్రయత్నంలో, ఆమె తాహతుకి మించిన ఖర్చులూ చేయాల్సి వస్తుండేది. అవి తప్పనిసరి అని ఆమెకి అనిపించేది. కాని, రామంకి ఆమె భావాలు యేమీ నచ్చేవికావు. అలాగని, ఆమెని వ్యతిరేకించే ధైర్యం లేకపోయింది అతనికి. దానికి కారణం, అతనికి భార్యపట్ల గల అనురాగమే అనొచ్చు. ఫలితంగా, రామం సంపాదిస్తున్న స్వల్ప జీతం, చాలా తక్కువనిపిస్తుండేది. ఒక్కొక్కప్పుడు రామంకి విసుగు పుడుతుండేది. భర్త విసుగు పుడుతున్నప్పుడంతా, శారద చిరునవ్వుతో అతన్ని మైమరపించేది.

"డబ్బు లేదని విసుగు పెంచుకుంటే యెట్లా చెప్పండి? ఇతరత్రా డబ్బు సంపాదించడానికి ప్రయత్నించాలి ..."

అంటూ రెండుమూడుసార్లు హెచ్చరించింది శారద.

శారద హెచ్చరిక, రామంలో అంతులేని ఆలోచనల్ని రేకెత్తించింది. డబ్బు సంపాదించడానికి తనేం చెయ్యాలి? తనలో తనే ప్రశ్నించుకున్నాడు. అతనికి ఒకే ఒక్క మార్గం కనిపించింది .. ప్రయివేట్లు చెప్పడం: తన ఆలోచనని భార్యతో చెప్పాడు. ఆమె ఎంతో సంతోషించింది. భర్త యెంతగా శ్రమపడాల్సి వస్తుందో, ఆమె ఆలోచించలేదు. అసలు, ఆ ఆలోచనే ఆమెకి లేదు. ఆమెకి కావల్సింది, కేవలం ఆమె ఆడంబరమే:

రామం, రెండు ట్యూషన్లు కుదుర్చుకున్నాడు. రాత్రి పదిగంటలకు గాని, ఇల్లు చేరుకోడు. అయినా, అతనికో తృప్తివుంది — తనకి అవసరమయ్యే డబ్బు సంపాదించగలుగుతున్నందుకు.

అవసరమైనంత విశ్రాంతి లేకపోతే, మనిషి ఆరోగ్యంగా ఎట్లా వుండగలడు? అదే జరిగింది రామం విషయంలో. పరిశ్రమ అధికమై, అతనికి ఆరోగ్యం దెబ్బతింది. మంచం పట్టేశాడు. మనిషి బల్లిలా అయిపోయాడు.

పద్మరాజు తమ్ముణ్ణి ఆ స్థితిలో చూసి, కంట తడిపెట్టుకున్నాడు తమ్ముడు ఎందుకు అట్లా అయిపోయాడో, తెలుసుకున్నాక, అతని హృదయం మరింత శోధించింది.

"రామం, నీకు డబ్బు అవసరమైతే, నన్ను అడగలేకపోయావురా? ఎప్పుడు నీకు కాదన్నానని? ఎందుకిలా రాత్రింబవళ్ళు శ్రమించి ఆరోగ్యం పాడు చేసుకున్నావు?" బాధపడుతూ అన్నాడు పద్మరాజు.

రామం జవాబు చెప్పలేదు. జవాబు చెప్పడానికేమీ లేదనిపించింది. దిగులుగా అన్నయ్యకేసి చూశాడు. అంతలో శారద అందుకుంది,

"ఇప్పుడేమైపోయిందని, అంత బాధపడిపోవడమండీ? మనుషులన్నాక, అనారోగ్యం రాకుండా వుంటుందా? మనమేం దేవతలమా? కష్టించడం ఎప్పుడూ తప్పు కాదండీ: ఒకర్ని యాచించడంకంటె, కష్టించడమే శ్రేయస్కరం...." అంది విసురుగా.

శారద మాటలు, చాలా వాడిగా పద్మరాజు గుండెల్లో గుచ్చుకున్నాయి. మరింకేమీ మాట్లాడలేదు. ఏం అనడానికీ, అది సమయం కాదనిపించింది.

"రామం: నువ్వేం అధైర్యపడకు. డాక్టరుతో నేను మాట్లాడతానులే: ఏ విషయాన్నీ మనస్సులో పెట్టుకుని దిగులు పడకు....వస్తా" అంటూ వెళ్ళిపోయాడు పద్మరాజు.

రామం, ఆలోచనల్లో పడ్డాడు. అనాడు అన్నయ్య, వదిన చెప్పినమాటలు చాలా విలువైనవని యిప్పుడు గ్రహించాడు. మనిషి విలువైనా, మాట విలువైనా, తరుణం మించిపోయాకనే గ్రహింపుకి,

వస్తుంది. నీరసంగా లోలోన నవ్వు కున్నాడు రామం. అయినా, తన దుర దృష్టాన్ని యెవరు చెరిపేయగలరు? తన అదృష్టమే బావుండి వుంటే, అప్పట్లో అన్నయ్య మాటల్నే వినేవాడు.... ఒకవేళ వినకపోయినా, శారదలాంటి భార్య దొరికి వుండేది కాదు. ..అనుకున్నాడు మళ్ళీ. తను యీ స్థితికి రావడానికి పూర్తిగ శారదే కారణమని, యిప్పుడు విశ్వ సిస్తున్నాడు.

డాక్టరు ఎంత మంచి మందులిస్తున్నా, రామం తేరుకోవడం లేదు సరిగదా, మరింత నీరసించిపోతున్నాడు క్రమంగా. అతనికి జీవితంమీద ఆశ పోయింది. ఆలోచనలే మిగిలాయి.

డాక్టరు పద్మరాజుతో చెప్పేశాడు. రామం మరి కోలుకోలేడని, అతడు గుండె జబ్బుతో తీసుకుంటున్నాడని, యెప్పుడో హఠాత్తుగ గుండె ఆగి పోతుందని.

పద్మరాజు హృదయభారంతో ఓ నిట్టూర్పు విడిచాడు. అతని కళ్ళు చెమ్మ గిల్లాయి. అతనికి తెలుసు, రామంకి గుండె బలహీనమని. అందుకే వివాహం చెయ్యడంలో జాప్యం చేశాడు. ఈ రహస్యం వాళ నాన్నగారు ఒక్క పద్మ రాజుకే చెప్పారు. ఆ రహస్యాన్ని పద్మ రాజు తన గుండెల్లో దాచుకున్నాడు. అర్థాంగి పద్మలతకు కూడా చెప్పలేదు. విధిమీద భారాన్ని వదిలేసి, ఒక ప్రేక్ష కుడిలా చూస్తున్నాడు అంతే!

ఓ రోజు రాత్రి పదిగంటలకి, శార దతో పోట్లాడుతూన్న రామం, హఠా త్తుగ గుండె ఆగి, వాలుకున్నాడు. శారద గొల్లుమన్నది. ప్రక్కింటాయన డాక్టర్ని తీసుకొచ్చాడు. డాక్టరు పెదవి విరిచి వెళ్ళి పోయాడు. శారద, భర్తను కళ్ళప్పగించి చూస్తూ యెంతోసేపు మౌనంగా వుండి పోయింది.

పద్మరాజు, పద్మలత వచ్చి రామం భౌతికదేహాన్ని చూసి, వలవల యేడ్చే శారు.

రామం చనిపోయాకకూడా, పద్మరాజు తన హృదయంలో దాచుకున్న రహ స్యాన్ని యెవరితోనూ చెప్పలేదు. చెప్పు దల్చుకోలేదు. చెప్పి, నలుగురి విమర్శ లకు గురి కాదల్చుకోలేదు. ఆ గుండెల్లోనే పదిలంగా ఉండిపోయింది, ఆ రహస్యం!



జనవరి నెల

# భావపరిచయ పోటీ



## బహుమతి పొందిన వ్యాఖ్యలు

కాళ్లు చేతులు త్రాళ్లతోఁ గట్టివైచి
రైలు మార్గంబు పైనుంచ రమణి యనిచె
నీవు నా వెన్కఁ వచ్చుట నిక్కమయ్య
చేరి స్వర్గాన పోరుకు సిద్ధపడుము.

కొండూరు శ్రీనివాసులు రెడ్డి. కవిగిరి.

ఇంట పోరుతోడ విసుగొంది కోపియై
భార్యఁ ద్రాళ్ళచేతఁ బందిచేసి
రాకపోకలేని రైలు మార్గంబుపై
వేయు పతినిఁ జూచి వెలది నవ్వె.

జి. సీతయ్య. [illegible]

# ఎక్కువ తక్కువ కులాలు

కొడవటిగంటి కుటుంబరావు

భార్య కాపరానికి రాగానే ముగ్గవేసి, పట్టీకొట్టి, సంపూర్ణంగా మారి మరొక మనిషి అయిపోయిన బాపతులో చేరాడు వెంకటేశ్వర్లు. బడితెలాగా వయస్సు వచ్చినతరవాతకూడా ఎక్కడో ఋష్యశృంగుడల్లే ఆడదాని మొహం ఎరగకుండా, ఆ సంభాషణ తెస్తేనే 'హరి హరీ!' అని చెవులు మూసుకున్న వెధవ అట్లాకాక ఏంచేస్తాడు లెమ్మనుకున్నారు స్నేహితులు. ఇంతవరకూ పెద్దవాళ్ల చెప్పుచేతలలో ఉంటూ, నలుగురిచేతా మంచివాడూ, బుద్ధిమంతుడూ అనిపించుకుంటూ వచ్చినవాడు ఇంతలో పెళ్లాం వలలో పడ్డాడే అని విచారించారు అయిన వాళ్ళు. అందులో వైపరీత్యం ఏమీలేదు. అట్లా కొంతకాలంపాటు ఉన్నతరువాత అదే సర్దుకుంటుంది లెమ్మన్నారు కొందరు విశాలహృదయులు.

మొత్తంమీద చూసేవాళ్లకు వెంకటేశ్వర్లులోని పరివర్తన ఏమీ బాగా కనిపించలేదు. తన ఒక్కడికే భార్య ఉన్నట్టూ, ఇతర పురుషులెవరూ భార్యాసుఖం ఎరగరేమో అన్నట్టూ ప్రవర్తించటం మొదలుపెట్టాడు వాడు. రాత్రీ పగలూ ఆ గదిలో కూర్చుని భార్యాభర్తలిద్దరూ అంతూ పొంతూ లేని రాచకార్యం మాట్లాడేవాళ్లు. అందులో ఆవగింజంత అయినా ఇంకొకరికి భాగం ఉండేదికాదు. భార్యాభర్త లన్నతరవాత మూడో మనిషికి సంబంధించని విషయాలుండటంలో వింతలేదు. కాని వాళ్లు మాట్లాడే ఏ విషయంలోనూ ఎవ్వరికీ సంబంధం ఉండకపోవటం వింతే.

లోకమంతా తనభార్యను హింసించటానికి అవకాశంకోసం నిరీక్షిస్తున్నట్టూ, తాను ఆవిడకు అంగరక్షగా ఉన్నట్టూ ప్రవర్తించేవాడు వెంకటేశ్వర్లు. వాడు తన భార్యనుగురించి ఎవరితోనూ చర్చించేవాడు కాడు. తాను భార్యవల్ల సుఖపడుతున్నా, కష్టపడుతున్నాకూడా తనదగ్గిర

వాళ్ళ సానుభూతి కోరవచ్చును. వెంక టేశ్వర్లుకు అటువంటి సానుభూతి అవసరం లేనట్టు కనిపించింది. తానూ తన భార్యా సంబంధించిన చోట తన తల్లి దండ్రులూ, తోబుట్టువులూ, స్నేహితులూ — అందరూ పరాయివాళ్ళే నన్నట్టుండేవాడు వాడు. 'నేను నా భార్యతో సుఖపడటం చూసి మీరెవరూ ఓర్చలేకుండా ఉన్నారని నాకు తెలుసులే!' అన్నట్టుండేది వాడి వాలకం. ఈ క్షణం భార్యతో పకపకలాడుతూనే ఉండేవాడు. మరుక్షణం ఆ గదిదాటి ఇవతలపడి అంతలో గంభీరంగా ఐపొయ్యే వాడు. వాడి వెధవ గాంభీర్యం చూడగానే అందరికీ ఆరికాలిమంట నెత్తికివచ్చేది.

"అమ్మా, దానికి ఆకలి అవుతున్నదట అన్నంపెట్టూ!"

"నాన్నా, నాకొక రూపాయి ఇయ్యి!"

ఈ విధంగా అనేవాడు వెంకటేశ్వర్లు.

"దానికి ఆకలి అవుతూవుంటె నాతో అది చెప్పదుట్రా?" అనేది తల్లి.

"నేను బజారికి పోతున్నాను, ఏం కావాలో చెప్పరా!" అనేవాడు తండ్రి. వాటికి సమాధానం ఉండేదికాదు.

దద్దమ్మ కనక వెంకటేశ్వర్లు భార్య మీది మోజువల్ల అయినవాళ్ళకు కాకుండా పొయ్యే ప్రయత్నం చేశాడు. కాని హైమవతి భర్తకోసం తనవాళ్ళను వదులుకోలేదు. ఆమె వారానికొకసారి పుట్టింటికి ఎడెనిమిది పేజీల ఉత్తరం రాసేది. తన సుఖపురోజులన్నీ పుట్టింటోనే వెళ్ళిపోయినట్టూ, వాటిని తలుచుకోవటం తప్ప తన జీవితానికి ఇక ఏమీ మిగిలిలేనట్టూ, భర్తతో చెప్పుకునేది. అందుకని వెంకటేశ్వర్లు పెళ్ళాన్నిచూసి చాలా జాలిపడేవాడు. భార్యకు తన ఇల్లు మళ్ళీ పుట్టిల్లంత సుఖంగా చెయ్యాలనీ, ఆమెకు గతం జ్ఞాపకం రాకుండా చెయ్యాలనీ చాలా ప్రయత్నం చేశాడు. తన ప్రయత్నం ఒక్కరవ్వయినా ఫలించకపోవటం చూసి వాడికి నిస్పృహ కలగలేదు — వెంకటి ప్రయత్నమే రెట్టింపైంది.

తన ప్రవర్తనా, తన భార్య ప్రవర్తనా ఎవ్వరూ మెచ్చుకోవటం లేదని వెంకటేశ్వర్లుకు నమ్మకంగా తెలిసినప్పుడు వాడు భార్యతో ఆ విషయం చెప్పిం. 'వీళ్ళు ఓర్చలేనివాళ్ళని నాకు తెలుసును. అందుకనే నేను మొదటినుంచీ వాళ్ళను లక్ష్యం చెయ్యటం లేదు!' అన్నాడు. వాళ్ళు ఆమోదించనిది తన నిర్లక్ష్యమేనని వాడి మట్టిబుర్రలోకి ఎక్కలేదు.

"ఏమైనా చెప్పండి. నాకు మీరైనట్టు మీవాళ్ళంతా ఎందుకవుతారు" అన్నది హైమవతి.

"అవును మరి!" అన్నాడు వెంకటేశ్వర్లు మనస్ఫూర్తిగా. తన భార్య తన్నుకూడా తన అ ప్తవర్గంలో చేర్చినందుకు తనకు గలిగిన ఆనందాన్ని వాడు భార్యకు ఏమాత్రమూ తెలియనివ్వ

లేదు!

ఇట్లా కొంతకాలం గడిచింది. వెంకటేశ్వర్లు తండ్రి చనిపోయాడు. ఆయన పోగానే తెర తొలగించినట్టయింది. ఆ పెద్ద ముండాకొడుకు బతికి ఉన్నంత కాలమూ గుంభనగావున్న వ్యవహారాలు చెరువు యెండితే చేపలు బయటపడినట్టు బయటపడినై. ఆస్తీ, అప్పూ ఇంచుమించు చెరిసగం అయినై. చూస్తూండగానే వసంతకాలం దాటిపోయి వడగాడ్పులు వచ్చినట్టు వెంకటేశ్వర్లు కాపరం సంపదనించి దారిద్ర్యానికి దిగింది.

హైమవతి మాత్రం దారిద్ర్యానికి తల ఒగ్గలేదు. ఆమె తన ఖర్చులేవీ తగ్గించుకో తలచలేదు. తన చీరలూ, తన నగలూ, తన కాఫీ, తన చిల్లర ఖర్చులూ—వీటికి ఏవిధమైన ఆటంకం వచ్చినా ఆమె వహించేటట్టు కనిపించలేదు. అంతటితో తీరుకున్నా బాగుండిపోను. ఆమె తన అత్తగారు అవలంబిస్తున్న జాగ్రత్తను చూసి ఎగతాళి చేసింది.

భార్య మూలాన వెంకటేశ్వర్లు తన దారిద్ర్యాన్ని చూసి సిగ్గుపడ్డాడు. వాడు తన దారిద్ర్యానికి గర్వించి ఉండవలసిందని నా భావం కాదు. కాని పట్టి పరిహాసాలకూ, శోకకూ దడిసి తొలిగిపొయ్యేది కాదు దారిద్ర్యం. హైమవతి తనకు దారిద్ర్యం లేనట్టు నటించినంతమాత్రం చేత లేకుండాపొయ్యేదికూడా కాదు.

దారిద్ర్యం తొలగిపొయ్యే సాధన చెప్పలేము. తానుమాత్రం దాన్ని గుర్తించటానికి నిరాకరించింది. దాని ఛాయాలేశం తనకంటు పట్టా విసుక్కున్నది. తన భర్తను దాన్ని గుర్తించనివ్వకుండా నైతిక బలంలేని వాణ్ణి చేసి కూర్చోపెట్టింది. వెంకటేశ్వర్లు ఎక్కడినుంచి తెస్తాడో ఎట్లా తెస్తాడో! తనకు ఇంత కాలమూ జరుగుతూ వచ్చినట్టు జరగటమే ఆమెకు కావలసినది.

ఈ ఏర్పాటుకు వెంకటేశ్వర్లు ఆమోదించాడు. "మా నాన్న జరపలేదా? నేనుమాత్రం ఎందుకు జరపరాదూ? ఇంకా ఇల్లూ, కాస్త పొలమూ ఉంది కదా!" అనుకున్నాడు వాడు. అదికూడా అయిపోయిన తరవాత అప్పుడే పడవచ్చును పడే దిగులంతా!

వెంకటేశ్వర్లు తల్లి ఈ ఏర్పాటు రుచించలేదు. తనకోడలు వందల రూపాయలనుగురించీ, యాభై రూపాయల ఉద్యోగాలనుగురించీ తేలిగ్గా మాట్లాడే మాటలు ఆమెకు దుస్సహంగా తోచినై. ఒక వందరూపాయలు అప్పుతేవటమన్నా యాభైరూపాయల ఉద్యోగంకోసం తన భర్త ప్రయత్నం చెయ్యటమన్నా ఆ పిల్ల మనస్సుకు అవి ఉండలేదు. ఏదో వంక పెట్టి తల్లి పెద్దకూతురి దగ్గిరికి వెళ్ళి, మళ్ళీ తిరిగిరాలేదు. అత్తగారి పొదుపుతనానికి ముచ్చటపడి అల్లుడు ఆవిడను వెళ్ళనివ్వలేదు.

వీరమ్మతల్లి వెంకటేశ్వర్లుగారి ఇంటో పాలూ, పెరుగూ పోస్తూండేది. ఎప్పు డైనా తల్లి రావటానికి వడవిరోజున వీరమ్మే తట్ట నెత్తిన పెట్టుకుని పాలూ, పెరుగూ తెస్తూండేది. వాళ్ళది బస్తీకి అరమైలు దూరంలో ఉన్న ఒక చిన్న పల్లెటూరు.

వీరమ్మకు వాళ్ళ ఊళ్ళోనే ఇచ్చారు. ఆపిల్ల అత్తవారి'కూడా పాడి ఉంది. తల్లి పాలు, పెరుగు అమ్మకం మాను కున్న తరవాత ఆపాడికలన్నీ కూతురు తీసుకుంది. ఆ కారణంచేత వీరమ్మ మళ్ళీ నాలుగు సంవత్సరాలకు తట్ట నెత్తిన పెట్టుకుని రాగానే ఆమె తల్లి వాడికవాళ్ళంతా వీరమ్మను గుర్తించారు. వయస్సు వచ్చిన తరవాత వీరమ్మ చాలా నిండుగా అందంగా తయా రయిందనుకున్నారు—ఒక్క వెంక టేశ్వర్లు తప్ప. వాడి కళ్లు పరస్త్రీని చూడటంమాని చాలా రోజులైంది. అటు వంటిది ఎప్పుడైనా ఉండికుంటే.

పాపం! వీరమ్మ మటుకు ఈసారి ఒక్క వెంకటేశ్వర్లునే చూసింది ఇంకె వర్నీ చూడలేదు. నాలగేళ్ళయిన తర వాత వాడు కనిపించగానే ఆ పిల్లకు నేత్రపర్వం అయినట్టయింది నాలుగు సంవత్సరాల క్రితం వాణ్ణి చూసినప్పుడు కలగని ఆనందం ఏదో కలిగింది వీరమ్మకు.

వీరమ్మ వెంకటేశ్వర్లను ప్రేమించిం దని చెప్పాలి. కావ్య భాషలో చెప్పవలసి వస్తే. కాని వీరమ్మ ప్రేమకూ, మనం సాధారణంగా ఊహించుకునే ప్రేమకూ ఏమీ సంబంధంలేదు. ఈ ప్రేమ వెంట విట్టూర్పులు విరహమూ లేవు. ఈ ప్రేమకు అర్థంలేదు. కారణం లేదు. అన్నిటికన్నా ముఖ్యమైన దేమంటే వీరమ్మకే తెలియదు. తను వెంకటేశ్వ ర్లును ప్రేమిస్తున్నట్టు. అది ప్రయత్న పూర్వకంగా వీరమ్మ తెచ్చి పెట్టుకున్నది గాదు. కొమ్మ చివరను పువ్వు ఎంత సహజంగా, నిరాడంబరంగా, నిశ్శబ్దంగా అంకురిస్తుందో, వీరమ్మ హృదయంలో ఆ ప్రేమ భావం అంత సహజంగానూ, అప్రయత్నంగానూ అంకురించింది. వెంకటేశ్వర్లు కోసం ఒక్క పూట భోజనం గాని ఒక్కగంట నిద్రగాని త్యాగం చెయ్యాలని వీరమ్మకు తట్టి ఉండదు.

తనలో కలిగినట్టయినా స్పష్టంగా తెలుసుకోలేని భావాన్ని దాచిపెట్టటానికి వీరమ్మ యెట్లా ప్రయత్నం చేస్తుంది కనకా? ఆ గొల్లపిల్ల తన భర్త వంక మెరిసేకళ్లతో చూడటం హైమవతి గమ నించింది.

"ఏమిటే అట్లా చూస్తావూ? ఆయన మొహాన కోతులాడుతున్నయ్యా" అని అడిగింది హైమవతి

వీరమ్మ నవ్వుతూ "ఏందండి అమ్మ గారూ!" అన్నది.

"అది మాయింట్లో పాలూ, పెరుగూ

పోస్తూ ఉండేదిలే!" అన్నాడు వెంకటే శ్వర్లు వీరమ్మ స్థితి ఏమాత్రమూ అర్థం చేసుకోకుండా. అతడి గొంతును పట్టి హైమవతి కొంత ధైర్యం తెచ్చుకుంది. కాని వీరమ్మను క్షమించలేక పోయింది. ఆనాటి మొదలు అవకాశం దొరికినప్పు డల్లా హైమవతి వీరమ్మను అమిత అగౌరవంగా చూసి, ఆ పిల్లతో అమిత పరుషంగా మాట్లాడేది. నాలుగు రోజుల్లో వీరమ్మకు హైమవతిమీద దురభిప్రాయం కలిగిపోయింది.



వీరమ్మ వాడిక ప్రారంభించి వారం కాగానే డబ్బులడిగింది. డబ్బులు లేవు. తరవాత చూతాంలే పొమ్మన్నది హైమ వతి.

"వారాని కొకసారయినా డబ్బు లివ్వండమ్మగారూ! మా అత్తమ్మ చంపుద్ది!" అని బతిమాలింది వీరమ్మ.

"చంపితే చావు!" అన్నది హైమ వతి నాజూకుగా.

ఈ ఏర్పాటు ప్రకారం నెలరోజులు గడిపింది హైమవతి. ఆలస్యంగా పాలు తెస్తున్నదని వంక పెట్టి హైమవతి డబ్బు విరగకోస్తానన్నది. వీరమ్మ నవ్వులకింద తీసుకుంది.

ఒకనాడు వెంకటేశ్వర్లు "పాలవాని కేమివ్వాలి?" అని భార్య నడిగితే హైమ వతి నగానికి నగం చెప్పింది. వీరమ్మ ఖర్గాంత పోయింది.

"మీరు డబ్బులు ఆలస్యంగా ఇచ్చి నాకు తిట్లు తగిలించింది గాక డబ్బు లిరగ్గోత్తానంటమ్మా. ఏం నాయమండీ!" అని సౌమ్యంగానే అన్నది వీరమ్మ

హైమవతి మాటలు తూలింది.

"మీరిచ్చే డబ్బులేమో ఇట్టా పారె య్యండి, దీనితోనే ఉట్టిగట్టుకూరేగు తామా ఇట్టాఅయితే మీ రింకో చోట పోయించుకోండి. నావల్ల కాదు. ఈ యమ్మగారితో యెవరేగుతారు బాబూ." అంది వీరమ్మ.

వెంకటేశ్వర్లు ఆనాడు తన నవవాగ

రిక భార్యకంటె ఎన్నోరెట్లు వింతైన ఆడదాన్ని చూశాడు. వీరమ్మ కోపంలో కూడా అందం ఉంది. హైమవతి ఆగ్రహం వికారంగా ఉంది. వీరమ్మ తన కెంతకోపం వచ్చిందో అంతే ప్రకటించింది, ముచ్చటగా. దానిముందు హైమవతి పెట్టిన "పోజు" పరమ అసహ్యంగా తోచింది వాడికి.

వెంకటేశ్వర్లు మాట్లాడకుండా వీరమ్మకు ఇవ్వవలసిన డబ్బంతా ఇచ్చి "పిచ్చికళలుపోక, మామూలు ప్రకారం పాలుపోస్తూ ఉండు!" అన్నాడు.

"ఏమిచ్చారూ?" కేక పెట్టింది హైమవతి పాలుకాస్తూ

"నువ్వు చెప్పినట్టే ఇచ్చాను" అన్నాడు వెంకటేశ్వర్లు.

"ఎక్కడికో వెళ్ళుతున్నట్టున్నారే!" అంది హైమవతి.

"కాఫీ హోటలుకు కాదు. ఇప్పుడే వస్తాను — కాఫీ అయేలోపల!" అంటూ వెంకటేశ్వర్లు తల వాకిలిదగ్గర వీరమ్మను కలుసుకున్నాడు.

"వీరమ్మా! నీకు అమ్మగారితో ఏం పని? కొత్త డబ్బులకు ఆలస్యం అవుతుంది. నీకు అభ్యంతరం లేకపోతే పాలుపోస్తూ ఉండు. అది ఏమన్నా అంటే వినిపించుకోకు" అన్నాడు.

"సరేలెండి అయ్యగారూ!" అంది వీరమ్మ. ఆపిల్ల వీధిమలుపు తిరిగేదాకా ఆమెవంకనే చూస్తూ నిలబడ్డాడు వెంకటేశ్వర్లు. వీరమ్మ ఈలోపల రెండుసార్లు వెనక్కు తిరిగిచూసింది.

మర్నాడు పాలు తెచ్చినప్పుడు వీరమ్మతో హైమవతి "ఏమే సిగ్గుమాలిన దానా, మళ్లా ఏమని వచ్చావు—రానని" అని అడిగింది. ఆమాట అడగటానికి అవకాశం దొరకగానే తన భార్య ఆ అవకాశాన్ని వెంటనే వినియోగపరుచుకోవటం వెంకటేశ్వర్లు గమనించాడు. వాడికి తన భార్యస్వరూపం అర్థం కావటానికి ఒక అనామకురాలు వీరమ్మ కావలిసి వచ్చింది!

వీరమ్మ ఆ తరవాత మళ్ళీ డబ్బులు అడగలేదు. బస్తీకి వచ్చేదారిలో ఇంకొక అరసోలెడు నీళ్లు కలపటంవల్ల అత్త బాధ తీరిపోయింది. ఆ తరవాత వెంకటేశ్వర్లు డబ్బులిచ్చినా ఫరవాలేదు. మానినా ఫరవాలేదు.

అప్పుడప్పుడూ కోడలి చేతికి కూరలిచ్చి పంపేది వీరమ్మ అత్త. అమ్ముకునిరమ్మని. "మా దొడ్లో కాసినవే తీసుకోండి!" అని వీరమ్మ ఆ కూరలు కాస్తా వెంకటేశ్వర్లుగారింట్లో పడేసిపొయ్యేది.

"ఏమి అనుగ్రహం!" అని ఎగతాళి చేసేది హైమవతి. కాని నిరాకరించేది కాదు. ఒక్కొక్కనాడు కూర లేకుండా భోజనం చెయ్యవలసిన పరిస్థితులుకూడా కలిగినై వారింట.

ఆ కూరలతాలూకు డబ్బులు వీరమ్మ ఎట్లా వసూలుచేసేదో వీరమ్మకే తెలియాలి.



"నువ్వు రేపటినించి రాకు. మళ్ళీ ఆదివారందాకా నేను ఊళ్లో ఉండను!" అని చెప్పింది హైమవతి వీరమ్మతో ఒకనాడు.

కాని వీరమ్మ మర్నాడువచ్చి "అయ్యగారూ, పాలు తీసుకోరూ?" అని అడిగింది. వెంకటేశ్వర్లు పాలుతీసుకుని అశ్రద్ధగా ఎక్కడో పెడితే పిల్లి తాగిపోయింది. ఒలకపోసినన్ని ఒలకపోసి.

ఆనాడల్లా వెంకటేశ్వర్లు మనస్సు వీరమ్మవైపు ఊగుతూ ఉండింది. వీరమ్మ మీద వాడికి ప్రేమ కలిగిందనటం అతిశయోక్తి అవుతుంది—ప్రేమ అనేదాన్ని వెంకటేశ్వర్లు నిర్వచించేవాన్నిబట్టి. కాని వీరమ్మ వాణ్ణి ఆకర్షించుతున్నది అది ఇప్పటిమట్టుకు కృతజ్ఞతా స్వరూపంలో వాడి హృదయాన్ని ఆవరించి ఉంది. వీరమ్మ, బ్రాహ్మణస్త్రీ—కనీసం నాగరిక స్త్రీ అయి ఉండకూడదూ? తక్కువకులం మనిషిని తాకితే స్పృశించటమే రోత! ప్రేమించటం ఎట్లా? మరి ఈ సంగతి వీరమ్మవైపు ఊగే తన మనస్సు ఎరగదా?

మర్నాడు వీరమ్మ వచ్చినప్పుడు ప్రాణాలన్నీ బిగబట్టుకుని వణుకుతున్న గొంతుతో "ఏమే, పిల్లా?" అన్నాడు. వీరమ్మ ఒక్కసారి అతనివైపు కళ్లెత్తి వేసి తన తట్టమీద గుడ్డ కప్పుకుంటున్నది.

ఇక వ్యవహారం తన చెయ్యి దాటిపోయింది. ఇప్పుడు తాను వెనకాడితే వీరమ్మ తన్ను పట్టి వాజమ్మకింద గణిస్తుంది. వెంకటేశ్వర్లు సాహసించి ఆ పిల్ల పక్కనే కూర్చుని ఆమెచుట్టూ చెయ్యి వేశాడు.

"ఊరుకోండి!" అంది వీరమ్మ. అంతే. అంతకంటే ఏమీ అనలేదు. ఏమంటుంది? ఆ మాటయినా వాణ్ణి వారిస్తూ అన్నమాట కాదు వాడి క్షేమంకోసమే హెచ్చరించుతూ అన్నమాట.

పాపం, వీరమ్మ వాణ్ణి ఎట్లా ఏవాశిస్తుంది? ఆమెకు వాడి సాన్నిధ్యంలో ఏతేమిటో తెలియదు: అతా భిమానం లేదు. లోకభయంకూడా లేదు. ప్రతి మనిషినీ అట్లా చెయ్యగల మనిషి ఇంకొకడు, లేక ఇంకొకతె ఉంటుందని మనం నమ్ముదాం. వీరమ్మ తనను తను వెంకటేశ్వర్లుకు ఎంత నిష్కల్మషమైన మనస్సుతో అర్పించుకుందో, వాడామెను అంత నిష్కల్మషంగా స్వీకరించలేదు. తను తప్పుచేస్తున్నాననే నమ్మకమూ, వీరమ్మను తాత్కాలికంగానన్నా హృదయ పూర్వకంగా ప్రేమించటం లేదనే నమ్మకమూ వాడికి ఏమూలో ఉండింది.

కాని పర్యవసానం—వాడి మనస్సు వీరమ్మద్వారా పొందలేని తృప్తి వాడి శరీరం పొందింది. వీరమ్మయొక్క ఆధిక్యత వాడి శరీరమైనా గుర్తించింది. తన్ను తను ఇచ్చేసుకునే వేప్పు హైమవతిదగ్గర లేదు సరి. కాని హైమవతి పాలుపోసి పెంచిన వెంకటేశ్వర్లు అంతరాత్మ ఒకంతట వీరమ్మపక్షం కావటం ఎట్లా?

ఇట్లా కొంతకాలం జరిగితే ఏమయి వుండేదో చెప్పలేం. హైమవతి ఊరికి వెళ్ళిన నాలుగోరోజే ఈ రంకుతనం బయటపడ్డది. ఆనాడు వీరమ్మ ఆడబిడ్డ వీరమ్మవెంట బస్తీకి వచ్చింది. ఆ ఆడబిడ్డను వాకిట్లో ఉండమని చెప్పి వీరమ్మ లోపలికి వచ్చింది. వెంకటేశ్వర్లు వీరమ్మ తట్టదింపి ఆమెను ఎంతో ఉత్సాహముతో దగ్గిరికి లాక్కుని తన రొమ్ముకు అదుము కున్నాడు—వీరమ్మ వాకిట్లోవున్న ఆడబిడ్డ సంగతి చెప్పేలోపల. అతను వీరమ్మను వదలిపెట్టే లోపల ఆ ఆడబిడ్డే లోపలికి చక్కావచ్చి చూడవలసింది కాస్తా చూసింది.

ఆ వెర్రిబాగుల మనిషి అక్కడే అరిచి అల్లరి చేసి ఉండకపోతే ఆ చుట్టు పక్కల ఇళ్ళవాళ్ళకీ, ఆ ద్వారా హైమవతికీ ఇదంతా తెలిసి ఉండకపోను!

ఇంతకూ లోకానికీ హైమవతికీన్నీ తెలిసిన తప్పల్లా వెంకటేశ్వర్లు వీరమ్మను కౌగలించుకున్నాడని. హైమవతి ఆకాస్త తప్పూ క్షమించ లేకపోయింది. తను తన భర్తకోసం నిర్మించి ఉంచిన ఆదర్శాలను వెంకటేశ్వర్లు అతిక్రమించాడు! ఎంత అతిక్రమించాడనే ప్రశ్నే లేదు.

ఇప్పటికి నాలుగు మాసాలు గడిచినై. హైమవతి గతాన్ని ఇప్పట్లో మరిచిపొయ్యే లక్షణాలు కనిపించవు.

పోతే వీరమ్మను ఆ కోపంమీద మామగారూ, అత్తగారూ, మొగుడూ అప్పటికి చావగొట్టినా ఆ తరవాత సులభంగానే క్షమించారు. వీరమ్మ సంసారం మామూలుకు భిన్నంలేకుండా వెళ్ళిపోతున్నది. జరిగిపోయిన దాన్ని తలచుకునే వాళ్ళెవరూ లేరు. ఆ తక్కువ కులంలో!




"ఏమిట్రా నువ్వంటున్నది, సుధీర్!"

కంగారుగా తలెత్తి చూచి అంది పద్మజారావ్!

తనకోసం డైనింగ్ టేబిల్ మీద మూత పెట్టబడివున్న గాజు ప్లేటు, తన దగ్గరగా జరుపుకుంటూ నింపాదిగా అన్నాడు సుధీర్. "రేపు కలెక్టరాఫీసు దగ్గర, సైన్యంలో చేరదల్చుకున్న యువకుల్ని రిక్రూట్ చేస్తారటమ్మా! నేను చేరుతాను!" మరోమారు అర్థమయ్యేలా తల్లికి చెప్పి, చేతిలో చెయ్యి వేసుకున్నాడు సుధీర్.

క్షణకాలం కొడుకు వేపు అయోమయంగా చూచింది పద్మజారావ్! అప్రయత్నంగా ఆమె భ్రుకుటి ముడి వడింది.. అప్పుడప్పుడూ ఇతగాడి కోసం వచ్చే శర్మ, జాన్....వాళ్ళ దుర్బోధ కాదుకదా ఇది? అన్న సంశయం ఆమె అంతరాంతరాల్లో మెరిసి మాయమైంది.

"నీకేమైనా మతి పోయిందా సుధీర్? అలాటి ఖర్మ నీకేంపట్టింది?"

సుధీర్ ఆశ్చర్యంగా తల్లివేపు చూశాడు. "అది ఖర్మా అమ్మా? ఖర్మా? ఇన్ని మహిళా మండలులు స్థాపించావ్? మరెన్నో సంస్థలకు ఆనరబుల్ సెక్రెటరీగా వున్నావ్! ఎంతో ఉత్తేజంగా ఎన్నో ఉపన్యాసాలిస్తావ్! ఎం.ఏ పాసైన నువ్వేనా ఇలా మాట్లాడుతున్నదీ." అత

గాడి ఎర్రని ముఖం చిరుకోపంతో మరి కాస్త ఎరుపును తిరటగం చూచి. లో లోపల మురిసి పోయింది పద్మజారావ్! "నా కొడుకు చాలా అందగాడు! అవును మరి నేనెంత అందంగాలేను ఈ వయసులో నైనా?" అందామె మనసు గర్వంగా....

"ఏమిటమ్మా పలకవు? మరి నా పేరెందుకు సుధీర్ అని పెట్టావు?" కోపంగా అరిచాడు సుధీర్.

పద్మజారావ్ ఫక్కున నవ్వింది....

"అసలు రణధీర్ అని పెడదామ న్నారు మీ నాన్నగారు .... నాలుగక్షరాల పేరు నాకిష్టంలేక పోయింది ...." ఆ విషయాన్నీ, ఆ వాతావరణాన్నీ, సహజంగా మార్చాలన్న ధోరణిలో నవ్వుతూనే వుంది ఆమె....

"ఇప్పుడు తమాషాలు కాదమ్మా! నేను రేపు వెళ్లి చేరతాను. తాటిచెట్టల్లే ఇంత పొడుగు పెరిగాను....నా మజిల్స్ చూడు ఎలా వున్నాయో .... తప్పక సెలెక్టు చేసుకుంటారు .... నాన్న గారు కూడా ఏమీ అనరు...." సుధీర్ ప్లేట్లో చెయ్యి కడుక్కుంటూ ధృఢంగా అన్నాడు....

పద్మజారావ్ తెల్లబోయింది. కొడుకు చాలా పట్టుదలగానే వున్నాడన్నది బోధపడింది....

అతగాడి వెనకాలే, బెడ్ రూంలోకి నడిచింది....బెడ్ మీద కూర్చున్నాడు సుధీర్. కుర్చీలో దగ్గరగా కూర్చుని మెల్లిగా అందామె.... "చూడు నాన్నా! వున్నది నువ్వొక్కడివినాకు.........మన ఆస్తి ఎంత వుందో నీకు తెలుసు కదూ? మీ నాన్నగారు ఫారిన్‌లో వున్నారు కదా?....ఆయన గారు రాగానే,. ఇక బిజినెస్ అంతా నీకు అప్పగించాలను కుంటున్నారు....నువ్వలా వెళ్లిపోతే....ఇదంతా మేమేం చేసుకోవాలి!" ఆమె కళ్ళల్లో నీళ్లు సుడులు తిరిగాయి....

సుధీర్ కలవర పడ్డాడు.... "అదేమిటమ్మా...." అతగాడి మాటలకు అడ్డొస్తూ అంది పద్మజారావ్ "....ఈ వయస్సులో నీ ఆవేశం ఇలాగే వుంటుంది. నాన్నా! కానీ వెళ్లిపోతున్న వయసులో మా ఆవేదన కాస్త అర్థం చేసుకో...."

"మరి దేశం....?"

ఆమె కన్నీళ్లు చప్పున తుడుచుకుంటూ నవ్వింది.... "....దేశం ఏమీ కాదు....దానికోసం చాలామంది వున్నారులే ...ప్రభుత్వాలు మారవచ్చు....మళ్ళీ సర్దుకోవచ్చు....కానీ ఒక్కసారి ఆస్తీ, అంతస్తూ పోగొట్టుకుంటే....తిరిగీ అవి సంపాదించుకోలేం నాన్నా! అవి వున్నంత వరకే మనం పది మందిలో గౌరవంగా బ్రతగ్గలం ...నా మాట విను... బిడ్డగా నిన్నేవిషయంలోనూ నొప్పించ లేదు ఇందాకా! ఈ విషయంలో నన్నూ మీ నాన్నగారినీ నొప్పించకు ...నీకంతగా ఓ

యువ




సారి అలాతిరిగి రావాలనుంటే, రేపే ఏదేనా "బోయింగ్" లో సీట్ రిజర్వ్ చేయించుకో....అలా అలా తిరిగిరా!"

పద్మజారావ్ లేచి తన గదిలోకి వచ్చేసింది....సుధీర్ మౌనంగా పడుకున్నాడు....

* *

"నీకిదేం పోడు బుద్ధిరా రఘూ! ఏదో ఆ బి.ఏ. కాస్త పూర్తయిందికదాని సంబర పడుతూంటే...." వెంకటరావు గర్జిస్తున్నాడు....

రఘు నేల చూపులు చూస్తున్నాడు....

"ఇప్పుడప్పుడే ఏ ఉద్యోగమూ వచ్చేలా లేదునాన్నా!" నసుగుతూ అన్నాడు....

"....అందుకని సైన్యంలో చేరి వస్తావా?"

"అపశకునపు మాటలూ! మీరూను," రంగంలోకి విశాలాక్షమ్మ రానే వచ్చింది.

"....చేరిన వాళ్ళంతా చావరు నాన్నా!"

"....చాల్లేవోయ్ అతితెలివి! రేపు నేనూ నీవెంట వస్తాను. ఆ ఎం ఎల్ ఏ రామారావుగారిని బ్రతిమాలి ఎక్కడో ఓ చోట టెంపరరీగా నైనా, గుమాస్తాగానైనా వేసుకుంటాను ...ఒట్టి గొడవ చెయ్యక ... మరో మాట అవకాశం ఇవ్వకుండా బయటికి వెళ్ళిపోయాడు వెంకటరావు..

"ఛీ ...ఓ దేశభక్తి లేదు....ఓ ధైర్యం లేదు....కాపిన బ్రతుకు...." పెద్దగా గొణుగుతున్న కొడుకువేపు వాత్సల్యంగా చూసింది విశాలాక్షమ్మ....

"ఆయనకు తిక్క కోపం .... అదే వర్ధుకుంటుంది.... అయినా మనకెందుకులే రా రఘూ! సైన్యాలూ వల్లకాడూను.... ఏదో గుమాస్తానో, టీచరో అయితే.... నాలుగు రాళ్లు తీసుకొస్తే....కాస్త మీ నాన్న రెక్క కడ్డు వస్తావు .... నీకు ఉద్యోగం వస్తే, వచ్చే ఏడాదైనా గిరిజ పెళ్లి చెయ్యాలి....దానికి పద్దెనిమిదేళ్లు నిండిపోతున్నాయి మరి!"

ఆమె వంట ఇంట్లోకి వెళ్లిపోయింది.

రఘు ఆ చిన్న గదిలో....అలాగే నిల్చుండి పోయాడు....

•  •

"నేను రేపు సైన్యంలో చేరి పోతా నమ్మా! తిండీ, బట్టా ఇచ్చి, మంచిమంచి జీతాలిస్తారట!" వీరాయి ఉత్సాహంగా చెప్పాడు.

చంద్రమ్మ కళ్లలో ఎంతో వెలుగు "నిజంగా నట్రా?" అంది....

"నిజంగానే! ఇప్పుడే ఆ ఆఫీసరు దగ్గరకి పోయి మాట్లాడొచ్చాను కూడా! వివరాలన్నీ చెప్పాడు .... రేపు చాలా మందిని తీసుకుంటారట .... వచ్చే నెల మంచి తంచనుగా జీతం వస్తుంది.... ఇక్కడికి పంపేస్తాను .... నువ్వు చీరె కొనుక్కో. గురవడికీ, నారిగాడికీ, శాయికీ, లక్ష్మికీ ఇంక ఒంటి నిండా బట్టలూ, కడుపునిండా తిండీ పెట్టు.... అక్కడ నాకు తిండీ బట్టా గడిచి పోతుంది! ఆఖరుకు దోమ తెరలూ, సెంట్లూ....చలికి తొడుక్కొనే కోట్లన్న మాట....ఇస్తారట కూడాను!" సంతోషంగా వీరాయి చెబుతుంటే చంద్రమ్మ మనసు ఆనందంతో తేలికై పోయింది క్షణకాలం. తన చుట్టూరా చిమ్మ చీకటి! రోజు మార్చి రోజు వస్తులు! రోశయ్య ఒక్కడి రెక్కల కష్టం! తనూ కూలి నాటికి వెళ్తోంది! అయినా కడుపులు నిండటం లేదు! నారిగాడికీ వద్నాలుగేళ్లు వస్తున్నాయో ఏమో! వాణ్ణి కూలికి పంపిస్తున్నారు! వాడు మొయ్యలేక, మొయ్యక లేక, నరాలు తెంచుకుంటూ బస్తాలు మోస్తుంటే .... తల్లిపేగు తెంపేసినట్టే అవుతోంది! ఒక్కరోజు కూలికి ఒక్కరు వెళ్లకుంటే....రెండో రోజు వస్తే! మరి మానెడు గింజలు రెండు రూపాయలు! పూటకు మానెడు చాలకపోయె!

అంతలోనే గుండెలు పిండివేసే ఆలోచన ఆమె ఎదలో ముల్లులా కదలాడింది.... "సైన్యంలో చేరితే....యుద్ధం వస్తే .... తన బిడ్డ !" ఆ మాటే మెల్లిగా అంది .... వీరాయి ఫక్కున నవ్వాడు.

"యుద్ధంలోగాక ఇక్కడ మాత్రం చావకూడదా ఏమిటే అమ్మా? వస్తులుండి చచ్చేకంటే....బతికిన నాలుగు రోజులూ నేను హాయిగా తిండి తింటాను....నీకూ, అయ్యకూ, తమ్ముళ్లకూ, చెల్లెలికీ ఇంత తిండి పెడతాను అలాటి మంచి చావు వస్తేమాత్రం ఏం!" నిర్లక్ష్యంగా గుడిసె



యువ

మా మంత్రిగారి వయసు 82 ఏళ్ళు - కూర్చుంటే లేవలేరు, లేస్తే కూచోలేరు లేపి, కూచోబెట్టడానికి ఒక సెక్రటరీ ఉన్నాడు!!



వెళ్ళిపోయాడు .... కొడుకన్న మాటలు రోశయ్యతో చెప్పింది చంద్రమ్మ .... రోశయ్య మీసం మెలేస్తూ గర్వంగా నవ్వాడు "ఆడు! ఆడు నా కొడుకే చంద్రీ! గుండె దెయిర్యం! అది వాడి....!" రాతిలావున్న తన ఛాతీమీద గర్వంగా చేత్తో చరుచుకున్నాడు రోశయ్య .... "అచ్చర లచ్చలు చేసే మాటన్నాడు నా బిడ్డ! మరివాడు ఏదో తరగతి దాకా సదువుకున్నాడాయె! తెలివి తేటా ఎట్టాగొచ్చిందో సూడు!"

చంద్రమ్మకు ఆనందమూ, దుఃఖమూ రెండూ కలిగాయి .... అణుచుకుంది....తెల్లారి లేచేసరికి ఆమెకు ఏ బాధా మిగల్లేదు. కారణం తన చుట్టుపక్కల గుడిసెల్లో చాలామంది వయసు కుర్రవాళ్లు, వీరాయితో బాటు సైన్యంలో చేరటానికి సిద్ధమై వెళ్తున్నారు. అందరికందరూ వీరాయిలానే మాట్లాడుతున్నారు....

* *

పదేళ్ళు గిర్రున తిరిగాయి....చరిత్ర పుటల్లోకూడా చిత్రవిచిత్రాలు దొర్లుతున్నాయి....

దేశం మారిపోయింది .... మనుషులు మారిపోయారు ... సామాన్యులు మరీ సామాన్యులుగా మారిపోతున్నారు .... గొప్పవాళ్లు మరీ గొప్పవాళ్లుగా మారిపోతున్నారు....మధ్యతరగతి కుటుంబాలు గానుగెద్దుల్లా .... ఒకే పరిధిలో గిరగిర తిరుగుతున్నాయి ...

సుధీర్ ఇప్పుడు బిజినెస్‌లో మెలకువ

అన్నీ తెలుసుకున్నాడు. తండ్రి ఇచ్చిన ఆస్తిని రెట్టింపుగా పెంచాడు....త్వరలో రాబోయే ఎలక్షన్స్‌లో సమితి ప్రెసిడెంటుగా పోటీ చేయబోతున్నాడు.... భార్య హేమతో ఈ మధ్యే కాశ్మీర్‌కు విలాసయాత్ర కూడా చేసివచ్చాడు. రావుగారూ, పద్మజారావ్ ...చాలా సఫలకూ, సమావేశాలకూ గౌరవాధ్యక్షులుగా...వక్తలుగా వెళ్తూ ...కాలం సరదాగానే వెళ్ళబుచ్చుతున్నారు .... ఆనాటి మూర్ఖపుపట్టు వదిలి సుధీర్ ఇలా హాయిగా వున్నందుకు వాళ్ళిద్దరూ ఆనందించని క్షణంలేదు. అప్పుడప్పుడూ, తనెలా సుధీర్ మనసు మార్చగలిగిందీ, గర్వంగా కోడలితో చెబుతూంటుంది పద్మజారావ్.

"వుయ్ ఆర్ ఎడ్యుకేటెడ్! అవర్ డ్యూటీ యీజ్ టు డైవర్ట్ దెమ్ టు ఎ గుడ్ పాత్.

అంటుంది నవ్వుతూ....

* *

రఘు ఎనిమిదేళ్లుగా యు.డి.సి. గా వున్నాడు .... భార్య మీనాక్షి స్కూల్ ఫైనల్ పాసై, టైప్ పరీక్షలు పాసైంది. ఇద్దరు పిల్లలు ..త్వరలో మీనాక్షికూడా ఎక్కడైనా టైపిస్ట్‌గా చేర్చితే తప్ప, గిరిజ పెళ్ళికైన అప్పు తీరేలా తోచటంలేదు తనగాడికి....సంసారమూ గడిచేలా కనిపించటం లేదు. ఇద్దరు తమ్ముళ్లు సరసగా చదువుకు ఎక్కివచ్చారు. మరో చెల్లాయి ఓణీలు వేస్తోందీ మధ్యే!

సుధీర్‌గారివో, పద్మజారావుగారివో, రావుగారివో. ..ప్రతిరోజూ...మనసు కరిగేలా విన్నవించుకునో....కావలిస్తే మరెవరికైనా....ఓ పదో, పరకో తినిపించో ...... ఎలాగో ఓలా తనకు ప్రమోషనూ, మీనాక్షికి ఉద్యోగమూ వచ్చేలా చూసుకోవాలన్నదే ఆతగాడికి రాత్రింబగళ్లు ఆలోచనై పోయింది.

వీరాయి చాలా మారిపోయాడు.... వీరారావుగా మారాడు. హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు, బెంగాలీ, కన్నడం, తమిళం... ఒకటేమిటి....ఎడెనిమిది భాషల్లో అనర్గళంగా మాట్లాడగలుగుతున్నాడు....మంచి మంచి పాంట్లు .... ఉలన్ స్వెట్టర్లు .... మంచి తిండి....ట్రాన్సిష్టరు....వాచీ.... దర్జాగావుంది తనగాడికి....శలవులకు ఇంటికి వచ్చేటప్పుడు చెల్లాయిలకూ, తమ్ముళ్లకూ, తలిదండ్రులకూ చాలా మిఠాయిలూ, బట్టలూ పట్టుకొస్తాడు .... ట్రాన్సిష్టర్ తెస్తాడు .... ఉలన్ స్వెట్టర్లు తెచ్చాడు. కప్పుకొనే రగ్గులు....బిస్కెట్ ప్యాకెట్లు ఒకటేమిటి? ఆతగాడొచ్చిన పదిరోజులూ అదో పండగగా గడిచిపోతుంది ఇంటిల్లిపాటికీ....గుడిసె పీకించి ఈ మధ్యే చిన్న పెంకుటిల్లు రెండు గదులతో వేయించాడు. తను పంపిన డబ్బుతో!

"నేనూ వీలానే సైన్యంలో చేరతాడా అన్నా!" అని నారిగాడు అంటే .... "అలాగేరా నారాయణా! మంచిదే. చేరుదూగాని!" అంటాడు నవ్వుతూ! ఆ నవ




యంలో అతగాడి అంతరాంతరాల్లో మాత్రం "నువ్వు నూరేళ్ళూ నిండుగా బ్రతకాలిరా నారాయణా!" అన్న నిట్టూర్పు రేగి చప్పున చల్లారిపోతుంది. రోశయ్య, చంద్రమ్మ .... కొడుకును చూచుకొనీ, తలుచుకొనీ గర్వపడని క్షణంలేదు.

"నా తండ్రి ఎక్కివచ్చాడు! మాకింక దిగుల్లేదు!" అనుకుంటారు ఇద్దరికిద్దరూ.

అందరూ నిద్రపోయాక అర్ధరాత్రిలో అలా ఆకాశంకేసి చూస్తుంటాడు వీరాయి ఒక్కొక్కసారి. ఆ సమయంలో అతగాడి మనసులో చిత్ర విచిత్రాలైన భావ పరంపరలు మొదలౌతాయి.

"నా వాళ్ళంతా హాయిగా వున్నారు! కడుపునిండా తిండీ, ఒంటినిండా బట్ట, కంటినిండా నిద్ర ఇవ్వగలిగాను. చాలు. నా తల్లి, తండ్రి....తోబుట్టువులకు నా ఋణం తీర్చుకుంటున్నాను. ఎదెంత హాయిగా వుంది! ఈ సంతోషం... ఈ సంతృప్తి ముందు మరణమన్నది ఎంత! చస్తేమాత్రం ఏం!"

ఆ సంతృప్తితో గుండెలమీద చెయ్యి వేసుకుని హాయిగా నిద్రపోతాడు మను

ఆరోజు శలవులకు ఇంటికొచ్చాడు వీరాయి. వచ్చిన మూడోరోజే కమాండర్ దగ్గర్నుంచి యుద్ధం ప్రారంభం కాబోతోందనీ .... ఉన్న పళాన సెంటర్‌కు రావలసిందనీ టెలిగ్రాం వచ్చింది.

దిగాలు పడిన చంద్రమ్మకు ధైర్యం చెప్పాడు. తండ్రికి కళ్ళతోనే వీడ్కోలు

చెప్పాడు. నవ్వుతూ (ట్రెయిన్ ఎక్కాడు. మరి తిరిగిరాలేదు!

యుద్ధం ముగిసింది....

చాలామంది మిలిట్రీ ఆఫీసర్లకూ, పైలట్లకూ, నౌకా దళాధిపతులకూ, బ్రతికివున్నవారికీ, చనిపోయినవారికీ ... వారు ప్రదర్శించిన ధైర్యసాహసాలకు గుర్తింపుగా మెడల్స్ అందజేయబడు తున్నాయి .... ఆ రోజంతా చనిపోయిన వీరజవానులకు శ్రద్ధాంజలి సమర్పించే సభలు దేశమంతటా జరుగుతున్నాయి.

ఆ సభలో....

సుధీర్ తనపేరుతో సైనిక కుటుంబాల సహాయార్థం విధి వసూలుచేస్తానని మొదటి విరాళంగా వెయ్యిరూపాయ లిస్తానని ప్రకటించాడు.

చాలారోజులుగా రఘు, వెంకటరావు ఇలాటి అవకాశంకోసమే కనిపెట్టుకుని వున్నారు. పెద్దపెద్దవాళ్ళంతా ఒకచోట చేరినపుడే తమ పనులు కాస్త వాళ్ళ చెవిని వేయటం, బౌననిపించుకోవటం మంచిదని ఇద్దరికీ వుంది.

"ఆరోజు నేను వద్దనబట్టి సరిపోయింది! లేకుంటే ఈనాడు నీగతి ఏమైవుండేది! ఈ సభలో నువ్వూ ఓ కీర్తిశేషుడిగా మిగిలిపోయేవు!" అన్నట్లు చూపులు విసురుతున్నాడు వెంకటరావు కొడుకువేపు అప్పుడప్పుడూ.

కండ, గుండె, ఏనాడో చచ్చిన రఘు "బౌనౌను" అన్నట్లు తలాడిస్తున్నాడు వుండి వుండి—జీవచ్ఛవంలా!

పద్మజారావు నిజంగానే చాలా అలసటగా వుంది! అధ్యక్షోపన్యాసం అయ్యేంత వరకూ....కుర్చీలో వెనక్కు తలవాల్చి రిలాక్స్ అవుతోంది!

విన్నంత ఆమె చాలా శ్రమపడింది! రోశయ్య, చంద్రమ్మల ఇంటికి స్వయంగా కారులో వెళ్లింది. ఇద్దరినీ చాలా వివరాలు అడిగింది. వీరాయి పుట్టిన తేదీకాదు కదా, సంవత్సరంకూడా వాళ్ళకి తెలీదన్నారు. ఉజ్జాయింపుగా తనే లెక్కకట్టుకుంది. వాళ్లిద్దరూ ఏడుస్తూ చనిపోయిన తమ కొడుకును వర్ణిస్తుంటే.... జాగ్రత్తగా అతగాడి ఆకారాన్ని మనసులో గుర్తుంచుకొంది, వీరాయి సెకెండు ఫారం వరకూ చదువుకున్నాడన్నది గుర్తుంచుకొంది... చంద్రమ్మ పేరు.... సైన్యంలో చేరటానికి వెళ్ళేముందు, ఆ తల్లీకొడుకుల సంభాషణా అంతా జాగ్రత్తగా ఏకసంధాగ్రాహిలా మనసులోనే నోట్ చేసుకుంది.

ఇంటికి వచ్చాక .... చరిత్రపుటల్లో మరుగుపడివున్న వీరమాతల పేర్లూ, మరికొన్ని పిట్టకథలూ అన్నీ క్రోడీకరించుకుంది.

రాత్రంతా కూర్చుని చాలా "ఎమోషనల్" అయిన స్పీచ్ తయారు చేసుకుంది. పాయింట్సు నోట్ చేసుకుంది. తెల్లారుఝామున ఓసారి మనసులోనే రిహార్సల్స్ వేసుకుంటుంటే, మెలకువ



యు వ

వచ్చిన రావుగారు ఆశ్చర్యంగా భార్యకేసి చూశారు.

"ఇంకా నిద్ర పోలేదూ? పద్మా?" అన్నారు కంగారుగా.

"ఊహూఁ! స్పీచ్ ప్రిపేర్ చేసుకున్నాను!" అంది ఆవులిస్తూ... ఒళ్లు విరుచుకుంటూ.

"అబ్బా! ఏదో నాలుగుముక్కలు చెబితే పోయేదానికి....ఇంతగా హైరాన పడాలా?" అన్నారాయన నిద్రమత్తులోనే....

"ఊహూఁ! నాలుగుముక్కలు యెవరేనా చెబుతారు .... నా స్పీచ్ ఎమోషనల్‌గా, మాబ్‌ను అట్రాక్ట్ చేసేదిగానూ, ఇంప్రెస్ చేసేదిగానూ వుండాలి!.. ఇలాటి అవకాశం ఎప్పుడోగానీ రాదు! ప్రెస్ రిపోర్టర్స్‌కూడా చాలామంది వస్తారని విన్నాను ...." అలసట పారద్రోలటానికి ఓ కప్పు ఓవల్టిన్ తాగి తెలతెలవారబోతూండగా పడుకుంది.

అందుచేతే ఇప్పుడు నిద్ర ముంచుకవస్తోంది. ఈ రెండు గంటలు కాస్త ఓపికపడితే ఇంటికి వెళ్ళి హాయిగా నిద్రపోవాలి అనుకొంటోందామె కళ్లు మూసుకుని....

".. శ్రీమతి పద్మజారావు మాట్లాడుతారు."

అధ్యక్షుని గొంతుక ఖంగుమంది మైక్‌లో. పద్మజారావు మెల్లిగా లేచి మైక్ ముందుకొచ్చింది. ఆమెలో వున్న సహజమైన అలసట....ఆ సన్నివేశంలో ఆమె ముఖంలో శోకరసాన్నికూడా ప్రతిబింబించేలా చేసింది.

"మన వీరాయి .... వీరారావు .... సైన్యంలో చేరిన మరునాడు నాదగ్గరకు వచ్చి "అమ్మగారూ! ఇలా చేరాను" అని చెప్పినప్పుడు నేను [illegible]. ఆ బిడ్డ .. ఈ గడ్డమీద పుట్టిన మన ఆ బిడ్డ ఇంతటి వాడౌతాడని, దేశాన్ని రక్షించే పవిత్ర కార్యక్రమంలో తను అమరుడౌతాడనీ, ఆనాడు నేను కలలో కూడా అనుకోలేదు! తల్లిగాని నాకే ఈనాడు గుండె పగిలిపోతుంది. మరి తల్లి చంద్రమ్మ ఎలా భరిస్తోందో ఈ దుంపపు కోత! అయితే ఆమె వీరమాత! జిజియాబాయిలాటి మహాతల్లి. ఆ తల్లికన్న ఈ బిడ్డ మన జిల్లాకేకాదు, రాష్ట్రానికే ఒక మణిపూస.

"సుధీర్ చేరుతానన్నాడు చేరమన్నాను. తీరా ఆ రాత్రే వాళ్ల నాన్నగారికి సుస్తీగా వున్నట్లు తెలిసి ఫారిన్ వెళ్లాల్సి వచ్చింది! వచ్చాక ప్రజాసేవ చేసితీరాలంటూ పెద్దలు పట్టుపట్టారు. అందుచేత మా సుధీర్‌కు "రణధీర్" అయ్యే అవకాశం లేకపోయింది. నాకూ వీరమాత అనిపించుకొనే అర్హత లేకపోయింది.

"ఆ గౌరవం, ఆ అర్హత శ్రీమతి చంద్రమ్మకు దక్కాయి. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అన్నారు పెద్దలు. జన్మభూమి ఋణం తీర్చుకున్న

వీరారావు అజరుడు. అమరుడు.''

ఇలా గంగాప్రవాహంలా గంటసేపు సాగిందామె ఉపన్యాసం. మధ్యమధ్యలో వీరారావుతో తన సాన్నిహిత్యం, సంభాషణలు. చిన్నరాత్రి అందంగా ఊహలతో తయారుచేసుకున్నవన్నీ సమయోచితంగా ఉదహరించింది.

జనం చాలా ఇంప్రెస్ అయ్యారు ఆమె ఉపన్యాసంతో. ఆ తర్వాత చాలా మంది పెద్దలు వీరారావును పొగిడారు. చివరగా చంద్రమ్మను వేదికమీ కి పిల్చి వెయ్యరూపాయల చెక్కు అందించారు.

ఆ రాత్రి .... అర్ధరాత్రి .... గాఢాంధకారం ...

సుధీర్, హేమ కౌగిలిలో వెచ్చగా నిద్ర పోతున్నాడు....

రఘు ...మీనాక్షి ...వెంకటరావు .... విశాలక్షమ్మ .... ఎవరికి వారుగా .... త్వరలో రఘుకు రాబోయే ప్రమోషన్ గురించీ....మీనాక్షికి రాబోయే ఉద్యోగం గురించీ .... కలలు గంటూ గురకలు కొడుతున్నాడు....

ఆ చిమ్మ చీకటిలో....ఆ చిన్న పెంకుటింట్లో . రోశయ్య నులక మంచంమీద కాళ్లు కిందకు వేసి కూర్చునివున్నాడు.... అతగాడి కాళ్ళమీద తలపెట్టి చంద్రమ్మ ఏడుస్తోంది. ఆమె వెచ్చటి కన్నీళ్లు అతగాడి మో కా ళ్ళ మీ ద బరువుగా పడుతున్నాయి....అతగాడి రాతిలాటి ఛాతీ కరిగి నీరౌతోంది....

''చంద్రీ! ఈ ఇల్లూ అదే కట్టించాడు గదే! మనకడుపున బుట్టి ...మనగుడిసెలో పుటిన మన బిడ్డ .. ఎంత గొప్పోడై నాడో చూసావూ? పెద్ద పెద్దోల్లంతా అణ్ణి ఎట్టా మెచ్చుకున్నారో చూసావూ! ఎంత పున్నెం చేసుకున్నామో! అంత పాపమూ చేసుకున్నాం! వనోడు మనకు దక్కలేదు!'' అన్నాడు రోశయ్య ...

అతగాడి కంఠస్వరం పూడుకుపోయింది....

చంద్రమ్మ వెక్కిళ్లు పెడ్తూ అంది....

''ఆ పెద్దోల్ల మాటలేమీ నాకర్థం గాలేదు. గానీ .... నా బిడ్డ .... బతికిన నాలుగు రోజులూ....మన ఋణం తీర్చుకున్నాడు. చచ్చాక కూడా... వెయ్యిరూపాయలు.... ఒక్క సంవత్సరం తిండి మనకోసం.... ఇచ్చి పోయాడు... మన ఋణం తీరేసుకునీ వెళ్ళి పోయాడు !'' ఆమె గుండె ఎగసి ఎగసి పడుతోంది ఆమె మాతృప్రేమ వరదలై పారుతోంది .... దేశం ఏమిటో....దేశభక్తి ఏమిటో ఆమెకీక్షణం లోనూ తెలియవు .... తెలిపిందల్లా .... ఆకలీ....దాని క్రింద కప్పివేయబడి వున్న మాతృ మమత ఈ క్షణంలో ఆకలి పొర తొలిగి .... మమత .... ఒక్కటే దహించి వేస్తోంది....మరి కొద్ది రోజుల్లో నారాయణ కూడా ఆ కటిక చీకటిలో ఆమె తల విదుల్చు కొంటోంది పిచ్చిదానిలా!

"కండొలెన్సెస్ సుబ్బారావ్ — నువ్వెంత సన్నగా వున్నా లావుపాటి అమ్మాయిని పెళ్ళి చేసుకున్నావటగా." సానుభూతి తెలిపారు మిత్రులంతా క్రొత్తగా పెళ్ళైన సుబ్బారావుకి. అందుకు సుబ్బారావు నోట్లోంచి వూడిపడిన ఒకటి పలుకు లివి: 'నాకేం భయం? నా పొట్టిమల్లా!'

పత్రిక చదువుతూ కిసగబడి నవ్వింది సుజాత.

"ఏమండీ! చూడండి. ఈ బిట్టు చదవండి. ఎంత బాగుందో!" నవ్వుతూ అంది భర్తని. కేవలం తన నీడకు తాను భయపడే వ్యక్తి. వివాహితుడు అని కూడ చెప్పవచ్చు

బిట్టు చదివాడు. ముఖంలో రంగులు మారాయి. సుజాత నవ్వు సూటిగా అతని హృదయానికి తగిలింది. సుజాత తనకా బిట్టు చూపడంలో అర్థమేమిటి? తాను సన్నగా ఉన్నాడనే కదా. నవ్వు వచ్చేందు కేముందిందులో?

కోదండరావు ఒకరోజు చేతికి కట్టు కట్టుకొని వస్తే వాడి గురించి తన ఆఫీసులో రకరకాలుగ చెప్పుకొని పండుగ చేసుకున్నారు. 'ఏమైందిరా చేతికి' అని స్నేహితులు అడిగితే 'బెణికింది' అని చెప్పాడు. 'పెళ్లాం మెలిత్రిప్పి ఉంటుంది అయ్యో పాపం!' అన్నారు. వాడు లేదు మొర్రో అని మొత్తుకున్నా, వాడి మొర లెవ్వరూ ఆలకించలేదు. కారణం? వాడు సన్నగా ఉంటాడు!



ఒకరోజు తానూ, సుజాత సినిమాకు వెడుతుంటే సుజాత స్నేహితురాలు రాధ కనిపించింది. వాళ్ళిద్దరూ మాట్లాడు కుంటుంటే తాను కొంచెం దూరంలో నిలబడ్డాడు. 'కాస్త చేయిపట్టుకొని నడవ్వే. మీవారు గాలి కెగిరిపోగలరు' అని రాధ నవ్వడం గమనించాడు. తనకు ఎక్కడలేని చిన్నతనం అనిపించింది. ఆమె భర్త ఇంజనీరని సుజాత చెబితే బాహాటంగా యీసడించుకున్నాడు. "రోడ్స్ అండ్ బిల్డింగ్స్" లో పని

చేస్తున్నాడు గామోసు రోలరును తెచ్చుకున్నాడు అని వూరుకున్నాడు. అందరూ తనలాగే గంగాళంలా ఉంటాలేమో ఆమెకు తాను సన్నగావుంటే వీళ్ళందరికీ ఏమిటో?

వంటింట్లోకి వెళ్ళి పీట వేసుకొని పుస్తకం చదువుతుంటూ కూర్చున్నాడు కొంచెంసేపటికి సన్నగా అలికిడైంది. అటువైపు చూచాడు. ఒక్క ఉదుటున ఎగిరి దూరంగా పడ్డాడు. ఒక త్రాచు పాము గోడ అంచువెంబడి ప్రాకుతూ వస్తోంది. 'పాము!' అని బిగ్గరగా అరిచాడు గొంతు తడారిపోయింది. సుజాత కంగారుగా పరుగెత్తుకొచ్చింది.

"ఎక్కడ?"

"అదుగో గోడవారన-ఇప్పుడెలా?"

"త్వరగా కఱ్ఱ తీసుకురండి" అనే పరికి అతని పై ప్రాణం పైనేపోయింది. తీరా తెచ్చాక తనను కొట్టమనదు కదా. తన కసలు పాములంటే చచ్చే భయం. చిన్నప్పుడు కల్లో వస్తే కెవ్వున కేక వేసేవాడు. నాయనమ్మ ప్రక్కలో పండేసుకొని సముదాయించేది. మిఠాయిలు కొనిస్తానని బుజ్జగించేది.

ప్రక్కింటివాళ్ళను పిలుస్తాను. అని బయటికి పరుగెత్తాడు ప్రక్కింటి శంకర్రావు వచ్చాడు బడితె తీసుకొని. హడావిడిగా బహు ఆర్భాటంతో నాలుగుదెబ్బలు వేశాడు పాము చచ్చి ఊరుకుంది. చచ్చిన పాముచెంత చాంపియన్‌లా నిల్చున్నాడు శంకర్రావు. ఇంతలో శంకర్రావు సతీమణికూడ వచ్చి భర్త పరాక్రమం గురించి ఒక చిన్న ఉపన్యాసం దంచింది. చివరికి సత్యకథా కాలక్షేపం చేస్తూ ఆ పుణ్యదంపతులు నిష్క్రమించారు. చచ్చిన పామును తీసుకుపోయి బయట పారేసి వచ్చాడు శేఖరం.

"పడుకొని చదువుకోలేకపోయారూ. ఇక్కడికెందుకొచ్చారు-" అంది సుజాత అక్కడ పడివున్న పుస్తకం తీస్తూ. ఆ పుస్తకం పైటిల చదువుకుంది. "హౌటు అట్టెయిన్ స్లెండర్!" "మీరు వెళ్ళి పడుకోండి. నేను ఇల్లు శుభ్రంచేసి వచ్చేస్తాను" అంది పుస్తకం అతనిచేతికిచ్చి. అతను సుజాత తలుపు గడియవేసి వచ్చేవరకు బిక్కుబిక్కుమంటూ కూర్చున్నాడు.

"సుజా, ఎంత పెద్దపామని!" అన్నాడు ఆమెను మాటల్లోకి దింపి తన భయం పోగొట్టుకోవాలని

సుజాత తడిచేతులు చీరకు తుడుచుకుంటూ "ఇంకా దాన్ని గురించే ఆలోచిస్తున్నారా? పడుకోండి" అని మందలించింది.

"ఆ పత్రికలోని జోక్స్ గట్టిగా చదువు."

"నాకు నిద్రవస్తోంది మీరే చదువుకోండి" అంటూ పుస్తకం అతని మంచమ్మీదికి విసిరివేసి గోడవైపుకు తిరిగి పడుకుంది.

నిద్ర పట్టలేదు. భయంగా వుంది. పాము గురించి పదేపదే గుర్తుకువస్తోంది. పాములన్నీ తన మంచంక్రింద పొంచి ఉన్నట్లు అనుభూతి కలుగసాగింది. చివరకి ఎలాగో నిద్రపట్టి భయంకరమైన కల వచ్చింది. అతను ఆఫీసునుంచి వస్తూ (ఇప్పటికి బాగా చీకటిపడింది) పామును పారేసిన స్థలంలో బ్యాటరీలైటు వేసేసరికి పాము "బుస్సు"న లేచింది. అంతే పరుగు లంకించుకున్నాడు పాము వెంటపడి తరుముతోంది. అతను ఎటు పరుగెత్తినా అది వదలడంలేదు. "పాము! పాము!" బిగ్గరగా అరిచాడు. మెలకువ వచ్చేసరికి గోడ గడియారం గంటలు కొడుతోంది. అంతా చీకటిగా ఉంది కిటికీ తలుపులు టపటపా కొట్టుకుంటున్నాయి గాలి "బుస్సు"మంటూ వీస్తోంది. అసలా పాము పూర్తిగా చచ్చిందో లేదో! కొంప దీసి బ్రతికిందా. ప్రక్కింటి శంకర్రావును పిలిపించి కొట్టించినందుకు అది నేరుగా తన మంచమ్మీదకే వచ్చి ముద్దు పెట్టుకుంటుంది. మంచంమీంచి మెల్లిగా క్రింద అడుగుపెట్టాడు ఒక్క అంగలో సుజాత మంచం చేరుకున్నాడు. మంచం కిర్రుమనేసరికి ఆమెకు మెలకువ వచ్చింది. "కొంచెం ప్రక్కకు జరుగు" అన్నాడు. "అబ్బ! అక్కడే పడుకోకూడదా. ఇరుగ్గా ఉంది" అంది నిద్రలో.

ఉదయం నిద్రలేవగానే ప్రక్కమీద అర్ధాంగి లేదు. తెలతెలవారుతోంది. కాకులు అరుస్తున్నాయి. అతను లేచాడు. నిద్రమత్తులో ఆలోచించాడు. చెంగున మంచమ్మీంచి క్రిందికి గెంతాడు గట్టిగా. ఒళ్ళు విదిలించి, తలుపు దగ్గరగావేసి గుంజిళ్ళు తీయనారంభించాడు. వినాయకుడికి గుంజిళ్ళంటే చాలా ఇష్టమట. అందుకే అంత లావయ్యాడు. కేవలం ఆ పద్ధతే మొదలెట్టాడు. ఐదునిముషాల్లో వంద దాటించాడు. చెమట ఏరులై పారుతున్నా పట్టుదల వదల దల్చుకోలేదు. బలంగా ఊపిరి పీలుస్తూ కొనసాగిస్తున్నాడు. కూర్చుంటే లేవలేక పోతున్నాడు. లేస్తే కూర్చోవడం కష్టమైపోతోంది ఉత్సాహం ఎంతపనైనా చేయించగలదు. "నూట యిరవై .. నూటయిరవై ఒకటి....నూట యిరవై....రెం...." ఇంతలో శ్రీమతి తలుపు చాటునుంచి ఫక్కున నవ్వు పరువు తీసింది.

అలాగే నిలబడిపోయాడు. సుజాత తలుపు తెరిచి "ఊఁ. కానివ్వండి" అంది నవ్వుతూ. అతను చిన్నబుచ్చుకున్నాడు.

"హౌ టు అట్టెయిన్ స్ట్రెంగ్త్!" అంది అతన్ని మరింత ఉడికిస్తూ. "ఇంకో పదిరోజుల్లో మీరు హెర్క్యులెస్ అయిపోతారు."

"ఊ—" అని మూలిగాడు.

"స్నానంచేసి రండి. ఎక్సర్‌సైజెస్ బాత్‌రూమ్‌లోకూడా మొదలెట్టేరు?"

"ఆఁ కాఫీ అయిందా"

"ఈ రోజు మిల్క్ త్రాగండి. కన



"కొండంత గుమ్మడి కత్తి పీటకు లోకువంటార్లే చిట్టీ!"

రత్తు చేశాడు కదా."

బాత్‌రూమ్‌లో జొరబడి తలుపు దఢీమని వేసుకున్నాడు.

స్నానం ముగించివచ్చి వంటగదిలో కూర్చున్నాడు ఆలోచిస్తూ. స్వీటుహార్టు పాలు తీసుకువచ్చింది.

"వద్దు, నాకు కాఫీ కావాలి."

"కాఫీ యివ్వను. పాలే. ఇష్టమైతే త్రాగండి. లేకపోతే హోటలుకెళ్ళండి."

అతను లేచాడు. గబగబా షర్టు తగిలించుకున్నాడు. ట్రౌజరు వేసుకొని బయలుదేరబోతున్నాడు.

"అయితే పాలు త్రాగరన్నమాట."

అతను జవాబివ్వలేదు. "తలుపేసుకో" అన్నాడు బయటికి వెళ్ళబోతూ.

"ఏమండీ!"

వీధిలో అడుగుపెట్టాడు.

"కాఫీ త్రాగుదురు రండి" అంటూ తలుపువగ్గరికి వచ్చింది సుజాత.

గిరుక్కున తిరిగి ఒక్కసారి కోపంగా చూసి వెళ్ళిపోయాడు.

హోటల్లో కాఫీ, టిఫిన్ చేసి (తిని) వచ్చి, టేబిలుమీద ఉన్న తాజా వార్తా పత్రిక చేతికి తీసుకొని కూర్చున్నాడు. సుజాత టిఫిన్ తీసుకొనివచ్చి బ్రతిమాలింది. 'రాక్షసీ!' అని ఛీదరించుకున్నాడు.

"ప్రేయసీ అనడం పోయి రాక్షసీ అంటారేమిటండీ" అంది బుంగమూతి పెట్టి.

అతను ప్లేటు విసిరికొట్టాడు. ఉప్మా చెల్లాచెదరుగా నేలమీద పడింది.

"ఏమైందండీ మీకు?" అంది ఏడ్వబోతూ. "వద్దని చెబితే నేనైనా తినేసి ఉందును కదా."

"తిను, తిను! నాకంటె డబుల్‌గా."



"చిన్న కత్తికి పెద్దా కాయ....అంటారు కదండీ!'

"అసలు మీరు పెట్టకుండా నేనేమైనా తింటున్నానండీ"

అతను ఉక్రోషం పట్టలేక,

"మరి నన్నెందుకు హోటలుపాలు చేశావు నేనిలా సన్నగావుంటే నువ్వెందుకంత లావున్నావు?"

"ఎంత లావున్నాను?"

"టేపు తెచ్చి కొలవాలా?"

సుజాత కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది.

"ఛీ ఛీ—నిన్ను చేసుకునే యిలా అయ్యాను."

సుజాత ఏడుస్తూనే కోపంగా అరిచింది. "ఇదివరకెలా వుండేవారు?"

ఇదంతా చేసింది ఆ శ్రీహరి గాడు. తన బంధుకులంలో ఒక సన్నాసి "పెళ్ళిచేసుకోరా లావైపోతావు" అని దిక్కుమాలిన సలహాయిచ్చాడు. తాను అందరూ ఒకసారి పెళ్లిచేశాడు. పెళ్లై రెండేళ్ళయినా ఒక్క వీసమెత్తు బరువు రాలేదు. రెండంగుళాలు పొడవు ఎదగడం తప్ప.

డాక్టరు సలహా అడిగితే బిల్లుపెంచి తన జేబుకు చిల్లువేశాడు.

సుజాత వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఎందుకిలా ఏడవడం? ఇరుగూ పొరుగు చూస్తే నేనేమో నిన్ను బాధలు పెడుతున్నట్లు అనుకోమనా? ఈ ఇంట్లోంచి ఎంత తొందరగా బయటపడితే అంత మంచిది'—బొబ్బలు పెడుతూ వీధిలో పడ్డాడు. సుజాత ఏడ్చి ఏడ్చి కన్నీరు యింకి మామూలు స్థితికి వచ్చింది. ఇల్లంతా పడిన ఉప్మా ప్లేటులోకి ఎత్తి ఇల్లు తుడిచింది.

పదకొండున్నర అవుతోంది. వీధి తలుపు తట్టిన చప్పుడు వినిపించేసరికి

వెళ్లి తలుపు తెరిచింది.

"మీరా! ఆఫీసుకు వెళ్లలేదూ?"

శేఖరం కుంటుతూ యింట్లోకి వచ్చాడు.

"కాలికేమైంది? ఆ కట్టేమిటి?

"నీ పాతివ్రత్య మహిమ నన్నిలా వెంటాడి కాపాడుతోంది" దారిలో ఆలోచించుకొని వచ్చేడు ఈ డైలాగు.

ఆమెకు నోట మాట రాలేదు.

"ఆసుపత్రికి వెళ్ళారా!"

"ఆఁ ఏదో తమ దయవల్ల"

"నెప్పిగా ఉందా?"

"ఆబ్బే చల్లగా ఉంది"

"చల్లగా ఉంటే ఆఫీసుకు వెళ్ళవచ్చుగా"

"ఏం? నేను యింట్లో ఉంటే నీకు బాగుండదా?"

ఆ తరువాత ఆమె ఏమీ అడుగలేదు. శేఖరానికి తన ఆఫీసు బడుద్ధాయిల విషయం బాగా తెలుసు. అసలు ఈ సన్నగా ఉండడమే ఒక శాపం. దానికి తోడు భార్య కాస్త [illegible]టంగా ఉంటే అందరికీ వేళాకోళం. ఇంక ఆ భార్యా భర్తలగురించి బుర్ర బద్దలుకొట్టుకోవడం వాళ్ళగురించి పరిశోధనలు. ప్రచారాలు వస్తైగా ఆ ప్రచారాలు చేయందసలు తన ఆఫీసులో సత్తిగాడిద (సత్యంగాడికి). కోనేటిరావుగాడికి ఆ రాత్రి నిద్రపట్టదు. ఇలా కుంటుకుంటూ తాను ఆఫీసుకు వెళితే 'వాడి పెళ్లాం వాడి కాలు త్రొక్కి ఉంటుందనో, లేక యిలాంటిదే ఏదో దుష్ప్రచారం చెయ్యక మానరు. తన గాయం గురించి వ్యంగ్య పరామర్శలు తప్పవు. ఈ పరిస్థితిలో ఆఫీసులో వాళ్ళ కంటబడేటంత ప్రమాద సంఘటన యింకోటి ఉండదు. తాను రోజూ చూస్తున్నాడుగా కోదండరావు అవస్థ. అందుకనే ఒక లీవు లెటరు వాసి పడేశాడు హాస్పిటలునించి వస్తూ తనకు దేవుడిలాగ ఎదురైన తన ఆఫీసు ప్యూను కైలాసం చేతికిచ్చాడు హాజరు పట్టిలో గుచ్చుమని ... ఈ కైలాసంగాడుగాని చెప్పడుగదా తనకు కాలికి దెబ్బతగిలిన సంగతి? అరె! తనకా ఆలోచనే తట్టలేదు. అసలు వాడికీ కనిపించకుండే బాగుణ్ణు. తన యింటిపనిచేసే సుబ్బులు మొగుడు చేతికిచ్చివుంటే సెలవు చీటీ ఆఫీసులో పడేసి వచ్చును. అసలప్పుడు యింత ఆలోచన రాలేదు. ఈ రోజు ఎలా ఉంటుందో ఆఫీసులో.... అందరూ తన గురించే మాట్లాడుకుంటూ ఉంటారు .. కోనేటిరావుగారు పంచె ఎగదీసి కళ్ళజోడు సవరించి గుస్సు మిటకరించి, చేతులు త్రిప్పి త్రిప్పి చెబుతుంటాడు అందరికీ తనగురించి....సత్తిగాడుకూడ చాల బిజీగా ఉంటాడు

మంచనటిరోజు ఆఫీసుకెళ్ళగానే గుసగుసలు గమనించాడు. సత్తిగాడి పలకరింపు వికటంగా తోచింది. కోనేటిరావు నాలుక బయటపెట్టి ముఖం పైకెత్తి

చత్వారం కళ్ళజోడులోంచి చూచిన చూపులు భరించలేక పోయాడు. తనే మంత చేతకాని వాడయ్యాడు?

సాయంత్రం లోకల్ లైబ్రరీలో 'ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్స్' అనే పుస్తకం చూచాడు. ఇంటికి తెచ్చుకొని తెల్లవారుజామువరకు పఠించాడు. 'నౌ యువార్ ఆల్ రైట్' అన్న చివరివాక్యం చదవగానే శేఖరానికి ఏనుగంత శక్తి వచ్చింది.

"మనం సాధారణంగా మన తెలివిలో పది పర్సెంటే ఉపయోగిస్తున్నాము. తొంభై పర్సెంటు వరకు నిరాటంకంగా ఉపయోగించ వచ్చును. అందువల్ల మనం ప్రతిరోజు సాధించే ప్రయోజనాన్ని తొమ్మిదిరెట్లు పెంచుకో వచ్చును. అందుకు చెయ్యవలసిందంతా ఒక్కటే. ప్రతి చిన్నపనిని ఎక్కువ తెలివి తేటలు ఉపయోగపెట్టి (తొంభై పర్సెంటు) ఒక గొప్ప పని చేస్తున్నామని భావించి పూర్తి చెయ్యడమే!" శేఖరానికి పై వాక్యాలు బాగా నచ్చాయి. నిజమే! తాను ఎప్పుడు తెలివి ఉపయోగించాడు గనుక? డిస్క్రిప్షన్ యీజ్ ది బెటర్ పార్ట్ ఆఫ్ వాలర్! హ్హ హ్హ హ్హ రేపటినుంచి అన్నీ మెదడు ఉపయోగించి చెయ్యాలను కున్నాడు.

తెల్లవారుజామున ఐదుగంటలకే నిద్ర లేచాడు. స్నానసంధ్యలు ముగించివచ్చి ఈజీచెయిర్ లో కూర్చున్నాడు ఆలోచిస్తూ. శ్రీమతి తెచ్చిన టిఫిన్ అలాగే ఈజీ చెయిర్‌లోంచి కదలకుండా రీవిగా ఆర గించి కాఫీ సేవించాడు. రాత్రంతా నిద్ర లేనందు వలన మత్తుగా నిద్ర పట్టింది.

"సుజాతమ్మా" అంటూ వీధిలోంచి ప్రక్కింటి కామాక్షమ్మ కేక వినిపించి మెలకువ వచ్చింది. ప్రొద్దున్నే ఏమి ముంచు కొచ్చిందో ఏమో! సుజాత స్నానం చేస్తోంది.

తానే వెళ్ళి తలుపు తీశాడు. "సుజాత లేదా!" అంది. స్నానంచేస్తోందన్నాడు. ఆవిడకు నాలుగు శేర్లు పాత బియ్యం అరువు కావాలిట. వాళ్ళింట్లో పాత బియ్యం కొరత గురించి ఒకటే వాగు తోంది! ఆ వీకరువు విని వింటూ పరమ యిబ్బంది పడ్డాడు. త్వరగా పంపిచే గాని మనస్సు స్థిమితంగా ఉండనిచ్చేటట్లు లేదు.

అటకమీద బియ్యమ్మూట ఉంది క్రిందికి దించడానికి బరువుగా వున్నా. జరజరా క్రిందికి లాగి ప్రక్కకు గెంతాడు. దురదృష్టవశాత్తు అది ఆతని దెబ్బతగిలిన కాలిమీద పడింది. కెవ్వు మన్నాడు.

"జాగ్రత్త నాయనా" అని కామాక్షమ్మ హెచ్చరించింది అంతా అయి పోయాక. అప్పుడే స్నానం పూర్తిచేసి వస్తున్న సుజాత బియ్యమ్మూట పడిన చప్పుడుకు పరిగెత్తు కొచ్చింది. పాదం మంట పుడుతుంటే అతను ముఖం చాటు చేసుకున్నాడు.

"ఇలాంటి పనులు చెయ్యవద్దంటే

ఖినరు.''

అతనికి తల తీసేసినట్లయింది. ఇలాంటి పనులంటే బరువైన పనులనే కదా దాని అర్థం. తనంత శక్తిలేనివాడా? తన చేతకాని తనాన్ని బాగా వేలెత్తి చూపించిందన్న మాట కామాక్షమ్మ ముందు. ఆవిడ అసలే కొరివి. ఇంకో ఐదు నిముషాల్లో తాను బియ్యమ్మూట కాలిమీద వేసుకున్న వృత్తాంతం వీధంతా తెలిసిపోతుంది. పెళ్ళామే! కొంచెమైనా జ్ఞానం ఉండఖ్ఖర్లేదా? ఏది అనాలో ఏది అనకూడదో తెలీదా? ఎంత పొగ రెక్కింది! తనంటే అంత అలుసన్న మాట!

సుజాత కామాక్షమ్మకు బియ్యం కొలిచివేసి పంపింది.

''సుజా! యిలారా.'' అని సాదాగా పిలిచాడు. సుజాత దగ్గరికి వచ్చింది. ''ఫెడీ' మని చెంపమీద వేశాడు. చెంప బూరెలా పొంగింది. ఈ ఆకస్మిక సంఘటనకు ఆమె కళ్ళలోంచి రెండు కన్నీటి బిందువులు రాలాయి.

''పళ్ళు దగ్గర పెట్టుకొని మాటలు రానియ్యి. నాలుక పీకేస్తాను జాగ్రత్త!'' గర్జించాడు.

అతని ముఖం చూడలేక ప్రక్క గది లోకి వెళ్ళిపోయింది.

అక్కడ ఏడ్చుకుంటుంది కాబోలు తీరిగ్గా. ఈ అనుభవం చాల క్రొత్తగా ఉంది. తానెప్పుడూ సుజాతను కొట్టలేదు. అందుకే తనతో అంత చనువుగా మాట్లాడుతుంది. అందుకే తనకేమీ కోపం రాదుగాని. కామాక్షమ్మ సమ క్షంలో....

''తలుపు వేసుకో. నేను పోతున్నా.'' ఆలోచిస్తూ బయలు దేరాడు. ఇలా నాలుగు రోజులు వాయిస్తేగాని యిక నోరెత్తదు, అనుకున్నాడు. అరచెయ్యి చిమచిమా అంటోంది తన ఘనకార్యాన్ని చాటుతూ. ''స్పేర్ ది రాడ్ అండ్ స్పాయిల్ ది వైఫ్'' అనుకున్నాడు.

తలవంచుకొని నడుస్తూ పోతుంటే గాంధీ చౌకు దగ్గర బ్రేకు పడింది. ఎవరో పిలిచినట్లు వినిపించి వెనక్కి తిరిగి చూచాడు. రాధ! తనగురించి కామెంట్ చేసిన తన అర్ధాంగి పరిచయస్తు రాలు. కాని తనను పిలిచింది మగ గొంతు. ఆమె ప్రక్కన నిల్చున్నతను దగ్గరికి వచ్చి ''ఏరా శేఖర్! బాగున్నావా? ఎన్నాళ్ళైంది నిన్ను చూచి—'' అని పలకరించాడు. వాడు ఇంటర్‌లో క్లాసు మేటు. ఇప్పుడు రాధ భర్త అనికూడా పోల్చుకోగలిగాడు. రాధ కొంచెం దూరంలో నిలబడి గమనిస్తోంది. 'ఒరేయ్ శ్రీనివాసులూ! ఇదేమిటి యిలా అయ్యావ్! ఏ రోలరు క్రింద పడ్డావురా. యిలా అప్పడంలా తయారయ్యావ్. అయ్యో. పాపం!'' తడుముకోకుండా బిగ్గరగా అన్నాడు.

''అరవకురా. మా ఆవిడ యిక్కడే




ఉంది.'' మెల్లగాఅని, ''రాధా యిలారా. వీడు నా స్నేహితుడు. ఇది నా భార్య రాధ!'' పరిచయం చేశాడు.

''నమస్కార మండీ!''

''నమస్ఖారం!'' అన్నాడు ఘాటుగా.

''శానుగాని, నేను నిజంగా సన్న గయ్యా నంటావా?'' డౌటులో పడ్డాడు శ్రీనివాసరావు.

''అక్షరాలా. అలా యిలానా. అట్లి కర్రక్రింద అప్పచ్చిలా.''

''ఏమోరా నేను నమ్మ లే కుం డా ఉన్నాను.''

''నువ్వు ఎప్పుడు నమ్మావుగాని — అసలు మనం చదువుకునే రోజుల్లో ఎంత వెయిటు ఉండేవాడివి! నాకు సరిగ్గా జ్ఞాపకం. నూట ఏభై పౌన్లు .... కాదు నూట అరవై!....ఇప్పుడు మూడు నూట పది కంటె ఒక గురుగింజ తక్కువే ఉంటావుగాని ఎక్కువ ఉండవు ''

''అరె! మొన్న రైల్వేస్టేషన్లో చూస్తే నూట పాతిక ఉన్నాను!''

శేఖరం పొట్ట చెక్క లయ్యే లా నవ్వాడు. ''పోయి పోయి ఆ రైల్వే స్టేషన్లోని వాటి వాత బడ్డావా? అవన్నీ చెడిపోయిన మెషిన్లురా బాబూ. ఇంకా చెప్పు. మీ ఆవిడ ఉంటుంది ఒక నూట పాతిక పట్టు నూట ముప్ఫయి. ఆయామ్ సారీ బ్రదర్. నాకు బాధగా ఉంది. నువ్వు చాలా వీక్ అయిపోయావు. అసలు పెళ్ళి కాక ముందు....''

''పోనీలేరా—ఈ మధ్య టైఫాయిడ్ కూడ ఒకటి వచ్చింది—ఇంతకీ నువ్వి

షాప్లో ఏం చేస్తున్నావు?"

"ఆఁ ఏదో—యూడీసీ—"

"వస్తారా—మా ఆవిడ చీర కావాలని పోరు పెడుతోంది. షాపింగ్‌కి బయలు దేరాము పొద్దున్నే...."

"ఇప్పుడు మన లాంటి వాళ్ళకు ఐ మీన్ మీ మిసెస్ లాంటి వాళ్ళకు సరి పోయే చీరలు దొరకడం చాల కష్టంరా. అన్నీ ఆరు గజాలు ఏడు గజాలూను— మీ ఆవిడకు సరిపడే చీరలు స్పెషల్‌గా నేయించుకోవడం ఉత్తమ మేమో!" నోటి తీట తీర్చుకున్నాడు.

ఆఫీసులో అడుగు పెడ్తూనే కోనేటి రావు ఎదురయ్యేసరికి రక్తం గడ్డకట్టింది. తనను చూచి సకిలించాడు. తొమ్మిదిన్నర యింది. ఇంకా ఎవ్వరూ రాలేదు. కోనేటి రావు ఆఫీకి వెళ్ళాడు. చుట్టూ చూసి సత్యం సీటుదగ్గరికి పోయి టేబిలు సొరుగు లాగాడు. అందులో ఆఫీసు ఫైళ్ళు సురక్షితంగా దాచబడి ఉన్నాయి. "ఇమ్మిడియేట్" అని ముద్రఉన్న కొన్ని ముఖ్యమైన కాగితాలు అందులోంచి చించి ముక్కలు చేసి మూడవ అంతస్తు కిటికీ లోంచి విసిరి పారేశాడు. తిరిగి అన్నీ యథాతథంగా సర్ది గుట్టుగా తన సీటు లోకి వచ్చి కూర్చున్నాడు. "ఈ దెబ్బతో పిత్తిగాడి ఆటకట్టు" అని తృప్తిగా గాలి పీల్చాడు.

పది గంటలయ్యే సరికి టైపు మిషను టకటకలు, కుర్చీల బరబరలు, కాగితాల

సరసరలు, వగైరాలతో ఆఫీసు సందడిగా తయారైంది.

పదకొండు గంటలవుతోంది. ప్రక్క సీటులోని కోనేటిరావు దేనికోసమో టేబిలు మీద ప్రతి వస్తువును తడుము తున్నాడు. శేఖరం లేచివెళ్ళి "ఏమిటండీ వెదుకుతున్నారు?" అన్నాడు.

"నా కళ్ళజోడు."

"కళ్ళజోడు లేకపోతే మీరు...."

"చూపు సరిగా ఆనదు."

"ఎక్కడ పెట్టారు?"

"ఇక్కడే టేబిలుమీద. ఎక్కడో కొంచెం వెదకి పెట్టండి బాబ్బాబు."

"అలాగే అంత మాత్రానికేనా?" అని వెదకినట్లు వెదకి ఫైళ్ళ చాటున పడి వున్న కళ్ళజోడు జేబులో పడేసు తున్నాడు. కోనేటిరావు ఏదో గొణుగు తున్నాడు. టేబిలుమీది వస్తువుల్ని చిందర వందర చేస్తూ. శేఖరం మెల్లగా కళ్ళజోడు జేబులోంచి తీసి చెత్తబుట్టలోని కాగితాల అడుగున పడేసినాడు. ఇంక కను క్కోవడం వాడి బ్రహ్మతరం కాదు. అనుకున్నాడు.

"అబ్బే కనబడ్డం లేదండీ!" అన్నాడు ఏమీ ఎరగనట్లు.

కొంచెంసేపటికి నలుగురూ మూగారు సహాయ పడ్డానికి. "ఇంట్లో ఏమైనా మరచి పోయారేమో?"

"లేదు బాబూ, ఇంట్లో మరచిపోతే ఇంతదూర మెలా రాగలను?—అది లేక



యువ






పోతే నాకసలే కళ్ళు కనిపించవు."

"ఈ రోజు ఆఫీసుకు ఇన్స్పెక్షను ఉందికదూ? ఔనౌను. కళ్ళజోడు అవసరమే."

"నువ్వు స్పేరుగా మరో కళ్ళజోడు ఉంచుకొని ఉండవలసింది. దీన్ని వెదకడానికి."

ఇంతలో ప్యూను ఆఫీసరు పిలుస్తున్నాడని కోనేటిరావుకు వర్తమానం తెచ్చాడు. నలుగురు కలిసి చేతులుపట్టుకొని కోనేటిరావును ఆఫీసరు గదిలోకి నడిపించుకు వెళ్ళారు.

ఆఫీసరు విస్మయం చెందాడు. "మీరంతా ఎందుకు వచ్చారు?"

"ఇతనికి దారి చూపడానికి. పాపం! కళ్ళజోడు పోగొట్టుకున్నాడు సార్. ప్రొద్దున్నే ఎవరి ముఖం చూచాడో!"

"చాల్లెండి. మీరంతా వెళ్ళండి."

"మరి తిరుగు ప్రయాణానికి...."

"ప్యూన్నిచ్చి పంపుతాను. వెళ్ళండయ్యా అంటుంటే. వెళ్ళి మీ పనులు చూసుకోండి. పైగా ఈ రోజు ఆఫీసు ఇన్స్పెక్షనాయె."

ఒక్కొక్కరే బయటికి వచ్చి తలుపు ప్రక్కన పొంచి నిల్చున్నారు.

"ఆఁ ఏమిటయ్యా కోనేట్రావ్! మంత్లీ రిటర్న్స్ సంగతి ఏంచేశావ్?"

"ఉన్నాయి సార్. నా కళ్ళజోడు..."

"నీ కళ్ళజోడు సంగతలా ఉంచు. ముందా రిటర్న్స్ మధ్యాహ్నానికి కంప్లీట్ అయ్యేట్టు చూడు."

"కళ్ళజోడు లేకపోతే ఎలా సార్..."

"క్రొత్తవి తెచ్చుకోవచ్చు లేవయ్యా. ముందా రిటర్న్సు సంగతి చూడు. వెళ్లు. ఒరేయ్! బసప్పా." కాలింగ్ బెల్ నొక్కాడు.

"అమ్మా" చేతులు కట్టుకొని నిల్చు న్నాడు ప్యూను.

"ఇతన్ని తీసుకెళ్ళు."

"రండి." చేయిపట్టుకొని బయటికి తీసుకువచ్చాడు కోనేట్రావును. అందరూ మూగారు.

"చూడర్రా. కళ్ళజోడు లేకపోతే పనెలా చేసేదిరా" అన్నాడు కోనేట్రావు దీనంగా. అందరూ కలిపి కోనేట్రావు తరపున ఒక డెలిగేట్‌ను పంపించారు ఆఫీసరు గదిలోకి.

"సార్! ఆయనకు కళ్ళజోడు పోయి నందువల్ల కళ్ళు బాగా కనబడవు. నేనా రిటర్న్సు పూర్తిచేస్తాను. మధ్యమధ్య నా పనికూడ చూసుకుంటూ ఉంటాను. అతనికి ఒక్కరోజు లీవు గ్రాంట్ చేయండి" అని గొణిగాడు డెలిగేట్.

"ఏదీ అతన్నిలా లోపలికి పంపు" ఆర్డరు జారీచేశాడు ఆఫీసరు.

మళ్ళీ కోనేటిరావు లోపలికి తీసుకు రాబడ్డాడు. ఆఫీసరు తన కళ్ళద్దాలు తీసి కోనేటిరావుకు తగిలించి "ఇవెన్ని?" అన్నాడు మూడు వ్రేళ్ళు ముచ్చటగా చూపుతూ.

"మసగ్గా ఉంది సార్."

ఆఫీసరు లీవు గ్రాంటుచేశాడు.

మిత్రబృందం ఒక మనిషిని తోడిచ్చి కోనేటిరావును రిక్షా ఎక్కించి జాలిగా వీడ్కోలు చెప్పారు.

"వాడికీ రోజంతా అంధకార బంధు రం" అని నవ్వుకున్నాడు శేఖరం.

ఒంటిగంట అయింది. అందరూ లంచ్‌కి వెళ్ళారు. ఇద్దరు ముగ్గురు మాత్రం ఉన్నారు. శేఖరం తలవంచుకొని దీర్ఘా లోచనలో మునిగిపోయాడు.

సత్యం ఒక టిఫిన్‌ప్లేటు తీసుకువచ్చి అతని ముందుంచి, 'నాకీ రోజు పది రోజుల ఓ.టీ. వచ్చింది భాయ్! తీసుకో' అన్నాడు. అక్కడున్న ముగ్గురిదగ్గర మూడు ప్లేట్లు అలాగే ఉంచాడు. తరువాత కాఫీకూడ స్వయంగా సర్వుచేశాడు.

శేఖరం స్తబ్ధుడయ్యాడు.

ఆరోజు ఇన్స్పెక్షను కాన్సిల్ అయింది.

సాయంత్రం ఆఫీసర్ వస్తుంటే సత్యం దేనికోసమో వెదుకుతున్నాడు. బహుశా తాను చించివేసిన కాగితాల కోసమేనేమో! ఎవరో అడిగారు. "ఏమి టండీ వెదుకుతున్నారు? మీ కళ్ళజోడు గాని కనిపించడం లేదా?"

"కాదు. కాగితాలు కనిపించడం లేదు." దీనంగా ఉంది ఆ గొంతు. "కలెక్టరుచేత సంతకాలయిన కాగితాలు ఈ ఫైల్లోనే ఉంచాను. అవి దొరక్క



యమ వ




పోతే నా కండిషనే బ్యాడ్‌గా ఉంటుంది."

"అంటే ఉద్యోగం పోతుందనా?"

"అదేమాట ఆఫీసరుగారన్నారు," కంఠం వణుకుతూ చెప్పాడు.

శేఖరం బయటికి వచ్చాడు. ఆరోజు జరిగిన సంఘటనలు ఘోస్ట్సులాగ తనను వెంటాడుతుంటే పార్కులోకి వెళ్ళి పచ్చికమీద పడిపోయాడు.

బాగా చీకటి క్రమ్మాక యింటిదారి పట్టాడు. బస్సులు, మోటారుకార్లు జయ్యిన పరుగెడుతున్నాయి. తీక్షణంగా కళ్ళకు కిరణాలు—దూరమౌతున్న వెలుగు.

ఇంటికి చేరుకునేసరికి వాకిట్లో బావ మరది ఎదురయ్యాడు.

"ఎప్పుడు వచ్చారు?" అన్నాడు శేఖరం ముఖాన్ని వికసింపజేసి.

"మధ్యాహ్నం వచ్చాను చెల్లాయిని చూసిపోదామని. మీరెలా వున్నారు? అర్జంటు పని ఉంది. ఎనిమిది గంటల ట్రెయినుకు షోలాపూరు వెళుతున్నాను. ఎక్కువసేపు నిలవనందుకు మరేమీ అనుకోకండి బావగారూ!" అని వెళ్ళిపోయాడు బావమరిది.

"అలా గొంతు కూర్చున్నారేమిటి? స్నానం చేద్దురు రండి" అని భార్య పిలవగానే లేచి కూచున్నాడు.

"నాకు ఓపిక లేదు. అన్నం పెట్టు" అన్నాడు బట్టలు మార్చుకుంటూ. విజావికతని మనసును ఆలోచనలు ఆవరించాయి. ఏ పనిమీద మనసు పోవడం లేదు.

భార్య బలవంతమ్మీద. ఎదురుచెప్పే

ఓపికలేక స్నానంచేశాడు. పరధ్యానంగా భోజనం చేసివచ్చి తలక్రింద చేయి పెట్టుకొని పడుకున్నాడు. రేపు ఏమవుతుంది? సమస్యలు తెచ్చిపెట్టడం సులభం. పర్యవసానం ఊహకుకూడ అందదు. తన మూలంగా ఒక వ్యక్తికి ఉద్యోగం ఊడడం తనెప్పుడూ ఊహించలేదు. చెత్తబుట్టలోని కళ్ళద్దాలు రేపటికి అక్కడే ఉంటాయా?

చల్లనిచెయ్యి తగిలేసరికి ఉలికిపడ్డాడు. సుజాత!

"ఏమిటాలోచిస్తున్నారు?"

"ఏమీలేదు."

కొంచెంసేపు నిశ్శబ్దంగా గడిచింది.

"ఈ వాచీ చూడండి."

"ఎక్కడిది?"

"బాగుందా? మా అన్నయ్యిచ్చాడు. మీకే." అతని చేతికి కట్టింది.

"చాల బాగుంది. నీకే యిచ్చి వుంటాడు. నీవే ఉంచుకో."

"నాకెందుకండీ వంటింట్లో పడివుండే దానికి. ఈ నల్లస్ట్రాపు మీ తెల్లనిచేతికి ఎంతో అందంగా ఉంది" అతని కళ్ల లోకి చూస్తూ అంది.

"సుజా! ఇలా దగ్గరికి రా."

"ఏం?"

"కూర్చో." ఆమె కూర్చుంది.

ఆమె చెంపమీద సున్నితంగా చేయి వేసి నిమిరాడు. అతనికి దుఃఖం ముంచుకొచ్చింది.

"అరరె! ఏడుస్తున్నారే. ఏడవకండి. నాకు బాగాలేదు." ఓదార్చబోయింది.

"నేనీరోజు చేసినపనికి నాకు ఒంట్లో జ్వరంగా ఉంది."

"జ్వరమా! అబ్బా! ఒళ్ళంతా వేడిగా ఉందే! టెంపరేచర్ చూడనా?"

"అవసరం లేదు. ఇది మామూలు జ్వరం కాదు."

వింతగా చూచింది అతనివైపు. "మీరు ఎందుకో బాధపడుతున్నారు?"

"నేను నీ జీవితంలోంచి శాశ్వతంగా సెలవు తీసుకోవాలనుకుంటున్నాను. ఒనరి ప్రార్థన. ఉదయం నేను చేసిన పనికి నన్నొక అమాయకునిగా భావించి క్షమించు."

"పెద్దమాటలే మాట్లాడుతున్నారు. నా జీవితంలోంచి సెలవు తీసుకోవడానికి కారణం?"

"నేను నీకు అర్హుణ్ణి కాను."

"అర్థమైంది. మీ జ్వరానికి నేను ట్రీట్‌మెంటు ఇవ్వగలను" వంగి అతని నుదుట పెదవులతో ఒత్తింది.

"చెంప నొప్పిగాలేదా?" అనుమానంగా అడిగాడు. అతని పెదవుల్ని ఆమె మృదువైన వ్రేళ్ళు నొక్కాయి.

"మీరేం చేసినా నాకు సంతోషమే. ఈ క్షణంనుంచి నా చెంపమీద మీరేం చెయ్యడానికైనా లైసెన్సు గ్రాంటు చేస్తున్నాను. కావాలంటే యింకొక్కసారి నా చెంపమీద ...... వేసి చూడ్డూ" గునుస్తూ అతనిమీద వాలిపోయింది.



# గాలిదేవుడు

క్లిన్లిక్ సన్ అండ్ కంపెనీ ఎయిర్ కండిషండ్ విజిటర్స్ రూమ్‌లో సోమయ్య పరధ్యానంగా ఫార్చ్యూన్ పత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు ముందు బల్లమీద ఇంకా మెర్క్యురీ టైమ్, న్యూయార్కర్, బిజినెస్ వీక్, కామర్స్, కేపిటల్ స్టాక్ మార్కెట్ బులెటిన్లూ, ఎయిరిండియా ఇంటర్నేషనల్ ప్రకటన కాగితాలూ కొల్లలుగా పడివున్నాయి. అతని మనసు వాటిమీద లేదు త్వరగా వచ్చిన పని ముగించుకొని వెళ్ళిపోవాలని వుంది.

గత ఆరేడు సంవత్సరాలుగా కాఫీ పంటకి లభిస్తున్న అధికవెలల వల్లనైతేనేం, కంపెనీ అవలంబిస్తున్న ఉత్కృష్ట వ్యవసాయపద్ధతుల వల్లనైతేనేం, పాలిబెటా ఎస్టేటు విపరీతమైన లాభాలు గడించింది. అందుకి తగ్గట్టుగా ఉద్యోగస్తులకి పెద్ద బోనస్ ఇచ్చింది. కాని చిన్న ఉద్యోగులు బోనస్‌తో తృప్తిపడలేదు. ఎంతో కాలంగా వాయిదా పడుతున్న సౌకర్యాలు ఈ మంచిరోజుల్ని పురస్కరించుకుని

సి. రామచంద్రరావు

తమకి కల్పించవలసిందిగా కంపెనీకి రాయమని మేనేజరుకి విజ్ఞప్తి చేసుకున్నారు. సోమయ్యకి సానుభూతి కలిగింది బ్రిటిష్ పరిపాలనలో కట్టి వాళ్ళ పరిస్థితి ఎంత హీనంగా వున్నా సరిపోయింది స్వాతంత్ర్యం వచ్చిన తరవాత కొంత మెరుగేకాని, ఇంకా వాళ్ళకి చెయ్యవలసినవి చాలా వున్నాయి. పాపం. ఎండనక, వాననక రోజు స్తమానూ కాఫీ చెట్లల్లో తిరుగాడుతూ వుంటారు. ఇంటికి పోతే రాత్రి ఎలక్ట్రిక్ దీపమయినా వుండదు చాలామటుకి యిళ్లు కూలిపోతున్నట్టుంటాయి వర్షాకాలం కప్పంతా కారుతూనే వుంటుంది. వర్షాకాలం అంటే కొండకిందలాగా నాలుగురోజు లుండిపోయేది కాదు. నాలుగు మాసాలు ఏకధారగా కుండపోతే. ఇంట్లో సరయిన స్నానాలగది వుండదు. ఉన్నా అందులో అన్ని సదుపాయాలూ వుండవు. ఎప్పుడూ చెమ్మగిలి వుంటుంది. కాలకృత్యాలు తీర్చుకోటానికి అంత వర్షంలో నూ చిన్నా, పెద్దా ఇంటి వెనకాల దూరంగా కట్టిన రేకుల చూరుకిందకి పరుగెత్తవలసిందే. కంపెనీ అభివృద్ధికి పాటుపడుతున్న వీళ్లెందుకు ఇంత కష్టపడాలి. అధిక లాభాలు గడిస్తున్నపుడు కొంత ఖర్చుచేసి వాళ్ళ సౌఖ్యాల్ని గమనించడం కంపెనీ విధి అనిపించింది సోమయ్యకి.

చిన్న ఉద్యోగుల కష్టాలు వివరించి, ముఖ్యంగా వాళ్ళ యిళ్ళయినా బాగుచేసి నూతన వసతులు కల్పించమని కంపెనీని కోరేడు సోమయ్య ఎలెక్ట్రిసిటీ కూడా యిస్తే బాగుంటుందని రాయబోయేడు. మేనేజిమెంటుకీ, తక్కిన చిల్లర ఉద్యోగులకి వుండే వ్యత్యాసం సన్నగిల్లిపోతుందేమోనని భయం వేసింది. తనకీ, తన యిద్దరి అసిస్టెంట్ మేనేజర్లకీ విశాలమైన చక్కని బంగళాలున్నాయి వాటికి వేరే వేరే జెనరేటర్ల ద్వారా ఎలక్ట్రిసిటీ సరఫరా అవుతుంది. ఇటువంటి అధికృత ఉండబట్టేగదా కింద ఉద్యోగులకీ, కూలీలకీ మేనేజిమెంటంటే భయం, భక్తి వున్నాయి. ఈ విభేదాలు తీసిపారేస్తే? సోమయ్యకి అనుకోకుండా చిక్కుసమస్య ఎదురుపడింది. ఈ తేడాలు కృత్రిమంగా కల్పించినవేనా? తాము చూపించే టీపీ, అధికారం, కార్యసాధన, ఉద్యోగం అంతస్థువల్ల సంపాదించినవా? ఇప్పుడిప్పుడు చిన్న ఉద్యోగాల్లో చేరుతున్న కొందరు చదువుకున్న యువకులతో తమ స్థానాన్ని నింపితే వాళ్ళుకూడా తమంత చాకచక్యంతో ఎస్టేటు నడపగలరా? మహా ప్రయత్నంమీద ఆలోచనల్ని పరిపరివిధాలా పోకుండా ఆపిపెట్టుకుని, ఎలక్ట్రిసిటీ ప్రసక్తి ఎత్తకుండా ఉత్తరం ముగించాడు సోమయ్య.

తన ప్రతిపాదన లన్నింటినీ కంపెనీ ఆమోదించినప్పుడు అతని మనస్సు ఆనం

దంతో నిండిపోయింది. కింది ఉద్యోగుల మీద వాత్సల్యం పెల్లుబికింది. వెంటనే ఇంటి కప్పుల్నీ, గోడల్నీ బాగుచెయ్యడానికి ఎస్టేటు కాంట్రాక్టర్ని నియమించాడు. నూతన పద్ధతిలో స్నానాల గదులు కట్టడం, పాత గచ్చుమార్చి మొజయిక్ గచ్చువెయ్యడం చుట్టుపక్కల ఎవరివల్లా కాదు. బెంగుళూరులో కిల్లిక్ నన్ అండ్ కంపెనీ సేనిటరీ ఫిట్టింగ్స్ లోనూ, మొజయిక్ గచ్చు చెయ్యడం లోనూ పేరు పొందింది వాళ్ళకే ఈ పని పురమాయించడానికి నిశ్చయించుకున్నాడు. కిల్లిక్ నన్ కంపెనీతో బేరసారా ఉండవని తెలిసినా మేనేజింగ్ ఏజన్సీలకి తగ్గింపు ధరలు చెప్పవచ్చనే ఆశకొద్దీ వాళ్ళకి రాయడానికి ప్లాను కున్నాడు. ముప్ఫైయిళ్ళకి స్నానాల గదులు, ఒక్కొక్క గదికీ, వాష్ బేసిన్, ఫ్లషవుట్, షవర్, నేలకీ గోడలకీ గది ఆరడుగుల ఎత్తువరకూ మొజయిక్ పెంకులూ, ఇవికాక డ్రాయింగ్ రూమ్‌కీ, భోజనాల గదికీ, మొజయిక్ గచ్చు. ఉత్తరం పూర్తిచేసి చదివిం తరవాత కాని యింత భారీ పని అనిపించలేదతనికి. పెద్ద మొత్తం ఖర్చు చేస్తున్నప్పుడు తనే బెంగుళూరు వెళ్ళి ఎందుకు సంప్రదించకూడదూ? కారు మైలేజీకి తను తీసుకునేది ఏపాటి? రెండు నెలల్నించి ఎస్టేటు కదిలి బయటికిపోక విసుగు

[illegible] వ

పుడుతున్నదని భార్య ఒకటే గోల. తను కూడా ఈ మధ్య ఎస్టేటు వ్యవహారాల్లో ఎక్కువగా చిక్కుపడి నలిగిపోయాడు. రెండురోజులు తిరిగివస్తే ఉత్సాహం పుంజుకుని మళ్ళీ బాధ్యతలు నెత్తిమీద వేసుకోడానికి తయారయి రావచ్చుననిపించి బెంగుళూరు వచ్చాడు.

'ఇలా రోజంతా నాలుగోడల మధ్య కాపుకాస్తుంటూ గడిపే బ్రతుకేం తెలుసుని ఇంటికి వెళ్ళగానే పుస్తకం మడిచి బల్ల మీదకి విసిరికొట్టి, ఒళ్ళు విరుచుకుంటూ' అనుకున్నాడు సోమయ్య. ప్యూన్ తలుపు తోసుకుని వచ్చి "మీరు లోపలికి పోవచ్చు" అన్నాడు.

సోమయ్య లేచి మేనేజింగ్ డైరెక్టరు గదిలోకి వెళ్ళాడు. చిన్నప్ప కరచాలనం చేసి అతను కూర్చోడానికి మెత్తని కుర్చీ చూపించాడు. చిన్నప్పది రంగైన విగ్రహం. చక్కని కనుముక్కు తీరు అన్నిటికీమించి మిసమిసలాడుతున్న యౌవనం. 'ఇంత చిన్న వయసులో ఎంత అధికారం చెలాయిస్తున్నాడు' అనుకోకుండా వుండలేకపోయాడు సోమయ్య.

"నేను మీకేం చెయ్యగలను" అన్నాడు చిన్నప్ప. తెరలిక్ షర్టుమీద తోపురంగు టైని సర్దుకుంటూ. సోమయ్య వచ్చినపని వివరించాడు. పెద్ద కాంట్రాక్టు ఇవ్వబోతున్నాడని విన్న చిన్నప్ప అన్నాడు:

"అన్నట్టు అడగడం మర్చిపోయాను. ఏం పుచ్చుకుంటారు?"

"ఏమీ ఒద్దు. థాంక్స్!" అన్నాడు సోమయ్య.

"అదేమిటి. చల్లని కొండల్లో వుండే మీలాంటి అదృష్టవంతులు మా ప్రాంతాల ఎండలు భరించడం కష్టంగా వుండాలి దాహ మయినా తీరుతుంది బీయర్ పుచ్చు కోండి" అంటూ ప్యూన్ కోసం బజ్జర్ నొక్కాడు చిన్నప్ప.

సోమయ్య బట్టలు మాత్రం ఎండలు తట్టుకునేందుకు ఉపయోగ పడేలాలేవు. బరువైన ట్వీడ్ సూటు వేసుకున్నాడు. వెడల్పాటి టైని మూడువంతులు వెయిస్ట్ కోటులోకి తోసేశాడు.

"క్షమించాలి. బయట కార్లో నా భార్యని కూర్చోపెట్టి వచ్చాను. సాధ్య మయినంత త్వరగా పని ముగించుకొని వెళితే బాగుంటుంది" అన్నాడు సోమయ్య.

"అయ్యో! ఎందుకావిడ్ని లోపలికి తీసుకురాలేదు? ఇప్పుడయితే నేం పిలుద్దాం" అన్నాడు చిన్నప్ప.

"ఒద్దొద్దు. ఆడవాళ్లు చుట్టుపక్కల చేరితే పని తెమలనివ్వరు" ఒద్దు పడ్డాడు సోమయ్య

"వ్యాపారం వాళ్ళ రంగం కాదు గదా!" లౌక్యంగా నవ్వాడు చిన్నప్ప. లోపలికివచ్చిన ప్యూన్ వైపు తిరిగి అన్నాడు "అళ్వా గారిని ఇక్కడికి రమ్మను"

"మేనేజరు ఆఫీసులో లేనట్టున్నారు" అన్నాడు సోమయ్య.

"ఆఁ. మర్చిపోయాను. అళ్వా ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళాడు. అతని అసిస్టెంటుని పిలుస్తాను"

చిన్నప్ప ఇంటర్ కమ్యూనికేషన్ ఫోన్ అంది పుచ్చుకున్నాడు

"ఆయన కూడా లేరనుకుంటా. వాళ్ళు లేరని నన్ను మీ దగ్గిరకి తీసు కొచ్చారు" అన్నాడు సోమయ్య.

"గోపీనాథ్ కూడా వెళ్ళాడన్నమాట. మా ఎరువుల డిపార్ట్‌మెంట్ మేనేజర్ అమెరికానుంచి ఈరోజు నాలుగుగంటల విమానంలో వస్తున్నాడు" ఆఫీసర్లు లేక పోడానికి కారణం చెప్పాడు చిన్నప్ప.

"వివరాలు నాకు చెప్పండి. రాసుకుని ఆళ్వా కిస్తాను" అన్నాడు మళ్ళీ.

"నేను కొలతలు తీసుకురాలేదు. మీ ఆఫీసు నుంచి ఎవ్వరైనా వచ్చి చూడ్డానికి వీలుండదా?" అన్నాడు సోమయ్య.

"ఓఁ. దానికేం" చిన్నప్ప అన్నాడు.

"మీ ఎస్టేటు ఎక్కడఉన్నారు?"

"మర్కారాకి పదిమైళ్ళ దూరంలో మంగళూర్ రోడ్డుమీద"

చిన్నప్ప మెమో పేడ్ మీద రాసు కున్నాడు

"నా మతిమరుపు క్షమించాలి. ఎస్టేటు పేరు?" చిన్నప్ప అడుగుతూనే సోమయ్య



యువ




పంపించిన విజిటింగ్ కార్డుకోసం బల్లమీద వెదికాడు

"సాలి బేటా ఎస్టేటు" అన్నాడు సోమయ్య.

"సాలి బేటా....ఎక్కడో విన్నట్టు జ్ఞాపకం" కళ్లు చికిలించి, శబ్దాన్ని అరికట్టడానికి గది గోడల కతికిన థెర్మాకోల్ లోపలికి చూస్తూ ఆలోచనలో మునిగిపోయాడు చిన్నప్ప

"తప్పకుండా విని వుంటారు. ఈ మధ్య షేర్స్ మంచి ధరలో వున్నాయి. ఎస్టేటంతా ఎరెబికా కాఫీయే...."

ఉత్సాహంగా చెప్పుకు పోతున్నాడు సోమయ్య

"మెంగిల్స్ బ్రదర్స్ ఎస్టేటుకదా" అడిగాడు సోమయ్య.

"వాళ్ళెప్పుడో అమ్మేశారు. గ్రీన్ వుడ్స్ కంపెనీ ఇప్పుడు మేనేజింగ్ ఏజెంట్స్."

"అదే ఎస్టేటన్నమాట."

సోమయ్యకి అతని మాటలు బోధపడలేదు.

"ఏమిటి?" అన్నాడు.

"గాళిదేవర వెలిసింది మీ ఎస్టేట్లోనేనన్నమాట"

"ఔను"

"ఐతే వేరే మనుషులెందుకు. నేనే వస్తాను."

చిన్నప్ప మొహం వికసించింది.

తప్పకుండా రండి" ఆహ్వానించి సోమయ్య అన్నాడు.

"గాళి దేవర మీద మీకు గురి

ఉన్నట్టుంది."

"కావలసినంత వుంది." ఓరు నవ్వాడు సోమయ్య. ఇన్ని మైళ్ళ దూరంలో వున్నవాళ్ళకి కూడా గాళిదేవరు మహిమ పాకినందుకు సోమయ్యకి ఆశ్చర్యం వేసింది. తమ ఎస్టేటులోనే వెలిసినందుకు కొంత తృప్తీ, గర్వం కూడా కలిగాయి. టీ టయిముకి అనుకున్న ప్రకారం భార్యని స్నేహితురాలి ఇంటికి తీసుకు వెళ్ళకపోతే జరిగే రాద్ధాంతాన్ని తలచుకుని, ఎంత ఉబలాటంగా వున్నా గాళిదేవరు ప్రశంసకి పూనుకోకుండా వ్యవహారం ముగించుకుని అక్కణ్ణుంచి బయటపడ్డాడు

* *

"ఇక్కణ్ణుంచి జీప్ పోదు సార్!" అన్నాడు డ్రైవరు.

"ఐతే ఆపు" ఆజ్ఞాపించాడు సోమయ్య.

ఎస్టేటు జీపు కూలీల యిళ్ళముందు ఆగింది. పిల్లలు దాన్ని చుట్టుముట్టేశారు. డ్రైవరు పొమ్మని కసురుతున్నాడు. సోమయ్య, ఏంథోని చిన్నప్ప, అతని పరివారం యిద్దరు ముగ్గురు జనం జీపులోనుంచి కిందకి దుముకారు. దూరంగా పోయి మంచున్న పిల్లలకి చిన్నప్ప వేసుకున్న రంగురంగుల బొమ్మలచొక్కా వినోదంగావుంది కిలకిల లాడుతున్నారు. ఇళ్ళల్లోంచి కొందరు కూలీలు వచ్చి సోమయ్యకి సలాం చేశారు

"అడుగో. మాంకూ ఇక్కడే వున్నాడు" అన్నాడు సోమయ్య. మాంకూ పళ్ళికిలిస్తూ ముందుకు వచ్చి చేతులు కట్టుకుని నుంచున్నాడు మొహం ముడతలు పడిపోయింది. తెల్లటి వెంట్రుకలు కావిరంగు తలగుడ్డ కిందనుంచీ అక్కడక్కడా బయటికి కనిపిస్తున్నాయి. మోకాళ్ళ కిందకి జీరాడుతున్న అడ్డపంచె రంగు తెలియనంతగా మాసిపోయింది.

"ఇక్కడేం చేస్తున్నావ్? దొంగసారా కాస్తున్నావా, బద్మాష్?" అన్నాడు సోమయ్య.

'రామరామ దొర పాదాలంటి సెబతా. ఆ మేల దొర కూక లేసిన కాణ్ణుంచీ మళ్ళీ ఆ యెదవ పనికాడికెల్ల నేదు "

సోమయ్య పాదాలు ముట్టుకోడానికి ఒంగాడు మాంకూ. మేకులు కొట్టిన బూట్సు కాళ్ళు దూరంగా జరిపి వారించాడు సోమయ్య.

"దొంగ వెధవ. అన్నీ అబద్ధాలే" నవ్వి అన్నాడు "సరేకాని, కూడా రా. ఈ పెద్ద మనుషుల్ని గుడి దగ్గరికి తీసుకెళ్ళాం."

"సిత్తం "

చిన్నప్ప వైపు తిరిగి సోమయ్య చెప్పాడు. "గాళిదేవరు హడావిడంతా

పీడిదే. గుడి దగ్గరే పడుంటాడు. పూజ ల్లోనూ, జాతరల్లోనూ చూదాలి వీడి ప్రతాపం.''

''ఎస్టేట్లో పని చెయ్యడం లేదా?'' అడిగాడు చిన్నప్ప.

''వాడి మొహం పని. ఈ ఎస్టేటు వేసినప్పట్నుంచి ఇక్కడున్నట్టున్నాడు. ఒక్కరోజయినా పని చేసేదంటే నాకు నమ్మకం లేదు.''

''ఒయినయిపోయింది గండా!'' మాంకూ వేలాడుతున్న చేతి కండరాల్ని తడిమి చూసుకుంటూ అన్నాడు

''బలంగా వున్నప్పుడు మహా పని చేసినట్టు'' అన్నాడు సోమయ్య

''సెయ్యకుంటానే తోటంత ఉద్దినో కొచి నాది కావాసు'' చేతులు తిప్పాడు మాంకూ.

చిన్నప్ప నవ్వాడు. మాంకూ అతని వైపు తిరిగి అడిగాడు.

''ఎ యేలకి దొరా యెల్లీదీ?''

''రాస్కెల్, ఇప్పుడే'' అన్నాడు సోమయ్య. ''ఎందుకొచ్చే ననుకుంటు న్నావ్ యింతదూరం, నిన్ను చూట్టా నికా?''

సోమయ్య తిట్లు మాంకూని బాధపెట్టి నట్లు లేవు. నవ్వేడు.

''దొర్లు సేతుల్లో ఏటిదీ ఏసుకురాలే దేటా అవి అడగేను.''

''ఏవిట్రా తీసుకొచ్చేదీ?'' అరిచాడు సోమయ్య.

''దేవారుకాడికి నెయివేద్దెం నేకంటా యెల్లపవా దొరా'' బుర్ర గోక్కుంటూ నేలచూపులు చూశాడు మాంకూ. ''పెద్ద దొరొల్లని ఎంజేసుకొత్తే వో యేట పోతేనా ఏమ్మొద్దేవిడి?''

''ఏడిశావ్, తొరగా రా'' అన్నాడు సోమయ్య.

''ఇవో ఒచ్చేత్తాను'' మాంకూ ఇళ్ళల్లోకి పరిగెత్తి మూడు కోడిపెట్టలు తీసు కొచ్చాడు.

''ఇంత దక్కోసినా యిలాంటివి కూసున్నావు కల్లట్టుక బెతిమాలాను.''

''ఛా, ఛా. దొంగ వెధవా! సిన్నేళ్ళొచ్చినా బుద్ధుయ మాత్రం మార్లేదు'' అన్నాడు సోమయ్య

చిన్నప్ప కల్పించుకొని అడిగాడు.

''ఎంతకి దేరవాడేవ్?''

''పదేనురూపాయు లిప్పించిసేయండి'' అన్నాడు మాంకూ.

''ఈ కోళ్ళని గాళిదేవరుకి నన్ను సమర్పించమయ్యండి'' సోమయ్యతో అన్నాడు చిన్నప్ప. జేబులోనుంచి డబ్బు తీసి, పదిహేను రూపాయలు లెక్కపెట్టి మాంకూ కిచ్చాడు తలపాగా మడతల్లో నోట్లు దాచుకుంటూ మాంకూ అడిగాడు. ''ఈ పెల్ని మనం తీసికెల్దారా? దొర్లు తొందరపడి పోతావుండారు. పూజ సేయిచ్చేతలికి టయిమవుద్దంటే ఎనాకా

ఒచ్చి నే నట్టించుకెల్లి దేవాడు కిత్తాము."

సోమయ్యా మాంకూని మళ్ళీ తిట్టి బోయాడు

"అది మంచిదే" అన్నాడు చిన్నప్ప. "ముసలాడు ఆ బరువుకూడా యిప్పు డెక్కడ మోసుకురాగలడు?" మాంకూ నవ్వుతూ కోళ్ళని యిళ్ళల్లో ఒదిలేసి చేత కత్తి పట్టుకుని వచ్చాడు.

ముందు మాంకూ, వెనక సోమయ్యా, చిన్నప్పా. ఆతని బృందం కూలీల యిళ్ళ పక్కనుంచి కొండ లోయలోకి పోతున్న కాలిబాటలో నడక సాగించారు. కాఫీ చెట్లు రెండువైపులా దట్టంగా మనిషెత్తున పెరిగివున్నాయి. చెట్లనిండా కాఫీపళ్ళు. వాటి బరువుకి కొమ్మలు ఒరిగి నేలని తాకుతున్నాయి. కొన్ని బాట కడ్డం పడ్డాయి. వాటిని ఎత్తిపట్టుకుని వెనక వాళ్ళకి దారి చేస్తున్నాడు మాంకూ. అక్కడక్కడ ముళ్ళచెట్లని నరికి దూరంగా పారేస్తున్నాడు. సన్నటి జారుడుబాటలో అతికష్టంమీద పడకుండా నడుస్తున్న చిన్నప్పని ముసలివాడి దేహదార్ఢ్యం ఆశ్చర్యపరిచింది. మేనేజింగ్ డైరెక్టరే వెళుతున్నప్పుడు మారు మాట్లాడలేక వెనక వున్న పట్నం మనుషులు నెమ్మదిగా అడుగుతీసి అడుగేస్తున్నారు వాళ్లు తొడుక్కున్న తెల్లచొక్కాలూ, పేంట్లూ, వనమూ, జిడ్డూ పులుముకున్నాయి ఆఫీసుకి వేసుకునే సున్నితమైన జోళ్ళమీద మందంగా బురద అంటిపెట్టుకుని వుంది. వాళ్ళ పరిస్థితి చూస్తే సోమయ్యాకి నవ్వాగలేదు.

"ఇప్పుడీ బాట యిలా వుంది కానీ. వేసంకాలంలో ట్రంక్‌రోడ్‌లాగా వుంటుంది" అన్నాడు. అతను ఖాకీ చొక్కా, నిక్కరూ వేసుకొని, నెత్తిమీద టోపీ పెట్టుకుని ఎస్టేటు దుస్తుల్లో సుఖంగా వున్నాడు.

"అదేటి సాపెట్టం దొరా. ఆ దారే యేరు ఎనకి యేటా జనం ఒత్తారుగందా అంతలక్క సుబ్బరం యిప్పుడెట్టా ఒత్తాది?" అన్నాడు మాంకూ.

"వేసంకాలంలో ఏమిటి విశేషం?" అడిగాడు చిన్నప్ప.

"అప్పుడు గాళిదేవరు జాతర జరుగుతుంది" అన్నాడు సోమయ్యా.

"ఎండ కాత్తంచే పరిసోద్ది కాని వానల్లో ఎవ్వరొత్తారు దొరా?" మాంకూ అన్నాడు. "సలికాలం మాత్తరం రాటానికవుద్దేటి?"

"అహం, అలాకాదు. కాఫీ పూతకి ముందు వర్షాలకోసం దేవర్ని ప్రార్థించడానికి ఒస్తారు" అన్నాడు సోమయ్యా.

మార్చి ఏప్రిల్ మాసాల్లో అనుకూలమైన వర్షాలు పడితేనే కాని కాఫీచెట్లు పూత పట్టవు. ఆ ఒక్క పూతమీద సంవత్సరం పంట ఆధారపడి వుంటుంది. ఒక్కొక్కప్పుడు వర్షాలు ఆలస్యమౌతూ




వుంటాయి. అప్పుడు పంట దెబ్బ తింటుంది. ఎప్పుడయినా పడకపోవడం కూడా కద్దు. ఆ యేడాదికి పంటమీద ఆశ ఒదులుకోవాలసిందే. ఈ అవాంతరాల నుంచి తప్పించమని కూర్గు ప్రజలు దేవర్ని కొలుస్తారు. జాతర జరుపుతారు. గాళిదేవరు గాలిదేవత. వర్షం దేవత. పెనుగాలుల్తో ఋతుపవనాల్ని లాక్కొచ్చి సకాలంలో వర్షాలు కురిపించే ఆప్త బంధువు. అయిదారు ఎకరాల కాఫీ తోట లున్న సామాన్యుడికైనా, అయిదారువేల ఎకరాల్ని కలిపెడుతున్న కంపెనీ మేనేజర్లకైనా గాళిదేవరు దయా, సహాయం అవసరం. అందుకే జాతి, మత, విచక్షణా, అంతస్థుల భేదాలూ [illegible] అందరూ ... ఉత్సవంలో పాల్గొంటారు.

"అంత మగాత్తైం వుండబట్టే గుర్రాల్దార ఈ దారి ఊరోల్లందరికీ ఒదిలిండు" అన్నాడు మాంకూ.

"గుర్రాల్దారంటే మేంగిల్స్" చిన్నప్పతో చెప్పాడు సోమయ్య.

"ఆఁ, మంగిలీసుదొరే. మా కండీసను మడిచి, గుర్రమెక్కి సావారీ పేత్తే గెలిసేవోడీ బూ పెంచకంలో నేదనీ వోరు. పులియేటకెత్తే కత్తీ, తుపాకీ అక్కర్నేదు" అన్నాడు మాంకూ.

"అందుకే యింటికి పడగుమ్ము కున్నాడు" అన్నాడు సోమయ్య.

"పోన్నేదొరా, ఆ మారాజు వెళ్లిపోటవే నెయ్యం. దొరసానమ్మకి యీ వోనలూ, ఒరదలూ పట్టేయి కావు. సీవ గడ్డనే వుంటా ఒక్కొక్కలికి ఒప్పిపోతా

వుండీవోరు'' అన్నాడు మాంకూ.

''అప్పుడీ తోట అమ్మకుండా నేవుంటే కాఫీ తెస్తున్న దొరలకి కుబేరుడై పోయే వాడు'' అన్నాడు సోమయ్య.

''ఎదవ డబ్బు. ఆరికున్నాది సాల్దేటి?''

కాలిబాట వాళ్ళని చదునైన ప్రదేశంలో పెద్ద వృక్షం కిందకి తీసుకొచ్చింది. చెట్టుకింద మూడడుగుల ఎత్తున రాతి ముక్కలూ, మట్టీ కలిపి దిమ్మ వేసి వుంది. దానిమీద చతురస్రాలుగా నలగగొట్టిన తెల్లరాళ్ళతో కట్టిన చిన్న యినప్పెట్టె లాంటి చీకటిగది. లోపల విగ్రహం రూపురేఖలు చెక్కని ఒక రాయి. దాని పక్కన త్రిశూలం. రాతిమీద పెద్ద నిడు పాటి ఎర్రని కుంకుంబొట్టు.

''సెప్పులిడిసేసి దేవారుకి దన్నవెట్టు కోండి'' అన్నాడు మాంకూ. చుట్టు పక్కల మొలిచిన బంతిచెట్లనుంచి పువ్వులు తెంపుకువచ్చి తలొకటీ పంచి పెట్టాడు.

''ఇప్పు డియ్యెట్టండి. ఆనాకా దొర్ల పేరు సెప్పి కోడిపెట్టన్నేత్తా'' అన్నాడు. అంత దగ్గిరగా మాట్లాడుతోంటే మాంకూ నోట్లోనుంచి సారా వాసన గుప్పుమని కొట్టింది.

''ఇదేనా గాళిదేవరు గుడి?'' అప్పటి వరకూ నోరు మెదపని తెల్లబట్ట మను షుల్లో ఒకతను ఆశ్చర్యంగా అడిగాడు.

''ఇదే. నమ్మకం లేకుండా వున్నారా? పట్నాల్లో గుళ్ళలాంటి పెద్ద కట్టడాల్ని ఊహించుకున్నట్టున్నారు'' నవ్వాడు సోమయ్య.

''ఛిన్న గుడి గందా అని ఎగతాళి సెయ్యబోకండహో. మరిగంటే దేవారిక్కూను కొచ్చెనా మగాత్తెం సూప గల్దురు'' అన్నాడు మాంకూ.

''ఎవరేమన్నార్రా?''

సోమయ్యకి తన మాటల్లో ఎక్కడైనా అపరాధం స్ఫురించిందేమోనని భయం వేసింది.

''ఆశ్రయిస్తే ఎంత దయగా వరాలిచ్చినా, ఆగ్రహం వస్తే అంతకి రెట్టింపు పట్టుదలా వుంది గాళిదేవరుకి'' అన్నాడు తక్కినవాళ్ళవైపు తిరిగి. అతనికి మేంగిల్స్ పడ్డ కష్టాలు జ్ఞాపకం వచ్చాయి. వాటిగురించి మాట్లాడకుండా వుండలేక పోయాడు.

మేంగిల్స్ కట్టించిన పెద్ద బంగళా పూర్తవొస్తున్న రోజులు. అంతవరకూ అతను శిధిలమైపోతున్న పాత యింట్లోనే వుండేవాడు. అసలు మేంగిల్స్ బ్రదర్స్ కొన్నప్పుడు ఎస్టేటు మంచిస్థితిలో లేదు. కాఫీమొక్కలు తిండిమొహం ఎరగనట్టు ఒడిలిపోయి వుండేవి. వాటిని సంస్కరించి కొంత డబ్బు చేసుకొనేవరకూ మేంగిల్స్ భార్యాపిల్లల్ని ఇంగ్లండులో తన అన్నదగ్గర విడిచిపెట్టేడు. వాళ్ళని ఆశ్చర్యపరిచేటంత పెద్ద బంగళా కట్టిగాని

ఎప్పేట్లో వుంచననేవాడు. చివరికి బంగళా కట్టగలిగాడు కాని, దాని భోగం అనుభ వించ లేకపోయాడు. ఆ బంగళాలో వంట గదినుంచి వాడిన నీళ్ళు పోడ నికి కట్టిన పిమ్మెంటు కాలువ గాళిదేవరు విగ్రహం పక్కగా పోయేది. అది దేవరుకి అపచార మని, వంటగదిని మార్చమనీ కూలీజనం మేంగిల్స్‌ని ప్రాధేయపడ్డారు. అతను నవ్వి వాళ్ళని పొమ్మని కసిరాడు. దేవరు కాగ్రహం కలుగుతుందనీ, అప్పుడు కీడు మూడడం తప్పదనీ హెచ్చరించారు. మేంగిల్స్ లెక్కచెయ్యలేదు. మూఢ నమ్మకాలని విసుక్కున్నాడు. పైగా అను కున్న రోజుకి ముందే వెయ్యదల్చుకున్న కుర్చీలూ, బల్లలూ ఇతర సామాన్లతో యిల్లు నిండకముందే కొత్త బంగళాకి మారాడు. ఆరోజునుంచీ అతని కష్టాలు మొదలయ్యాయి. గుర్రపుస్వారీకి వెళ్ళిన వాడు చెయ్యి విరక్కొట్టుకుని వచ్చాడు. తరవాత తరవాత అతను తాగుతున్న గ్లాసులు మాయమయ్యేవి. ప్లేట్లల్లో భోజనం బదులు రాళ్ళు కనిపించేవి. తలుపులు జాగ్రత్తగా బిగించిన గరాజ్‌లో కారు రాత్రిళ్లు స్టార్టయి, హారన్ మోగడం ప్రారంభించేవి. ఇటువంటివే యింకా లెక్కలేనన్ని. గాళిదేవరు నిదర్శనాలని అందరూ పోరుపెట్టారు. మేంగిల్స్ భయ పడ్డాడు. కాని తొందరగా లొంగలేదు. ఇల్లు మారిన పదవరోజున తన చిన్న కొడుకు హఠాత్తుగా చచ్చిపోయాడని ఇంగ్లండునుంచి కేబుల్ వచ్చినప్పుడు మాత్రం అతని ధైర్యం సడలిపోయింది. దానికితోడు ఆ యేడాది సకాలంలో వర్షం పడక కాఫీచెట్లు సరిగ్గా పూత పుయ్య లేదు. వెంటనే ఎస్టేటు బేరానికి పెట్టి పాత యింట్లోకి మారిపోయాడు.

"ఏటి సేత్తాం, రాతట్టాగుంటే, ఆ యేల ఒచ్చే తలికి బుద్ది అట్టా సేయిస్తది. దరమరాజంటి పెద్దమనిసికి పెడసరం బుద్ధి పుడతాదని కల గంతామా." అన్నాడు మాంకూ.

"గుడి కట్టమని పురమాయించేడని మేంగిల్స్‌మీద వీడికంత అభిమానం" మాంకూవైపు తిరిగి అన్నాడు సోమయ్య.

"దాంట్లో ఏమాత్రం మిగిల్చేవురా?"

"దొర్లు పరాసికా లాడతన్నారు" అన్నాడు మాంకూ.

"ఈ గుడి నువ్వు కట్టేవా?" చిన్నప్ప అడిగాడు.

"ఔను దొరా. తప్పుసేసిండని పిచ్చకి గుడి లేపిండు గుర్రం దొర. నన్ను సూత్తానికి వుండమనిండు కాని దబ్బయిపోనాది. నాదీ కాంతో, కూంతో అద్దాది" అన్నాడు మాంకూ. సోమయ్య నవ్వాడు.

"మేంగిల్స్ ఒదిలేసిన బంగళాకి వెళ్ళడానికి ఇక్కణ్ణుంచి దారుందా?" సోమయ్యని చిన్నప్ప అడిగాడు.

"ఏరా," మాంకూ వైపు చూశాడు

సోమయ్య.

"అదేటి దొరా, యీ పెట్టెవకాల గుట్టమీదున్నాది. అదిగదే బంగలా. కొట్టిన దారేటీ నేదు"

"పోగలమా?" అన్నాడు చిన్నప్ప.

అందరూ బంగళాకి బయల్దేరారు. చిన్న గుట్టమీద విశాలమైన భాగం చదును చేసి వుంది. ముళ్ళ తుప్పలూ, అడివి మొక్కలూ ఇంటిచుట్టూ దట్టంగా పెరిగి వున్నాయి. ఇంటి తలుపులు ఎవరో పీకేసినట్టున్నారు. గుమ్మాలు సగంపైగా చెదలు తినేసో, ఊడిపోయో వున్నాయి. అక్కడక్కడా కిటికీలకు ఒక్కొక్క గాజు పెంకు వేలాడుతూంది కప్పు మీద మచ్చుకైనా ఒక్క పెంకులేదు.

"పెంకులన్నీ మాంకూ పట్టుకుపోయి వుంటాడు" అన్నాడు సోమయ్య.

"అమ్మో, యీ బంగలా సరుకు అంటుకోటవే?" అన్నాడు మాంకూ.

"నీ యింటికి పెంకులూ, కలపా ఎక్కణ్ణుంచి వచ్చినయ్యిరా?" మాంకూ ఇంటివైపు చూపించాడు సోమయ్య. వాళ్ళెక్కి వచ్చిన దారికి ఎడంగా అరటి చెట్ల మధ్య కనిపించింది. కూలీల యిళ్ళలాలేదు. కొంచెం పై అంతస్థుకి చెందినట్టుంది.

"వీడు కాంట్రాక్టరయ్యాకా స్వయంగా కట్టుకున్నాడు" అన్నాడు సోమయ్య మళ్ళీ.

"రగతం వోడ్చి గడిచ్చిన సొమ్మెత్తి కట్టిచ్చీను" అన్నాడు మాంకూ. సోమయ్య పెద్ద నవ్వు నవ్వాడు.

కూలిపోయిన ముందు గుమ్మంలో నుంచీ చిన్నప్ప బంగళాలో ప్రవేశించాడు. తక్కినవాళ్ళు అనుసరించారు.

"పెద్ద బంగళా"

"మేంగిల్స్‌కి చాలామంది పిల్లలుండేవారట. ఆరుగు రనుకొంటాను. తలొక గదీ కట్టించి, అతిథుల కోసం ఇంకొకటి కట్టించాడు" అన్నాడు సోమయ్య.

"ఇది స్నానాల గదిలా వుంది." రెండో తెల్లబట్ట మనిషికి స్నానాల గది చూస్తే ప్రాణం లేచివచ్చింది. దాని పొడుగూ, వెడల్పూ, ఎత్తూ చూసి ఎన్ని మొజయిక్ పెంకులు వెయ్యాలో ఓక్క నిముషంలో అంచనా వేసేశాడు.

"స్నానాల గదులూ, మొజయిక్ పెంకులూ వుంటే నీ కింకేవీ అక్కర్లేదు" నవ్వాడు చిన్నప్ప.

మేనేజింగ్ డైరెక్టరు మెప్పు అతన్ని సంతోషంలో ముంచి ఎత్తింది.

"అన్నేళ్ళ క్రితంకూడా యింత విశాలంగా స్నానాల గదులు కట్టేరంటే నమ్మలేకుండా వున్నాను" అన్నాడు.

"దీంట్లో వేసిన తొట్టెలవీ చూస్తే మరీ ఆశ్చర్యపోదురేమో మీరు. ఇంగ్లీషు తయారీలో ప్రత్యేక రకాలివట" అన్నాడు సోమయ్య.






“సూత్తై కల్లు జిగిల్మకీపి. సవద్రం వడాన్ని ముంచేపిన్రు” అన్నాడు మోంకూ.

“ఆఁ!” తెల్లబట్ట మనిషి ప్రాణం కొట్టుకుపోయింది.

“అవును. మేంగళూర్ సముద్రంలో పారేయించేశాడు మేంగిల్స్” అన్నాడు సోమయ్య.

“ఎందుకు?”

“వాటికి గాలిదేవరు శాపం తగిలింది. మళ్ళీ పాత ఇంటికిపోతూ మేంగిల్స్ కొత్త బంగళా స్నానాల గదుల్లో తొట్టెలూ, షవర్లూ, అద్దాలూ, అప్పటికి తయారై వచ్చిన కొద్దిపాటి కుర్చీలూ, సోఫాలువంటి విలువైన సామాన్లూ రెండు రెండెడ్ల బళ్ళకేపి పట్టుకుపోదా మనుకున్నాడు. మొదటి బండి వంద గజాలు నడవకుండానే ఒక యెద్దు కూలిపోయి చచ్చిపోయింది. ఈ అపశకునంతో సామాన్లు ఎస్టేట్లో ఉండడానికి వల్లకాదు. దూరంగా పారెయ్యాలని గోల బయల్దేరింది.”

“అమ్మెయ్యకపోయారా?” అడిగాడు తెల్లబట్ట మనిషి.

“అమ్మడంలాగే వుంది. పడిపోయిన బండిలో వస్తువులు తిరిగి బంగళాకి చేరవెయ్యడానికే ఎవ్వర్నీ ఒప్పించలేక పోయాడు మేంగిల్స్. ఎంత డబ్బాశ చూపించినా ఒక్క లారీ డ్రైవరూ, బండివాడూ బరువు తీసుకెళ్ళి పారెయ్యడానికి ధైర్యం చెయ్యలేదు”

“సిగురుకి ఆ కిరస్తానీ దొర్లేమ తోలు

కెల్లిండు. అల్లంతెత్తు కెరటం లెగిసిం దంట ఆటిల్ని గిరాటేసేతలికి'' అంది పుచ్చుకున్నాడు మాంకూ.

''నిజంగా సముద్రంలో పారెయ్య లేదట గదా?'' అన్నాడు చిన్నప్ప. మాంకూ ఒకటి రెండు నిముషాలు సంకోచించాడు.

''ఏటో దొరా. నాకు తెల్దు. అడ య్యాన్నీ అట్టుకెల్లి యాపాకరెట్టిండని యిక్కడోల్లు గుసగుసలాడుకునీ వోరు'' అన్నాడు.

''మీరెవరూ మళ్ళీ బట్టల్ని చూళ్ళేదా?''

''ఏటిదికి? అడు బాగడిపోనాడంటా యేడుత్తా వుంటానికి అడమునుదోడ్నేటి వేను? నేవుంటే నిప్పూ సంపాదిచ్చాలి.''

''వాడు డబ్బు గడించిన విషయం నిజమేనన్నమాట'' అన్నాడు సోమయ్య.

''అదేవో, నాకెట్టా తెలుస్తది? ఎట్టా గడించిందో, ఏపాటి గడించిందో నే వాడికాడికి పోలేదు, ఆడ్నాకు సెప్పనేదు. ఈ కుసుద్దపు యెదవలు కూసిందే. ఆ యెవకాల ఆడింకా పెద్దోడయి పోయిం దంటూ యేడిసీవోరు. తెలకడుగుతాను దొరా. పుంజిడు పింగానీ పిప్ప లుచ్చుకుని లచ్చలు గడిచ్చటానికి. ఆడిపేతిలో మాయ మంతరం వుందేటి?''

''పింగాణీ చిప్పలా? వాటి విలువ నీకు తెలిసినట్టులేదు'' తెల్లబట్ట మనిషి మనస్సు చివుక్కుమంది.

''పోన్లే. మాంకూకి మనం ఇప్పుడు ఉద్యోగం యివ్వటంలేదుగా. వాటిగురించి బోధించనక్కర్లేదు'' నవ్వాడు చిన్నప్ప.

''మీరు ఉద్యోగం ఇస్తానంటేమటుకు వస్తాడేవిటి వాడు?'' అన్నాడు సోమయ్య.

''దొర్లకి ముసలోడ్నిసూత్తే అపి కంగా వున్నాది. వొచ్చే పాణం, పోయే పాణం గాల్లేవురి పాదాలకాడ వగ్గేయాల్సిందే'' అన్నాడు మాంకూ.

''చూశారా, వాడికిక్కడ కొండంత వ్యాపారం వుంటే, ఒదులుకుని మీ దగ్గరికెలా రాగలడు?'' అన్నాడు సోమయ్య.

''ఒద్దులే మాంకూ, మేం పట్టుబట్టడం లేదులే'' అన్నాడు చిన్నప్ప.

''అంతేసి ఊసులాడమాకండి దొరా'' మాంకూ చేతులు జోడించి చిన్నప్పకి దణ్ణం పెట్టాడు.

స్నానాలగదినుంచి బయట వరండా మీదకీ, అక్కణ్ణుంచి బంగళా వెనక భాగంలోకీ కదిలారంతా.

''దిట్టమైన కట్టడం'' అన్నాడు తెల్ల బట్ట మనిషి.

''కలకాలం వుండాలని కట్టించింది కాని, ఇలా అప్పుడుంటామకో లేమనా'' అన్నాడు సోమయ్య.

''మేంగిల్పిని భయపెట్టింది బట్టలే నట?'' మాంకూవైపు తిరిగి చిన్నప్ప అడిగాడు.

యిం కా




"ఆదేం సేసిండు?" అన్నాడు మాంకూ. "దొర బంగలా యిడిసిపెట్టి యెల్లిపోతంటే బెయం వొద్దంటా పోరెట్టిండు. ఆ మాట జింబేనా? ఆతలికే అరిగుండి బేజారెత్తిపోనాది. ఈ యెదవ వాలవాలా యేడిపించు."

"తమాషాలన్నీ అత నేచేసి దేవరు మహత్త్యం అని మేంగిల్స్‌ని నమ్మించా డంటారే?" అన్నాడు చిన్నప్ప మళ్ళీ.

"అదేటి సొబువు. గుర్రాల్లొ గ సేసింది తప్పయి దేవారు కాగ్గరం వొత్తేసి."

"కనిపించిన వాణ్ణంతా అల్లరిపెట్టి ఏడిపించడం అతనికి సరదా ఆటగదా?"

"ఆడికాగొవం వున్నది. ఓ పాలియేటి సేపిండూ. మా యింటిది అమ్మోరుకి కోడిపెట్ట కోసెట్టింది. పూనకం అంటూ యీడొచ్చి తలకాయకాణ్ణుంచి సొంతం తొంచేసిపోయిండు."

చిన్నప్ప నవ్వాడు.

'మేంగిల్స్‌నికూడా ఒక ఆట ఆడించాడని చెప్తారు" అన్నాడు.

"అబద్ధం, ఎవారుదొరా సెప్పేదీ? ఈ తోట్లో ఒక్క గాడిదికొడుకుని సెప్పమనండి సూత్తా. నాలిక సీరిపోద్ది" అన్నాడు మాంకూ.

"మరి మేంగిల్స్ తాగుతున్న గ్లాసు తీసేసి మాయమైపోయిందని పుకారు పుట్టించలేదూ?" అన్నాడు చిన్నప్ప.

"అది సత్తెమేదొరా" మాంకూ ఒప్పుకొన్నాడు.

"నిజంగానా? ఏం జరిగింది?" అత్య

తగా అడిగాడు సోమయ్య.

''ఆయాల దొర సీకాగ్గా ఎగిరిపడ తండాడు. సెయ్యారిగి కట్టేస్కుని ఆసు పత్తిరివించి వత్తానే పిచ్చోడ్నాగా యిల్లంతా గాలిచ్చేత్తా గళాసుమీద గళాసు యిస్కీ ఎక్కిచ్చేత్తండాడు. ఆతలికి కూలోల్లం సూట్టానికెల్లాం. ఎట్టాగినా వాంచెల్లు ఆకాడ్నించి తప్పిచ్చెయ్యటానికి ఒప్పించాలా అని.''

''వంటిల్లు మార్చడవెందుకు, నీళ్ల గుడిదగ్గిరకి పోకుండా చెయ్యలేరా?'' తెల్లబట్ట మనిషికి సందేహం వచ్చింది.

''బెమ్మాండవేటిగాని, కొండవాటం అట్టాగున్నాది. పిమ్మెంటూ, సున్నమూ యేపి కట్టిచ్చిన తూవు యిరగ్గొట్టనంటా పంతంపట్టి కూసున్నాడు దొర. మాయన్నీ తెలివితక్కువ నమ్మకాలంటా కూక లేసిండు.''

''తరవాతేవయిందో చెప్పు'' తొందర పెట్టేడు సోమయ్య.

''ఏటవుద్ది. మైకవులో వున్నాడేమో. సూట్టాని కీల్లేదని గసిరి పొమ్మనేసిండు. కూలోల్లం ఒగ్గనేదు. ఇసురుగా వచ్చి మీద పడిపోయిండు. నోపల బొట్లేరూ, వంటోడూ దొర యిడిసేసిన కొంత యిస్కీవుంటే, తాగేసిరి. దొర తాగటం అయిపోనాదని అల్లబ్రెమ. ఆనాకా దొర కూకలేత్తే బొట్లేరు బెయంపడిపోనాడు, ఆడికి తెలవదంటా బొంకిండు. వంటోడూ అట్టానే బుకాయించిండు. పొద్దు పొడిసే యేలకి దొర తాగి గలాసు గాల్దేవదు మగాత్తాన్న మాయవయిందంటా వోర్త గుప్పుమన్నాది.''

''నిజం బయటపడకుండా వుందా?'' అన్నాడు తెల్లబట్ట మనిషి. ఏ విషయాన్నీ తర్కించకుండా నమ్మడం అతని కలవా ట్లేదు.

''మాలాటోల్లు వలుగురి సెవులుకాడి కెట్టాగో వత్తాది, కూలోల్లందరికీ యెట్టా తెలిత్తాదీ? ఆ యెనవ లిద్దరూ అడల్తా వాళికిపోతండారు గందా నోరిప్పుతారో యేవో.''

''ఒకళ్ళకి తెలుత్తే అందరికీ తెలిసి నట్టే'' అన్నాడు తెల్లబట్ట మనిషి.

''గుర్రాడ్దొర మాత్తరం నమ్మేరేటి? మోసవయి పోనాదంటా కొన్నాల్లు సీద రిచ్చుకునీవోరు. కడం మగెత్తాల సందట్లో యిదీ కమ్ముకుపోనాది'' అన్నాడు మాంకూ.

''తక్కిన నాటకం కూడా బట్లరాడిందే నట'' అన్నాడు చిన్నప్ప.

''మీ కిదంతా ఎలా తెలుసును?'' అడిగాడు సోమయ్య.

''విన్నాను'' అన్నాడు చిన్నప్ప.

తను విన్నది చెప్పాడు.

గాళిదేవరు మహిమవల్ల విస్కీగ్లాసు మాయమయిందని మేంగిల్స్ నమ్మిని మాట నిజమే. ఇది జరిగిన మర్నాడే



బంగళా ఆవరణలో పెద్దచెట్టు విరిగిపడి అతని పెంపుడు కుక్క చచ్చిపోయింది. దీంతో మేంగిల్స్ మనస్సు కలవరపడటం మొదలు పెట్టింది. దానికితోడు కూలీల గోల. అయినా జడిసినట్టు ఎవరికీ తెలియకుండా వుండాలని చాలా ప్రయత్నించాడు. ప్రతిపనిలోనూ అధైర్యం, అపోహ, భయం కమ్ముకువచ్చేవి. వింతగా ప్రవర్తించేవాడు. యజమాని విర్బలత్వాన్ని చూస్తే బట్లరుకి నవ్వాగేది కాదు. దొర పిరికితనాన్ని ఆసరాగా తీసుకుని అల్లరిపెట్టి వినోదించకుండా వుండలేకపోయాడు. భోజనసమయంలో వాయికీ పళ్ళెలు మార్చేటప్పుడు వీలు చూసుకొని అన్నం పళ్ళెం మార్చేసి వేర్పుగా రాళ్ళు పెట్టిన పళ్లెం యిరికించేవాడు. మేంగిల్స్ పడకగది డ్రాయర్లో దాచుకున్న మాదకాశం తీసి, గరాజ్ పై కప్పునుంచీ లోపలికి దిగి కారు స్టార్టు చేసి, హారన వాయించి పారిపోయేవాడు. ఇంకా ఇటువంటివే ఎన్నో. మేంగిల్స్ కంగారుపడుతుంటే, యితనికి ఆటగా వుండేది. తమాషాల్ని నిజం అని నమ్మించగలిగానని మురిసిపోయేవాడు. అయితే, అవి వింత పరిణామాలకి దారి తీస్తాయనుకోలేదు. అంతా జరిగిపోయిం తరువాత చెప్పడానికి ధైర్యం చాల్లేదు.

“దొర సెబితావుంటే నమ్మదాని కీల్లేకంటా సిత్తరంగా వున్నాది” అన్నాడు మాంకూ.

“నాకు అలాగే అనిపిస్తోంది” అన్నాడు సోమయ్య.

కొంతసేపు జీపులో తిప్పి ఎస్టేటు చూపించి, గాళిదేవర దర్శనం చేయించి ఛోటా ఏస్కోకీ, ఖులాసా కబుర్లకీ తిరిగి అతిథుల్ని బంగళాకి తీసుకుపోదామను కున్న సోమయ్య తను ఊహించలేని విషయాల ఒత్తిడికి తట్టుకోలేక పోయాడు.

"వంటిల్లెటువైపు" అన్నాడు చిన్నప్ప. అప్పటికే యిల్లంతా కలయజూపి చదరపు గజాలూ, ఘనపరిమాణాలూ లెక్కకట్టిన తెల్లజట్టు మనిషి "ఈ చివర" అంటూ దారి తీశాడు. చిన్నప్ప వంటగదిలో ప్రవేశించి, పాత్రలు కడిగే తొట్టిని పరీక్షించడం ప్రారంభించాడు. తొట్టి సిమ్మెంటు చాలావరకూ పగిలిపోయి వుంది. లోపల ఇటికలుకూడా మూడు వంతులు కరిగిపోయాయి. మీద ఒకప్పుడు కొళాయి వుండేదనడానికి ఆనవాలుగా విరిగిపోయిన రేకుముక్కలు ఇక్కడా అక్కడా గోడకి అంటిపెట్టుకుని వున్నాయి. తొట్టికింద నీళ్ళు పోడానికి చేసిన కన్నం పూర్తిగా పూడుకుపోయింది. నేల మీద పడున్న ఒక పుల్లని తీసి కన్నం కెలికాడు చిన్నప్ప.

"ఇక్కణ్ణుంచేనా నీళ్ళు గాళిదేవర విగ్రహం దగ్గిరకి పోయేది?" అన్నాడు మాంకూని చూసి.

"అవును."

వంటగది బయటికివచ్చి సిమ్మెంటు కాలవకోసం చూశాడు చిన్నప్ప. గడ్డీ మట్టీతో కప్పబడిపోయి వుంది. ఇక్కడా అక్కడా కొంతరాయి బయటికి కనిపిస్తోంది. దాని వారన కాలిజోడుతో కొట్టి వర్షాలకి మెత్తబడిన కొంతమట్టిని పైకి లాగాడు.

"ఆకత్తితో కాస్త పొడు మాంకూ" అన్నాడు.

మాంకూ మట్టి బెళ్ళల్ని పెళ్ళగించడానికి ఉపక్రమించాడు. సోమయ్య కేమీ అర్థం కాలేదు. కూడా తీసుకువచ్చిన కర్రతో తనూ కాలవ శుభ్రం చెయ్యడం మొదలు పెట్టాడు.

"ఇక్కడ మూడు మాంకూ" అన్నాడు చిన్నప్ప ఉత్సాహంగా. మాంకూ వెనక్కి తిరిగాడు. సిమెంటు కాలవ అక్కడ కొట్టేసివుంది. ఆపైన నీళ్ళుపోకుండా రాళ్లు ఒకదానిమీద ఒకటి పేర్చివున్నాయి. అక్కణ్ణుంచి మలుపు తిరిగి కొండకి రెండవవైపు నీళ్ళు పారడానికి కట్టిన సన్నకాలువ ఆనవాళ్లు చూచాయగా కనిపిస్తున్నాయి. "ఈ కాలవ యెక్కడికి పోతుంది మాంకూ?" అన్నాడు చిన్నప్ప.

మాంకూ ముసలి కళ్ళు మిలమిలా మెరిసాయి. చిన్నప్పని పరిశీలించి చూశాడు.

"ఏం మాంకూ" అన్నాడు చిన్నప్ప మళ్ళీ.

"దొరకి తెలివి యెక్కువేటి?"

ఆ పక్కనే తవ్విన గోతిలో దిగి వొంచున్నాడు మాంకూ.

"ఇక్కడికి" అన్నాడు.

అతను లోపల నుంచోబోతే అది గొయ్యని తెలియడం కష్టం. కణుపు మోకాళ్ళదాకా మాంకూని కప్పేసింది.

సోమయ్యకి చెప్పలేనంత ఆశ్చర్యం వేసింది. చరచరా గొయ్యి దగ్గిరకి వెళ్లాడు.

"వంటింట్లో పిల్ల విగ్రహం దగ్గిరికి వెళ్ళనే లేదన్నమాట" అన్నాడు.

మాంకూ వున్న పళ్ళన్నీ బయటపెట్టి నవ్వాడు.

"అంతా తెలుసుండే దాచిపెట్టేవురా" ఉరిమాడు సోమయ్య.

"నేదుదొరా" అన్నాడు మాంకూ.

"ఇంకా అబద్ధాలే, వెధవా!"

"నత్తెందొరా, ఆడుపోయేతలికి నాకు తెల్దు" అన్నాడు మాంకూ.

"ఎవరు?"

"ఆడే, కిరస్తానీ దొర్లేరు."

"వాడు తవ్వేడా ఈ గొయ్యి?"

"ఆదేమరి. వంటింట్లో అయ్యి. ఇయ్యి తడిగివోడాదేగందా" అన్నాడు మాంకూ.

"వాడెళ్లిపోయిం తరవాత తెలిసిందని దొరతో చెప్పడం మా నేస్తావ త్రా రాస్కెల్....స్కౌండ్రల్...."

సోమయ్య తిట్లతో గుక్క తిప్పుకో లేక ఉక్కిరి బిక్కిరయ్యాడు. అది మాంకూ వ్యక్తిగత సంబంధమైన విషయం అన్న తలంపు అతనికి రాలేదు. జరిగింది ఎన్నో ఏళ్ల క్రితం అయినా, తనకి పరిచయమైనా లేని మెంగెల్స్ కథ. దాని వల్ల తనకేం నష్టమూ కలగలేదని కూడా అనిపించలేదు. కింద పడిపోయే [illegible] ఎస్తేల్లు నడిచే దారంట పడున్న అతడు [illegible]పోయాడు.

"దొర్లు గొంపవమాకండి" అన్నాడు మాంకూ. "గాద్దేసిన పూను సెప్పు కుంటా బతికేసినవని."

"మాంకూ" పిలిచాడు చిన్నప్ప. అతని గొంతులో మార్దవం ఆవరించింది.

మాంకూ తలెత్తి చూశాడు.

"నీ గురించి మా తాత నా కెందుకు చెప్పలేదో తెలియడంలేదు" అన్నాడు.

"ఏటిదొరా! తివురనీది, తాతా!" ఆశ్చర్యపోయాడు మాంకూ.

"అవును చిన్నప్ప."

"కిరస్తానీ దొర్లేరు."

అప్యాయంగా సింహాద్రి చిన్నప్ప దగ్గిరకి వెళ్లి ఒళ్లు నిమిరిచూశాడు మాంకూ. నచ్చినట్లు తృప్తిగా కనుబొమ లెగరేసి బుర్ర ఆడించాడు. ఆ సాన్నిహిత్యానికి అతనిలో విగ్రహం కట్టలు తెంచుకుంది. గట్టిగా నవ్వాడు ఆనవ్వు పెద్దదై ఇంకా పెద్దదై లోయ మారుమోగింది. వారించాలని ఎవరికీ తోచలేదు.

